ACC NO 12939

# ఏ విూ, నిన్ను పేక్షింతునా?

శ్రీ సాయీబాబా చరిత్రము - భక్తుల వృత్తాంతములు

## చతుర్థ సంపుటము

(Adopted mainly from H.H.B.V. Narasimha Swamyji's Life of SAI BABA English Original)

శ్రీ గాల్వంకర్; శ్రీ మాధవరావు దేశపాండే, శ్రీ బూటీ; శ్రీ బయ్యాజీ; శ్రీ బి.వి. దేవ్ మొదలగువారు శ్రీ పి ఆర్. ఆవస్తే; శ్రీ బి వి. నరసింహస్వామి, మరియు చరమలీల.

రచయిత
కీ॥ శే॥ బాపట్ల హనుమంతరావుగారు
శ్రీ సాయీకుటీరము
చిన్నగంజాము

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు

ప్రచురణ కర్త:
బాపట్ల వేంకట పార్థసారథి.
చెరువు.

# కృతి సమర్పణము.

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురుదేవుఁడగు
శ్రీసాయీబాబా పదాశ్రితులైన సోదరీ
సోదరభక్తులకు ప్రణిపాత సహస్ర
ములతో అంకితము గావింపఁ
బడినది.

శ్రీ సాయీశరణ్
రచయిత.

## పరిచరణకర్త ప్రార్థన.

"షిరిడి సంస్థానకవి"యను బిరుదుగన్న
జనకు నీశ్రితు "హనుమార్య" చరణములను
జనని 'కామేశ్వరి' పదాబ్జములగొలుతు
సతత మాశీర్వదింప శ్రీ సాయిదేవ!

# కృతి భర్త

# శ్రీ సాయిబాబా

కర్మధూమపత్రంబులఁగాల్చు "చిలుము"
కోటిసమస్తభయంబడఁజాలు "సటక"
అక్షయాన్నసిద్ధినిఁగూర్చు "భిక్షపాత్ర"
సంగమునకు "పాదుకల" నెంతు, సాయిదేవ,



జననీ జనకులకు ప్రచురణకర్త ధర్మపత్నితో కూడి పాదపూజచేయుట, 8—2—1965

శ్రీ సాయినాథాయనమః

# విజ్ఞప్తి

సోదరీసోదర సాయిభక్తులారా!

శ్రీసాయిప్రభువు కృపావిశేషమున మీయెల్లర ప్రేమాదరణ సహాయసంపత్తులవలన పూజనీయులైన మాతండ్రి సాయిపరిసన్న శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు రచించిన "ఏమీ, నిన్ను పేక్షింతునా?" అను గ్రంథమందలి 4, 5 సంపుటములు ముద్రణ నిర్విఘ్నముగ నెఱవేఱి మీ కందించు భాగ్యము నాకు కలిగినది.

శ్రీ పుండరీక చరిత్రమున మాతండ్రిగా రిట్లు వ్రాసిరి.

"యేనాస్య పితరోయాతా- యేనయాతాః పితామహాః
తేన యాయాత్సతాం మార్గం- తేన గచ్ఛన్న రిష్యతే"

సాధు సత్పురుషులగు తమ తమ తండ్రులు- తాత లేమార్గము ననుసరించిరో యామార్గమే మానవునకు శ్రేయస్కరము. అట్టి వారి ననుసరించినవా రెన్నఁడును జెడరు. మానవునకుఁ దల్లిదండ్రులే ప్రత్యక్షదైవములని వేదములు వివరించుచున్నవి.

" అకసముకంటె నున్నతుఁడగును దండ్రి
జనకు పదవందనమున సుజ్ఞాన మొదవు;
ధరణికంటె విశాలమై తనరుఁ దల్లి,
మాతృసేవ మోక్షదమని మాన్యులండ్రు"

శ్రీ సాయిప్రభుని దివ్యచరితామృతమును చక్కగ జదివి భక్తివైరాగ్యములందు మనస్సు లగ్నము కాకుండినను, సాంసారికవిషయములందాసక్తి, ఆశ యొకవైపు వేధించుచున్నను; వృత్తిబాధ్యతలు మరొకవైపు బాధించుచున్నను పూర్వజన్మ పుణ్యవిశేషమున ప్రథమము

నుండి తల్లిదండ్రులయందు భక్తిగలిగి వారి యాజ్ఞానుసారముగ కార్యములను నిర్వర్తించి వారి ప్రేమను పూర్తిగఁ బడసి, వారి ఆశీస్సులను పొందగలిగిన భాగ్యశాలిని నేను. 'రామచంద్రచరణ రజము వోలె' నాతండ్రి నాయెడఁ బఱపిన అపారప్రేమయే నన్ను చైతన్యునిగఁజేసి యీగ్రంథముల ముద్రణయం దప్రమత్తునిఁగ జేసెను.

ప్రేమపాత్రమెవాని హృదయంబు కాదో!
రామనామంబేని రసనాన నిలదో!
అట్టి నిరర్థకుండైన నరుండు
పుట్టుచు నవనిపైఁ బొలియుచునుండు"

(శ్రీ సాయీశబీజ సూక్తులు)

అట్టి ప్రేమస్వరూపుడైన తండ్రి ఋణముఁ దీర్చుకొనుట కిట్టి కార్యములు సహస్రములకొలది చేసినను యసాధ్యమే! నాతండ్రి సాయీప్రభునియం దైక్యము నొందినదాదిగ వారి శిష్యవర్గము, బంధుమిత్రులు, సాయీభక్తాగ్రేసరులు నాయందు వాత్సల్యముఁ జూపి, నాయండను నిల్చి, యుత్తరప్రత్యుత్తరములు జరుపుచు 'ప్రేమ' తత్త్వము త్యాగశీలురై బోధించుచున్నారు.

అట్టి మహనీయ ప్రేమతత్త్వ మెట్లు సాధ్యమగును?

"సాయివిభుని హృదయ సారసంబున నిల్పు
మహితసుకృతులైన మానవులకు
లేదు క్రోధగుణము, లేదు మాత్సర్యంబు
లేదు లోభబుద్ధి, లేదు కుమతి"

"సాయి నెదనునిల్పి! సాయీశు మ్రొక్కుచు,
సాయివిభుని సేవ సలుపు భక్తుఁ
డైనవాని కమరు నీనాల్గు— నాయువు
ప్రజ్ఞయును— యశంబు— బలము— నెపుడు."

"సాధులతో సదాచరితు లీయఖిల జ
గంబు నెంత్రు తమ కుటుంబమనుచు"

[శ్రీ సాయీమానసము]

"సత్యమగు ప్రేమ, భక్తి ప్రాపంగ నేని
నెల్ల కామితములు నశించిపోవు"

[నారద భక్తిసూత్రములు]

శ్రీ సాయీప్రభుసియందు మనము అపారమైన భక్తికలిగి యీ ప్రపంచమున ప్రతిజీవియందు ఆ సాయీప్రభుని చూడగల్గుటయే మనకు ప్రేమతత్త్వమున గమ్యస్థానము చేరిన నిదర్శనయగును.

"పెరుగు పాలమ్ముకొనఁబోయి వ్రేత యొకతె
యాత్మయందు గోవింద పాదారవింద
ములను దలఁచుచు, వీధులన్ మోహవశత
కేకలిడె — హరి! గోవింద! కృష్ణ! యనుచు"

[శ్రీ కృష్ణకర్ణామృతము]

"ప్రేమస్వరూపము పలుకుల కందనిది. లౌకికవిషయములందు — గృహధనక్షేత్రాది సంపదలందు మనము ప్రకటించు ఆసక్తి— ప్రీతి— కామముయొక్క వికారములకాని ప్రేమకాదు. ప్రేమ అనునది సాధు సాంగత్యముతో ప్రారంభమై- భక్తి భూమికలనన్నిటిని గడచి, పరాకాష్ఠనొందిన నిర్మల మానసికస్థితిగఁ బేర్కొనదగును. సకలభూతములందు దైవమును, గురుదేవుడైన శ్రీసాయీప్రభువును జూడఁగలిగి, యీ సకలజీవములు బాబాకు భిన్నముకావు అను నిశ్చితబుద్ధితో ఆదరించి, గారవించి, సేవించుటయే ప్రేమ. అట్టి ప్రేమకే ఈశ్వరుడు దాసుఁడగును.

అనుచు పలికిరి. తర్వాత 45 సంవత్సరములకు సకల భూపాలకుడు శ్రీ సాయీప్రభుని యాస్థానకవిని వారు సగర్వముగ జెప్పుకొనిరి. అట్లే ఆపై పద్యము వ్రాయు సందర్భమున మాతృగర్భమున నున్న నాకు గ్రామాధికారిపదవియందు విధినిర్వహణ బోధను గఱపి, వంశ పారంపర్యముగ తనకుఁ జెందవలసిన పదవిని త్యజించి, నాజీవితనౌకను క్షేమమార్గమున నడుపు సాధనము నొసంగిన ఆ ప్రేమస్వరూపుని గూర్చి వ్రాయుట నా కసాధ్యమైన విషయము.

శ్రీ సాయీప్రభుని చిత్తరువులు (Colour Photos) 1000 అడిగినంతనే పంపిన శ్రీ R. వ. Chitnis, Delhi గారికి, దయతో 'తొలిపలుకు' వ్రాసిన శ్రీ V. V. R. శర్మగారికి, మా తండ్రిగారి కృతులు ముద్రించుటకు ప్రథమమునుండి కుతూహలము కలిగి పరోక్షముగ తోడ్పడుచున్న సాయీభక్తాగ్రగణ్యులు శ్రీ కొప్పరపు రామారావు పంతులుగారికి; శ్రీ C. సాంబమూర్తిగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు సమర్పించుకొనుచున్నాను

ఈ పుస్తకముద్రణకు కేవలము శ్రీ సాయీప్రభుని ప్రేరేపణ వల్లను, మాతండ్రిగారియందు గల గురుభావమువల్లను విరివిగ విరాళములు పంపిన పోషకులకు శ్రీ సాయీనాథుడు ఆయురారోగ్య భోగభాగ్యముల ప్రసాదించి రక్షించగలడని నా ప్రార్థన. ఈ పుస్తక ముద్రణము ప్రత్యేక శ్రద్ధ జూపి, బహుకష్టముల కోర్చి, సకాలములో అందించిన శ్రీ K. V. N. అప్పారావు, M. A. బాబుగారికి శ్రీ మంచిరాజు సూర్యనారాయణమూర్తిబాబుగారికి నాహృదయపూర్వక నమస్కారముల సమర్పించుచు వారి యాశీస్సుల ననుక్షణము నపేక్షించుచున్నాడను. సోదర సాయీభక్తులు పెక్కురు 'పూజావిధానము' కావలెనని కోరినందున తండ్రిగారు రచించిన "శ్రీసాయిబాబా పూజా

స్తవములు" సాక్షి ప్రకటచి, ౯ వ సంపుటము ౭వ భాగముగ ముద్రిం చుట జరిగినది.

'పొదిలి' విశ్వనాథు ప్రోత్సాహంబు కలిమి
'మంచిరాజు' వారి మంచితనము
'కేశిరాజు' వారు చేసిపెట్టిన మేలు
'పోషకుల' ధనంబు ప్రోగుఁ జేసి.

జనకుడు రచించి యుంచిన సంపుటములు
మోదము ప్రచురించి ఘనతను పొందుచుంటి
వందనంబులు వీరల కందఱకును
సలుపుచుంటి; కృతజ్ఞతల్ తెలుపుచుంటి!

ఇట్లు,
(శ్రీ) సాయిభక్తజన అనుసరణుఁడు
ప్రచురణకర్త
బాపట్ల వేంకట పార్థసారధి
చెరువు గ్రామం.

—o—

# పత్ర ప్రశంస!

'శ్రీ బాపట్ల వేంకటపార్థసారథి'

చ॥ జనకుఁ డొసంగు భూములు, విశాలగృహంబులు, దొడ్డతోటలున్
ధనము గ్రహించు పుత్త్రికులు ధారుణి నుందురుగాని, మీవలెన్
జనకుఁ డముద్రితమ్ములగు జాడను వీడిన గ్రంథజాలముల్
బనిగొని యచ్చుఁగూర్చు గుణవర్యులు మృగ్యులు పార్థసారథీ!

ఉ॥ మానవజాతి కభ్యుదయమార్గముఁ జూపెడు భక్తికావ్య సం
తానము వ్రాసినట్టి గుణధాముఁడు శ్రీ హనుమంతరాట్కవీ
శానకృతాంధ్ర సత్కృతులఁ జయ్యన నచ్చొనగూర్చి తండ్రి చి
త్తానకు శాంతిఁగూర్చిన యుదార మనీషివి పార్థసారథీ!

ఉ॥ శ్రీయుతమూర్తి భక్తజనచిత్త సరోరుహమిత్రుఁ డూర్జిత
శ్రేయము లిచ్చు దేవుఁడగు శిర్డిపురీవర సాయిదేవుఁ డా
ప్యాయముతోడ ముద్రణము పట్టునఁ దోడ్పడినట్టివారికిన్
శ్రీయుతులైన మీకెపు డశేషశుభంబు లొసంగుఁ గావుతన్.

## శ్రీ మంచిరాజు సూర్యనారాయణశాస్త్రిగారు

మ॥ కవిరాణ్ముఖ్యుఁడు, శాంతిదాంతినిధి లోకస్తుత్య 'బాపట్ల' వం
శవిధుండా హనుమంతరాట్కవి కృతంబౌ గ్రంథముల్ ముద్రణం
బవలీలన్ బొనరింపఁబూనిన గుణాఢ్యా! మీకివే యంజలుల్
భవుఁడో మున్ మిము; మంచిరాజు కులదీపా! సూర్యనారాయణా!

బిలాస్పుర్ [N. P.]
28—7—75

'మధురకవి'
మరాలా పేరన్నశాస్త్రి

ఓం శ్రీ సాయిపత్రినన్న

# తొలిపలుకు

అది 1970 ఫిబ్రవరిమాసము మొదటిసారిగా శ్రీ బాపట్ల హనుమంతరావుపంతులుగారిని నేను చూచుట, కొవ్వూరులో శ్రీసత్యసాయి విజయము అను మాసపత్రిక ప్రారంభోత్సవసమయము. అంతకు ముందు శ్రీ పొదిలి విశ్వనాధశర్మ, శ్రీ మంచిరాజు సూర్యనారాయణ మున్నగు ఆత్మబంధువులచే పరోక్షముగ నేను అన్నగారగు శ్రీ బాపట్ల హనుమంతరావుపంతులుగారిని గురించి చెప్పబడినవాడనైతిని పైనుదహరింపబడిన శ్రీ సాయీసంతానము ప్రత్యేకముగ నొక శ్రీమూర్తిస్వరూపమైన శ్రీ సాయి సంతానగుచ్ఛము. ఒకరి నొకరు అన్నగారిని సహోదరత్వమును మించిన అనురాగ, ఆర్ద్రత, మమకారబంధితులై, సాయిమాత ముద్దుబిడ్డలై వ్యవహరించుకొనుచుండిరి. శ్రీ మంచిరాజు సూర్యనారాయణగారు నాకు మేనబావ వరుస దేహసంబంధము అగుటవలన మేము నలుగురము పరస్పరము "బావగారు" అని సంప్రీతికరముగ సంబోధించుకొనుచు, ఉత్తరప్రత్యుత్తరములలో కూడ నట్లే పిలచుకొనుట జరిగినది

శ్రీ హనుమంతరావు పంతులుగారి ప్రేమస్వభావము ప్రేమావతారియైన మన తండ్రి శ్రీసాయి స్వభావమును పుణికి పుచ్చుకొనుటలోనే గలదు. "శ్రీ సత్యసాయి విజయము" ఆవిష్కరణ సమయమునకు డెబ్బదియేండ్లు నిండిన వృద్ధులైనను, అనారోగ్యముగ నున్నను కోరిన వెంటనే మాయింటి కేతెంచి, శ్రీసాయినాథ సహస్రనామపూజ శాస్త్రోక్తముగ నొనర్చి, మమ్ముద్ధరించిరనిన అతిశయోక్తి కాదు.

అంతటితో మా బంధుత్వము, పరిచయము ఆగలేదు. వారమునకొక ఉత్తరము మాకుటుంబ క్షేమసమాచారములతోను, తిరుగు

అను అభయములను అమలువరచి మన యజమాని, తండ్రి, తల్లి, గురు దైవమై మనలను తన వడినిడుకొని పసిపాపలుగా సాకును. ఇది శ్రీసాయీసంతానము యొక్క అనుభవము.

శ్రీ సాయినాథుడు ఎట్లు శ్రీ హనుమంతరావు పంతులుగారిని మన్నన చేసి, గారము చేసి, తనవానిగా తన వొడిలో ఎట్లు శాశ్వతస్థాన మిచ్చి సదా వారిహృదయవాసియై ప్రాణ- చైతన్య- జ్ఞానశక్తుల- అంతఃకరణ- త్రికరణ- తను ధనమనఃప్రాణములు తానేయై వారి నెట్లు అనుగ్రహించినదీ తెల్పుటకు శ్రీపంతులుగారి జీవితమందలి అనేకము లైనవానినుండి ఈక్రింది ఉదహారణములు నేనుటంకించుట ఔచిత్య భంగము కాదనుకొందును. ఒకతూరి హనుమంతరావు పంతులుగారు, ఇంకొక పండితులు, శ్రీ పొదిలి విశ్వనాథశర్మగారు శ్రీ సాయిసన్నిధిని సద్గోష్ఠియందుండిరి శ్రీ పంతులుగారియందు స్వామికి మిక్కుటమైన ప్రేమాభిమానము లుండుటవలన శ్రీస్వామి వారిని ఇంచుమించుగా తన వడినిడుకొనినట్లు కూర్చొనబెట్టుకొనిరి. అపుడు యోగమన నేమి? యని శ్రీసామి అచట నున్నవారిని ప్రశ్నించిరి. యోగమన అదృష్టము, ఐశ్వర్యసంపదలు, ధనకనకవస్తువాహనములు, భూసంపద అని పండితులు సెలవిచ్చిరి. శ్రీస్వామి శ్రీహనుమంతరావుగారిని ప్రశ్నింప శ్రీ పంతులుగారు యోగమన భగవంతునియందు మనస్సు లగ్న మగుట అను సరియైన సమాధానమిచ్చి, శ్రీ సత్యసాయీశ్వరునిచే మెచ్చుకొనబడిరి.

వేరొకతూరి శ్రీ విశ్వనాథశర్మగారు, శ్రీ హనుమంతరావు పంతులుగారు శ్రీస్వామి ఆదేశానుసారము బెంగుళూరు బృందావన ఆశ్రమమున శ్రీసాయికి అతిథులుగ సుమారు నాలుగైదురోజులుండుట తటస్థించెను. శ్రీ సాయి వారికి సహపంక్తి భోజనమిడి స్వయముగా వడ్డించి, అతిథిమర్యాదలు నెఱపి ఆనంద మందించి, నూతనవస్త్రముల

ననుగ్రహించి పంపిరి. లోగడ శ్రీపంతులుగారికి స్వప్నమున శస్త్ర చికిత్స లేకుండగనే నేత్రరోగమును నివారించి చూపునిచ్చిన సంగతి మనకందరకు సువిదితమే.

శ్రీ సాయి అల్పసంతోషి. కఠినసాధనలు, నిర్బంధ ఉపాసన మున్నగునవి లేకుండ అందరినీ ఆదరించు మాతృహృదయము శ్రీసాయిది. ఏదైన కష్టము, నష్టము కల్గిన అది శ్రీసాయి మనమీది కరుణతో స్వల్పబాధలతో మనకు కల్గు గొప్పనష్టమును, కష్టమును తొలగించుచున్నాడని తలంచవలెను. ఏదైనా లాభము, సంతోషము, శుభము కల్గిన అది శ్రీసాయి అనుగ్రహప్రసాదముగ భావింపవలెను. అంతేగాని మన స్వప్రయోజకత్వముగా తలంచరాదు. ఆచరణపూర్వకమైన భక్తి– సబూరి, నిష్ఠ– శ్రీసాయిని మనవానినిగాచేయును. గత కోట్లవందలజన్మల తపఃఫలితముగా మనకు శ్రీసాయితో సంబంధమేర్పడును. అది ఋణానుబంధము. అట్లే మననుండి ఏదైనా ప్రయోజన మాశించి, చేయువానిని ఋణానుబంధముగా చేరదీసి, వానికి మేలు చేసిన శ్రీసాయి సంతసించి, మనకు ఉన్నతి కలుగునట్లు చేసెదరు. జన్మాంతర సంస్కారమువలన సంప్రాప్తించిన ఐశ్వర్యసంపదలను మనము సమాజరూపియైన శ్రీ సాయిని గుర్తించి అర్పించిన మనము ధన్యులమగుదుము.

నిత్యపారాయణగా శ్రీసాయిచరిత్ర–"ఏమీ నిన్ను పేక్షింతునా?" పఠించిన మనకు దరిద్రము, అలక్ష్మి, వెలితి, అగౌరవము, లేమి, లోటు, అపమృత్యువు, అల్పాయుష్షు ఉండవు. శ్రీసాయి నామస్మరణ మాత్రాన మనను తన వొడినిడుకొని ప్రతిక్షణము, ప్రతిలిప్త మన ఆధివ్యాధిబాధలు ఆగామిసంచితప్రారబ్ధములు మన కంట కుండునట్లు వానిభారము తాను భరించి, మనచే అనుభవింపజేయును. తగుశక్తి, విశ్వాసము, ధైర్యము, ప్రేమ, సహనము అనుగ్రహించును.

తల్లి చంకనున్న చంటిబిడ్డ ఎటుల తల్లి మురికికాలువలో నడచి వెళ్ళునప్పుడు, మురికి తనపాదములకంటకుండ, మురికివాసనను మాత్రమే అనుభవించుచు కాలువను తల్లి వొడిలోనుండి దాటునో అట్లే శ్రీసాయి తన బిడ్డలకు అవలంబనము అయ్యెదరు. మనము యంత్రములము, పనిముట్లము. శ్రీసాయి యజమాని, రథికుడు, సారథి. యంత్రములను నడపు ఆసామి. ఈ భావము సతతము మనయందుండుటకు శ్రీసాయిని త్రిసంధ్యల, సర్వకాలాల ప్రార్థింతము. చూచేది శ్రీసాయి వినేది శ్రీసాయి భాషించేది శ్రీసాయి. ప్రాణములేని శరీరము ఏవ్యవహారము చేయలేదు. ప్రాణమే శ్రీసాయియైనప్పుడు సర్వవ్యవహారములు నిర్వహించునది శ్రీసాయి. అందుచేత సర్వజీవరాసుల— స్థావరజంగమములు — మన్నించి, ప్రేమించి, సేవించుట అవసరము.

నిరంతరము శ్రీసాయి ధ్యాస, ధ్యానములలో శ్రీసాయినామముతో జీవితమును గడపిన శ్రీహనుమంతరావు పంతులుగారు సాయియే [illegible] అందుచేతనే నాలో శ్రీసాయిప్రేరణతో భౌతికతనువున శ్రీహనుమంతరావు బావగారి జ్యేష్ఠపుత్రులైన శ్రీ బావల్ల వెంకట పార్థసారధిగారు నాకొక లేఖ వ్రాయుచు "ఏమిరా నిన్ను పెంచుకొంటినా!" అను గ్రంథము నాల్గవభాగమునకు తొలిపలుకు నన్ను వ్రాయమన్నారు. అది శ్రీసాయిప్రేరణమున వ్రాసిరి. భౌతికతనువున నన్ను మిక్కిలి అభిమానించుచు, ప్రేమించుచు, సర్వదా సర్వథా నా అభివృద్ధి కాంక్షించే మాబావగారు, హనుమంతరావుగారే సాయుజ్యత చెంది సాయియే కాదా? నాపై ప్రేమతో ఇట్టిప్రేరణ సాయిచే చేయించిరని తలంచెదను. శ్రీసాయిచరిత్రకు తొలిపలుకు వ్రాయు మహాభాగ్యము అణువు మేరువగుట, ప్రాకుట నేర్వని పసిబిడ్డ ఉత్తుంగహిమాగిరి శిఖరము [illegible] అధిరోహించుట. ఇది సాయి నాదేహాత్మాభిమానమునకును, తన పాదపద్మములయందలి విశ్వాసమునకును, శరణాగతికిని పెట్టినైన పరీక్ష

యను భావన కల్పించిరి. వెంటనే హేమాద్రిపంతు విషయమై "అహంకర్తృత్వము, యాజమాన్యము, దేహాత్మాభిమానము తొలగించుకొని, శ్రీసాయినాథ పాదపద్మములే శరణని నమ్మినయెడల తానే హేమాద్రిపంతుచే తన చరిత్ర వ్రాసెదనను అభయము జ్ఞప్తికి వచ్చెను వెంటనే బాబా! "ఏమీ నిన్నుపేక్షింతునా?" అను గ్రంథ రూపివైన నీవ నీవు తొలిపలుకు వ్రాసుకొనవలెను. పంచభూతాత్మకుడవైన నీవు పాంచభౌతికమైన ఈ వేమూరి వేంకటరామశర్మ అనే పేరుతో అంతర్యామివై, ప్రాణశక్తివై జీవయాత్ర చేయువినాడు ఈశరీరమొక పుట్టెడు పుల్లలలో పుల్లయై కాలేటి శుష్కకాష్ఠము మాత్రమే," అని ప్రార్థిస్తూ "ఏమీ నిన్నుపేక్షింతునా ?" అను గ్రంథమునకు తొలిపలుకు వ్రాయు బాధ్యత, భారము నీదే యని ప్రార్థించుటకు ప్రేరణ యొసంగి, ఈతొలిపలుకు జ్ఞానె, భావము, భాష అందించవినాడు వ్రాయుశక్తి నాకులేదు. ఈ గ్రంథమందలి ఔన్నత్యమును నిరూపించుటకు గ్రంథమునుండి ఉదాహరణలు చూపలేను. కారణము, సూర్యుని చూపుటకు దివ్వెయనవసరము. శ్రీసాయి యొక్క లీలలను, మహిమలను చదువరులు స్వయముగా అనుభవించి, అనుభూతిచెంది, ఆనందించుటయే ఉత్తమమైన పద్ధతి యని తలచితిని.

ఈతొలిపలుకులో యత్ కించిత్ సాయిసోదరులు మెచ్చుకొను భావమున్న అది శ్రీసాయిప్రేరణ. ఏదైన తెలివితక్కువతనము, వెకిలితనము ఉన్న అది దేహాత్మాభిమానియైన వేమూరి వెంకటరామ శర్మ యనువానిది.

సతతము శ్రీసాయి పాదారవింద ధ్యానమననచింతనల గోరు

శ్రీ సాయినిలయం
12–4–1/1
రాయపేట
నిడదవోలు,
5—3—1975

శ్రీ సాయిబిడ్డ
వేమూరి వేంకటరామశర్మ

శ్రీ సాయిసమర్థ

# OM PRABHU SAINADH

# F O R E W O R D

"Spiritual awakening can come often through one single impact of DIVINE GRACE. A single darshan, a look, a touch of a SATPURUSH can bring about this immediate miracle of transformtaion in an individual Jiva.

-Mani Sahukar."

"His (Sai Baba's) grace is like the light of the SUN for all save those who blind themselves or hide themselves in the caverns of the Six VIKARAS. He is there ready to give His all. You have to be prepared with Truth, Faith & Steadfast love to receive His grace :

: Retd. Chief Justice M. B. Rege of Indore :" (A message sent to me on 2-3-1967)

PUJYA SHRI BAPATLA HANUMANTHA RAO [illegible] was one of the 'Ankita Children' (Chosen) of Sri Shirdi Sai Baba needs no introduction to Sai devotees in Andhra Pradesh; besides he was already renowned as an [illegible] scholar and poet by his innumerable monumen- [illegible] in philosophy etc. His indefatiguable selfless services to Baba in translating all the available English [illegible] on Baba in Telugu vernacular in a most simple [illegible], left his name imprinted in the hearts of [illegible]. His life was totally dedicated to Baba to the [illegible] as he was always feeling and securing the grace of Baba even in minutest affairs.

[illegible] our Hanumantha Rao had Baba's grace in [illegible], due to prenatal ties in which he

was very mysteriously drawn to Baba on Tuesday the 27th December 1944 (at 5 A. M ) through a vision just as he was on the verge of an extreme calamity tantamounting to a suicide, although he never heard of Baba (Readers requested to kindly peruse the preface by the author in his book 'SAI MANANAM' Ist edition 1958 for fuller details). Has not our Baba in His commandments frequently told 'That let his man - devotee be at any distance a thousand kross away from Him, he will be drawn to Him like a sparrow with a thread tied to its feet.' Baba's statements are always true and like Bhagavan Sri Rama Baba too resiles not from His words. Similarly our Hanumantha Rao was enlightened' saved & motomorphasised into Life Divine Since then he made a firm resolve and made an absolute surrender to Baba & carried on Baba's works as per Baba's time to time behests in dreams, visions etc., till his last breath and left his physical vesture on 7-11-73 solely centreing his mind on Baba timely receiving Shirdi Prasad, and thinking of Baba only. As Bhagavan Vasudeva has stressed in Gita 'When mind and intellect are centred on me you will undoubtedly come to me'. Unquestionably our Pujya B. H. Rao was taken by Baba in His fold. Let us always offer our prostrations to him for his monumental works on Baba and for his unflinching devotion to Baba.

"If any one remembers with one's mind absolutely fixed stationary in Him in His constant meditation, Sri Sai Baba is always close to him and ever ready to render him in his difficulties all help in thousands of ways and what is further more he can have His Darsan as well.

: Retd. High Court Judge Sri P. R. Avasthi of Gwalior.

Regarding the present works on Baba under the caption - "ఏమీ నిన్నుపేక్షింతునా? Kya Thujhe Upeksha Kartha Hum' [Am I neglecting/forgetting you] he had direct inspiration from Baba as per the anecdote given below -

On superannuation he retired from service of Grade I Telugu Pandit on 30—6—57. Provisionally to sustain himself and to eke out his livelihood, he approached Swami Kesaviahji, the Doyen of Sai movement on 14—7—55 and similarly the then President late Sri D. Bhima Rao [Retd. Post Master General] of A. I. Sai Samaj; Madras- 4 to come to his rescue by providing some job. Wonder of Wonders, on the same night while he was put up in one of the rest rooms of A. I. S. S., he was sleeping, Baba appeared to him in a dream and handed over to him a book having a cover of Tricoloured picture of Baba with the above title. Immediately it struck him that while was Baba taking care of him so scrupulously right from 1944 [from his 45th year] since he was in the vortex of Baba's love and was in the orbit of Baba's grace and while Baba was taking alround care of him, WILL he not protect? was the speck of doubt still clinging to him. Instantaneously with a contrit heart most ardently prayed Baba for pardoning him or his folly [not lack of discrimination but being natur ] and once for all gave up the idea of mployment further. Henceforth not only he adher d to aba's every assurance and also got them translate in h life in every instance till he shuffled his mortal co .

Finally in fair, I would wish to say to my beloved readers that although I am too feeble and worth not even a speak-of dust of Author's hallowed feet, I lisped

few words mainly on the insistence of my beloved brother Devotee: Pujya Sri B. V. Pardhasaradhy, the blessed son of his worshipful father and who is following the footsteps ef his father by thus making his life holy and divine.

I close here, with thousand-fold adorations to the author and his generation with a following prayer to our Prabhu Sainath :

May we live always in the paradise of the dust of Sai's feet repeating :

> "May our minds and movements lead us to the dust of Sai's Feet, Let our tongue repeat Sai's name. Let our bodies prostrate at his feet. Whatever deeds are done by us as an instrument of Sai shall become pure enough to bear the fruit of 'Unsullied Love for Sai'.

'Bow to Shri Sai. Peace be to All'

T. R. NAIDU,
Kharagpur. (W. B.)
18—10—75

———



3, 4, 5 సంపుటముల ముద్రణకు శ్రీ సాయిప్రభువు

ఆశీస్సులతో ద్రవ్యసహాయము చేసిన ప్రధాన

పోషకులు

శ్రీ చోడవరపు కృష్ణారావుపంతులుగారు

విజయవాడ రు 1116-00



1 నుండి 5 సంపుటముల ముద్రణకు (శ్రీ) సాయీప్రభువు ఆశీస్సులతో
ద్రవ్యసహాయముచేసిన ప్రధానపోషకులు.

శ్రీ G. L. నరసయ్యగారు, Sri Sainadh Cloth Stores

కర్నూలు. రు 1000-00

ఉ॥ సాయకనిన్ను నిత్యమును భక్తినుతించునటుంగు బిడ్డడా
ప్యాయత వేయిరూప్యములుపంపెను నీచరితంబు నైదు న
ధ్యాయములచ్చునొత్తుటకు తండ్రికి, నాకును, సాయి; యీతనిన్
జీయలు, నరసయాఖ్యుని విశిష్టశుభంబులగూర్చి బ్రోవవే!

# 4, 5 సంపుటముల ముద్రణకు తోడ్పడిన పోషకులు

| | రూపాయలు |
|---|---|
| శ్రీ C. సాంబమూర్తిగారు, హైదరాబాదు | 750 |
| శ్రీమతి యర్రా బసవమ్మగారు, చెరువు | 316 |
| శ్రీ యార్లగడ్డ స్వాములుగారు, చెరువు | 120 |
| శ్రీ బయన్న శివరామారావుగారు, గుంటూరు | 116 |
| శ్రీ పాటిబండ్ల రామచంద్రరావుగారు, చెరువు | 116 |
| శ్రీ నూతలపాటి చెంచు సుబ్బారావుగారు, చెరువు | 116 |
| కీ॥ శే॥ శ్రీ అల్లంశెట్టి కేదారేశ్వరుడుగారి జ్ఞాపకార్థం వారి కుమార్డు | 116 |
| శ్రీ కావూరి హరినారాయణ శర్మగారు, State Bank of India, విజయవాడ | 116 |
| శ్రీ యార్లగడ్డ వెంకటప్పయ్యగారు, చెరువు | 116 |
| కీ॥ శే॥ శ్రీ పంగులూరి పెదవెంకయ్యగారి జ్ఞాపకార్థం కుమార్తె శ్రీమతి కొమ్మినేని వీరమ్మగారు, జమ్ములపాలెం | 116 |
| శ్రీ పంగులూరి చినవెంకయ్యగారు, చెరువు | 116 |
| శ్రీ మాగంటి లక్ష్మణరావుగారు B.A.B L., M.B.A. వీరి సతీమణి శ్రీమతి సుశీలాదేవిగారు, M.B.B.S, M.D.D.G.O. మచిలీపట్నం | 116 |
| శ్రీ P. రాఘవులుగారు, Sub-Registrar, బాపట్ల | 116 |
| శ్రీ Dr. U. వెంకటరత్నంగారు, M.D. విజయవాడ | 116 |
| శ్రీ కన్నెగంటి చౌదరిగారు S/o వీరయ్య, వెదుళ్ళపల్లి | 116 |
| శ్రీ యర్రా సంగమేశ్వరరావుగారు, మురకొండపాడు | 130 |
| శ్రీ K.V. రామారావుగారు, M.Sc, నర్సాపూర్ | 100 |
| శ్రీ బాపట్ల సీతారామయ్యగారు, కరణం, నర్సాయపాలెం | 100 |

| | రూపాయలు |
|---|---|
| శ్రీ అడుసుమల్లి వెంకటచలపతిరావు, కరణం, అడుసుమల్లి | 100 |
| శ్రీ M.V. రామకృష్ణారావు బొంబాయి | 100 |
| కీ॥శే॥ శ్రీ రాపేట వెంకటస్వామి. గంగమ్మగార్ల సంస్మరణార్థం వారి కుమార్డు శ్రీ R. సీతారామయ్యగారు. [Kharagpur w.p] | 100 |
| శ్రీ మెట్లా వెంకటప్పయ్యగారు, చెరువు | 60 |
| శ్రీమతి అడుసుమల్లి అలివేలుమంగమ్మగారు, బాపట్ల | 60 |
| శ్రీ నూతలపాటి ఉమామహేశ్వరరావుగారు, చెరువు | 58 |
| శ్రీ నల్లమోతు రామకృష్ణదాసుగారు, చెరువు | 58 |
| శ్రీ P.B.V.S. రంగాచార్యులుగారు, పెంటపాడు | 58 |
| శ్రీ C. విస్సావధానులుగారు, బిక్కవోలు | 55 |
| శ్రీ చిన్నకోటరామన్న పంతులుగారు, B.A.B.L, విజయవాడ | 50 |
| కీ॥శే॥ శ్రీ బూదరాజు సుబ్బారావుగారి జ్ఞాపకార్థం వారికుమార్డు శ్రీ ప్రసాదరావుగారు, హైదరాబాదు | 50 |
| శ్రీ R. రామారావుగారు, విశాఖపట్నం | 50 |
| శ్రీ B. శ్రీనివాసరావుగారు, మదనపల్లి | 50 |
| శ్రీ G. నిరంజన్‌గారు. B.Sc (Hons), బేటంచర్ల | 50 |
| శ్రీ A. వెంకటేశ్వరరావుగారు, State Bank of India పటమట | 50 |
| శ్రీ బొడ్డు రామయ్యగారు, విశాఖపట్నం | 45 |
| శ్రీ U.V.S. శర్మగారు, నల్గొండ | 40 |
| శ్రీ అందుగులపాటి వీరభద్రరావు, చీరాల | 40 |
| శ్రీ మార్కండేశ్వరరావుగారు, విజయవాడ | 40 |
| శ్రీ మూలుపూరి సుబ్బారావుగారు, కొవ్వలి | 30 |
| శ్రీ కోక లక్ష్మణరావుగారు, హైదరాబాదు | 30 |

| | రూపాయలు |
|---|---|
| శ్రీమతి సుంకర ప్రమీలాకుమారిగారు, పామరు | 30 |
| శ్రీ E. భరద్వాజగారు మరియు V. విశ్వంగారు, విద్యానగర్ | 30 |
| శ్రీమతి అడుసుమల్లి వెంకటేశ్వరమ్మగారు, విజయవాడ | 30 |
| శ్రీ అడుసుమల్లి రామారావుగారు, కోలవెన్ను | 30 |
| శ్రీ K.V. పాండురంగారావుగారు, మచిలీపట్నం | 28 |
| చి॥ శ్రీ॥ కొప్పరపు భాస్కరరావుగారు, విజయవాడ | 25 |
| శ్రీమతి S. వనజాక్షిగారు, అనంతపురం | 25 |
| శ్రీ E.N.S. ప్రతాప్‌గారు, రాజమండ్రి | 25 |
| శ్రీ భద్రి మహాదేవయ్యగారు, నెల్లూరు | 25 |
| శ్రీ D. సుభద్రమ్మగారు, మద్రాసు | 25 |
| శ్రీ A. సూర్యప్రకాశరావు, బండారులంక | 25 |
| శ్రీ C. రఘురామయ్యగారు, పాణ్యాం | 25 |
| శ్రీ D ఉమామహేశ్వరరావుగారు, State Bank of Hyderabad, హైదరాబాదు | 25 |
| శ్రీ G. రామమోహనరావుగారు, B.A., కొవ్వలి | 25 |
| శ్రీ Dr. C. పరమేశ్వరాచారిగారు, హైదరాబాదు | 25 |
| శ్రీమతి M. ప్రమీలాదేవిగారు, రాజమండ్రి | 30 |
| శ్రీ మట్టుపల్లి గోపాలకృష్ణమూర్తిగారు, గుంటూరు | 25 |
| శ్రీ R.V. సుబ్బారావుగారు, Advocate, హైదరాబాదు | 25 |
| శ్రీ మలినేని వెంకటసీతమ్మగారు, చినపారకపూడి | 25 |
| శ్రీమతి D. శేషాయమ్మగారు, విజయవాడ | 25 |
| శ్రీ M. రంగాచారిగారు, హైదరాబాదు | 25 |
| శ్రీ సావడి సుబ్బారావు, పందితవారె | 25 |
| శ్రీ K. నాగేశ్వరరావు, పటమట | 22 |
| శ్రీ ఉప్పల అచ్చిరాజుగారు ధర్మవరం | 20 |

| | రూపాయలు |
|---|---|
| శ్రీ మూలా పేరన్న శాస్త్రిగారు, బిలాస్‌పూర్ (M.P.) | 22 |
| శ్రీమతి పెమ్మరాజు శకుంతలగారు, కాకినాడ | 20 |
| శ్రీ K. సీతారామరాజుగారు, శ్రీకాకుళం | 20 |
| శ్రీ P. మల్లిఖార్జునరావుగారు, Advocate. గుంటూరు | 20 |
| శ్రీ T.R. నాయుడుగారు, Kharagpur [W,P] | 20 |
| శ్రీ J. సీతారామయ్యగారు. Special deputy Tahsildar, బాపట్ల | 20 |
| శ్రీ N. శ్రీధర్‌గారు, విద్యానగర్ | 17 |
| శ్రీ A.S. కిషోర్‌గారు, హైదరాబాదు | 15 |
| శ్రీ మహాకాంత్ క్లాత్ స్టోర్సు, ప్రొద్దుటూరు | 15 |
| శ్రీ M. వీరభద్రరావుగారు, వెల్మ్నేడు, | 15 |
| శ్రీ బొల్లు వెంకటరామయ్యగారు, పెరికలపూడి | 15 |
| శ్రీ S. నారాయణశెట్టి & సన్స్, మడకశిర | 15 |
| శ్రీ G. సత్యనారాయణగారు, మంచిలి | 15 |
| శ్రీమతి D. సుశీలగారు, మద్రాసు | 15 |
| శ్రీమతి M. సీతమ్మగారు, మదనపల్లి | 15 |
| M/s బుక్‌లింక్స్, హైదరాబాదు | 15 |
| శ్రీ G.N. స్వాములుగారు, విశాఖపట్నం | 15 |
| శ్రీ R. విశ్వనాథంగారు B.A. కొల్లూరు | 15 |
| శ్రీ P. వెంకట్రాజయ్యగారు, హైదరాబాదు | 15 |
| శ్రీ S. భాస్కరరావుగారు, కోట | 17 |
| శ్రీ P.B. ముదలియార్‌గారు, ఖరగ్‌పూర్ [W.B.] | 11 |
| శ్రీ శ్రీరంగం సీతారామాంజనేయులుగారు, Delhi | 10 |
| శ్రీ ,, ప్రకాశంగారు, ,, | 10 |
| శ్రీ ,, కనకరామంగారు, ,, | 10 |

| | రూపాయలు |
|---|---|
| శ్రీ B.V. రామారావుగారు, పార్వతీపురంకోట | 10 |
| శ్రీ చిట్టా సూర్యనారాయణశర్మగారు. B.A. B.Ed, మచిలీపట్నం | 10 |
| శ్రీ A.V. సుబ్బారావుగారు, సికిందరాబాద్ | 10 |
| శ్రీ M. మల్లిఖార్జునమూర్తిగారు, గుంటూరు | 10 |
| శ్రీ B.L N పట్నాయకగారు, ఖరక్‌గ్‌పూర్ [W.B] | 10 |
| శ్రీ S. పుల్లన్నగారు, శ్రీ P.C. శర్మగారు, ఆదోని | 10 |
| శ్రీ M.S. నాయుడుగారు, తిరుపతి | 10 |
| శ్రీ P. కృష్ణమూర్తిగారు హిందీ పండిట్, పెదకొదమగండ్ల | 10 |
| శ్రీ కలగ సీతారామయ్యగారు B.A.BL, నల్గొండ | 10 |
| శ్రీ V. కోదండరామ్‌గారు, హైదరాబాదు | 10 |
| శ్రీ L. శోభన రామసింగుగారు, బందరు | 10 |
| శ్రీ సత్తిరాజు రామచంద్రరావుగారు, విజయనగరం | 10 |
| శ్రీ V. లక్ష్మీనారాయణగారు, ఆదోని | 10 |
| శ్రీ C. P. రావుగారు, Kharagyur (W.B) | 10 |
| శ్రీ D. లక్ష్మయ్యగారు, సికిందరాబాదు | 10 |
| శ్రీ బోడి వాసుదేవరావుగారు, నర్సరావుపేట | 6 |
| శ్రీ N. నరశింహమూర్తిగారు, పాలకొండ | 5 |
| శ్రీ వాడ్రేవు ప్రసాదరావుగారు, ధవళేశ్వరం | 5 |
| శ్రీ వేణుగోపాల్ మొదలియార్‌గారు, బిలాస్‌పూర్ (M.P.) | 5 |
| శ్రీ M.M. Jha గారు, Kharagpur (W.B) | 5 |
| శ్రీమతి మంగమ్మాల్‌గారు | 3 |
| శ్రీమతి చంద్రమ్మగారు | 2 |
| శ్రీ G. రాజగోపాల్‌గారు, మదనపల్లి | 5 |

# విషయసూచిక



(4 వ సంపుటము)

పుటలు

పుటలు

ఓమ్.

నమో భగవతే శ్రీ సాయీనాథాయ.

# 'ఏమిరా, నిన్నుపేక్షింతునా ?'

(క్యా! తుఝే ఉపేక్షా కర్తాహూఁ?)

శ్రీ సాయీబాబా చరిత్రము — భక్తుల వృత్తాంతములు.

# (LIFE OF SAIBABA)

## శ్రీ సాయి ప్రసన్న!

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్
సమర్థ సచ్చిదానంద భగవాన్ సాయిసద్గురుః

## మంగళాశాసనము.

శ్రీ వేంకటేశ ప్రసిద్ధ స్వరూప గోపాల సద్గురు కృపావర్థితంబు,
క్షేత్ర తీర్థ విశిష్ట శిర్డీ పురస్థిత ద్వారకా మాయీ ప్రభాసితంబు,
చందోర్కరాది ప్రశస్త భక్త సమార్జితైహికాముష్మికాప్యాయనంబు,
ప్రాణి హితంకర పరమేశ దివ్యావతార రహస్య ప్రచారకంబు,

సగుణ నిర్గుణోపాసనాసక్త ఫలము.
వేద వేదాంత సిద్ధాంత విస్తృతంబు,
సర్వసౌలభ్య, మార్గ రక్షణ సమర్థ
మగుచు 'శ్రీ సాయిలీల' యీ జగతి నలరు!

## శరణాగతి.

శ్రీ సాయి సద్గురూ! చిన్మయాకార!
వాసుదేవ! శ్రితభక్త మందార!
జనన మరణరూప సంసారఘోర
వనధిఁ గూలితినింకఁ బారముఁ జేర

## ఏమో, నిన్ను పేక్షింతునా

నీ పదాంబుజ భక్తి నిష్ఠపోతంబు
ప్రాపుఁగూర్పవె! సాయిబాబా! సతంబు.
వివిధ విషయము లన్వేషించి, వానఁ
దవులు నింద్రియములఁదగఁ ద్రిప్పి, లోనఁ
బొలుచు పరాత్మాభిముఖముఁ గావింపు;
తెలివి నాత్మానుభూతినిఁ బ్రసాదింపు.
సుతుఁడేని సతియేని సుహృదుండు నేని
మృతివేళ నెవరుఁ జేయిడరు సుంతేని,
మోక్షసౌఖ్యముల ప్రాపును గూర్తువీవ
అక్షీణ కరుణాకటాక్ష! శ్రీదేవ!
వాదోపవాదముల్ పాపవర్తనల
నేదింపు స్వార్థ ప్రవృత్తికార్యముల;
నాలుక నీదివ్యనామ ద్వయమ్ము
రేలుబవళ్ళు స్మరింపఁగానిమ్ము.
తలఁపులనెల్ల దాదవులఁ బోనడపి,
వలు గృహధన ధాన్యవాంఛలఁ గడపి,
దేహ విస్మృతిఁగూర్చి ధృతి బుద్ధులిడుము;
మోహబంధముల నిర్మూలింపు చిరము.
సాయి! నీనామ సంస్మరణంబు నిమ్ము
మాయయా నితరంబు మఱచిపోనిమ్ము
మతి చంచలత్వంబు మాయింపుసామి!
ధృతి శాంతి విమలభక్తినిగూర్చి యోమి.
స్వామి! నీప్రేమ వీక్షణ దీప్తివెలుఁగ
నామోహ తమసమంతయుఁ బాయువేగఁ;
బానుపుగనే తొంటిపుట్టువులందుఁ
బొనరించితినొ యెట్టిపుణ్యంబు, లిందు

ననఘ! నీలీలా కథామృతంబానఁ
గనినాఁడ, మెలకునఁగంటి నీమేన
సాయి ! నీపదభక్తి; సాయి! నీసేవఁ
బాయనీయకు సత్కృపామేయభావ !

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు శ్రీ సాయిబాబా
మహాప్రభువునకు జై! జై! జై!

శ్రీ సాయీ సమర్థ !

---

# ఏమి, నిన్ను పేక్షింతునా ?

## ఇరువదినాల్గవ ప్రకరణము

## అనుగ్రహ లీల 19, రావుసాహెబ్ - యస్వంత్ జనార్ధన్ గాల్వాంకర్

### సద్విషయము :-

శ్రీ సాయిప్రభువునకు సాష్టాంగ దండప్రణామము గావించు దము. ఆతండిి కరుణాసింధువు, భగవానుని అవతారము. యోగే శ్వరేశ్వరుండైన పరబ్రహ్మము. సాధుచూడామణి,పరమకల్యాణ గుణ ధాముఁడు. ఆత్మారాముఁడు. సకలభక్తులకు సదాశ్రయము. విశ్రమ స్థానము. లక్ష్యలక్షణ లక్షితుండైన బాబాకు ప్రణమిల్లుదము.

సాయిబాబా పరమదయా ప్రపూర్ణుఁడు, ఆతండికి మనవలన కావలసినది సంపూర్ణ శరణాగతి, గాఢవిశ్వాసము— భక్తితో బాబాను సేవించు భక్తుని కాంక్షితములు సత్వరమీడేరును. అట్టిభక్తుని బాధించు ఆధివ్యాధులు సకలము నివారణమగును. బాబా అట్టివానిని విడ నాడక యెల్లవేళల కాపును ప్రాప్తనై గండములఁ దలఁగఁబెట్టి క్షేమ కరమార్గమున నడిపించును. ఇఁక బాబా భక్తుఁడైన గాల్వాంకర్ వృత్తాంతమును తెలిసికొందము.

### గాల్వాంకర్ బాబాను సందర్శించుట :-

బాబా అంకితసంతతిలోనివాఁడగు అన్నాసాహెబ్ దభోల్కర్— హేమాద్రిపంతునకు అల్లుఁడు ఈ రావుసాహెబ్ యశ్వంత్ జనార్ధన్ గాల్వాంకర్-ఇతఁడు శ్రీ సాయిసంస్థాన సభ్యులలోనొకఁడు. శ్రీ సాయిలీలా మాసపత్రికకు సంపాదకుడుగ కొన్నిసంవత్సరములు సేవ

చేసెను. గాల్వాంకర్ బొంబాయిరాష్ట్ర ప్రభుత్వ కార్యాలయమునందు హోంశాఖలో సూపరింటెండెంటుగ ఉద్యోగము చేయుచుండెను. హేమాద్రిపంతునకు అల్లుడగుటచే తన మామవెంటజని శ్రీ సాయీనాథుని సందర్శించు భాగ్యమీతనికి గలిగినది. అయిదు నాలుగైదు పర్యాయములు బాబా దర్శనము చేసికొనినాడు. క్రమక్రమముగ నితనికి బాబాయందు గాఢవిశ్వాస మేర్పడినది.

## గాల్వాంకర్ స్వప్నము - బాబా బోధ :-

ఒకనాటిరాత్రి బాబా - గాల్వాంకరునకు స్వప్నమునందగుపించి రెండురూపాయలు దక్షిణ నిమ్మనెను, నిద్రలేచి మఱునాడు రెండు రూపాయలు మనిఆర్డరు ద్వారా పంపదలచెను. కాని ఆస్వప్నములోనే తరువాత బాబా రెండు నియమముల బోధించెను. 1. నేకనేవాగావే, ఆర్జవ ఋజుత్వములుగలిగి ప్రవర్తింపుము. (ఇది ఆతని ఉద్యోగ ప్రవర్తనకు సంబంధించినది) 2. త్రికరణశుద్ధి- ఇంద్రియనిగ్రహముగలిగి ప్రవర్తింపుము. (ఇది అతని నైతిక ప్రవర్తనకు సంబంధించినవి) బాబా అతనివలన కోరిన రెండురూపాయలు దక్షిణ యిదియని గాల్వాంకర్ గ్రహించి, యావిధముగ నతని జీవితమును గడపినాడు.

## బాబా హస్త స్పర్శ - మహత్త్వము :-

గాల్వాంకరునకు గలిగిన ఆనందానుభవమునుగూర్చి తెలిసికొనదగినది. ఒకసారి 1917లో గాల్వాంకరు శిరిడికి వెళ్ళి బాబాను దర్శించి పాదములకు మ్రొక్కెను. బాబా తన దివ్యహస్తమును అతని శిరమున నిలిపెను. ఆతండి హస్తస్పర్శమతనికి అద్భుతానందము ప్రసాదించినది. తనను తన పరిసరములనుమఱచి, సమాధినిష్ఠయందు- బ్రహ్మానందమందు చాల తడవుండినాడు. ఆసమయమున నచటచేరిన వారితో గాల్వాంకర్ పూర్వజన్మములగూర్చి తెలుపుచు నతని సత్స్వ

భావ ఋజుప్రవర్తనములఁ గూర్చి ముచ్చటించి, 'యట్టి సత్ప్రవర్తనలు గలవాఁడగుటచేతనే యీ పుట్టువున నట్టి మాతృగర్భమున నితనిఁ బుట్టించితిని. నేటికిని పూర్వజన్మ వాసనల వివశత 'సాధు సన్మార్గ మునఁ బ్రవర్తించున్నాఁడు.'– అని బాబా తెలియఁజెప్పెను. (S.C.S. 465)

క్రిస్మస్– మఱి యితర సెలవలలో గాల్వాంకర్ శిరిడికి వెళ్లి బాబా దర్శనము చేసికొనువాఁడు. బాబా అతనికి ఆధ్యాత్మిక సంబంధమైన– మతసంబంధమైన బోధ లేమియుఁ జేయలేదు. ఒక సమయమున మాత్రము 'మీ సాడేతీన్ హాత్ దేహామధ్యే నాహీం–సర్వత్రి కాణీ ఆహే సర్వత్రి కాణీ మలా పాహాత్ జా' (నేను మూడున్నర మూరల దేహము మధ్యనున్నవాఁడను కాను. నే నెల్లెడల గలను– నన్నెల్లెడలఁ జూడుడు !) అని, బాబా పలుకుట గాల్వాంకర్ వినినాఁడు. బాబా నిర్దేశింపకున్నను అతండి) అనుగ్రహమువలన గాల్వాంకర్ భగవద్గీతలు– భాగవతము– ఏకనాథరామాయణము పారాయణచేయ గలిగినాఁడు: 1918 నాటికి ఇతఁడు చిన్నవాఁడగుటచేత, ఉద్యోగ కార్యభారములు పైఁబడుటచేత, బాబా భౌతికతనువునందున్న కాలమున నెక్కుడు సన్నిహిత సంబంధము గడింపలేకపోయెను.

## బాబా అనుగ్రహమైన గాల్వాంకర్ సాధుసందర్శనము

### స్పొందుటు :-

బాబా మహాసమాధి తరువాత గాల్వాంకరునకు బాబాయందు గాఢవిశ్వాస మేర్పడినది. 1931లో గయ, ప్రయాగ, కాశి మొదలగు పుణ్యక్షేత్రములకు కుటుంబముతో తీర్థయాత్రకై గాల్వాంకర్ వెడలెను. ప్రయాగయందు భరద్వాజాశ్రమముఁ జేరునవుడచట నెవరినేని ఒక సాధుసత్పురుషుని సందర్శించు భాగ్యము ప్రసాదింపుమని యతఁడు బాబాను ధ్యానించినాఁడు. భరద్వాజాశ్రమమును విడిచి రాజమార్గ

♦ గాలమ్మ్యార్ వరప్రదాతా నమః

మునఁ బోవుచుండగ నొక మహాయోగి వర్యుఁడచటఁ గూర్చుండుట గాల్వాంకర్ చూచెను. అతని వెంటవచ్చినతఁడా యోగిని నిర్దేశించి చూపుచు 'ఈ మహాసాధువు 7 సంవత్సరములకొకసారి ప్రయాగను దర్శింపనేతెంచును. ఈతని దర్శనము మిక్కిలి దుర్లభము- ఎవరును సమీపింప భయపడుదురు. ఎవరేమియిచ్చిన స్వీకరింపఁడు'- అని చెప్పెను.

గాల్వాంకర్ శ్రీ సాయీప్రభువునందు, ఆతండి కరుణయందు గాఢవిశ్వాసము కలవాఁడు కావున ధైర్యమువహించి, ఆసాధువరుని సమీపించెను. ఆసాధువు చేతుయెత్తి "రమ్మ! బిడ్డా! రమ్మ!" అనిపిలిచెను. గాల్వాంకర్- ఆతనిసతియు, తల్లియు, మఱి యితరస్త్రీలును ఆసాధువరుని పాదములకుమ్రొక్కిరి. వారినతఁ డనుగ్రహించెను. గాల్వాంకర్ జేబులో 3 అణాలుమాత్రముండెను. వానినిఁదీసి ఆసాధువునకు సమర్పించెను. ఆయోగివరుఁడు స్వీకరించెను. ఇట్టి అనుభూతుల వలన గాల్వాంకరునకు శ్రీ సాయీశునందు భక్తి పెంపొందెను. ఆధ్యాత్మికచింతనము హెచ్చెను.

## గాల్వాంకర్‌నకు బాబా 'ప్రేమ' ను ప్రసాదించుట :-

[S.C.S. 313 A.]

1932లో నొకదినమున బాబా- గాల్వాంకర్ స్వప్నమునఁబొడమి 'నీకేమి కావలయును?' అని, ప్రశ్నించెను. ఆకలలోనే అతఁడు చేతులుమోడ్చి, 'బాబా! నాకు ప్రేమకావలయును- శుద్ధప్రేమ కావలయును' అని ప్రార్థించెను. 'నీవు కోరుప్రేమ నీకుఁ గలుగును! ప్రసాదించు చున్నాఁడను' అని, బాబా తిరోహితుఁడయ్యెను. అది మొదలు గాల్వాంకర్ సద్గ్రంథములను పారాయణముచేయునపుడు ధ్యానమున నున్నపుడు ఆప్రేమప్రవాహ మతనియందు వెల్లి విరియుచుండును. 1917న శ్రీ సాయీప్రభు హస్తస్పర్శమొదలు గాల్వాంకర్ జీవితము మధురాతి మధురమై- ప్రేమపూరితమై ప్రశంసనీయమైనది.

శ్రీ సాయీ మహాప్రభువునకు ప్రేమపాత్రులైన శ్రీయుత్ జనార్దన గాల్వాంకరునకు వందనశతము లర్పించుచు ఆబిడ్డ ననుగ్రహించినటుల మనలను రక్షింపుమని శ్రీ సాయీనాథునకు ప్రణామ సహస్రముల నర్పించుదము.

ఓమ్ శ్రీ సాయీశరణ్ !

తెలుపుల్ వల్కులు చెయ్యలేక సరణిన్ దైవార విద్యుక్తముల్
పిలుచన్ నైతికసిద్ధమైసలువ సర్వేమంబు పెంపొందు; నా
వల నజ్ఞేయవిధంబు బోధపడు; గాల్వాంకర్ ప్రవృత్తంబునం
దెలమిన్ దెల్పనె? యుక్తమౌసరణి; ఏమీ, నిన్ను పేక్షింతునా?

---

# ఏమి, నిన్నుపేక్షింతునా ?

## ఇరువదియైదవ ప్రకరణము

## అనుగ్రహ లీల 20.

## మాధవరావు దేశపాండే - (శ్యామా.)

### సద్విషయము :-

శ్రీ సాయిప్రభువు పదాబ్జములు మధురములు. బాబా స్మరణము మధురము- సకలకర్మ విమోచనమగు ఆతండ్రి సందర్శనము మధురము. శ్రీ సాయినాథుడు నేడు భౌతిక దేహమున లేకున్నను భక్తుడు గాఢవిశ్వాసముతో బాబాను ధ్యానించిన ఆ భౌతికానుభూతినిఁ బడయఁగలఁడు. తన బిడ్డలెందున్నను బాబా అదృశ్యతంతులచే వారినిఁ దన చెంతకాకర్షించుకొని తల్లిబిడ్డలఁ గౌగిలించుకొనునట్లు ప్రియమారఁ జేరఁదీసికొనుచు బాబా యెచటనుండెనో భక్తులెఱుఁగకున్నను ఆనూతధారియగు తండ్రి కూర్చు సంఘటనములవలన బాబా తమ వెంట తమముందున్నట్లు వారివారి అనుభవములఁ దెలిసికొనఁగలరు. విద్యాధన పదవి వ్యామోహముఁగలవారు- అహంకార పూరితులగుట సంసారకూపమునఁ గూలుచుందురు కాని, అకించనులు నిరాడంబరజీవనులు దీనులు విధేయులగుభక్తులు శ్రీ సాయీశుని శరణొంది ఆతండ్రి మహాప్రభావమున భవాబ్ధిఁ దరింతురు.

### మాధవరావు దేశపాండే - (శ్యామా) వృత్తాంతము :-

శ్రీ సాయినాథునితో సన్నిహిత సంబంధముగలవారిలో- మహల్సాపతి - తాత్యాపటేల్ - తరువాత పేర్కొనఁ దగినవాఁడు 'శ్యామా'- మహల్సాపతి దైవభావమున బాబాను చూచువాఁడు. తాత్యాపటేల్ బంధుభావమున [మామా అనిపిలుచుచు] చూచు

వాఁడు. శ్యామా స్నేహభావమున బాబాను సేవించువాఁడు అట్ల య్యును బాబాను 'దేవా!' అనియే సంబోధించువాఁడు. శ్యామాతో సమానముగ బాబాదగ్గఱ చనువుమానము గలవాఁడు మఱియొకఁడు లేఁడనియే చెప్పవచ్చును. ఇంతకుఁబూర్వముఁ దెలుపఁబడిన నిఁక ముందుఁ దెలుపఁబడు భక్తులచరిత్రములలో శ్యామాపాత్ర యెట్టిదో పాఠకులు గ్రహించఁగలరు. బాబా- శ్యామాల సంబంధమెట్టిదో- [S.C.S. 542 ఔరంగాబాద్ కర్ సతికి సంతతిప్రసాదించుట వృత్తాం తముచూడుడు] శ్రీ సాయీనాథ బోధామృతమున పాఠకులు సావ ధానముగఁజూడఁదగును,

## శ్యామా బాల్యము - విద్య :-

శ్యామా తాతలు తండ్రిలు నిమోన్‌గామము నివాసముగాఁ గలవారు, శ్యామా అచటనే జనించెను. వీరు దేశపాండ్యా బ్రాహ్మ ణులు. శ్యామా రెండుసంవత్సరముల బిడ్డగానున్నపుడు అతని తండ్రి కుటుంబసహితముగ స్వస్థానమువిడిచి శిరిడీకిఁజేరి యందు స్థిరనివాస మేర్పఱచుకొనెను. శ్యామా విద్యాభ్యాసము శిరిడీయందే కావించెను. పెదవాడైనతరువాత ఆశిర్డీయందే శ్యామా ఉపాధ్యాయవృత్తి నవలం బించినాఁడు. ఆతఁడు పనిచేసిన పాఠశాల నేడు శ్రీసాయీ సంస్థాన మున "శ్యామకర్ణ" అశ్వశాల గల స్థలమునందుండెడిది. ఆపాఠశాల కిటికీనుండి ద్వారకామాయి మసీదు బాగుగఁ గనఁబడును. శ్రీసాయీ బాబా ఆ మసీదునఁజేరిన క్రొత్తలో శిరిడిజనులా తండ్రినొక పిచ్చి ఫకీరని తలంచినారు. శ్యామా బాబా వింతచేష్టలను తన పాఠశాల యందుండి చూచుచుండువాఁడు. అప్పటిలో నతనికి బాబాయందు లక్ష్యము కుదిరినదికాదు. శ్యామా మన బాబాయెడ గౌరవాదరణ ప్రేమలెట్లు పెంపొందించుకొనెనో తెలిసికొనఁదగును శ్యామాకూడ బాబానొక పిచ్చిఫకీరుగ మొదట తలంచెను. (S.C S. 412-B)

• వంధ్యాదోష విముక్త్యర్థం తద్వస్త్రీ శిరికేళదాయ నమః

శ్యామా ఒక ఉపాధ్యాయుఁడని తెలిసికొంటిమి. అతఁడా పాఠశాలయందే రాత్రుల నిద్రించువాఁడు. ఆబడి ప్రక్కనగల మసీదునందు బాబా ఒక్కఁడే యుండువాఁడు. రాత్రివేళల ఆ మసీదునందు పారసీ, హిందీ, మరాటీ మొదలగు భాషలలో బాబా మాట్లాడుట-కీర్తించుట నితఁడు వినువాఁడు. అట్లు కొన్ని నెలలు జరిగినపిదప బాబా అద్భుతశక్తి సంపదలుగలవాఁడు- అను తలంపీతనికిఁ గలిగినది. బాబాయెడ భక్తి అంకురించెను.

## శ్యామాకు బాబాయందు భక్తి వృద్ధినొందిన విధము :-

1878యందు మహాసమాధినొందిన అకల్కోట మహారాజు భక్తుఁడు ఆనందస్వామి.' అతఁడు 'యివోలా'కు 6మైళ్ళ దూరమున నున్న 'సావర్గోన్'- అనుగ్రామమున నొక మఠము నిర్మించుకొని యుండువాఁడు. 1885 నాటికతఁడు 95 సంవత్సరములవాఁడు సిద్ధపురుషుఁడు సాక్షాత్కారి. శ్యామా- శిరిడియందలి నందరాం మార్వాడి యిరువురుకలిసి సావర్గోనునకు వెళ్ళి ఆ సాధుదర్శనముఁ జేసికొనిరి. ఆసాధువొక 'లంగోటీ' మాత్రము ధరించువాఁడు. వారిరువురు కొన్ని దినములందుండి ఆనందస్వామినిఁ దమ వెంటఁగొని శిర్డికిఁ దిరిగివచ్చిరి. ఆనందస్వామి మసీదునకేగి బాబాను సందర్శించెను. వారొండొరులు చూచుకొనిరి. కాని, ఏమియు మాటాడుకొనలేదు. 'ఒక పేడ దిబ్బమీద అమూల్యరత్నము పడియున్నది'- అని, ఆనందస్వామి సాయీ ప్రభువునుగూర్చిన తన అభిప్రాయము నందరాం మార్వాడి-శ్యామాలతోఁ జెప్పెను. గంగాగిర్ అనుసాధువు శిర్డికిఁజేరి బాబాను దర్శించి యాతఁడు వెలిపుచ్చిన అభిప్రాయము లోగడ ద్వారకామాయిలీలలోఁ దెలుపఁబడినది. ఈ యిరువురు సాధువులు తెలిపిన పలుకులవలన శ్యామాకు బాబాయెడ భక్తి వృద్ధినొందెను. ఉపాధ్యాయవృత్తి విడిచిపెట్టినపిదప శ్యామా, బాబాకు మిక్కిలి సన్నిహితుఁడయ్యెను.

♦ భోగైశ్వర్యేష్వసక్తాత్మనే నమః

మహాల్సాపతివలె శ్యామాకూడ ఐహిక కాంక్షలు లేనివాఁడు. స్వవిషయమునకంటె ఇతర బాబా భక్తులవిషయమున ప్రధానపాత్ర వహించినాఁడు ఈతనినిఁగూర్చి సంక్షిప్తముగఁ దెలుపవలయుననిన నందికేశ్వరు నాశ్రయించినవాఁడు శంకరుని అనుగ్రహమును బడయుటకెట్లు పాత్రుఁడగునో శ్యామాను ఆశ్రయించిన భక్తులు బాబా అనుగ్రహమునకుఁ బాత్రులైనారని చెప్పఁదగును. ఇట్టి సందర్భములు కోకొల్లలుగ భక్తుల అనుభవములందుఁ దెలుపఁబడినవి. ఆకారణమున శ్యామానుగూర్చి ప్రత్యేకముగఁ దెలుపనక్కఱలేదు.

## సర్పదష్టుఁడైన శ్యామా రక్షింపఁబడుట- (S.C.S. 612)

ఒక సమయమున విషసర్పము శ్యామా కాలి చిటికెనవ్రేలును కాటువేసెను. విషము శరీరమున వ్యాపింపఁదొడఁగెను. అతఁడు మరణము నిశ్చయమని తలంచెను. అతని మిత్రులతనిని విఠోబా దేవాలయమునకుఁ గొనిపోఁదలఁచిరి. కాని శ్యామా తన విఠోబాయైన శ్రీ సాయినాథుని దగ్గఱకేఁగఁదలఁచి మసీదుఁ జేరెను. మసీదు మెట్లెక్కబోవుచుండగా బాబా అతనినిఁజూచి 'బాపన—పై కెక్కకు [illegible]! ఎక్కితివా- జాగ్రత్త! పొమ్ము! పైకెక్కకుము' దిగిపొమ్ము!' అని ఆగ్రహోదగ్రుఁడై కనులెఱ్ఱఁజేయుచు గాబాపలుక శ్యామా చలితుఁడై నిరాశనొందెను. ద్వారకామాయి మసీదు తన ఆశ్రయ స్థానమని, శ్రీ సాయిప్రభువొక్కఁడే తన ఏకైక శరణ్యమని విశ్వసించినవాఁడు శ్యామా. ఇపుడిట్లు తరిమివేయఁబడిన కానెట కేఁగవలయునో యతఁడూహింపలేకపోయెను. ప్రాణములపై ఆసలుడిగి, మౌనముగ నూరకుండెను.

ఒకటిరెండు నిముసములకు బాబా శాంతించెను. శ్యామాను జేరఁబిలువ నతఁడు బాబా దగ్గఱకేఁగి కూర్చుండెను. అంతట బాబా

'భయపడకుము. దీనిని లేశమేని లెక్కింపకుము. ఆ దయాళువగు ఫకీరు నిన్ను రక్షించును. ఇంటికేగి కదలక కూర్చుండుము. వెలుపలకేగకుము. నను విశ్వసించి భయాందోళనలు విడువుము'— అని యతని నాశ్వాసించి యింటికంపెను అంతట బాబా కాకాసాహేబును కాకా దీక్షితును శ్యామాయింటికి బంపుచు 'శ్యామా తనకిష్టమైన పదార్థములను భుజించి, యింటందిరుగుచు నిద్రమాత్రము పోవలదని చెప్పుడు'— అని తెలియజెప్పెను. అవిధముగ వారు తెలిపిరి. శ్యామా స్వస్థుండయ్యెను.

ఇచట మనము గమనింపదగినది బాబా ఉచ్చరించిన పంచపద మంత్రము 'పొమ్ము-పైకెక్కకుము! దిగిపొమ్ము!' అనునది శ్యామా నుద్దేశించిన మాటలుకావు. వెలికావిధముగ దోచపడేసినవి. కాని అవి ఆ సర్ప విషమునుగూర్చి పలుకబడినవి. శ్యామా శరీరమున వ్యాపింపక దిగిపొమ్ము! అను బాబా ఆజ్ఞ అది. మంత్రశాస్త్రమున నిర్దేశింపబడిన యితర ప్రక్రియలతో బాబాకు నిమిత్తములేదు. ఆ తండ్రి ఆజ్ఞయే మంత్రమై శ్యామాను కాపాడినది. శ్రీ సాయీనాథుని పద పద్మముల హృదయమున నిలుపుభక్తులు సంసారవిషయ విష సర్పభీతి నుండి విముక్తులగుదురనుట అతిశయోక్తి కాదు.

## పవిత్రీకృత సద్గ్రంథములు :-

బాబా తన భక్తులకుగావించు బోధలు— ఆదేశించువిధానముల ప్రత్యేకతనుగూర్చి లోగడ పెక్కుతావుల దెలుపబడినది. అట్టివిధానములందొకటి రెండు శ్యామా విషయమున దెలిసికొందము. భక్తులు వారివారి అభిరుచుల ననుసరించి పవిత్రములగు ఆధ్యాత్మికగ్రంథములను దమవెంటగొని వెళ్ళి బాబా చేతులందుంచుదురు. బాబా తన దివ్యహస్తస్పర్శచే వానిని మిక్కిలి పవిత్రవంతములుగావించి వానిని

తిరిగి ప్రసాదించువాడు. భక్తులా గ్రంథములను పారాయణము చేయుచు శ్రీ సాయీప్రభువు తమ చెంతనున్నట్లు భావించువారు,

## శ్యామా - ఏకనాధ భాగవతము,-

ఒక సమయమున కాకామహాజని ఏకనాథ భాగవతమును (ఏకనాథరచిత శ్రీ మద్భాగవతము- మరాటీభాషలోనిది) వెంటఁగొని శిరిడికి వెళ్ళెను. శ్యామా ఆగ్రంథము నతని దగ్గఱనుండి చదువుటకుఁ దీసికొని దానిని మసీదునకుఁ గొనిపోయెను. బాబా ఆగ్రంథమును శ్యామావద్దనుండి చైకొని అందలిపుటల నటు నిటు త్రిప్పిచూచి, దీనిని నీ దగ్గఱనుంచుకొని పారాయణచేయుమని శ్యామాకు బహూకరించెను. ఆగ్రంథము కాకామహాజని దని, దానినిఁ దిరిగి యాతనికీయవలయునని శ్యామాపలుక 'వలదు-వలదు, దీనిని నేను నీకు ప్రసాదించితిని కావున దీనిని నీదగ్గఱ భద్రపఱచుకొనుము. ఇది నీకు మిక్కిలి ఉపయోగపడును'- అని, బాబా నియమించెను. ఇటుల బాబా శ్యామాకు మఱికొన్ని గ్రంథముల నప్పుడప్పుడు ప్రసాదించినాఁడు. కొన్ని దినములు గడచిన తరువాత కాకామహాజని ఏకనాథ భాగవతము మఱియొక ప్రతిఁగొని శిరిడికి వెళ్ళి బాబాకు ప్రణమిల్లి ఆతండి హస్తములం దాగ్రంథమునుంచెను. బాబా దానిని ప్రసాదముగ తిరిగియిచ్చి 'ఇదినీకు సర్వశ్రేయములఁ బ్రసాదించును'- అని అనుగ్రహించెను. కాకామహాజని వినతుఁడై ఆగ్రంథమును స్వీకరించెను.

## శ్యామా — విష్ణు సహస్రనామములు :-

శ్యామా శ్రీ సాయీప్రభువునకు మిక్కిలిగఁ గూర్చుఁభక్తుడని తెలిసికొంటిమి. బాబా అతనికి ప్రత్యేకవిధానమున విష్ణు సహస్రనామములు (గ్రంథము) ప్రసాదింపఁదలంచెను. సమర్థ రామదాస— అనుయాయి యొకఁడు శిర్డికిఁజేరి కొంతకాల మచటనుండెను. అతఁడునిత్య

ము వేకువజామునలేచి, కాలకృత్యములఁ దీర్చికొని స్నానముసలిపి, కాషాయవస్త్రముల ధరించి, భస్మములఁదికొని మిక్కిలి నిష్ఠతో విష్ణు సహస్రనామములు- భగవద్గీతలు- అధ్యాత్మ రామాయణము మొద లగు సద్గ్రంధములను పారాయణము చేయుచుండును. అటుల కొన్ని దినములు కడచినతరువాత బాబా విష్ణు సహస్రనామములను శ్యామా కు ప్రసాదింపఁదలఁచెరు.

ఒకనాఁడు బాబా 'రామదాసి'ని తనచెంతకుఁజీరిఁ తనకు కడుపు నొప్పిగ నున్నదనియు- సునాముఖి కషాయము త్రాగవలయునని, ఆ సోనాముఖపత్రముల నంగడినుండి కొనితెమ్మని అతని నియమించెను. రామదాసి తన గ్రంధములను మసీదునందుంచి అంగడికి వెళ్లెను. బాబా తన గద్దియనుండిదిగి, రామదాసి నిత్యము పారాయణచేయు స్థలమున కేగి విష్ణుసహస్రనామములు గ్రంథముఁదెచ్చి, శ్యామా చేతులందుంచి "శ్యామా! ఈగ్రంథమమూల్యమైనది. మహోత్కృష్టము—సర్వశ్రేయ స్కరము-దీనిని నీకు బహూకరించుచున్నాఁడను. పారాయణచేయుము. ఒకసారినేను హృద్రోగమున మిక్కిలి బాధపడితిని - ప్రాణాపాయస్థితి యందుంటిని. అట్టి విషమసమయమున ఈగ్రంథమును నాహృదయము నకు హత్తియుంచితిని. ఓశ్యామా! నాకెంతసుఖము-ఆనందము ప్రసా దించినదనుకొంటివి! ఆభగవానుఁడు-అల్లా-దిగివచ్చి నను రక్షించినాఁ డు అందుచే నీకు దీనినిచ్చుచున్నాఁడను. దీనిని నెమ్మదిగ-ప్రశాంతము గ—కొంచెముగ నిత్యము పారాయణము చేయుము! ఒక్క-నామమేని పఠింపుము! నీకు శుభమగును"-అని తెలియఁజెప్పెను (S.C.S. 198)

అంతట శ్యామా "బాబా! ఇదినాకువలదు. ఈగ్రంథము రామ దాసిది. అతఁడున్మాదుఁడు, కోపి, మూర్ఖపు పట్టుదలగలవాఁడు. నాతో కలహించును. అదియునుగాక దేవనాగరలిపిలోనున్న యీగ్రంథమును చదువఁదగినశక్తి నాదగ్గఱలేదు."-అని, విన్నవించెను. బాబా యీవిధ

♦ సహస్రనామ విశ్వాసినే నమః

ముగ రామదాసిని తనపైకి ఉసికొలుపఁదలఁచినాఁడేమో యనియు నూహించెను-కాని, బాబా తలంపాతని కేమి తెలియును? తన కాంతరంగిక భక్తుఁడగు శ్యామా – పామరుఁడేయైనను బాబా ఆతని కంఠమును ఆ విష్ణుసహస్రనామ రత్నహారమునఁ గైసేసి, యీవిధముగ నతని ప్రాపంచిక వ్యసనములనుండి విముక్తునిఁగావింపఁదలఁచియుండును. భగవన్నామముల యొక్క మహత్త్వమద్భుతము-సువిదితము-ఆనామములు సర్వపాపములఁదూలించి,జనన మరణాత్మక చక్రభ్రమణమునుండి జీవిని ముక్తునిఁగావించును. ఇంతకంటె సులభ సాధనములేదు, మనస్సును కల్మషరహితముగావింప సమర్థమైనది. దీనికెట్టినియమ నిబంధనములు లేవు-సర్వకాల సర్వావస్థలయందు స్మరింపయోగ్యమైనది. మిక్కిలి సులభము. అమోఘఫల ప్రదమైనది. శ్యామా కోరకపోయినను బాబా ఆతని నభ్యసింపుమని నిర్దేశింపఁ దలఁచెను. కావున ఆపని ఆతనికి విధించినాఁడు. పూర్వము ఏకనాథస్వామి తన సన్నిహితుఁడగు నొక పేదవిప్రునకీవిధముగ విష్ణు సహస్రనామ పారాయణము విధించెనని చెప్పెదరు.

సోనాముఖ ఓషధులను దీసికొని రామదాసి తిరిగివచ్చెను. అచటనున్న 'అన్నాచించనికర్' నారదునిపాత్ర మభినయింపఁదలఁచెను. ఆ రామదాసితో నతని పరోక్షమున జరిగిన విషయములనన్నియుఁ దెలిపెను. ఆమాటలు వినినతోడనే రామదాసి ఆగ్రహోదగ్రుఁడయ్యెను. వెంటనే యుద్రిక్తుడై శ్యామా మీఁదికిఁగవిసెను. శ్యామా ఆగ్రంథమును నాచికొనఁదలఁచి బాబాను ప్రేరేచి, తనను సోనాముఖఁ దెచ్చు మిషపై వెలుపలకంపి, తన పూనిక సాధించుకొనెనని నిందించెను. అంతటితో నూఱకొనక శ్యామాను పెక్కువిధముల దూషించి, యాగ్రంథమును దిరిగి తనకీయకున్న తలవ్రయ్యలు చేసెదనని తెగఁబడెను. శ్యామా ప్రశాంతముగ జరిగిన విషయమంతయుఁ జెప్పెను.

కాని, ప్రయోజనము లేకపోయెను. ఆ రామదాసి కోపమంతకంతకు హెచ్చెను. అంతట బాబా రామదాసినిఁజూచి మిక్కిలి ప్రేమతో “ఓ రామదాసి! ఏమి యీ యాగడము? ఏల నీవిటుల తబ్బిబ్బులగు చుంటివి? శ్యామా మనబిడ్డ కాఁడా? వ్యర్థముగా నతనినేల నిందించెదవు? నీకిట్టి కలహాస్వభావమెట్లుకలుగును? మృదుమధురవాక్కులఁ బలుకలేవా? నిత్యమిట్టి పవిత్రగ్రంథములను పారాయణము చేయుచుంటివే! నీమనస్సు నిర్మలము కాకుండెను ఇంద్రియముల వశముఁజేసి కొనఁజాలవైతివి. నీవెట్టి రామదాసివి? నీవిట్టి స్వల్పవిషయములకు విముఖుఁడవుగ నుండవలయును. ఈపుస్తకముపై నీకిట్టి లోలుపత్వముగలుగుట ఆశ్చర్యము కాదా! యథార్థముగ రామదాసికి దేనియెడ ‘మమత’ తగదు. ఎల్లయెడల ‘సమత’ కలుగవలయును. ఒక బాలుఁడగు శ్యామాతో నొక పుస్తకముకొఱకై తగవులాడుచున్నాఁడవు! పొమ్ము! నీస్థానమున నీవు కూర్చుండుము! ధనము వెచ్చించిన పుస్తకములు కోకొల్లలుగ దొఱకును, కాని, మనుష్యులు దొఱకరు. శెస్సగ ఆలోచించుకొని సమాధానపడుము! నీ పుస్తకము విలువఎంత? శ్యామాకు దానితో నెట్టి సంబంధములేదు. స్వయముగఁ దీసికొనివచ్చి నేనే శ్యామాకు ఇచ్చితిని. నీవాగ్రంథమును కంఠస్థముఁ జేసికొంటివి శ్యామా దానిని పఠించి బాగుపడఁగలఁడని నేను దాని నతనికి బహూకరించితిని.”— అని పలికెను.

బాబా పలుకులెంత మృదుమధురములు— అమృతోపమానములైన వో గమనింపుడు! వానిఫలము అమోఘము. రామదాసి శాంతించి శ్యామా దగ్గఱనున్న పంచరాత్రగీత తనగ్రంథమునకు బదులుగ నిమ్మని అతని నడిగెను. అంతట శ్యామా సంతోషముతో “ఒకటి కాదు పదిప్రతులిచ్చెదను’ అని పలికెను. అంతటితో నావిషయమంతయు ముగిసెను, కాని, యీ ఉదంతమునందొక ప్రశ్న ముదయింపక

♦ సహస్రనామ లక్షితాయ నమః

పోదు. ఏమన శ్యామదాసి తనకభిరుచి, సంబంధములేని పాంచరాత్రి గీతాగ్రంథము నేలకోరెను? నిత్యము మసీదునందు బాబా సన్నిధిని ఆధ్యాత్మిక గ్రంథములను పారాయణముఁ గావించునతఁడు బాబా ఎదుటనే శ్యామాను అట్లు నిందించుటకు కారణమేమి? వీనికి యుక్తములగు సమాధానములు మనకు దొరకవు. ఎవరిని నిందింపనవకాశములేదు. కాని యింతరభస జరిగినఁగాని ఈవిషయ ప్రాధాన్యము విష్ణు సహస్రనామములయొక్క ప్రాశస్త్యము శ్యామా తలకెక్కదేమో! అని, బాబా యిట్టి సంఘటనముఁగూర్చి యుండవచ్చును. బాబా తనబిడ్డలకు గావించుబోధలు ప్రత్యేకములు- ఇతరుల కూహింపనలవి కానివని మనము పలుతావులఁ దెలిసికొంటిమి. సంస్కృతజ్ఞానము లేనివాఁడైనను శ్యామా- బాబా అనుగ్రహమున ఆ విష్ణు సహస్రనామములను సాధనఁజేసి ప్రొఫెసర్- జి.జి. నార్కేకుఁ దెలియఁజెప్పఁ గలిగినంత అనుభవమును సంపాదించెను.

## కాకాజి - వైద్య :-

నాశిక్ జిల్లా 'సానీ' అనుగ్రామమున కాకాజి- వైద్య యను పూజరి కలఁడు. ఆగ్రామమునఁగల 'సప్తశృంగి' దేవాలయమున నతఁడు పూజరి. అతనికి పెక్కుసంకటములు ప్రాప్తించి మనస్సు స్తిమితములేకుండెను. అశాంతి హెచ్చెను. ఒకనాటి సాయంకాలమున ఆలయమున కేగి తనకష్టములను దెలుపుకొని మనశ్శాంతిని ప్రసాదింపుమని ఆ సప్తశృంగి దేవతను ప్రార్థించెను. ఆతనిభక్తికి మెచ్చి ఆదేవి ఆరాత్రి యతనికి స్వప్నమునఁబొడమి 'నీవు బాబాదగ్గఱకుఁబొమ్ము!నీకు మనశ్శాంతి చేకూరును' అని నిర్దేశించెను.ఏబాబా!-అని అతఁడు ప్రశ్నించుపూర్వమే మెలకువ వచ్చెను. త్రియంబకములోని త్రియంబకేశ్వరస్వామి యనుకొని అతఁడు త్రియంబకముఁజేరి అచట స్నానజపాభిషేకాదులఁ బెక్కుగావించెను. కాని మనశ్శాంతి కలుగలేదు, తిరిగి వైద్య తన గ్రామము

'వానీ'చేరి ఆదేవినిఁ బ్రార్థించెను ఆదేవి మరల ఆతని కలలోఁబోడమి 'నీవు త్రియంబకేశ్వర మేలవెళ్ళితివి? బాబా- అనిన శిరిడియందుఁగల శ్రీసాయీ సమర్థుఁడు అని నేను నిర్దేశించినది కావున అచటకేగుము'- అని మరల ఆదేవి బోధించెను

కాకాజీకి ఒకసమస్య యేర్పడెను. ఎప్పుడు శిరిడికి వెళ్ళుట? బాబా దర్శనమెట్లు ప్రాప్తించును?- అను ఆలోచనలోపడెను. సాధు సత్పురుషుఁడు - దైవము అభిన్నులు. కావున ఎవరెంత ఆసక్తితో వారి దర్శనముఁ గాంక్షింతురో ఆసాధు-దైవములు అంతప్రేమతో తన వానినిఁ జేరఁదీయుదురు. సాధుసత్పురుషుని అనుగ్రహములేనిదే యెవ రును వారినిఁజేరఁజాలరు. తన వానినిఁ జేరఁదీయఁదలంచెనా- ఆతండి ్రయే తనబిడ్డ తననుజేరుటకు ఎల్లసాధనముల సమకూర్చును. ఈకాకాజీ విషయమున బాబాకూర్చిన సంఘటనము గమనింపుడు!

## శ్యామా - బాల్యవిషయము - మ్రొక్కుబడి :-

శ్యామా కుటుంబములోనివారికి 'వాని' గ్రామములోని 'సప్త శృంగిదేవి'- కులదేవత. శ్యామా పసిబిడ్డగనున్నపుడు పెద్దజబ్బుచేసె ను. ఆబిడ్డకు వ్యాధినయమైన ఆబిడ్డతో 'వాని' కివెళ్ళి ఆ దేవతను దర్శనము చేసికొందునని శ్యామాతల్లి మ్రొక్కుకొనెను. బిడ్డకారోగ్య ము కలిగిన పిదప మ్రొక్కుబడివిషయము తల్లిమఱచెను. కొంతకా లము గడచినతరువాత ఆతల్లికి ఱొమ్మునంబంధమైన వ్యాధివచ్చెను. ఆవ్యాధి నివారణమైన ఆదేవికి రజతస్తనములు చేయించి తీసికొనివెళ్ళి సమర్పింతునని శ్యామాతల్లి మ్రొక్కుకొనెను. ఆమెవ్యాధి నివారణ మయ్యెను కాని ఆరెండు మ్రొక్కుబడులను ఆమె చెల్లించలేదు. అవ సానకాలమున తల్లి శ్యామానుపిలిచి, తానుకావించిన మ్రొక్కుబడులఁ జెల్లింపుమనిచెప్ప శ్యామా తప్పక చెల్లింతునని మాటనిచ్చెను. తల్లి గతించెను. 30 సంవత్సరములుగడచెను. శ్యామా ఆమాట మఱచెను.

శ్యామా తమ్ముఁడు 'బాపాజీ' అనువాఁడు కలఁడు. శిరిడికి గొప్ప ప్రసిద్ధిగల జ్యోతిష్కుఁడేతెంచెను. బాపాజీ తనజాతకము విషయమై అతనినడిగెను. ఆజ్యోతిష్కుఁడు వారింట్లో గావించిన మ్రొక్కుబడులను దెలిపి వానిని చెల్లింపుమనెను బాపాజీ ఆవిషయము శ్యామాకుఁ దెలుప నిఁక నాలసింపఁదగదని రజతస్తనములను సిద్ధము చేయించుకొని మసీదుకేగి బాబా పాదముల మ్రోలనిలిపి 'బాబా! నీవే మాకు సప్తశృంగిదేవతవు. వీనిని స్వీకరించి మమ్ము ఋణవిముక్తులఁ గావింపుము'- అని ప్రార్థించెను. అంతట బాబా 'నీవు స్వయముగ 'వానీ' గ్రామమున సప్తశృంగి దేవతను సందర్శించి యీ రజతస్తనములను ఆదేవతకు సమర్పించిరమ్ము!'- అని ఆజ్ఞాపించెను అంతట శ్యామా బాబా అనుజ్ఞఁబడసి, ఊధి ప్రసాదముల స్వీకరించి 'వానీ' గ్రామముఁజేరెను. ఈవిచిత్ర సంఘటనము పాఠకులు గమనింపుడు! కాకాజీవైద్య శిరిడికి వెళ్ళుదును ఎట్లుల వెళ్ళి బాబా దర్శనముఁజేసి కొందునా యని తహతహ పడుచున్న సమయమున ఆతని యింటికి తన మ్రొక్కుబడులఁ జెల్లించుటకు శ్యామా వచ్చినాఁడు. శ్యామాను గూర్చి తెలిసికొనిన వైద్య ఆనందమేమని చెప్పఁగలము? వారిరువురు బాబా లీలలనుగూర్చి చాలతడవు ప్రస్తావించుకొనిరి. శ్యామా తన మ్రొక్కుబడులఁ జెల్లించెను. ఇరువురుకలిసి శిరిడికిఁ జేరిరి.

కాకాజీ వైద్య ద్వారకామాయి మసీదుఁజేరి శ్రీ సాయీప్రభు శ్రీచరణములకు సాష్టాంగ నమస్కృతులఁగావించెను. అతని కనుల వెంట నానందబాష్పములు స్రవించెను. మనస్సు ప్రశాంతినొందెను. సప్తశృంగి దేవత కలలోఁదెలిపిన విధమున బాబా దర్శనము చేసికొనిన క్షణముననే కాకాజీకి అంతకుఁబూర్వముగల వంతలన్నియుఁదొలఁగి మనస్సు కుదుటపడి శాంతివహించెను. 'ఈ యద్భుతశక్తియేమా?-' అని వైద్య ఆశ్చర్యపడెను. బాబా సందర్శనము మాత్రమున నతనికి పర

* గురవే నమః * అతినమ్ర స్వభావాయ నమః

మానందము గలిగెను. సాధుసత్పురుష సందర్శన మహత్త్వమదియే. బాబా పాదముల దృష్టినిలిపి యతఁడట్లె నిలిచియుండెను. శిరిడియందు కాకాజి 1 3 దినములుండి, యెల్లవిచారములఁ బాసి, సంతుష్టి సంతృప్తులొంది బాబా అనుజ్ఞ ఉధి ప్రసాదములఁ బడసి స్వగ్రామము జేరెను.

## శ్యామా మఱదలు - ప్లేగువ్యాధి - ఉదిప్రభావము

(S.C.S. 383)

శ్యామా తమ్ముఁడు 'బాపాజీ' సావూల్ వాపి' (శిరిడి సమీపమున నొకగ్రామము) అనుచోట నివసించుచుండెను. ఒకసమయమున నతని భార్యకు పెద్దజ్వరముతగిలి, పొత్తికడుపుమీఁద ప్లేగుబొబ్బలు రెండు వర్పడెను. బాపాజీ భయపడి ఆరాత్రి శిరిడికివెళ్లి శ్యామా సాయముకోరెను. శ్యామాకు భయముకలిగి, అతనివిశ్వాసముచొప్పున మసీదుఁజేరి, బాబా పాదములవ్రాలి, వారి ఆపదలను దెలుపుకొని అనుగ్రహింపుమని, తననారాత్రి వెళ్లుటకు అనుజ్ఞనిమ్మని ఆ తండ్రిని బ్రార్థించెను. అంతట బాబా శ్యామానుజూచి 'నీవీరాత్రి యింత ప్రొద్దుపోయినతరువాత వెళ్ళవలదు- 'ఉధి' పంపుము. జ్వరము-బొబ్బలకై యింతభయమేల? భగవానుఁడు మనతండ్రి- ప్రభువు. ఆమె తేలికగ ఆరోగ్యముపొందును. నీవిప్పుడు వెళ్ళవలదు. రేపు ఉదయము వెళ్లి వెంటనే తిరిగిరమ్ము!" అని, పలికి 'ఉధిని' ప్రసాదించెను.

బాబా ప్రసాదించు 'ఉధి'యందు శ్యామాకు గాఢవిశ్వాసము కలదు. బాపాజీచేతికి ఆ "ఉధి*నిచ్చి పంపెను. అతఁడింటికేగి ఆఉధిని కొంతబొబ్బలపై నలఁది కొంత మంచినీటియందు గలిపి ఆరోగిచే త్రాగించెను. ఆతీర్థము త్రాగినవెంటనే ఆమెకు చెమటలుపట్టెను. జ్వరముతగ్గెను. సుఖముగ నిద్రపోయెను. మఱునాటి ఉదయము జ్వర

* కర్మయుక్తోఽప్యకర్మకృతేనమః

ముగాని బొబ్బలబాధగాని లేక ఆరోగ్యముగనున్న తన భార్యనుజూచి బాపాజీ ఆశ్చర్యపడెను. ఆ మఱునాటి ఉదయమున బాబా అనుజ్ఞం బడసి, శ్యామా తమ్ముని యింటికి వెళ్ళి కుంపటిదగ్గఱం గూర్చుండి తేనీరు సిద్ధపఱచుచున్న మఱదలనుజూచి, యాతడాశ్చర్యచకితుండయ్యెను. శ్యామా అట్టి వింతనుగూర్చి తమ్ముని బ్రశ్నింప ఊధి ప్రభావముచే నొక్కరాత్రిలో ఆవ్యాధి యంతయు నివారింపంబడెనని చెప్పెను. బాబా ఆ క్రిందటిరాత్రి 'నీవు రేపు ఉదయము వెళ్ళి వెంటనే తిరిగి రమ్ము!'- అని, పలికిన పలుకులలోని భావము శ్యామా గ్రహించెను. అనగా 'నీవు రాత్రి వెళ్ళి చేయంగలుగునది యేమియు లేదు. సకలముం జక్కంబెట్టుటకు నేనుండంగా నీకేమి భయము?' అని బాబా పలుకుల లోని అంతర్యమతండప్పుడు గ్రహించెను.

తేనీరుత్రాగి శ్యామా తిరిగి శిరిడీకిం జేరి బాబాను సందర్శించి మ్రొక్కి, 'దేవా! ఏమి? యీ నీనాటకము! నీవు మొదట నొక తుపాను లేగంజేసి మాకు ఆందోళన భయభ్రాంతులను గలిగింతువు. పిదప దానిని శాంతింపంజేసి, మాకు స్వస్థత ప్రసాదింతువు'-, అను శ్యామానుజూచి 'గహనా కర్మణోగతిః'- కర్మవిధానము (పద్ధతి) దురవగాహమైనది. నేనేమియుం జేయకున్నను జనులు వారివారి కర్మానుసారముగ ప్రాప్తములగు శుభాశుభ ఫలములకు నన్ను కర్తగందలంతురు, నేను కేవలము సాక్షిభూతుండను. ఆ మహాప్రభువే కర్త-ప్రేరకుడు- అతండే పరమ కరుణాళువునైయున్నాండు నేను దైవమును గాను- ప్రభువునుగాను. నేనా ప్రభువుయొక్క విధేయసేవకుండను. అతనిని సదా స్మరించువాండను. అహంకృతిని నిర్మూలించి అతనియందు గాఢవిశ్వాసముగలిగి, సర్వభావముల సమాశ్రయించువాండు ఆప్రభువు ననుగ్రహమున సకలకర్మ బంధవిముక్తుండై అవ్యయానందము బడయును'- అని బాబా బోధించెను.

* ఓం వాసినవాసినే నమః * మాధవరాయదేశపాండే సఖ్యుః సాహాయ్యకృతే నమః

## శ్యామా – తీర్థయాత్ర :-

ఒక సమయమున కాకాదీక్షిత్తు తన పెద్దకుమారుఁడగు 'బాబు' యొక్క ఉపనయనము 'నాగపూరు'లో జరుపఁదలఁచెను. ఆ సమయముననే నానాసాహెబ్ చందోర్కరు తన పెద్దకుమారుని వివాహము 'గ్వాలియర్'లో జరుపఁదలపెట్టెను ఈ యిరువురు శిరిడికివెళ్ళి శ్రీ సాయీప్రభువునకు మ్రొక్కి, తాము జరుపఁదలఁచిన శుభకార్యములకు విజయము చేయుమని వినయమున బాబాను ప్రార్థించిరి. బాబా తనకు ప్రతినిధిగ శ్యామాను గొనిపొండని నియమించెను. కాకాదీక్షిత్తు-చందోర్కర్- ఇరువురు బాబాను స్వయముగ రావలసినదని పోరింబొరి ప్రార్థింప 'కాశీ- ప్రయాగక్షేత్రముల పనులను ముగించుకొని మేము శ్యామాను పురోగమింతుము'- అని, బాబా పలికెను. ఈపలుకుల లోని బాబా సర్వవ్యాపకత్వము గమనింపుడు!

బాబా అనుమతినిఁబడసి ఆరెండు శుభకార్యములకు నాగపూరు గ్వాలియర్ పట్టణములకేగి శ్యామా అచటనుండి కాశీ, ప్రయాగ-గయ క్షేత్రములను సందర్శింప ప్రయాణమయ్యెను. ఆతనివెంట అప్పాకోటేకూడ వెళ్ళఁదలఁచెను. వారిరువురు ముందుగ నాగపూరునకు ఉపనయన శుభకార్యమునకేగిరి. కాకాదీక్షిత్తు శ్యామా ఖర్చులకు గాను 200 రూపాయలనిచ్చెను. అక్కడనుండి వారిద్దరు గ్వాలియర్ లోజరుగు వివాహమునకేగిరి. అచట చందోర్కర్ 100 రూపాయలు ఆయన వియ్యంకుఁడు 'జాతార్' 100 రూపాయలు శ్యామాకు సమర్పించిరి. వారచటనుండి కాశికి– నందుండి అయోధ్యకు వెళ్లిరి. కాశీ యందు రెండునెలలు అయోధ్యయందు 21 దినములు గడపిరి. అచట నుండి ప్రయాగకు ప్రయాణమైరి. రైలులో ప్రయాణము చేయునపుడు

గయయందు ప్లేగువ్యాధి కలదని విని భయపడిరి. ఆరాత్రి గయ స్టేషన్ లోదిగి, సమీపమునగల ధర్మశాలలో నిద్రించిరి.

మఱునాటి ఉదయమున గయక్షేత్రములో యాత్రికులకువలయు నేర్పాటులన్నియుఁ గావించు పెద్ద పురోహితుఁడు ఆ ధర్మశాలకు వెళ్ళి 'యాత్రికులందఱు బయలుదేరిరి. మీరును త్వరపడుడు!'- అని, శ్యామా - కాకాలతోఁ చెప్పెను. గయలో ప్లేగువ్యాధి విషయమై శ్యామా ప్రశ్నింప ఆవ్యాధి అచట లేదనియు, వారే స్వయముగవచ్చి చూచుకొనవచ్చునని ఆ పురోహితుఁడు చెప్పెను. వారిపురాతనివెంట గయలోని అతని పెద్దభవనమును జేరిరి. ఆ పురోహితుఁడు ఏర్పఱచిన వసతికి శ్యామా మిక్కిలి సంతోషించెను. అన్నిటికంటె ఆపురోహితుని భవనము సింహద్వారమునకు ఎదురుగ లోపలిగోడపై నలంకరింపఁబడిన శ్రీ సాయీ మహాప్రభువు పెద్ద చిత్రపటమునుగాంచి శ్యామా పొందిన ఆశ్చర్యానందములకు మేరలేకపోయెను. బాబా పలుకులను:- కాశీ ప్రయాగాది క్షేత్రముల పనులముగించుకొని శ్యామాను పురోగమించెదము'- అనినమాటలను స్మరించి, శ్యామా పరవశుఁడై కనులవెంట ఆనందబాష్పముల స్రవించుచుండెను. ఆగయా బ్రాహ్మణ పురోహితుఁడు ప్లేగువ్యాధినిఁ దలంచుకొని భయపడి శ్యామా యేడ్చుచుండెనని తలంచెను. కాని, శ్యామా ఆపటమెట్లాతఁడు సంపాదించెనని ప్రశ్నింప నాపురోహితుఁడు తన అనుచరులుగ మన్మాడ్- 'పునతంబి' యందు 200 మంది గయా యాత్రికులకు వసతులఁగూర్చు వారు పని చేయుచుండిరనియు, వారివలన శ్రీ సాయీబాబానుగూర్చి తాను వినెననిచెప్పెను. 12 సంవత్సరములక్రిందట శిరిడికి వెళ్ళి శ్రీ సాయీ ప్రభుదర్శనము చేసికొంటిననియు, శ్యామా గృహమున వ్రేలాడఁగట్టబడిన బాబా చిత్రపటమును బాబా అనుమతిన శ్యామా తనకు బహూకరించెనని యీ వృత్తాంత మాపురోహితుఁడు వివరించెను. శ్యామా

12 సంవత్సరములకుఁబూర్వము జరిగిన విషయములన్నియు స్మరించెను. ఆ పురోహితుఁడు తనకు శ్రీ సాయీనాథుని పటమును ప్రసాదించిన మహనీయుఁడే తనగృహమును పావనముఁజేయ నతిథియయ్యెనని తెలిసికొని, అత్యంతానందభరితుఁడై శ్యామాను ఆలింగనముఁ గావించి కొనెను. వారిరువురు పరమానందభరితులైరి. ఆ పురోహితుఁడు గొప్ప భాగ్యవంతుఁడు. పాలకియందుఁ గూర్చుండి పోవువాఁడు. ఆతఁడు శ్యామాను రాజమర్యాదలతో గౌరవించి, యేనుఁగుపై స్వారి చేయించెను. ఆ గయాక్షేత్రమున శ్యామాకు సకలవిధములఁ దోడ్పడి తీర్థవిధులు మొదలగువానిని నిర్వర్తింపఁజేసెను.

[బాబా పలుకులు గనుడు! (S.C.S. 582) 'పూర్వజన్మమున నేను-నీవు (కపర్దే) జోగ్-కాకాదీక్షిత్-శ్యామా- దాదా కేల్కార్ అందఱముఁగలిసి చీకటిపిధియందు మన గురువుదగ్గఱ నున్నవారము, కావున వీరందఱ నొకచోటునకు మరలఁ జేర్చినాఁడను.']

శ్యామా తన అనుభవమును పురస్కరించుకొని తెలిపినముఖ్య విషయములు పాఠకులుగ్రహింపఁ బ్రార్థితులు. 'నేను దేనికొఱకు బాబాను ప్రార్థింపను. నాకేది కావలయునో బాబా ఎఱుఁగును. మన మనకేది యవసరమో దానిని ప్రసాదించుట బాబా బాధ్యత.(ఆతండ్రి సమకూర్పఁదలచిన) బాబాను మనకోరికలతో బాధించనేల? బాబా మన అవసరము తెలియఁగఁడనికాని, యెఱిఁగియుండియు మనము ప్రార్థించనిదే ప్రసాదింపఁడని కాని మనము తలంచరాదు. బాబా మనకేది యెటుల ఘటింపఁదలచెనో అటులే కానీయుదము- దానివలన మనకు సుఖసంతోషములు చేకూరును.

శ్యామా- (మాధవరావు దేశపాండే) బాబా మహాసమాధివరకు ఆతండ్రిని విడిచినవాఁడుకాఁడు. ఈతని సాయమున పలువురు భక్తులు బాబా అనుగ్రహపాత్రులైరి. శ్రీ సాయీ మహాప్రభువునకు మిక్కిలి ప్రేమపాత్రుఁడై అంకితసంతతిలో నొకఁడగు మాధవరావు దేశపాండే-

శ్యామాకు వందనశతము లర్పించుచు, ఆబిడ్డ ననుగ్రహించినటుల మనల ననుగ్రహింపుమని శ్రీ సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయీ మహారాజునకు ప్రణతిసహస్రము లర్పించుదము.

ఓమ్ శ్రీసాయీ శరణ్ !

కల పూర్వంపు ఋణానుబంధమున భక్తశ్రేణి నేవేన నెపంబుల నాసన్నిధికేన చేర్చుకొని, ప్రాపున్గాపునై, యెన్ని జన్మల నేనిన్ నిడనాడఁబోవ; నిట శ్యామా వృత్తమాలించి తర్మిలి; నీ శంకలనింక నేన్ విడవ? ఏమీ, నిన్ను పేక్షింతునా ?



# ఏమీ, నిన్నుపేక్షింతునా ?

## ఇరువదియారవ ప్రకరణము

## అనుగ్రహ లీల 21.

## శ్రీమంత్ బాపూసాహెబ్ గోపాలరావు - బూటీ (నాగపూరు)

### సద్విషయము :-

శ్రీ సాయీప్రభువునకుఁ దనబిడ్డలపైఁగల ప్రేమ అపారము. లౌకిక పారలౌకికవిషయములందు సద్బోధఁగావించి, తన ఆశ్రితులను సుక్షేమపథమున నడిపించి గమ్యముఁజేర్చ సమర్థుఁడు- శ్రీ సాయీనాథుఁడు. వరదాభయదాన ప్రశస్తమగు హస్తమున తన పదాశ్రితుని మస్తమును స్పృశించుమాత్రమున తన అద్భుతశక్తిఁ దనవానియందు ప్రవేశపెట్టువాఁడు. దానినే 'శక్తినిపాత' మందురు. సర్వహృదయాంతర్వర్తియైన సాయీప్రభువెవరిచే నేయేకృతులఁ జేయింపఁదలచునో వానిని నిర్వర్తింపఁజేయును, మానవుఁడు సహజముగ నెంత విద్యాధన బలములు గలవాఁడైనను దైవానుగ్రహము- దైవప్రేరణ లేనిదే యేపనియుఁ గావింపసమర్థుఁడుకాఁడు. 'ఈపని మనము కావించితిమి- దీనిని మనము చేయఁగలము' అని, మానవుఁడు తలంచుట కేవలము అవివేకము. ఏపని యెట్లు పరిణమించినను అదియంతయు దైవసంఘటనముకాని, మనుష్యుని స్వశక్తి యనునది లేదు.

సమర్థ సద్గురువగు శ్రీ సాయీప్రభువు తానే యేభక్తునిచే నేమి చేయించఁదలఁచెనో వానినంతయుఁ దనవాని కెఱుకపడకయే ఈపనిఁ జేయఁబోవుచున్నాను- ఈపనిఁ జేయఁగలను- అను తలంపు ఆత

♦ కృత్స్నక్షేత్ర ప్రకాశకాయనమః

నికిఁ గలిగింపకయే ఆతండ్రి సకలముఁ గావింపఁజేయును. ఫలానుభవ సమయమునఁగాని ఆవ్యక్తికిఁ దానుగావించిన పనివేద్యముకాదు. అఘటిత ఘటనాసమర్థుఁడగు బాబా కావించు పనులనూహ్యములు. 'నేను నీవాఁడను'- అను అభేదదృష్టితో బాబా పాదకమలముల సమాశ్రయించుటే భక్తుఁడు చేయఁదగినపని. అట్టిప్రేమతో బాబాను సమాశ్రయించిన క్షణమున వర్షర్తువునందు సకలనదులు సముద్రమునుజేరి, ఆసాగరమున లయమొందునటుల ఆశ్రితుఁడు బాబాయందు- లయించును. ఆక్షణము మొదలు ఆభక్తునిఁ దనవానిఁగఁ జేసికొని సకలముఁ దానె నిర్వర్తించుకొనును. ఆ తండ్రిచేతిలోని యంత్రమువలె భక్తుఁడు ప్రవర్తించును.

ధనము- విద్య- బలాదులు దైవదత్తములు, అవి దైవమునకు అంకితములైననే రాణించును. స్వార్థపరములైన అవియుండియు లేనివేయగును. వానివలన యిహపరములందు సుఖశాంతులుఁగలుగవు. నాగపూరులోని కోటీశ్వరుఁడగు గోపాలరావుబూటీ (బాపూసాహెబ్ బూటి) శ్రీ సాయీప్రభువునకెట్లు ప్రేమపాత్రుఁడై లక్ష్యోపలక్షల సోదరీసోదరభక్తుల ప్రేమలను చూఱఁగొనినది- శ్రీసాయీ మహాస్వామి భౌతికదేహమును భద్రపఱచుటకై సమాధి మందిరమును [బూటీవాడ-దగ్గివాడ] నిర్మించి, చిరస్థాయిగ దిగంత విశ్రాంతకీర్తిని గడించినది భక్తులెల్లరు గ్రహింపఁదగును కోటిటంకముల వెచ్చించి కొనఁదలఁచినను ఇట్టికీర్తి లభ్యముకాదు, అది కేవలము దైవప్రసాదము.

## గోపాలరావుబూటి వృత్తాంతము - బాబా ప్రథమ సందర్శనము :-

శ్రీమంత్ బాపూసాహెబ్ గోపాలరావుబూటీ- నాగపూరులో మిక్కిలి ప్రసిద్ధిగవిన కోటీశ్వరుఁడు. మనము లోగడ నాశిక్‌లోని

రావుబహద్దూర్ యస్. బి ధుమాల్‌నుగూర్చి తెలిసికొంటిమి. ధుమాల్ 1907లో శ్రీ సాయీబాబాను సందర్శించినాఁడు. ఆతఁడు అనుగ్రహమునకుఁ బాత్రుఁడైనాఁడు. 'ఏకఃస్వాదు నభుంజీత!-' అని నూక్తికలదుగదా! మధురపదార్థముఁ దానొక్కఁడే భుజింపఁదలపరాదు. తనకుఁ గూర్చువారితో - తన ఆప్తులతోఁగలిసి భుజించినపుడే సుఖానందములు కలుగును. శ్రీ సాయీప్రభువు మహత్త్వమును గుర్తించినధుమాల్ తనమిత్రుఁడు ఆప్తుఁడగు గోపాలరావుబూటీని వెంటఁబెట్టుకొని శిరిడికిఁగొనివెళ్ళి 1907ననే బాబా దర్శనముఁ జేయించెను.

లోఁగడ పలుతావుల ఋణానుబంధమునుగూర్చి తెలుపఁబడినది. తనవాఁడెంతెంత దూరముననున్నను శ్రీ సాయీనాథుఁడే యేదొక కారణమునుగల్పించి తనదగ్గఱకుఁ జేర్చుకొనును. బూటీ-బాబా సందర్శనముఁ జేసికొనినది మొదలు ఆతఁడిపై గాఢమగు భక్తిప్రేమలఁ బఱపినాఁడు. అతఁడేకాదు- ఆయన కుటుంబములోని వారందఱు బాబా యందపార భక్తిప్రేమల నెఱపినారు. లోఁగడ జి.జి. నార్కే వృత్తాంతముఁ దెలిసికొంటిమి. ప్రొఫెసర్ నార్కే యీ గోపాలరావుబూటీ అల్లుఁడు అనియుఁ దెలిసికొంటిమి. బూటీ కుటుంబములోనివారు- నార్కే కుటుంబములోనివారందఱు బాబా అనుగ్రహమునకు పాత్రులైరి. ఈ యిరువుర కుటుంబములను శ్రీ సాయీనాథుఁ డనేకవిధముల రక్షించినాఁడు.

## బూటీ రక్తవిరేచనములు - వాంతులు - నివారణము :-

గోపాలరావుబూటీ తఱచుగ శిరిడి యందుండువాఁడు. ఒకసమయమున అతనికి రక్తవిరేచనములు - వాంతులునేర్పడి మిక్కిలి బాధపడెను. శ్రీమంతుఁడగుటచే నతని అలమరనిండుగ ఔషధముల సీసాలుకలవు. కాని యేవియును పనిచేయలేదు. వాంతులు విరేచన

ములవలన బూటీ మిక్కిలి నీరసించి బాబా దర్శనార్థము వాసీమునకుఁ గూడ వెళ్ళలేని స్థితియందుండెను. శ్రీ సాయిప్రభువు బూటీని పిలువనంపెను. బూటీ అతిప్రయాసమున బాబానుజేరి మ్రొక్కెను. బాబా అతనినిఁజూచి 'జాగ్రత! విరేచనములుకారాదు!- వాంతులాగిపోవలయును'- అని, చూపుడువ్రేలు ఆడించుచు శాసించెను. ఆతండ్రి ఆజ్ఞయెట్టిదో గమనింపుడు! ఆరెండుజాడ్యములు అక్షణమున నివారణమయ్యెను. బూటీ క్రమ్మఱ *ఆరోగ్యముఁబొందెను.

## బూటీ - కలరావ్యాధి నివారణము :-

ఒక సమయమున బూటీ కలరావ్యాధిచే బాధపడెను. మిక్కిలి దాహమేర్పడెను. డాక్టరు పిళ్ళె అపుడు శిరిడియందుండెను ఆతఁడు పెక్కు ఔషధములిచ్చి చూచెను. కాని, ప్రయోజనములేకపోయెను. పిళ్ళె డాక్టరునకు ఏమియుఁదోఁచక బాబానుజేరి దప్పికశమించుటకు- కలరావ్యాధి తగ్గుటకు ఏమిచేయఁదగునో తెలుపుమనికోరెను. 'సీమబాదముపప్పు అక్రోటుకాయపప్పు నలగకొట్టి పాలలోకాచి పంచదార కలిపి త్రాగించుడు!'- అని, బాబా తెలిపెను. ఆవిధమగు చికిత్స ఆ వ్యాధిని అధికముఁజేయునని డాక్టరు పిళ్ళె యెఱుఁగును. కాని, బాబా ఆజ్ఞ శిరసావహించవలసినదే- దానికి తిరుగులేదు. బాబా తెలిపిన విధముననే సిద్ధపఱచి పిళ్ళెడాక్టరు బూటీకిచ్చి త్రాగించెను. ఎల్లరు మిక్కిలి ఆశ్చర్యపడ ఆవ్యాధి వెంటనే నివారణమయ్యెను.

## బూటీ - ప్రాణాపాయ గండము :-

ఒకసమయమున నొకప్రసిద్ధ జ్యోతిష్కుఁడు 'నానాసాహెబ్ డెంగాలే' యనునతఁడు శిరిడియందుండి యొకనాఁడు బూటీకి ఆదినమున పెద్దగండము కలదనిచెప్పెను. ప్రాణభీతితో బూటీ తబ్బిబ్బయ్యెను. ఆదినమున యథాప్రకారము బూటీ- తక్కినభక్తులు బాబా

* మారిగ్రస్త బూటీత్రాతేనమః

దర్శనార్థము మసీదున కేగిరి. అందఱు బాబా పాదములకు ప్రణమిల్లి ఆసీనులైరి. బాబా, బూటీవంకఁజూచి 'నానా ఏమిచెప్పుచున్నాఁడు?- నీకీనాఁడు మరణముకలదని జోస్యము చెప్పినాఁడా?- మంచిది. నీవే మియు భయపడవలసిన పనిలేదు. ఆమృత్యుదేవత యెట్లుచంపునో చూచెదముగాక! ఈమాటలు ధైర్యముతో నా జ్యోతిష్కునకుఁ జెప్పు ము'!- అని పలికెను.

ఆ సాయంత్రము మలవిసర్జనకు బూటీ దొడ్డిలోనికి వెళ్ళెను. అటనొక పెద్దసర్ప మాతనికగంటఁబడెను బూటీసేవకుఁడు ఆసర్పమును జూచి, దానిని చంపుటకై ఒక పెద్దఱాతిని చేతులఁబట్టెను. ఆటుల కాదు పెద్దకఱ్ఱను తీసికొనిరమ్మని బూటీచెప్ప కఱ్ఱను తెచ్చుట కాసే వకుఁడు వెళ్ళెను. అతఁడు తిరిగివచ్చులోపల ఆసర్పము మటుమాయమై పోయెను. బాబా పలికిన పలుకులఁ దలఁచికొని, ఆతండ్రి సంరక్షణ మునన్ను తనకెట్టి యిక్కట్టులు కలుగవని దృఢనిశ్చయుఁడయ్యెను.

[ద్వారకామాయీరూపమున బాబా అభయ ప్రదానములు చూడుడు! శ్రీ సాయినాథ బోధామృతము. [S.C.S. 2]

'ద్వారకామాయి బిడ్డలగువారిని సర్పమేమి చేయఁగలదు ! సర్పము కనఁబడినేని వారు దానిని వినోదముగఁజూతురు. ద్వారకా మాయి రక్షణమునన్నవానిని సర్పము తాకగలదా?' (S C.S. 3)

'మనము భయపడవలసినపనిలేదు తాకుము! నీ వెటులతాకి చంపఁగలవో చూచెదఁగాక!- అని ద్వారకామాయి కేకపెట్టును.'- అని బాబా యొసఁగిన అభయము ప్రత్యక్షర సత్యమని భక్తులు గ్రహిం పనగును. (బూటీవిషయమున మృత్యుదేవత రానూవచ్చినది పోనూ పోయినది.)

## సమాధి మందిరము - (బూటీవాడ)

విశ్వనాటక సూత్రధారుఁడు శ్రీ సాయీప్రభువు అని మనము గుర్తింపనగును, తాను నిర్వర్తింపఁదలచిన పనినిఁగూర్చి బాహాట

ముగఁజాలఁడు. అయినా పరిస్థితులను పరిసరములఁ దన యిచ్ఛాప్రకారము తీర్చిదిద్దును. అవి కార్యరూపమొంది ఫలోదయమైనపిదప తనవారి కద్భుతానందములు గలుగఁజేయునటుల ఘటించును. ఈ విషయము నిరూపించుటకు సమాధిమందిరమే నిదర్శనము. కోటీశ్వరుఁడు త్యాగశీలుఁడునగు బాపూసాహెబ్ బూటీ యంతవానికే మందిరనిర్మాణము సంవత్సరముల కాలముపట్టినది. ఇట్టి మందిరము నిర్మించుటకు బూటీ ... 6 నెలలకంటె నెక్కువకాలము పట్టను. కాని, బాబా సంకల్పించినవిధమున ప్రతికార్యముజరిగి తీరవలసినదే. *ఆవిచిత్రమును గూర్చి పాఠకులు గ్రహింపఁదగును.

## నార్కేతో బాబా చెప్పిన విషయములు (S.C.S. 380)

1913న ప్రొఫెసర్ జీ.జి. నార్కే (బూటీఅల్లుఁడు)తో నొక సందర్భమున 'నీమామ శిరిడియందు దగ్గివాడ (రాతికట్టడము) సౌధము నిర్మించును, దానికి నీవు ధర్మకర్తవుగనుందువు' అని బాబా పలికినాఁడు. అప్పటికే సాఠే, దీక్షిత్ మొదలగువారు సాఠేవాడ-దీక్షిత్ వాడలు నిర్మించినట్లు బూటీకూడ ఒకభవనము నిర్మించవచ్చునని, నార్కే తలంచెను. ఆవిషయమంతటితో ముగిసెను. ఆ మందిరము 1915లో ప్రారంభమై 1918 నాటికి పూర్తియయ్యెను. బాబా భౌతికతనువా మందిరమున సమాధిచేసిన తరువాత 1917 చివరభాగమున ఆమందిరమునకు ధర్మకర్తలలో నొకఁడుగ నార్కే నియమింపఁబడెను. త్రికాలముల జరుగువిషయములు బాబా కెట్లు విదితములో గమనింపుడు!

## సమాధి మందిర నిర్మాణము :- [S.C.S. 331]

శ్రీమంతు బాపూసాహెబ్ బూటీ తన కుటుంబముతో శిరిడియందు నివసించుచుండెను. ఆగ్రామమున తాను నొక భవనమును

* అత్యల్పున మహాసర్పాదపి భక్తమురక్షిత్రే నమః

నిర్మించుకొనవలయునను తలంపు ఆతనికిఁగలిగెను. కొన్నిదినములు గడిచినపిదప నొకనాటిరాత్రి బూటీ- శ్యామా యిరువురు దీక్షిత్ వాడయందు నిదురించుచుండిరి. ఆ రేయి బూటీ స్వప్నమున బాబా కనఁబడి 'ఇచట నీవొక భవనమును- దేవతామందిరములోఁగూడిన దానిని నిర్మింపుము'- అని ఆజ్ఞాపించెను. ఆసమీపమున నిద్రించుచున్న శ్యామాకుఁగూడ అదేవిధముగ స్వప్నములోచెను. బూటీ మేలుకొని యేడ్చుచున్న శ్యామానుగాంచి, యాతని దుఃఖమునకుఁ గారణమేమని ప్రశ్నించెను. అంతట శ్యామా 'బాబా నాకు స్వప్నమునఁ గనఁబడి 'దేవాలయసహితమగు మందిరమును నిర్మింపుడు! నేనెల్లరకామితముల ననుగ్రహించెదను'- అని పలికినాఁడు. ఆ మధురాతి మధురములు- ప్రేమపూరితములగు బాబా పలుకులనాలకించి, ఆనందపారవశ్యమున కంఠము డగ్గుత్తిక నొందినది- కనులవెంట నానందాశ్రులు స్రవించుచున్నవి ఈకారణముననే నేడ్చుచుంటిని'- అని సమాధానమిచ్చెను. ఆపలుకులువినిన బాపూసాహెబ్ బూటీ తమ యిరువురకు ఏకకాలమున నొకేవిధమగు స్వప్నముఁ దోఁచుటకు ఆశ్చర్యచకితుఁడయ్యెను.

బూటీ శ్రీమంతుఁడు- సమర్థుఁడగు కారణమున శిరిడీయందు భవనమును నిర్మింపనిశ్చయించి, శ్యామా-తానుగలిసి తాను నిర్మింపఁదలఁచిన భవనమునకు నమూనా (ప్లాను) సిద్ధపఱచి, దానిని కాకా దీక్షితునకుఁ జూపనతఁడును బాగున్నదని సమ్మతిఁదెలిపెను. అంతట వారందఱు ఆ నమూనాను బాబాకుఁ జూపించి ఆతండ్రి అనుమతి నర్థించిరి. బాబా వెంటనే తనఅంగీకారమునుదెలిపి బూటీ మొదలగువారి ననుగ్రహించెను.

భవన నిర్మాణము ప్రారంభమయ్యెను. శ్యామా[మాధవరావు దేశపాండే] దగ్గఱనిలిచి పనులసాగించుచుండెను. బావి త్రవ్విరి. పునా

దులు దిటముగ నేర్పఱచిరి. వారేర్పఱచుకొనిన 'ప్లాను' ప్రకారము నేలమట్టమువరకు గోడలు సిద్ధమయ్యెను. బాబా లెండివనమునకు వెళ్ళి వచ్చుసమయములందు కావించు సూచనల ననుసరించి కట్టడపు పనుల సాగించుచుండిరి. తక్కినపనులు బాపూసాహెబ్ జోగ్ నకు విడచిరి. బూటీ హృదయమున నొక తలంపుగలిగెను. ఆ భవనమున సుదీర్ఘమగు గదియు [హాలు] నొక వేదికయు నిర్మించి, ఆ వేదిక మధ్య మురలీధరుఁడగు శ్రీకృష్ణుని పాలరాతి విగ్రహమును ప్రతిష్ఠించవలయునని యాతఁడు తలంచెను. ఈవిషయమును బూటీ- శ్యామాకుఁ దెలిపి అటులఁగావించుటకు బాబా అనుమతినిఁ బడయుమని కోరెను బాబా ఆకట్టడముప్రక్కగఁ బోవుచున్న సమయమున శ్యామా ఆవిషయమునుగూర్చి బాబాకు విన్నవించెను. ఆమాటలనువిని బాబా తన అంగీకారమునుదెలుపుచు 'ఈకోవెల పూర్తియైనపిదప నేనిక్కడ నివసింప వచ్చెదను. (ఆమందిరమువంక దృష్టిసారించుచు) ఈ మందిర నిర్మాణము పూర్తియైనపిదప మనమే దీని నుపయోగించుకొందము. మనమందఱము ఇందుండి మెలఁగుచు- క్రీడించుచు కౌగిలించుకొనుచు- సుఖసంతోషములఁ బొందుదము.'- అని పలికెను. శ్రీకృష్ణవిగ్రహ ప్రతిష్ఠాపనము జరుగనున్న వేదికకు- మధ్యగదికి పునాదులు వేయుటకు ఆ సమయము బాగున్నదా?- యని శ్యామా ప్రశ్నింప బాబా 'మేలు' అనిపలికెను. అంతట శ్యామా కొబ్బరికాయఁదెచ్చి పగులఁగొట్టి యాపని ప్రారంభించెను. భవననిర్మాణము పూర్తికావచ్చెను. మురళీధరుఁడగు శ్రీకృష్ణుని పాలరాతివిగ్రహమును సిద్ధపఱచుట కేర్పాటులు గావింపఁబడెను.

1915లో ప్రారంభింపఁబడిన మందిరము పూర్తియగుటకు 3సం వత్సరములకాలము (1918 వరకు) పట్టినది. ఆ శేషధనము సమర్థతలు గల బూటీ యంతవాఁడు తలంచినపని యింతజాగయ్యెను- అనిన-

* కలియుగావతారాయ నమః * గృహహీన మహారాజాయనమః

దానికి దైవనిర్ణయముతప్ప వేఱు కారణములేదు. ఆబూటీ భవనము లోని మధ్య విశాలమగు గదియందలి వేదికపై ప్రతిష్ఠించుటకు మురళీ ధర్ పాలరాతివిగ్రహమును సిద్ధపఱపించుచున్నారమని శ్యామా మొదలగువారు తెలుప మందహాసముఁ బ్రకటించుచు 'వీఁడే మురళీ ధరుఁడు. ఈతఁడే అక్కడకుఁ జేరును'.— అని, బాబా పలికినాఁడు. ఆవి ధముగ శ్రీకృష్ణవిగ్రహము పూర్తికాకపూర్వమే బాబా మహాసమాధి నొందుట సంభవించెను. ఆవిషయములన్నియు 'చరమలీల' యందుఁదెలుపఁబడినవి. పాఠకులు గమనింపఁదగును.

లక్షలధనము వెచ్చించి శ్రీ సాయీప్రభువు భౌతిక తనువును భద్రపఱచుటకు పెద్దభవనమును శిర్డియందు నిర్మించి కోట్లకొలఁది భక్తులప్రేమను చూఱఁగొని బాబా అంకితసంతతిలో నొకఁడైన శ్రీమంతు బాపూసాహెబ్ గోపాలరావుబూటీకి వందనశతము లర్పించుచు ఆబిడ్డను అనుగ్రహించినట్లు మనల ననుగ్రహింపుమని సమస్తసద్గురు దేవుఁడగు శ్రీసాయీ మహాప్రభువునకు సహస్రప్రణతుల సమర్పించుదము.

ఓమ్ శ్రీసాయీ శరణ్!

ధనవిద్యాదులు దైవహైతుకము, లాదైవానుకూల ప్రవృ
త్తిని నీశ క్తికొలంది నిర్మలిన భక్తినొవాని దైవాప్పణం
బొనరింపన్. సమస్తం త్రు నీకిపాపరా భూర్ధారణల్ 'బూటీనో
మిన చందంబు సమాలకింపవో కోకీ ఏవియా, నిన్నుపేక్షింతునా!

• నిత్యమంగళధామ్నే నమః • గృహమేధి పరాశ్రయాయ నమః

# ఏమి, నిన్ను పేక్షింతునా?

## ఇరువదియేడవ ప్రకరణము

## అనుగ్రహ లీల 22.

## బయ్యాజి - అప్పాజి పటేల్. (శిరిడి)

### సద్విషయము :-

శ్రీ సాయీప్రభువు పాదకమల స్పర్శనొందిన శిరిడి పుణ్యస్థలము ధన్యము! శిరిడి ప్రవేశించినది మొదలు మహాసమాధి పర్యంతము బాబా వసించి చరించిన ద్వారకామాయి మసీదు ధన్యము! శ్రీసాయీనాథునకు నీడయొసంగిన ఆమధుర నింబవృక్షము ధన్యము! బాబాకు ఆసనమై ప్రసిద్ధినొందిన ఱాతిబండ ధన్యము! ఎవరిని సముద్ధరించు తలంపున శ్రమలకోర్చి దవ్వులనుండి మనతండ్రి వెదకికొనుచువచ్చెనో ఆ శిరిడిగ్రామములోని ప్రజలు ధన్యులు! శ్రీ సాయీనాథుని యునికిచే నొక కుగ్రామమైన శిరిడి పరమపవిత్ర తీర్థక్షేత్రమై యలరారుచున్నదో అట్టిపావనస్థలమునఁగల పశుపక్ష్యాదులు తరుగుల్మలతాదులు ధన్యములు! నిర్వ్యాంచిత నిరవధిక ప్రేమాదరణములు శ్రీ సాయీపదములఁ బఱపిన శిరిడిగ్రామమున కాంతలు ధన్యలు, జలకమాడుచు-పశులమేపుచు నింటిపనులఁగావించుచు సచ్చిదానంద విగ్రహుఁడగు శ్రీ సాయీ లీలాకథాదికములు గేయములుగ కీర్తించుచు నానందించు లోకోత్తర చరిత్రలగు శిరిడి పుణ్యసతుల భాగ్యముతో బ్రహ్మాదిదేవతల భాగ్యములు సమముకావనిన అతిశయోక్తి కాదు.

ఈ సకలవిశ్వమునకు సుఖప్రదాతయు భక్తజనుల కష్టములఁ దొలఁగించి అభీష్టములఁ బ్రసాదించు భగవానుఁడు శ్రీ సాయీబాబాగా

అవతరించినాఁడు. బాబా పాదపద్మములకు ప్రణమిల్లుదము. ఆతండ్రి తనబిడ్డలపై నఱపు దయాప్రేమౌదార్యము లసదృశములు. 'బాబా!'— అని— ఆర్తుఁడై యొక్క—మాత్రైనాఁడేనిఁ దలఁచిన— పిలిచిన మాత్రమున క్షణములో నాబిడ్డనాదుకొని ఆతండ్రి రక్షించును.

విశ్వవ్యాప్తమైయున్న ఆ సచ్చిదానంద పరబ్రహ్మమును కరువునఁబోసి తీసిన సాధుచూడామణి '(శ్రీ) సాయిబాబా'— అని మనము త్రికరణశుద్ధిగ విశ్వసింపఁదగును. సచ్చిదానంద ప్రపూర్ణతకేకైక స్థానము (శ్రీ) సాయిప్రభువు. అనంతకోటి జీవరాశుల కభయశాంతి సుఖములఁ ప్రసాదింప నవతరించిన లీలావినోద విగ్రహుఁడు శ్రీసాయీశ్వరుఁడు. '(శ్రీ)సాయి'నామ మాప్యాయతతో స్మరించి, స్మరించి, తరించుదము !

శ్రీ సాయిమహాప్రభువు శిరిడీకిఁ జేరినది మొదలు తాను నిత్యము భిక్షించిన గేస్తుల నెల్ల అనుగ్రహించినది తెలిసికొందము. మన వాకిటకుఁ జేరిన జీవినెద్దానినేనిఁ గసరక— యీసడింపక— మనశక్తి కొలఁది, ప్రేమాదరణములఁ బఱపుచు పెట్టిపంపిన సర్వఫలప్రదాత— విశ్వంభరుఁడు బాబా యెటులసంతసించి, మనము సమర్పించినదానికి వేలమడుంగులు ఎటుల ప్రసాదించునో యీ వృత్తాంతమున గ్రహింపఁగలము— మనము సమర్పించు పదార్థములు కావు ప్రధానములు—మన దఱికేతెంచిన ప్రాణిపై మనము పఱపు ప్రేమాదరణములు ముఖ్యములు— సర్వభూతాంతర్యామి శ్రీ సాయిప్రభువను దృష్టితో మనసార ఆదరణప్రేమలఁగలిగి, మనశక్తికొలఁది పెట్టిపంపుటకుఁ గడంగవలయును అట్టి భూతతృప్తి అనంతసత్య సుఖప్రాప్తి కేకైక సాధనమని గాఢముగ మనము విశ్వసింపవలయును. శ్రీ సాయి అవతారమునఁగల ప్రాధాన్యమిదియని పాఠకశ్రోతలు గమనింపఁదగును.

♦ యశఃపూరిత భారతాయనమః

♦ మోహినీరాజపూజాయాం తులస్యప్పానిరోధకాయ నమః

## బయ్యాజి - అప్పాజీ పటేల్ :-

ఇతఁడు శిరిడినివాసి. బాబా శిరిడీఁ జేరిన నాటనుండి నిత్యము భిక్షించు అయిదుగృహములలో నీగృహమునొకటి. తొలుత 15 సంవత్సరములు ప్రతిదినము పలుతడవలు బాబా భిక్షకై వీరియింటికి వెళ్ళి రొట్టెలు మొదలగు పదార్థములనుభిక్షించి కొనివచ్చువాఁడు. ఆపిదవ దినమునకొక్కమారు మాత్రమే వెళ్లుచుండెను.

అప్పాజీ ఊహ తెలిసినప్పటినుండి- అతిబాల్యమునుండి బాబాను విడనాడక అంటికొనియున్నవాఁడు. తుదిక్షణమున బాబా యీతని మీఁదనే తనువును వ్రాల్చినాఁడు. 'చరమలీల' యందు ఈవిషయములను పాఠకులు గమనింపఁదగును. ఈతని యేడవయేట అనగా 1896 లో శ్రీరామనవమినాఁడు 'ఉరుసు' ఉత్సవము ప్రారంభమైనది. ధనాపహరణ నేరమునుండి విముక్తుఁడైన 'అప్పాకులకర్ణి' అను నతఁడును ఈఉత్సవమును ప్రారంభింపజేసినవారిలో నొకఁడు. [ఈ'ఉరుసు- శ్రీరామనవమి'- ఉత్సవములఁగూర్చి 'ద్వారకామాయిలీల'లోఁ దెలుపఁబడినది.

అప్పాజీపటేల్ 11వయేట (1911-1912) నొకదినమున పశువులను దోలుకొని పొలమునకుఁ బోవుచుండఁగ నతనిని వెళ్లనీయక బాబా ఆపెను, మిక్కిలి కోపముతో నేమేమియోవలుకుచు బాబా నాలుగు కడవలను పగులగొట్టి, తనచేతులను ముడిచి "బమ్-బమ్"- అను ధ్వనిఁజేయుచు నేదియో అపాయము జరుగుచున్నట్లు ప్రకటించెను. ఆసమయముననే అప్పాజీపటేల్ మేనత్తకుమారుఁడు 'దాజీకోటే' అనునతఁడు 30 సంవత్సరాలవాఁడు మరణించెననువార్త వీరికిఁ దరువాత తెలిసెను.

## బయ్యాజి - అప్పాజీకి బాబా బహూకృతులు :-

[S.C.S. 449]

దక్షిణలు స్వీకరింపఁదొడగిన నాటనుండి[1907 అప్రిలు నెలనుండి] 1918 మహాసమాధినాఁడుకూడ శ్రీసాయిప్రభువు ప్రతిదినము నాలుగురూ

పాయలుచొప్పున నితనికిచ్చినాఁడు. "ఈబహూకరింపఁబడిన ధనమును వ్యయింపవలదు- నీవు తినవద్దు- ఇతరులకీయవలదు'- అని శాసించి నాఁడు. బాబా బహూకరించిన ధనముతో అప్పాజీ 84 ఎకరముల భూమిని సంపాదించెను ఇదికాక వారికి పిత్రియమైనది మఱి 11 ఎకర ముల భూమికలదు. ఈభూమి సాగువిషయముఁగూడ బాబా ఏపైరు వేయఁదగునో తెలుపుచుండువాఁడు. అందఱు చెఱకుతోటలు వేయు చుండ అప్పాజీకూడ చెఱకుపైరు వేయఁదలంచి బాబా సెలవుకోరెను. బాబా వలదనెను. కాని అప్పాజీ ఆసపడి చెఱకుపైరువేసెను. దాని వలన మెట్టపైరులవలని లాభము లేకపోగా చేతిధనము 300 రూపా యలు నష్టపడెను. బాబా మాటలను త్రోసివేసినందులకు శిక్ష అని అప్పాజీ గ్రహించెను.

## బయ్యాజి అప్పాజీ తండ్రి మృతి పుత్రజననము :-

1918న అప్పాజీ తండ్రి 70 సంవత్సరములవాఁడు తన అలవాటు చొప్పున గుఱ్ఱముపై స్వారిచేయుచు ప్రక (-గా)మమునకేగి పక్షవా తము తాకుపడి యింటికిఁ దిరిగివచ్చెను. అప్పాజీ బాబానుకోరి 'ఉధి' ప్రసాదింపుమని ప్రార్థించెను. 'అల్లామాలిక్ హైఁ- అని ఊది ప్రసాదింపలేదు. అప్పాజీ ఏడ్చి యింటికిఁ దిరిగివెళ్ళెను. ఆ 8వ దిన మున కార్తీకశుద్ధ ఏకాదశి పుణ్యదినముల వృద్ధుఁడగు అప్పాజీ తండ్రి పరమపదించెను.

ప్రతిదినము అప్పాజీ బాబా పాదములొత్తుచు 'మాలీస్' చేయు చు సేవించువాఁడు. అటుల సేవకావించి బాబాను చేతులతో నెత్తుకొని 'ధుని'ముందుఁ గూర్చుండఁబెట్టువాఁడు. అటులచేయుచుఁ దనకు భీమబల ముగలదని గర్వముతోఁ జెప్పుకొనువాఁడు. అప్పాజీ తండ్రి గతించిన మఱునాఁడు- ద్వాదశినాఁడు మసీదునకేగి బాబా పాదసంవాహనము గావించి బాబాను చేతులనెత్తుకొనఁ బ్రయత్నించెను. కాని బాబాను

♦ గోవృద్ధీకృత కష్టాబ్దయేనమః ♦ బలాతిదర్పబయ్యాజీ మహాగర్వ విభంజనాయనమః

కదలింపలేక పోయెను. [కేనోపనిషత్తుగనుఁడు!] అదివమున బాబా అప్పాజీకి రెండువిషయములను బోధించెను. 1. (S.C.S. 224) ఏసమయమునందును గర్వము వహింపఁ దగదనియు– 2. [S.C.S. 318] గతించినవారికై దుఃఖింపఁగూడదనియు బోధించెను. విచారగ్రస్తుఁడైయున్న అప్పాజీనిఁజూచి 'ఏల నీవు దుఃఖించెదవు? అయిదు నెలలలో నతఁడు (అప్పాజీతండ్రి) తిరిగివచ్చును–' అని, బాబా ఓదార్చినాఁడు. 5 నెలలకు అప్పాజీకి కుమారుఁడుకలిగెను. [పూజ్యశ్రీ బి.వి. నరసింహస్వామిగారితో అప్పాజీ తన అనుభూతులను తెలుపునాటికి (డిసెంబరు 1936) అతనికుమారుఁడు 22 సంవత్సరములవాఁడు.)

## ఆఁబోతును బాబా రక్షించిన విధము:–

1910 యందు శిరిడీలోనొక ఆబోతునకు రుద్రత్రిశూల చిహ్నములనుముద్రించి స్వేచ్ఛగవిడిచిరి. అది విచ్చలవిడి తిరుగుచు లెండివనమును ఇతరతోటలను నాశనము చేయుచుండెను. అప్పాజీ మఱికొందరు దానిని 'యెవోలా' యందు విడిచిపెట్టుటకుఁ గొంతధనముఁ గూర్చుకొని 'బిక్కు మార్వాడి' వశముగనిచ్చి, ఆఁబోతును 'యెవోలా'యందు విడిచిపెట్టిరమ్మని నియమించిరి. అతఁడాఁబోతును గొనిపోయి దానిని విడిచిపెట్టివచ్చితినని వారికిఁ దెలియఁజెప్పెను. ఆ రాత్రి బాబా అప్పాజీ స్వప్నమునఁదోఁచి 'కాంపోనా? మేరేకు కసయీకే దారీం బాంధ్యా' (నిద్రపోవుచున్నావా? నన్ను కసాయివానికట బంధించినారు) అనిపలికెను. అంతట అప్పాజీ నిద్రలేచి తాత్యా మొదలగువారితో మాట్లాడి ఆఁబోతువిషయమై కనుగొనుటకు యెవోలాగ్రామమునకేగెను. అచటివారు ఆఁబోతు నెవరు నిటకుఁ గొనిరాలేదనిరి. అంతట అప్పాజీ అపాంతము తిరిగి కసాయివానియింటికేగెను. వానిదొడ్డి గోడపైగా తలయెత్తి ఆఁబోతు అప్పాజీవంకఁజూచెను. ఆకసాయివాని నడుగ భిక్కుమార్వాడి దానిని 14 రూపాయలకు తనకు విక్రయించెనని

* భీమబలాన్వితాయనమః * భ్రాతృభావనాయనమః

చెప్పెను. అప్పాజీ ఆధనమాతనికి జెల్లించి ఆంబోతును బంధవిముక్తిం గావించి 'యిమోలా'కుం జేర్పించెను. అప్పాజీ ఆక్షణమున వెళ్ళక యున్న కసాయీవాడు ఆంబోతు నాదినమున వధించియుండెడివాండే- బాబా యీవిధముగ దానిప్రాణములం గాపాడినాండు. భిక్కూమార్వాడీపై నేరము మోపంబడెను, ఆతని దుష్టచర్య నిరూపింపంబడినది. రెండుమాసము లతనికి కఠినశిక్ష విధింపంబడెను.

శ్రీ సాయీప్రభువునకు మిక్కిలి ప్రేమపాత్రుండైన బయ్యాజీ- అప్పాజీపటేలునకు వందనశతము లర్పించుచు ఆబిడ్డ ననుగ్రహించి నటున మనల రక్షింపుమని శ్రీ సమర్థ సద్గురుదేవుండగు శ్రీ సాయీ నాథుని పదపంకజములకు ప్రణామసహస్రము లర్పించుదము.

ఓమ్ శ్రీసాయీ శరణ్!

అనురాగంబును జాలి తార్కాణంగ నీకారీతి నేన్ సాదరం
బున సన్సేవినప్రాణులన్ దనుపుచో మోదింతు; వేయంతలో
యేన్యున నీకుగా సమకూర్చిప్రోచుదును; బయ్యాజీ కుటుంబమ్మునో
[illegible]నచందంబు సమాలకింపవొకో! ఏమీ, నిన్ను పేక్షింతునా!

---

# ఏమీ, నిన్నుపేక్షింతునా ?

## ఇరువదియొనిమిదవ ప్రకరణము

## అనుగ్రహ లీల 23.

బి. ఏ. దేవ్ - [దహన్ - తానా Dt]

**సద్విషయము :-**

'నాభక్తునియింట తిండిగుడ్డలకు కఱవులేదు' [S.C.S. 26) అని బాబా శపథముచేసినాఁడు. శ్రీ సాయీబాబా అభయప్రదానములను లెస్సగ గుర్తింపఁదగును. బాబా బోధలను పాటించి యనుసరించువారు సుక్షేమకరపథమున నడిచి గమ్యము-పరమధామముఁ జేరఁగలరు-'నా ప్రభువు హరి'యున్న- సాయీ మంచముదగ్గఱకుఁదెచ్చి తినఁబెట్టును'- అని ఒకభక్తుఁడు పలికినాఁడు. అది త్రిసత్యము. ఆమహాప్రభువు తిండి గుడ్డలకు కొఱత గలిగింపఁడు. కాని దీనిని విశ్వసించినవాఁడు- ఎట్టి ఆధ్యాత్మిక సాధకుఁడైనను సోమరియైనచో చెడును. ఆత్మసాక్షాత్కృతికి సాధకుఁడు శక్తివంచనలేక శ్రమింపవలయును. వాఁడుప్రయత్నము సలుపుకొలఁది మేలుపొందును. శ్రీ సాయీప్రభువునందు గాఢవిశ్వాసమువహించి, ఆతండి లీలాచరితములను వినుచుఁ బలుకుచు నిరతము లందపేక్షలుడుగువాఁడు ఆత్మసాక్షాత్కారముఁ బడయును.

శ్రీ సాయీనాథుఁడు తనబిడ్డలను తననామమును స్మరించుచు సంపూర్ణశరణాగతిఁ జేయుఁడని బోధించినాఁడు. ఆత్మవిచారముఁ జేయుఁదలఁచువాఁడు (నేనెవఁడను? అని, విచారముఁ జేయువాఁడు) శ్రవణ మననాదులఁ గావింపఁదగునని నిర్దేశించినాఁడు. కొందఱను భగవా

కొందఱఁ దనపాదకమలముల సేవింపుఁడనెను, కొందఱ ఖండోబా మొదలగు దేవాలయముల కంపినాఁడు. అధ్యాత్మరామాయణము-జ్ఞానేశ్వరి మొదలగుసద్గ్రంథముల పారాయణముఁజేయుఁడని కొందఱ నియమించినాఁడు. కొందఱ తనపాదముల ప్రోలఁగూర్చుండుఁడనెను. కొందఱ విష్ణుసహస్రనామములఁ గీర్తింపుమనెను. కొందఱ నుపనిషత్తులను గీతలను చదువుఁడని నియమించెను బాబా బోధలకు పరిమితి లేదు. కొందఱకు స్వయముగఁ దెలిపెను. కొందఱకు స్వప్నరూపమున బోధించినాఁడు కొందఱ నితరులదగ్గఱకుఁబంపి బోధకావించినాఁడు. తన ఆశ్రితుఁడు ఏవిధమునఁ జక్కఁబడునో బాబా యెఱుంగును. తన బిడ్డల పురాకృత అభ్యాసములు- సంస్కృతుల ననుసరించి వారివారికి యోగక్షేమములగు విధాన నిర్దేశించువాఁడు. లౌకికవిషయములందును ప్రవర్తింపఁదగు విధానములను బాబా తనవారికిఁ దెలుపువాఁడు. ఆ తండ్రిబోధలను వివరింప సాధ్యములుగావు.

## దేవ్ - బాబాను గూర్చి తెలిసికొనుట - చందోర్కర్ ప్రేరణవలన :-

శ్రీ బి.వి. దేవ్ తన జీవిత చరమదశయందు శ్రీ సాయీ సంస్థానమున ధర్మకర్తలలో నొకఁడుగనుండి గొప్ప సేవ కావించిన వాఁడు. ఈతఁడు ప్రప్రథమమున 1910లో నానాసాహేబ్ చందోర్కరు ప్రేరణమున బాబా దర్శనముఁ జేసికొనెను. చందోర్కరు డిప్యూటికలెక్టరుగ నుండఁగ నితఁడు మామ్లతదారు (తహసీల్దారు) ఉద్యోగమున నుండెను. చందోర్కర్ బాబాకు సన్నిహితుఁడనియు ఆయనద్వారా బాబాను సమాశ్రయింపుమని శ్రీ బి.వి. దేవ్ అన్న తన తమ్మునకు ఉత్తరమువ్రాసెను. చందోర్కరు తన అనుభవములను 'దేవ్'నకుఁదెలిపి బాబాను సందర్శింపుమని ప్రేరేచెను. శ్రీసాయీ బాబా చందోర్కరును ముమ్మాఱు పిలువనంపించినవాఁడు తననేల

పిలువనంపఁడని దేవ్ మొదటఁదలంచెను. ఉద్యోగ— అధికార-గౌరవ బుద్ధితో బాబా- చందోర్కరును పిలువనంపలేదనియు, ఆతనితో నాలుగు జన్మములనుండి సంబంధము- ఋణానుబంధము కలిగియున్న కారణమున ఆతనిఁ బిలువనంపినాఁడని తరువాత గ్రహించి దేవ్- తన బుద్ధిని మార్చుకొనెను.

చందోర్కర్ పలుమాటులు ప్రేరేచుటచే దేవ్ 1910 లో శిరిడికి వెళ్ళి శ్రీ సాయిప్రభువును సందర్శించెను. ప్రథమ దర్శనముననే అతనికి బాబాపై కొంతభక్తి కుదిరెను. అతఁడు మరాటీభాషలో ఆధ్యాత్మికగ్రంథములు చదివి కొంత అనుభవముఁ గలవాఁడగుటచే నతనితలంపులు ప్రత్యేకములు. ఈతఁడు ఏకనాథకృతులు- జ్ఞానేశ్వరి మొదలగు గ్రంథములను పఠించువాఁడు. మహారాష్ట్రదేశమున ముముక్షువులు సాధారణముగ 'జ్ఞానేశ్వరి' నిత్యపారాయణ గ్రంథముగ నేర్పఱచుకొని నియమితకాలములో నొక ఆవృత్తి పూర్తిచేయుదురు. దేవ్— జ్ఞానేశ్వరిని నియమితకాలమున నొక ఆవృత్తి పూర్తిచేయవలయునని సంకల్పించి యెపుడు ప్రారంభించిన నేదొక ఆటంకము (అశుచి మొదలగునవి) కలిగి ఆతని నియమమునకు భంగము కలుగుచుండెను. ఆకారణమున నతనికి విసుగు— ఆందోళన కలిగినది. ఇట్టి విఘ్నముల కేవియో తనకుఁదెలియని కారణములుండెనని యతఁడు తలంచెను. బాబాను సమాశ్రయించుట కిదియొక ముఖ్యకారణమైనది.

## శ్రీ బి. వి. దేవ్ - జ్ఞానేశ్వరిగ్రంథమును బాబా చేతులందుంచుట :- (S.C.S. 405)

ఒకపరి 'జ్ఞానేశ్వరి' గ్రంథమును వెంటఁగొని దేవ్- శిరిడికి వెళ్ళెను. శ్రీ సాయిప్రభువునకు మ్రొక్కి- ఆజ్ఞానేశ్వరి[1] గ్రంథమును ఒకరూపాయను బాబా చేతులందుంచెను. 'ఒకరూకయేల? యిరువది

1 గీతాపూర్ణోపదేశాయనమః

రూపాయలు తెమ్ము! అని బాబా అనెను, దేవు. 20 రూపాయలు తెచ్చి యిచ్చెను. కాని బాబా పారాయణము విషయమునుగూర్చి యేమియు పలుకలేదు. ఆరాత్రి దేవు-తనవిడిదియందున్న 'బాలకరాం మానక్కరు'ను సమీపించి, అతఁడు బాబా అనుగ్రహము నెట్లు సంపాదించినది- ఆధ్యాత్మికముగ నెటులభివృద్ధిగాంచినది- బాబాను గూర్చిన ఆతని అనుభవములను దెలుపుమనికోరెను, మఱునాటి సాయంత్రము తెలుపుదునని బాలకరాం మానక్కర్ చెప్పెను. మఱునాఁడు బాబా- దేవ్‌ను 20 రూపాయలు దక్షిణ నిమ్మనెను. దేవ్ తెచ్చియిచ్చి తిరిగివెళ్ళి మానక్కర్‌తో మాట్లాడుచుండెను. బాలకరాం మానక్కరు తన అనుభూతులఁగూర్చి తెలుప మొదలుపెట్టుచుండగ బాబా- దేవును పిలిపించెను.

సా.బా:- నీవేమి మాట్లాడుచున్నావు? ఎవరితో? ఎక్కడ?

దేవు:- బాబా! దీక్షిత్ వాడలో బాలకరాంతో నీయొక్క గొప్పతనము- కీర్తినిఁగూర్చి మాట్లాడుచున్నాను.

సా.బా:- 25 రూపాయలు తెమ్ము. దేవు వెళ్ళి 25 రూపాయలు తెచ్చి యిచ్చెను.

సా.బా:- ఈ మసీదునందుఁ గూర్చుండుము!

## బాబా దేవ్‌ను అనుగ్రహించుట:-

అంతలో బాబా ఆగ్రహోదగ్రుఁడయ్యెను. 'నా ప్రాత గుడ్డపీలికలేల దొంగిలించుచున్నాఁడవు? తలనెరసిన ముసలివాఁడవు చేయవలసిన పని యిదియేనా? ఈగోడ్డలితో నిన్నువధింతును'- అని గర్జించెను, దక్షిణలుస్వీకరించి, తటాలున నటుల కుపితుఁడై వలుకుట లెదుటివారికి హృదయ విదారకములే యగును. కాని, అటుల బాబా పలుకుటకుఁ గల కారణమెవరికినిఁ దెలియదు. దేవు భయభ్రాంతుఁడయ్యెను. ప్రాత

గుడ్డపేలిక లేమో! ఆకోపము ఏవిధముగ పరిణమించునో ఆతఁడెఱుఁగఁజాలకుండెను. పదినిమిషములైన తరువాత బాబా శాంతివహించి 'దేవు'ను వెళ్ళుమనెను. అరగంటతరువాత దేవ్‌ను ఇతరులను మసీదునకుఁ బిలిపించెను. దేవ్ నుద్దేశించి 'తంబీభావ్! 'గుడ్డపేలిక'— అని నిన్ను నొవ్వించితినా? ఏదేని చౌర్యమున్నదానినిఁ దెలుపవలయును. గత్యంతరములేదు. కానిమ్ము! భగవానుఁడు సకలముఁ జక్కఁబెట్టును'. అని బాబా పలికి, 12 రూపాయలు దక్షిణనిమ్మని దేవును అడిగెను. దేవు తెచ్చి బాబాకు సమర్పించెను.

సా.బా:- నీవేమి చేయుచున్నావు?

దేవు :- ఏమియులేదు- బాబా!

సా.బా:- ప్రతిదినము ఉదయకాలమున దీక్షిత్ వాడలో పారాయణము చేయుము! నేను నీకు చక్కని పట్టుజరీ అంచుసాలువ ప్రసాదింపఁదలఁచినపుడు ప్రాత పీలికలకై నీవాసపడనేల?

అది మొదలు దేవు జ్ఞానేశ్వరి పారాయణము ప్రారంభించెను. ఆతనికెట్టి విఘ్నములు కలుగలేదు. బాబా అద్భుత శక్తిసామర్థ్యములతనికి బోధపడినవి ఇతరుల అనుభూతులనుగూర్చి యతఁడు విచారించి తెలిసికొనవలసినపని లేకపోయెను. అట్టి స్వానుభూతులే పట్టు జరీయంచు సాలువయనియు, నితరులవలనఁ దెలిసికొనునవి పేలికలను దొంగిలించుట వంటివని, బాబా పలుకులలోనిభావము అతఁడు గ్రహించెను.

## దేవ్ - స్వప్నము :-

దేవు. 'జ్ఞానేశ్వరి' పారాయణము నిర్విఘ్నముగఁ గొనసాగించుకొనుచున్నను, దానియందలి భావము చక్కగ అతనికి బోధపడకుండెను. 2-4-1914 వేకువజామున స్వప్నమునందు బాబా అతనికి కనఁబడెను. కలలో సంభాషణ మిట్లుజరిగెను.

సా.బా:- నీవు చదువునది బోధపడుచున్నదా?

దేవ్:- బాబా! నీకరుణ ప్రసాదింపవేని నాకెట్లు బోధపడును?

సా.బా:- నీవు మిక్కిలి త్వరగా చదువుచున్నావు. నాయెదుటఁ గూర్చుండి, నాసమక్షమున పారాయణము సలువుము!

దేవ్:- బాబా ఏమి చదువమందువు?

సా.బా:- అధ్యాత్మము (ఆత్మావలోకనము)

దేవ్ లోనికి వెళ్ళి అధ్యాత్మరామాయణముఁ గొనివచ్చెను. స్వప్నము పూర్తియయ్యెను- దేవ్ మేలుకొనెను.)

## బాబా ఆధ్యాత్మిక విషయములు దేవ్‌నకు బోధించుట:-

[ S.C.S. 245]

శ్రీ సాయీప్రభువు దేవ్‌నకు అప్పుడప్పుడు ఆధ్యాత్మిక విషయముల బోధపఱచు పలుకులఁ బలుకువాఁడు, కాని, దేవ్‌నకు అందలి భావము ప్రస్ఫుటముగాకుండెను. ఒకపర్యాయము బాబా దేవును పిలిచి,

సా.బా:- భా ! దక్షిణనిమ్ము!

దేవు ఒక నవరఇచ్చెను.

సా.బా:- ఇంకను తెమ్ము.

అటుల వరుసగ నాలుగు నవరలు తీసికొని 'నీవు నాలుగిచ్చినను బాబాకుఁ జెందినది- ఒక్కటే'- అని బాబా పలికెను.

దేవ్:- బాబా! నీకు నాలుగు ఇచ్చితిని.

సా.బా:- అవును- నిజమే! కాని నాకుచెందినది ఒక్కటే- నీవు తెలిసికొందువు-

భక్తుఁడు బాబాకు అంతఃకరణ చతుష్టయము- (మనస్సు-బుద్ధి చిత్తము- అహంకారము) సమర్పించినను బాబా గ్రహించునది-'జీవి'

నొక్కనినే. తక్కినవికారములు [అంతర్భూతములు] అన్నియు బాబాను జేరునప్పటికి 'ఏకమే'యగును. దైవమునందైక్యమగుటకు వికారసహితమగు ఆత్మ దైవమున కర్పనము గావింపఁబడవలయును.

## దేవ్ - ఇతరభక్తులకుఁ దోడ్పడుట :- [S.C.S. 174]

శ్రీ సాయీప్రభువు బి. వి. దేవ్‌నకు ప్రతిపదమున భక్తి పెంపొందించుచు శరణాగతిఁ జేయుశక్తినిఁ బ్రసాదించినాఁడు. దానికనుగుణ్యముగ దేవు- బాబాకీర్తిని వ్యాపింపఁజేసినాఁడు. చందోర్కరు వలన కొంత,బాబావలన ప్రత్యక్షముగ కొంత దేవ్‌గడించిన చైతన్యశక్తిని ఇతరులకును అందఁజేసినాఁడు. బాబాయందు గాఢవిశ్వాసము వహింపుఁడని జనులకు బోధించుట అంత తేలికయైన పనికాదు. జనములు సాధారణముగ సంశయగ్రస్తులు. ఏ విషయమైన స్వానుభవమున బోధపడి హృదయమున నాటుకొనినట్లు ఇతరుల మాటలవలన పాదుకొనదు. మామ్లత్‌దారగు దేవునకు సంబంధించిన 'శాన్లేపటేల్' అనునతఁడు గలఁడు. దేవునకు సమర్థసద్గురువగు బాబాతో సన్నిహిత సంబంధముగలదని తెలిసికొని దేవుద్వారా బాబాను ఆశ్రయించి,తనకు తన కుటుంబమునకు సంబంధించిన సంశయమును దీర్చికొనఁదలఁచెను. ఆ పటేలునకు వారి కులగురువొకఁడు గలఁడు. ఆపటేల్ వారి గ్రామమున శిథిలమైన దేవాలయమును మరల కట్టించెను. అందు ప్రాతవిగ్రహములనుగాక 'వాసి'నుండి క్రొత్తవిగ్రహములను తెప్పించి ఆ దేవాలయమున ప్రతిష్ఠించుమని ఆ పటేల్ గురువుచెప్పెను ఆ నూతన విగ్రహ ప్రతిష్ఠాపనకు ఏవేవియో పెద్దఖర్చులా గురువుచెప్పెను. ఈ విషయమున పటేలునకు సంశయముదోఁచి దేవుద్వారా బాబాను సంప్రశ్నించి, శ్యామాచేత నూతనవిగ్రహములను దెప్పించి ఆ దేవాలయమున ప్రతిష్ఠింపఁదగునా? యని యడిగించెను. బాబా నూతన విగ్రహములు తెప్పించవలదని ప్రాత విగ్రహములనే ప్రతిష్ఠించుఁడని తెలియ

పెద్దకాలమునుండి సేవచేయఁగల దేహపటుత్వముగలవాఁడు. బాబాను గూర్చి ప్రశ్నించుభక్తులకు విసుగు విరామములేక పెక్కువిషయములనుదెలిపి సంతృప్తులఁ గావించువాఁడు. తుదిగడియవరకు శ్రీసాయీ సంస్థానము సేవఁజేయుచు శ్రీ బి.వి. దేవ్ తనభౌతికతనువును విసర్జించినాఁడు. మరాటీభాషయందీతని రచనలు అపారము— ప్రశంసనీయములని చెప్పదగును. ఆభాష నెఱిఁగినవారు వానిని మిక్కిలి ఆప్యాయతతో పఠించి యానందించుచుందురు. శ్రీ బి.వి. దేవ్ అనంతరము ఆయనకుమారుఁడు యస్. బి. దేవ్ శ్రీ సాయీసంస్థానమునకు ధర్మకర్తలలో నొకరుగనుండి బాబా సంస్థానమునకు అమూల్య సేవ చేయుచున్నాఁడు.

శ్రీ సాయీనాథుని ప్రేమకు పాత్రుఁడైన శ్రీ బి వి. దేవ్‌నకు చందనశతము లర్పించుచు ఆబిడ్డను అనుగ్రహించినటుల మనల నను గ్రహింపుమని శ్రీసమర్థ సద్గురుదేవుఁడైన శ్రీ సాయీబాబా పాదములకు ప్రణతిసహస్రము లర్పించుదము.

ఓమ్ శ్రీసాయీ శరణ్

పరతత్త్వజ్ఞుని సాధుసత్పురుషుఁగొల్వన్ తత్కృపాపేక్షణం
పురమాస్యంబది స్వానుభూతము యగున్; మూఢుల్ పరప్రత్యయుల్;
పెరఁబోఁగాములతోడ నేమిపని? బీ. వీ. దేవు వృత్తంబునం
దెలుఁగన్ జేయనే? మద్విధానముల; ఏమీ, నిన్ను పేక్షింతునా!

# ఏమీ, నిన్నుపేక్షింతునా ?

## ఇరువదితొమ్మిదవప్రకరణము

## 24 అనుగ్రహ లీల

a) నానాసాహెబ్ శంకర్ నిమోన్కర్ దేశపాండే
b) (ఆయన కుమారుడు) సోమనాథ్ శంకర్ దేశపాండే

సద్విషయము :_

సాధు సత్పురుషులనుగూర్చి మనమేమి పలుకదగునో యెట్లు పలుకవలయునో యెఱుగము, ఈ యావిధమున బలుకుదమని పూనుకొనుటయు నజ్ఞానమే. పలికింపగలవాడు బాబా మనహృదయమున నధివసించి యీ దేహము, బుద్ధి,వాక్కు అను ఉపకరణముల తన యిచ్ఛచొప్పున ప్రవర్తింప జేయువాడు. బాబా ఏమిపలికిన ఆ తండ్రివాక్కులే కాని, మనవికావు. ఆయాజీవుల పూర్వజన్మ సంస్కారముల ననుసరించి యాయాతలంపులు వాక్కులు క్రియలు ప్రకటమగుచుండును. మనసర్వస్వము సద్గురువున కర్పనముగావించి, సంపూర్ణశరణాగతి సలిపినగాని మన ప్రయత్నములు సఫలములుకావు. కర్తృత్వ స్వాభిమానములనుండి మనము దూరమైననాడు మనము కావించుపనులు జయప్రదములగును,

శ్రీ సాయీప్రభువు సేవవలన లౌకిక పారలౌకికసిద్ధి నొందగలము, మన సహజస్థితినిపొంది సత్యసుఖానందముల బడయగలము. కావున సత్సుఖ సంతుష్టి సంతృప్తుల బడయగోరువారు శ్రీసాయీలీలా కథాదికముల జదివి, విని, స్మరింపదగును. అటుల గావించువారు వారి జీవితలక్ష్యమును బడసి పరమానంద మొందగలరు,

ॐ విజయలక్ష్మి సమస్తమాయతనమః

అనేకజన్మ సముపార్జిత సుకృత పరిపాకముగలిగిన వారికేగాని సాధుసత్పురుష సాంగత్య సేవాభాగ్యములు గలుగవు. అట్టిభాగ్యము గలిగినవారుగాని జనన మరణరూపమగు సంసారచక్ర భ్రమణము నుండి విడివడరు. మన హృదయవచశ్శరీరములను ప్రత్యక్షభగవానుఁడగు సమర్థసద్గురునకు సమర్పనముఁజేసిన నిఁక స్వపరవిషయములఁ గూర్చి ఆందోళనమొందవలసిన పనిలేదు, మనశక్తిపై నాధారపడి, ప్రయత్నించి కావించు- కావింపఁగల వానికంటె అతుల భరన్యాసముఁ గావించినవారు చేయునవన్నియు మిన్నగ దైవమే నిర్వర్తింపఁ జేయును. మనము చదువఁబోవు నిమోన్కరు వృత్తాంతమున నీ విషయములు విశదముకాఁగలవు.

## నానాసాహెబ్ శంకర - నిమోన్కర్ - దేశపాండే

నిమోన్కరు 1916 నుండి బాబా మహాసమాధి పర్యంతము (1918వరకు) శ్రీసాయీపదసేవయందు మనస్సు లగ్నముజేసియుండెను. 70 సంవత్సరముల వృద్ధుఁడయ్యును బాబాను త్రికరణశుద్ధిగ సేవించినాఁడు. శిరిడియందు నిమోన్కరు బాబా సేవచేయుచుండ దూరమున నున్న ఆతని కుటుంబములోని వారినందఱను- ఆతనికొడుకులను-కోడం డ్రను మనుమలనెట్టి హానిపాలుగానీయక- ఏ యితరుల సాయములో నిమిత్తములేక బాబా రక్షించి వారందఱకు బాబా యెట్లు తోడ్పడు నది ప్రదర్శించినాఁడు. ఆ తండ్రియందు మన మెంతెంత విశ్వాసముం చుదుమో బాబా మనపై అంతంతప్రేమ ప్రకటించును. ఈ రహస్య మనుభవైక వేద్యమని భక్తులు గ్రహింపఁదగును.

## శంకర్ నిమోన్కర్ వృత్తాంతము :-

నానాసాహెబ్ శంకర్ నిమోన్కర్ శిరిడికి 20 మైళ్ళదూరమునఁగల 'నిమోన్' గ్రామనివాసి. ఆ గ్రామమున వీరి వంశీయులకు

1 జగన్మాయేతి బోధకాయనమః

'దేశపాండే' వృత్తిగలదు. అనగా వీరు జాగీరుదారులు. వీరిగ్రామము నుండి కోపర్గామునకు వచ్చిపోవుమార్గమున శిరిడీకలదు. శిరిడియందు వీరిబంధువులు కలరు. [మాధవరావు దేశపాండే] శ్యామా తండ్రియైన బలవంతరావు నిమోన్కరునకు బినతండ్రియైన శంకర్ నిమోన్కరును మిక్కిలి ప్రేమించువాఁడు. ఒకపరి బల్వంతరావు బాబానుగూర్చి చర్చించుచు 'జనులు శిరిడీలోని సాయిబాబాను ఒక పిచ్చిఫకీరని చెప్పుకొందురు. కాని నేనట్లు తలంచను. అయిన నీవువచ్చి స్వయముగఁజూచి నీయభిప్రాయముఁ దెలుపుము'— అని శంకర్ నిమోన్కరును తనవెంట శిరిడీకిఁ గొనిపోయెను. బల్వంతరావు బాబాను చూచుటకు మసీదున కెప్పుడువెళ్ళినను బాబా ఒక ఇటుకరాతిని విసరుటగాని లేక రాతినిఁ జేతఁబూని విసరునట్లుజడిపించుటకాని చేయుచుండువాఁడు, ఈవిధముగఁ గొందఱను మసీదులోనికి రానీయక బాబా దూరము నుంచుచువాఁడు.

శంకర్ నిమోన్కర్ సాయిప్రభువును జూచినవెంటనే అతనికి బాబాయందు భక్తి అంకురించెను. హృదయము ద్రవించెను. అతఁడు బాబా దర్శనముఁజేసికొని తిరిగివెళ్ళి 'సాయిబాబా ఒక గొప్ప సాధువు. ఏమాత్రము పిచ్చివాఁడుకాఁడు'— అని తన నిశ్చితాభిప్రాయమును దెలిపెను. బలవంతరావు అంతకుఁ బూర్వమెప్పుడు మసీదు దగ్గఱకువెళ్ళినను రాళ్లనువిసరు బాబా ఆసమయమున రాళ్ళను విసరకుండుట కతఁడాశ్చర్యపడెను. 'నీవు బాబా యొక్క పిచ్చివాఁడేమో! యని సందేహించితివి కావున నటుల కావించి యుండవచ్చును'— అని శంకర్ నిమోన్కరు— బల్వంతరావు సందేహమునుదీర్చెను. అదిమొదలు శంకర్ నిమోన్కరు తఱచుగ శిరిడీకివెళ్ళి బాబా సందర్శనముఁ జేయుచుండెను. క్రమక్రమముగ నతనికి బాబాయందు గాఢమగు భక్తివిశ్వాసములు పెంపొందెను.

* ఖాపర్డేతో సంభాషణము

శంకర్ నిమోన్కర్- సంగమ్నేరునందు గౌరవమేజస్ట్రేటుగా పనిచేసెను. అచట డిప్యూటీకలెక్టరుగు నానాసాహెబ్ చందోర్కరు నితడు కలియుట సంభవించెను. ఈ యిరువురు బాబానుగూర్చి తలచుచుగ జెప్పుకొనుచు ఆతండ్రి లీలలను గీర్తించుచు నానందించువారు. నానాసాహెబ్ చందోర్కర్ ద్వారకామాయి మసీదు పునరుద్ధరణకు సంకల్పించి, చందాలు వసూలుచేసినపుడు నిమోన్కర్ తనశక్తికొలది చందాయిచ్చుటయేకాక, యాకట్టడముపని తాను దగ్గఱనుండి జరిపించెను. బాబా ఆమసీదుగోడలు మొదలగువానిని గట్టనిచ్చినవాడు కాడు. భక్తులు కావింపదలచి చేసినపనిని ధ్వంసము జేసెడివాడు. అటుల ఆమసీదు పునాదుసహితము పూర్తియగుటకు చాలకాలము పట్టినది. కాని సాయిప్రభువునకు శంకర్ నిమోన్కరునందు మిక్కిలి ప్రేమకలదు. బాబా దినమువిడిచి దినము చావడియందు రాత్రములు గడపువాడని లోగడ దెలిసికొంటిమి. బాబా మసీదునందుండని సమయమున ఆకట్టడపుపని త్వరితముగ బూర్తిగావించిరి.

## శంకర్ నిమోన్కర్ - బాబాల అన్యోన్య ప్రేమ - (నిమోన్కర్ కోశాధికారి)

నిమోన్కరునకు బాబా యందెంత గాఢవిశ్వాసముకలదో బాబాకు నిమోన్కరునందంత ప్రేమకలదు. 1916—18 వరకు దక్షిణల రూపమున విశేషధనము భక్తులు బాబాకు సమర్పించువారు. బాబా తానీయదలంచిన ఆశ్రితులకీయగా మిగిలినది నిమోన్కరున కిచ్చువాడు, అనగా అతడు మూడుసంవత్సరములు నిమోన్కరు బాబా ఖజానుగ (కోశాధికారిగ) నున్నవాడు. బాబా అంతరంగిక భక్తుడగు శ్యామా అంతవాడుకూడ ఆధనమును బాబా నిమోన్కరునకు బహూకరించుచున్నాడని తలంచెను కాని, నిమోన్కరునకెట్టి

అవసరము లేదు. భూవసతినుండియు కుమారునివలనను కావలసిన ధనమాయనకు లభ్యమగుచునేయుండెను. బాబా తెలుపగ పలుకు పలుకులలోని సత్యము 'ఫకీరు(దైవము) ధనము మ్రింగరానిది. ఎవ రేని దిగమ్రింగిన యెడ తుదిపై సావరకు వెలిగ్రక్కి తీరవలయును'- అను మాటలలోని సత్యము నిమోన్కరు బాగుగ గుర్తించినవాఁడు. కావున బాబా అతని చేతులందుంచిన ధనములో నొకపైసాకూడ స్వప్రయోజనమునకై వెచ్చించికొనక బాబా నియమించు కార్యములకే వ్యయపెట్టువాఁడు. ఎప్పుడేపనికి అవసరమైన బాబా నిమోన్కరు వద్దనుండి ధనముఁ దీసికొని ఉపయోగించువాఁడు.

## బాబా బహుమతులు - భాగవత పారాయణము :-

ఆర్థిక బహుమానములకంటె నశేష శుభావహములగు హిత కామితములు- ఆధ్యాత్మిక బహుమానములను నిమోన్కరు కోరి బాబా వలన పొందినాఁడు. శంకర్ నిమోన్కరును ఆయన గ్రామము లోని జనులు పిన్నలు పెద్దలు తుదకు ఆయన కుమారుఁడుసైతము 'కాకా'- అని పిలుచువారు. ఆకారణమున బాబాకూడ ఆతనిని 'కాకా' అని పిలుచువాఁడు. ఆధ్యాత్మికముగ నిమోన్కరు- బాబా వలన పొందిన విషయమొకటి పాఠకులు గ్రహింపవలెను. నిమోన్క రునకు సంస్కృత భాగవతము నిత్యపారాయణముగఁ జదువవలయు నను కోరికకలదు. కాని అతనికి సంస్కృతవిద్య రానికారణమున పఠిం పలేకపోయెను. సర్వాంతర్యామియగు బాబాకు తెలియని విషయము లేదు. ఒకదినమున నిమోన్కరును చేరఁబిలిచి,

సా.బా:- కాకా! నీవు నిత్యమేల పారాయణము కావింపవు?

నిమో:- బాబా! నాకు సంస్కృతము రాదు- నేనెట్లు పారాయణము చేయఁగలను?

సా.బా:- సందేహింపకుము. మస్జిద్ ఆయీ నీకు సంస్కృతముఁ గఱపఁగలదు. క్రమముగ నీకు లభ్యమగును. ప్రారంభింపుము.

అంతట నిమోన్కరు బాబాయందు గాఢవిశ్వాసముంచి, శ్రీమద్భాగవతమును సంస్కృతవ్యాఖ్యతో పారాయణముఁజేయ ప్రారంభించెను. అర్థము కాకపోయినను పట్టుదలతో పారాయణము చేయఁగా- చేయఁగా దానియందు అభిరుచిహెచ్చి, అవగాహనముఁ జేసికొని, పిదప భగవద్గీతలు- జ్ఞానేశ్వరి పారాయణము సమర్థతతోఁ గావించి' కాకాసాహెబ్ దీక్షిత్తు- బాపూసాహెబ్ జోగ్ మొదలగు సంస్కృత భాషాకోవిదుల సందేహముల నివారింపఁగల పాండిత్యము తఁడు సంపాదించెను. దీక్షిత్-జోగ్ చక్కని సంస్కృత సాహిత్యము గలిగినవారు నిమోన్కర్ ప్రజ్ఞను కొండాడి, యదియంతయు బాబా అనుగ్రహలేశమున లభ్యమయ్యెనని మిక్కిలిగ నానందించిరి. ఆటుల కొంతకాలము జరిగినపిదప బాబా- నిమోన్కరును జేరఁబిలిచి ,నీవేల యితరులకు నీ పాండిత్యమును ప్రదర్శించుచు బోధించవలయును ? ఇట్లు చేయుటవలన నీహృదయమున గర్వమునకు- నేను నేర్పరినైతినని అహంకారమునకు- తావుగలుగును. కావున నితరులకు బోధింపవలదు; అని తెలియఁజెప్పెను. నిమోన్కరు తన వార్ధక్యదశయందు బాబాను ధ్యానించుచు తనచేతితో ఉధిని ప్రసాదించి పెక్కురు ఆర్తులకు వ్యాధిగ్రస్తులకు సు సంతోషములు ప్రసాదించిన విషయము లనేకములు కలవు. ఆధ్యాత్మికముగ నితఁడు మిక్కిలి ఉన్నతస్థితినిఁ బొందినాఁడు.

ఐహికముగ శంకర నిమోన్కరు పొందినలాభము లనేకములు కలవు, ఆతనికి భూములపై లభ్యములగు ఆదాయములు పొందుటయే గాక జనాదరణము- గౌరవము- కుటుంబములోని వారికందఱకు సుఖ సంతోషములు- కుమారునకు ఉద్యోగాభివృద్ధి మొదలగునవి యెన్నే నియుఁ గలిగినవి. నిమోన్కరు తన కుమారుఁడగు 'సోమనాథుని'

చిన్నవాఁడుగనున్న సమయమున బాబా వద్దకుఁ గొనిపోయెను. బాబా ఆబిడ్డనుగూర్చి యితరులతో — ఆబిడ్డతోడను మిక్కిలి ప్రేమతోఁబలుకువాఁడు. అట్టిప్రేమ చిహ్నముగ ఆబిడ్డను- ముద్దు పేరున 'సోమ్నియా!' అని పిలుచువాఁడు.

సోమనాథ్ మొట్టమొదట 1912న కోపర్గామునందు పోలీసు సబ్ ఇన్స్పెక్టరుగ నియమింపఁబడెను. మొదటినెల జీతమురాగానే రెండు రూపాయలు బాబాకు మనిఆర్డరు ద్వారా పంపెను. అటుల 1920 వరకు ప్రతిమాసము పంపినాఁడు. అది అతని తండ్రి మ్రొక్కుబడి కానిండు- లేక సోమనాథుని భక్తి కానిండు- శంకర్ నిమోన్కర్ జీవించి యున్నంతవరకు (1920 వరకే) అటుల జరిగినది.

## సోమ్నియా వద్దనుండి బాబా 10 రూపాయలు దక్షిణ తీసికొనుట :- [S.C.S. 239]

సోమనా కోపర్గామునందుద్యోగమున నుండగ నొకనాఁడు తన తండ్రితో శిరిడికి వెళ్ళి, బాబాను సందర్శించెను. అతనిని 10రూపాయలు దక్షిణనిమ్మని బాబా అడిగెను. అతఁడు వెంటనే బాబాకు సమర్పించెను. ఆ విషయప్రాధాన్యత నప్పుడెవ్వరు పాటించలేదు. ఆరు నెలలు జరిగినపిదప, ఏనాఁడు బాబా అతనివద్దనుండి 10 రూపాయలు దక్షిణతీసికొనెనో ఆనాటినుండి జీతము 10 రూపాయలు పెంచఁబడి, 1912లోనే పూనాకు బదిలీ చేయఁబడినాఁడు.

బాబా తన బిడ్డలపైఁగలప్రేమ- తనబిడ్డలనెట్లు సర్వదాదృష్టి యందుంచుకొని రక్షించునది లోఁగడఁ దెలుపబడిన ఈక్రింది విషయము నిరూపించును. బాబా జేబులో అఱిగిపోయిన నాణెములసంచి యుండును. మసీదునందుఁ గూర్చుండి ఆసంచిలోని నాణెముల నొక్కొక్కటితీసి, చేతివ్రేళ్ళతో వానిని రుద్దుచు 'కాకాచా' - 'సోమ్యాచా'

* జాంబూనద పరిత్యాగినే నమః

మొదలగు నామముల నుచ్చరించువాఁడు అటుల కావించుట తనవారి కష్టహాని కలుగకుండుటకు— శుభముల సమకూర్చుటకు బాబా కావించు వింతచర్యలని మనము ఊహింపఁదగును.

## భక్తయోగ క్షేమవహుఁడు - బాబా :- [S.C.S. 329]

(శ్రీ) సాయీకృష్ణుఁడు [యోగక్షేమం వహామ్యహమ్] తన భక్తుల యోగక్షేమముల భారమును తాను వహించుచున్నవాఁడనని తెలిపినాఁడు. ఆవిధముగ నిమోన్కరు కుటుంబములోని వారినందఱను- ముఖ్యముగ నిమోన్కర్ చరమదశయందు బాబా సేవసేయుచు శిరిడి నుందున్న 8 సంవత్సరములు బాబా మిక్కిలి శ్రద్ధతోఁ గనిపెట్టియుండెను. 1916లో సోమనాధుని భార్య గర్భవతి. సోమనాధ్ తనకు సాయముచేయుటకై తలితండ్రులకొఱకు ఎదురుచూచుచుండెను. నిమోన్ నుండి పూనాకు వెళ్లుటకు నిమోన్కర్ దంపతులు బయలుదేరి మార్గమధ్యమున బాబాను దర్శించుకొని వెళ్ళుటకు శిరిడీఁ జేరిరి. 1916లో బాబా చాల జబ్బుగనున్న సమయమున ఆతండ్రిని సేవించు తలంపున వారువెళ్ళిరి. వారు బాబాను జేరఁగా వారిని నిమోనుకుఁగానీ, పూనాకుఁగాని, వెళ్లుటకాతండ్రి అనుజ్ఞ నీయకుండెను. బాబా తన కటూల నిలుపుటకుఁగల కారణము నిమోన్కరునకు బోధపడలేదు. శ్యామా జోక్యముకల్పించుకొని వారి బాధ్యతలు పూనాలో వారికిఁ గలుగనున్న కష్టములనుగూర్చి విన్నవించి, నిమోన్కర్ దంపతులకు సెలవు ప్రసాదింపుమని ప్రార్థించెను.

సా.బా.- నాబిడ్డలను పంపఁజూచుచున్నావా? కాకా నీయబ్బసొమ్ము మైనఁ దినుచున్నాఁడా?

శ్యామా:- బా! ఆతనికోడలు గర్భవతి- ప్రసవకాలము సమీపించుచున్నది. వారికి సాయమవసరము.

సా.బా.— అరే! కాకా! ఏలనీకు ఆందోళనము? దైవము రక్షించునే. నన్ను సమాధిచేసి నీవు వెళ్ళుము!

ఆ విధముగ బాబా నిమోన్కరు ప్రయాణమును ఆపఁగా, నిమోన్కర్ తనచేతితో గుడ్డపేలికను చుట్టుకొనెను. [illegible] సంవత్సరములుండుకొని, బాబా తనువువిడుచు 4 దినములకుముందు అట్టివిప్పెను. బాబా మహాసమాధి తరువాత 4 నెలలకు నిమోన్కరు [illegible]. బాబా మహాసమాధి తరువాత నాలుగుదినములకు [illegible] శిరిడీవిడిచి [illegible] వెళ్ళుచు శ్యామాకు ఈ విషయము [illegible] తెలిపెను. (నన్ను సమాధిచేసి నీవు వెళ్ళుము— అనఁగా ఈ [illegible] సంవత్సరములు నీవిక్కడనేయుందువు!— అని బాబా ఆజ్ఞయని పాఠకులు గ్రహింపనగును.)

## [illegible]ని ప్రసవము :-

ఇటుల నిమోన్కర్ దంపతులు శిరిడియందు నిలువఁబడిరను విషయమెఱుఁగక పూనాలో వారికొఱకు ప్రతిక్షణము నిరీక్షించు సోమనాథుఁ డితరములగు నేర్పాటులు చేసికొనకుండెను. ఒకనాటి రాత్రి 10 గంటలకు అతనిభార్యకు కానుపునొప్పులు ప్రారంభమయె నట్లు తెలువవెంటనే పూనాలోని ప్రసూతివైద్యాలయమున కామెను [illegible] వెళ్ళెను. ఆ వెంటవచరించవలసినదాది సోమనాథుతో నావల గదిలో మాట్లాడుచుండగనే అతనిభార్య ప్రసవించెను. బిడ్డపడ్డెను. అంతయు నొక్కక్షణములో జరిగెను. ఎట్టి సహాయములేకుండ [illegible] ఆమె ప్రసవించెను. పూనాలో ప్రసవము జరుగుచుండగ శిరిడియందు బాబా 'ఒక కాంతగలదు— ఆమెకు వైద్యాలయమునకు [illegible] సుఖముగ ప్రసవించెను. మగశిశువు కలిగినాఁడు'— అని నిమోన్కరుతో చెప్పెను.

* [illegible]

సోమనాథ్ తనకు కుమారుఁడు జనించిన మఱునాఁడు వారిఆచారముల ప్రకారము పంచిపెట్టుటకు మధురపదార్థముల నాతని తమ్మునకిచ్చి శిరిడీకిఁబంపి, బాబాకు సమర్పింపుమని, వారి తల్లినిఁ దీసికొని రమ్మని చెప్పెను. ఆమె వెళ్ళుటకును బాబా అనుమతి నీయలేదు. తన కోడలికాన్పు విషయమై బాబా ఆక్షణముననే తెలిపినసంగతి తన రెండవకుమారునకు నిమోన్కరు చెప్పి, సర్వరక్షకుఁడగు బాబా ఉండఁగ నెవరి సహాయముతో పనిలేదని, ఆతండ్రి ఆజ్ఞ లేనిదే యెవరు కదలుటకు సాధ్యముకాదని తెలిపిపంపెను. నిమోన్కరు దంపతులను శిరిడీనుండి యెచటకుఁ బోనీయక నిలిపినను బాబా ఆతని కుటుంబములోని వారి నందఱనెట్లు రక్షించినది యీ క్రిందివిషయములవలన గ్రహింపఁదగును.

## నిమోన్కర్ కుటుంబమును బాబా రక్షించుట [S.C.S.538]

1917 డిసెంబరులో పూనాయందు ప్లేగువ్యాధి విజృంభించెను. సోమనాథ్ ఆతని రెండేండ్లబిడ్డ గోపాలును భార్యను వెంటఁగొని వారి స్వగ్రామమగు నిమోన్ నందలి తమ్ముని భార్య ప్రసవింప చూచివచ్చుటకై క్రిస్మస్ సెలవులలో బయలుదేరి మార్గమధ్యమున శిరిడీకి వెళ్ళి బాబా దర్శనముఁ జేసికొనెను. బాబా సోమనాథుని కుటుంబమునకు 'ఊది' ప్రసాదించి సెలవొసఁగుచు 'పోరాలా జీవ్ లావ్' [బిడ్డను రక్షింపుము!] అనిపలికెను. అది తనబిడ్డ గోపాలు ననుగ్రహించుచు బాబా పలికినమాటలుగ నతఁడు తలంచి గోపాలునకు ఊదినొసంగెను. అచట నుండి టాంగామీఁదవారు నిమోన్ చేరిరి. అప్పటికి 12 రోజులకుఁ బూర్వముజనించిన సోమనాథుని తమ్మునిబిడ్డ చాల ప్రమాదస్థితి యందుండెను. కాలుసేతులు చల్లఁబడెను. ఆబిడ్డపై తల్లిదండ్రు లాసవిడిచిరి. సోమనాథునకు బాబా పలుకులలోని భావమప్పుడు బోధపడెను.

'బిడ్డను రక్షింపరా!'— అని బాబా 'ఉధి' ప్రసాదించుట గుర్తించి 'ఉధి' పొట్లమునకై యతఁడు వెదకెను, కాని, వారిప్రయాణము తొం దరలో ఉధి యెక్కడో జారిపోయెను. వెంటనే సోమనాధుఁడా బిడ్డను చేతులలోని కెత్తుకొని ఆర్తితో బాబాను ప్రార్థించెను. 15 నిమి షములలో నాబిడ్డతిరిగి కోలుకొని, క్రమముగ ఆరోగ్యముపొందెను. ఆబిడ్డకు 'దత్త'—అని,— (భగవానుఁడగు బాబాచే ప్రసాదింపఁబడిన వాఁడు!— అని) పేరుపెట్టిరి.

## ప్లేగువ్యాధి - వివరణము—

క్రిస్మస్ సెలవల అనంతరము 3—1—1918 న సోమనాథ్ పూనాకుఁ జేరవలసియుండెను, ప్లేగువ్యాధి అచట తగ్గలేదు. సోమ నాథ్— కుటుంబముతో శిరిడికి వెళ్ళి బాబా దర్శనముఁజేసికొని సెల విమ్మని కోర, బాబా అంగీకరింపలేదు, నిమోన్కర్ ఉద్యోగనిబంధన ల తెలిపి, బాబా చేతియందు 'ఉధి' ఉంచి, సెలవిమ్మని నిర్బంధిం చెను. ఎట్టకేలకువారు జనవరి 3 వ తేదీకి పూనాచేరిరి. వారియింటి యజమానికి ప్లేగు తగిలియుండెను. 4వ తేదీన సోమనాధునిభార్యకు ప్లేగువ్యాధి యేర్పడెను. ఆతఁడెక్కడకు వెళ్లుటకు వీలుపడక ఆయింట నేయుండెను. సోమనాథునిభార్య బాబా అనుగ్రహమున తిరిగి ఆరో గ్యముపొందెను. గాని చూపు నష్టమయ్యెను. ఆయెడ ప్లేగువ్యాధి వ్యాపించియున్న పట్టణమును వదలి, దూరముగ నిర్మింపఁబడిన ఆరో గ్యనివాసములకు వెళ్ళఁదలఁచి, బాబా సెలవుకై వర్తమానమంప "ఇల్లు వీల విడువవలయును?"— అని, వారి తలంపును బాబా త్రోసి వేసెను. బాబా ఆజ్ఞను పాలించిరి. వారికెట్టి అపాయము కలుగలేదు. కొడలు జబ్బుగానుండెనని పూనాకు వెళ్లివచ్చుటకు సెలవిమ్మని నిమో న్కర్ కోరఁగా మరల 'నన్ను సమాధిచేసిపొమ్ము!' అని, బాబాపలుక నతఁడు శిరిడీయందే నిలిచిపోయెను.

• శ్రీ తేండుల్కర్ వృత్తాంతము •

## సోమనాథునకు ఆరోగ్యమును బాబా ప్రసాదించుట :-

1918 మార్చి నెలలో సోమనాథ్ ప్లేగుజ్వరమో లేక విషజ్వరము చేతనో బాధపడెను. తండ్రిని రావలసినదిగ కోరుచు నతఁడు శిరిడీకి ఉత్తరము వ్రాసెను. బాబా అనుమతినీయలేదు. 'నీకేల ఆందోళనము? సొమ్మియా కోలుకొని యిక్కడకువచ్చును.'- అని బాబా ధైర్యముచెప్పెను. సోమనాథ్ 21 రోజులు విడువనిజ్వరముతో బాధపడెను. నీరుమాత్ర మాహారముగనుండెను. అంతట ఆరోగ్యము కోలుకొనుటకై రెండుమూఁడు నెలలు సెలవుపెట్టి కుటుంబముతో బేలాపూరు చేరెను అచట అతనికిఁబూర్వము మంత్రోపదేష్ట-భక్తిమార్గప్రబోధకుఁడైన విజయానందస్వామి సమాధిని దర్శించెను. కొన్నిదినములచట గడపెను. (S.C.S. 546 చూడుడు) శంకర్ నిమోన్కర్ భార్య బేలాపూరునకువెళ్ళి సోమనాథును కుటుంబ సహితముగ శిరిడీకిఁ దీసికొనివెళ్ళెను. సోమనాథ్ బాబాను దర్శించుకొనెను. అతనికి 'కిచాడి'- [పులగము] ఆహారముగ పెట్టుమని నియమించెను. వారటులఁగావించిరి. ఒక నెల దినములతఁడు శిరిడియందుగడపి పూర్వపు బలారోగ్యములనతఁడు తిరల పొందెను. బాబా చరమదశయందు కొన్నిదినములు బాబా సేవలో సోమనాథుఁడు గడపి తిరిగి పూనాకు వెళ్ళుటకు సెలవిమ్మని బాబాను కోరగ సమ్మతింపలేదు. కాని, తిరిగి ఉద్యోగమున ప్రవేశింపవలయును కావున సోమనాథ్ శిరిడివిడిచి కుటుంబముతో పూనాకుఁ జేరెను,

తరువాత 8 నెలలకు బాబా మహాసమాధినొందఁగా నిమోన్కరు శిరిడివిడిచి నిమోన్ [వారిస్వగ్రామము] చేరెను. అచటనుండి అహమ్మద్ నగరునకు వెళ్ళెను. పూనాలో సోమనాథ్

మహాశయ పరిత్రాత్రేనమః
శివశక్తియుతాయనమః

ఒక ప్రక్కభాగము నొప్పిచే బాధపడుచు రావలసినదిగా తండ్రి! ఉత్తరము వ్రాయుటచే నతఁడు పూనాకు వెళ్లి తుదివరకు నచటనేయుండెను. ఆయనను జేరిన వారినందఱను శ్రీ సాయీనాథుడుగ నతఁడరయుచుండెను. నిమోన్కర్ గొప్ప రామభక్తుడగుటచే తుదిక్షణము వరకు శ్రీరామనామము జపించుచు భౌతికతనువును విసర్జించెను. శ్రీరామ- శ్రీసాయిబాబా ఏకత్వమగుటచే నిమోన్కరునకు పరమపదప్రాప్తి శ్రీ సాయీరాముఁడనుగ్రహించెను.*

## సోమనాథుఁడు బాబాను సేవించుట :- బాబా మారుతిగ దర్శనమిచ్చుట :-

బాబా చరమదశయందు ఆతండ్రిసేవ నాలుగుదినములుచేయు భాగ్యము సోమనాథునకుఁ గలిగెను. శంకర్ నిమోన్కరు కోర్టుపని మీద అహమ్మద్‌నగర్ వెళ్ళవలసి వచ్చెను, నాలుగురోజులట ఉండ వలసివచ్చినది. ఆ నాలుగుదినములు బాబా సేవ నేమరక కావింపుమని కుమారుని- సోమనాథుని- నియమించి వెళ్లెను, ముసలివాఁడగుటచే నిమోన్కర్ కూర్చుండి బాబా సేవచేయువాఁడు. సోమనాథ్ యువకుఁడగుట నిలఁబడి బాబా సేవ చేసెను. ఆ నాలుగుదినములు సేవించుటకు బాబా ఆజ్ఞల నిర్వర్తించుటకు నతనికి శక్తి చాలకుండెను. ఆ నాలుగుదినములలో నొక అద్భుతానుభవమతఁడు పొందెను. బాబా తనస్థానమందుఁ గూర్చుండెను. మాధవరావ్ [శ్యామా] మసీదు మెట్ల మీద గూర్చుండెను. సోమనాథ్ మసీదునందుండెను. తటాలున బాబా మారుతిగ [హనుమానుఁడుగ] సోమనాథునకు గోచరించెను. తోఁక కనఁబడుటలేదు గాని అంతయు హనుమంతునిరూపమే. తోఁకయున్నను బాబా కూర్చుండుటచే నతనికి గనఁబడలేదు. అద్భుతానందము పొంది సోమనాథ్ శ్యామానుపిలిచి 'చూడుము! బాబా వైపుచూ

* నానా నిమోన్కరస్యాంతే పాన్యాంత్రిర్ధ్యానలయ ప్రదాయకః

ను! మారుతిగనున్నవాఁడు'— అని పలికెను. బాబా వాస్తవముగ శ్రీరామభక్తుఁడు. చావడికి యూరేగింపు దినములందు మారుతి దేవాలయముముందు నిలిచి, యేమియో పలుకుచు మారుతివైపు చేతులిరువదిమారులు లూఁపుచుండువాఁడు. [S.C.S. 58, 144]

సాధారణముగ సోమనాధునకు ప్రాపంచకములైన ఆలోచనలే కలుగుచుండును కాని, బాబా సన్నిధియందు అవియన్నియు నెటో మటుమాయము లయ్యెడివి, నవీనములు ఆధ్యాత్మికములగు తలంపులతనికి గలుగుచుండెడివి, కాని అతని అనుభూతి చాలస్వల్పము. నానా నిమోన్కర్ విషయమువేఱు శ్రీసాయీనాథ సన్నిధాన సాంగత్య సేవాదులవలన నతఁడాధ్యాత్మికముగ మహోన్నతస్థానము నొందెను. బాబా అనుగ్రహమున నతనికి ఆధ్యాత్మిక శక్తిసమర్థతలు పెంపొందినవి. నిమోన్కరు చేకిమీఁదుగ 'ఉధి'-తీర్థములిచ్చిన నెట్టి దీర్ఘవ్యాధులైనను నివారణమైనవి. అదియంతయు బాబా ప్రసాదించిన శక్తి యనుటకెట్టి సందేహము లేదు. శ్రీ సాయీ మహాప్రభువు పాదముల నొక అఱికాలున 'మత్స్య'రేఖయు— మఱియొక అఱికాలున 'ధనుస్సు' రేఖయు కలిగియుండుట సోమనాథ్ స్పష్టముగ గుర్తించినవాఁడు.

శ్రీ సాయీప్రభు సేవాధురంధరుఁడు బాబా అంకిత సంతతిలో నొకఁడగు శ్రీ శంకర్ నానాసాహెబ్ నిమోన్కరునకు— ఆయన పుత్రరత్నమగు సోమనాథ్‌శంకర్ దేశపాండేకు వందనశతము లర్పించుచు ఆ బిడ్డల ననుగ్రహించినటుల మనల ననుగ్రహింపుమని శ్రీ సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయీబాబాకు ప్రణతిసహస్రము లర్పించుదము.

• రామదూత మహాయనమః

ఓమ్ శ్రీసాయీ శరణ్

---

మది నిశ్చింతితభక్తి నన్ను భజియింపన్ నేర్చు నావానికే
కొదవల్ కల్గవు; వానిభారములఁ గైకొందున్; వృథాచింతనల్
గడురన్ వ్యాకుల మందనేవని!— నిమోన్కర్ వృత్తమున్ నిల్పుమీ
హృది, సుశ్రేయపథంబు నీకిదుదు, ఏమీ, నిన్ను పేక్షింతునా!

# ఏమీ, నిన్నుపేక్షింతునా?

## ముప్పదియవ ప్రకరణము

## శ్రీ సాయిబాబా – ముస్లిముల సంబంధము,

శ్రీ సాయిబాబా చరిత్రము నింతదనుక పఠించిన పాఠకులు ముస్లిములెవరేని బాబాతో సంబంధముగలిఁగియున్నారా?– అటులఁ గలిగియుండిన బాబానుగూర్చి వారి తలంపులేమి? వారెట్టిలాభములు (లౌకిక పారలౌకిక లాభములు) పొందఁగలిగిరి? అట్టివారెవరు? ఇతర ముస్లిములును బాబావలన నేమిలాభములఁ బడయఁగలరు?– అను విషయములు తెలిసికొనఁ గుతూహలపడుట సహజము. అది ముఖ్యమైన ప్రశ్నమే. మొదటినుండియు హైందవ ముస్లిములకుఁగల పరస్పర ద్వేషభావములను బోకార్చి, యిరుతెగలను తనదరికి నాకర్షించుకొని, వ్యక్తిగతముగ– సాంఘికముగ– నైతికముగ దేశసౌభాగ్యవృద్ధికి సకల మతానుయాయుల కన్యోన్యమైత్రినిఁ గూర్చుటయే బాబా సంకల్పము. శ్రీసాయి అవతారప్రాధాన్యము నిదియే.

ఈప్రశ్నము బాబా హైందవుఁడా? మహమ్మదీయుఁడా? అను ప్రశ్నమునకు సన్నిహితసంబంధము గలిగియున్నది. బాబాను ప్రప్రథమమునఁ జేరు ప్రతిభక్తుని నీసందేహము బాధించినదే! బాబా స్వయముగఁ దెలిపిన విషయముల ననుసరించి, మనకింత దనుక లభించిన వృత్తాంతములవలన బాబా హైందవదంపతులకు జనించినటులఁ దెలియుచున్నది. బాబా చెవులకు పోగులుకుట్టఁబడిన గురుతులు కనఁబడుటయె దీనికి నిదర్శనము. [మహ్మదీయబాలురకు చెవిపోగులు కుట్టబడవు.] బాబా పలుకుల ననుసరించి చిన్నబిడ్డగ నున్నపుడే తానొక

ఫకీరునకు దత్తమయ్యెనని, ఆఫకీరు దంపతులు ఒకటిరెండు సంవత్సరములబిడ్డయగు బాబాను పోషించినటులఁ దెలియుచున్నది. కావున పసిబిడ్డగనున్న నాటినుండి బాబా ముస్లింసంబంధముఁ గలిగియున్నాఁడు. ఆఫకీరు పత్రిగ్రామ సమీపగ్రామమున నున్నవాఁడని సాధుసద్గుణసంపదగలిగి నిజమైనఫకీరు- విరాగి-యైయుండవచ్చును. కారణము- తఱచుగ బాబా భగవానునిఁగూర్చి తెలుపునపుడు- ముఖ్యసమయములందు- 'ఆఫకీరు'- అని పలుకువాఁడు. తనకు మార్గదర్శకుఁడు ఆదర్శపురుషుఁడునై, అతిబాల్యమునుండి తనను చక్కదిద్దిన మహనీయుఁడు ఆఫకీరై యుండవచ్చునని మనకుఁ దెలియుచున్నది. బాబా ఆఫకీరును తన గురుదైవముగ భావించియుండవచ్చును.

నిరంతరముఁ దన్నురక్షించుచు మార్గమును నిర్దేశించు-దైవము 'గురుదేవుఁడు'- అని, బాబా పలుకు 'ఆఫకీరు' 'సూఫీ' శాఖకుఁ జెందినవాఁడై యుండవచ్చును. సూఫీలు సాధారణముగ సమాధి నిష్ఠఁబత్తయువారై, 'అహంబ్రహ్మాఽస్మి' అను- 'మహావాక్యము'నకు సమమగు 'అనల్ హక్'- అను అరబ్బీ భాషాపదమున తమ సచ్చిదానందస్థితినిఁ- దెలుపుచుందురు. బాబా తఱచుగ 'అనల్ హక్'-అనువాఁడు. ఆపదము అందఱయెదుట నుచ్చరింపకున్నను కొందఱభక్తులయెదుటఁ బలికియున్నాఁడు. [S.C.S. 58] 'దైవము'- అని పలుకఁబడు తత్త్వముయొక్క- వివిధరూపములు- 'లక్ష్మీనారాయణ-దత్త-గణపతి-మారుతి'- మొదలగు రూపములు తానేయని బాబా తెలిపినాఁడు. [S.C.S. 49] 'అంగాన్యన్యా దేవతాః'- సకలదేవతలు తపరతత్త్వమైన దైవముయొక్క- వివిధావయవములు- అనుభావము బాబా తెలిపినాఁడు. 'అనల్ హక్'- అను అరబ్బీపదమునకు సమానమగు- హిందీ- ఉర్దూ పదము 'మైఁ అల్లాహూఁ' అనుపదము బాబా తఱచుగఁ బలుకుట

విదితము. బాబా తుదిక్షణమువరకు సూఫీమత సాంప్రదాయములగు శాఖానుభవములు కలిగియున్నవాఁడనియె చెప్పనగును.

సూఫీ శాఖానుయాయుల గాఢవిశ్వాసము— 1. మన అజ్ఞానమే మనల పెడదారికీడ్చుచు ప్రతిబంధకమైయున్నది. మన అహంతను (అజ్ఞానమును) పరతత్త్వమున లయింపఁజేసి, మనచే చేయఁబడు సకలము ఆదైవము— పరమాత్మచేతనే కావింపఁబడుచున్నది— అను దృఢ విశ్వాసముఁ గలిగియుండుటయే అనఁగా సకలకర్త దైవమొకఁడే యను నిశ్చయబుద్ధిఁ గలిగియుండుట,

2. ఏకైకసాధనము 'గురువు'మాత్రమే యగును. ఆ గురువు ఉపదేశములు— బోధలచేఁగాక— కేవలము ప్రేమచేత— తన అద్భుత శక్తిచేత తనపనినిఁ దానుగావించును. గురువు తన ఆత్మశక్తిచేత తన ఆశ్రితుని [అంతేవాసి] ఆత్మనుగ్రహించి, తనవైపున కాకర్షించుకొని చక్కదిద్ది,తన సకలశక్తులను ప్రసాదించి 'అపనాసరికా సరికాకరితక్'— తన యంతవానిఁగఁ గా మర్చుఁడు. (ఈ విషయములు బాబా తన గురువులయెడ నెఱపిన విధానముల ననుసరించి, తాను చక్కదిద్ది తన యంతవారిగఁ జేయఁదలఁచిన ఉపాసనీమహారాజ్ మొదలగువారియెడఁ బఱపిన విధానములననుసరించి మనకీవిషయము విదితమగుచున్నది.]

కావున బాబా తెలిపిన ఆ'ఫకీరు'— బాబాను సర్వవిధముల యోగ్యుఁడు— పాత్రుఁడు—సర్వలక్షణ లక్షితుఁడగు బాలునిఁగఁ జక్క దిద్ది, ప్రసిద్ధ సాక్షాత్కారి—యగు గోపాలరావ్ దేశముఖ్— వేంకుశుని దగ్గఱకు పంపించిన 'ఫకీరు' సత్పురుషుఁడని మనము గ్రహింపవలయును.

బాబా విషయమున ఆవిధి విధానము గమనింపుడు! హైంథవ దంపతులకుజనించి, ముస్లిందంపతులచే సాకఁబడి, మరల హైందవ సాధుసత్పురుషునిరక్షణమునకుఁ జేర్పఁబడినాఁడు.కావున హైంధవముస్లి

ముల కలయిక ప్రప్రథమమున బాబాయందే పరిపూర్ణత నొందవలసి యున్నది. ఆపిదప బాబా ద్వారా హైందవ మహమ్మదీయ సంఘమున నెట్టిమార్పునైనఁ గలిగింప సమర్థమైనది. ఇస్లాంమత సిద్ధాంతాను సారము దైవముయొక్క ఏకత్వము-హైందవమతానుసారము దైవము యొక్క బహుధాత్వము మనము గమనించుచున్నారము, హైందవుల గృహములందు శ్రీరామ- శ్రీకృష్ణ- శంకర- దత్త- మారుతి- సుబ్రహ్మణ్య- గణపతి- లక్ష్మి- పార్వతి- మొదలగు చిత్రపటము లను మనము చూచుచున్నాము. ఇందఱ దైవస్వరూపములకు సంబం ధించిన పౌరాణిక గాథలనువిశ్వసించి యిందఱ దైవతాస్వరూపములను హైందవులు పూజింతురు. కాని, ముస్లింమతానుయాయులకు ఇవియ న్నియు 'అనాత్మ'యే. వారికి దైవముఒక్కఁడే. ఇతరదైవములులేరు' మహమ్మద్ ఒక్కఁడే 'ప్రవక్త' అనఁగా వారికిదైవము- 'అల్లా' ఒక్కఁడే. ఇతరములను దలంచవలసిన పనిలేదు.

హైందవులవిషయమున ఈ వివిధమూర్తులు పర్యాయముగ దైవమే. ఇతరమును దైవముగా నిరాకరించని- ఈశ్వరైకత్వము'- అని, మనము గుర్తించవలయును! అనఁగ పర్యాయముగ సకలము దైవస్వరూపమే- అని భావము. "నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి"అని, సూర్య- అగ్ని-జలాదులనుద్దేశించి 'త్వమేవప్రత్యక్షం బ్రహ్మాఽసి'- అని హైందవులు చెప్పుదురు, ఇదియేకాక మానవవ్య క్తులనుగూడ దైవముగఁ బరిగణింతురు, ప్రథమమున మాతాపితరు లను దైవస్వరూపులుగ పూజింతురు, 'మాతృదేవోభవ'- 'పితృదేవో భవ!'- అని. ముస్లిములకీ నియమములు సుబోధములుకావు. హైందవులు 'అతిథిదేవోభవ'- అందురు. హైందవేతరులకివి బోధపడవు. కాని, తైత్తిరీయోపనిషత్ప్రతిపాదితమగు 'ఆచార్యదేవోభవ'- అను నది హైందవులకేకాక, కొంతవరకు ముస్లిములకును సమానాదరణీయ

( శీర్ణహానాలయస్థానే పూర్వజన్మసుకృతం స్మరతేవహః

మైన సిద్ధాంతమే. ముస్లిములలో 'సూఫీ' శాఖానుయాయులకు 'ఆచార్యదేవోభవ'– అనునది సమ్మతము. సూఫీలలో శిష్యుఁడు మనస్సునందు నిలుపుకొనఁదగిన దైవము 'గురువు' ఒక్కఁడే. గురుప్రేమయందు– గురుధ్యానమునందు తనవ్యక్తిత్వమును పూర్తిగ విస్మరించును. గురువు తప్పనితరములేదు. తైత్తిరీయోపనిషత్ప్రతిపాదిత సిద్ధాంతమిదియే. 'ఆచార్యదేవోభవ'– అనునది– సూఫీమతానుయాయులకు హైందవమతానుయాయులకు ఏకైకలక్ష్యము.

శ్రీ సాయిబాబా తనగురువును 12 సంవత్సరములు సేవించిన విధమునుగూర్చి బాబా స్వయముగఁ దెలిపినాఁడు. [S.C.S. 178, 80] తనగురువు తనవలనఁగోరినది ప్రేమమాత్రమే (బాబా) తానుకోరినది గురుప్రేమమాత్రమే. గురువుకంటె నితరముతో బాబాకు పనిలేదు, కావున గురువునేకైకలక్ష్యముఁ జేసికొని సంవత్సరములకొలఁది బాబా అధిక ప్రేమాసక్తులతో సేవించినాఁడు. తదితరమును సకలము మఱచినాఁడు. సూఫీలకోరు 'నిష్ఠ'యదియే. శ్రీకృష్ణ చైతన్యాదులు పరాప్రేమమార్గమునఁ బడయఁదగినదని సూచించిన 'మహాఫలము' అదియే, కావున అదృష్టవశమున ఫకీరునుండి వేంకుశుని సన్నిధిఁజేరిన బాబా సాధన నిష్ఠయందేమియు మార్పులేదు. సాధన– సాధ్యఫలములు సమమేమైనవి ప్రేమామృతాబ్ధియందు నోలలాడుటయే ప్రేమానందమునఁ దనను విస్మరించుటయే. పదిపండ్రెండు సంవత్సరముల వేంకుశుని సేవవలన బాబా తానుపూర్వము ఫకీరురక్షణమున పొందిన ప్రేమతత్వము పరిపక్వస్థితినొందినది. ఆవిధముగ హైందవ-ముస్లిముల తత్త్వములయొక్క కలయిక బాబాయందు పరిపూర్ణతనొందినది. ఉభయమతాదర్శములు బాబాయందు పాదుకొనినవి. సూఫీ సిద్ధాంత– వ సిద్ధాంతముల ననుసరించి గమ్యమునకు– సచ్చిదానందస్థితికి–

* ఇష్టనామకు సంతుష్టహరి ప్రీత్యకభావితాయనమః

ఏకైకమార్గము ప్రేమ- గురువును గాఢముగ ప్రేమించుటయే- అని బాబాకు- బాబాద్వారా మనకు విస్పష్టమైనది.

బాబా దైవమునుద్దేశించుచు తఱచుగ అల్లా–ఫకీర్- హరి– అనుపదములను పర్యాయముగ నుపయోగించువాఁడు. అల్లా నామ స్మరణము హరినామస్మరణము చేయువాఁడు. సాధారణముగ మనము చూచు ఫకీర్లుగాని; సాధువులుగాని 'అల్లా–హరి' అనుపదములను పర్యాయముగ నుచ్చరింపరు. 'కబీరు' విషయమటులకాదు. ఈరెండు పదములను పర్యాయముగ నుచ్చరించువాఁడు కబీరు. బాబా తన పూర్వము అవతారము 'కబీరు'– అని తెలిపినాఁడు. 'కబీరు'– గురుస్థానమాక్రమించినాఁడు. సూఫీ పంథానుయాయులకు "గురుస్వామి" యైనాఁడు. ఆధ్యాత్మికసాధనమున సూఫీ పథానువర్తులు కబీరుగేయములందు లక్ష్యముంచువారు. 'హరిబోలే– హరిబోలే– హరిబోలే బయ్యా"– అను ప్రసిద్ధకబీరు గేయము తెలుపుచున్నది, ఉన్నత ఆస్తిక సమాజములన్నియు హరినామమునఁ గూర్పఁబడినవి. బాబా తన గురువు 'కబీరు'-అని యొకపరి తెలిపినాఁడు. హరినామము- అల్లానామముఁ దానుస్మరింపఁగ- స్మరింపగ తనయురమున నిలుపుకొనిన విష్ణుసహస్రనామములనుండి శ్రీహరి తనహృదయములోనికి దిగివచ్చినటుల ఆపిదప దన హృద్రోగము శమించినటుల బాబా తెలిపినాఁడు. [S.C.S. 198] కాకాదీక్షితుతో 'నేను హరి–హరి–హరి-యని స్మరించినాఁడను, హరి ప్రత్యక్షమైనాఁడు అప్పటినుండి ఔషధములుఇచ్చుట మానినాఁడను. 'ఉధి'మాత్రమే చేరిన ఆశ్రితులకుఁ బ్రసాదించినాఁడను'. అని, చెప్పినాఁడు. (S.C.S. 195) కావున 'అల్లా'- అనిన, 'హరి' అనిన బాబాకు సమానమే; ఏకమే. బాబాను ఆశ్రయించి అనుసరించు బిడ్డలందఱకు అల్లా-హరి- శబ్దములు- తత్ప్రతిపాదితమగు "తత్త్వము" ఒక్కటే.

॥ జ్యోతిర్జ్ఞాన ప్రదాయనమః

గురుదేవుఁడైన వేంకుశుని వీడ్కొని బాబా శిరిడికిఁ జేరినపిదపనైన వేషమున ననుసరించి ముస్లింఫకీరువలె కనఁబడినను ఆతండి యంతయు ముస్లిం హైందవసాధు తత్త్వముల కలయిక పరిపూర్ణత నొందియే యున్నది. కావుననే హైందవసాధువులు దేవదాస్, జానకిదాస్ మొదలగువారు బాబాను సమాదరించి గౌరవించినారు. బాబా ఆధ్యాత్మిక జ్ఞాననిష్ఠ అద్భుతయోగసిద్ధులు శక్తులు వేనవేల ఆశ్రితుల నాకర్షించినవి. పూనా, షిగాఁవ్ మొదలగు ప్రదేశములనున్న సాధుసత్పురుషుల యోగుల ప్రశంసలకు బాబా పాత్రమైనాఁడు. మాధవనాథ్ మహారాజు, షెగాఁవలోని గజానన్ మహారాజు దత్తమహారాజు మొదలగు హైందవయోగులు తమ ఆశ్రితులను బాబా దగ్గఱకు పంపినారు. అక్కల్‌కోట మహారాజు నిర్యాణసమయమున తన ఆశ్రితులను శిరిడికి వెళ్లుఁడని ఆదేశించినాఁడు. [S.C.S. 84] ఈ విషయముల ననుసరించి హైందవయోగులందఱు బాబాను విగ్రహారాధన విరోధులు, విగ్రహ ధ్వంసకులగు ముస్లిములకు జెందినవానిగ పాటించలేదని మనకుఁ దెలియుచున్నది.

చాంద్‌భాయి పటేల్‌తోడ బాబా శిరిడికిఁ జేరినతోడనే ఆతండ్రి ఖండోబా దేవాలయ మందుండఁదలఁచి ప్రవేశింపఁ బోవుచుండఁగా బాబా నొక ముస్లింఫకీరని భ్రమపడి మహాల్సాపతి ఆటంకపఱచినాఁడు. అటుపైని వేషము ఒకవిధముగ మేలేఅయినది. ఆహేతువున బాబా నింబవృక్షముక్రింద మసీదునందు నుండుట సంభవించినది. ఇట్టి విధానములన్నియు శ్రీ సాయీ అవతారకారణమైన హైందవముస్లిముల కలయికకు దోహదముఁ గల్పించినవి. బాబాను సమాశ్రయించిన వందలు వేలకొలఁది ఆశ్రితుల భక్తుల అనుభవముల ననుసరించి, ఆతండ్రి వేషభాషలఁగని ముస్లింఫకీరని పలువురు తలంచినను, బాబాను తమ గురుదైవముగ సేవించి పూజించి, ధ్యానిం

* వృందావనయని వాళ్లి సేవకు

చుటకా పై తొడవులు ప్రతిబంధకములు కాలేదు. తొలుదొలుత తనను పూజింపవచ్చిన హైందవులను బాబా కఠినముగ వారించినను వారి భక్తిప్రేమలకు తుదకు లొంగక తప్పినదికాదు. మసీదునందా విధముగ హైందవులచే పూజింపఁబడుట— దానికి బాబా సమ్మతించుట అనన్య సామాన్యమైన పనియె యగును. బాబా అవతార విశిష్టతకు సంబంధించినవని సగముమాత్రమే పూర్తియైనది. తక్కిన సగము. ముస్లిములును బాబాను తమ గురువుగా దైవసంబంధీయునిఁగ భావింపఁజేయుటలో కలదు, ఇందు బాబా ఎంతవరకు కృతకృత్యుఁడైనది తెలిసికొందము.

ఈపని నిర్వహించుటయందును దైవనియోగము బాబాకుఁ దోడ్పడినది. సర్వేశ్వరునందు లయస్థితిబొంది బాబా సర్వభూతాత్మభూతాత్మయగుటచే త్రికాలముల సర్వత్ర జరుగుసకలము నెఱుఁగఁజాలు ఋతంభరప్రజ్ఞ- ప్రతిభ- బాబాను హైందవులుగాని ముస్లిములుగాని గురుదైవముగ పరిగణించునటులఁజేయుటకు మిక్కిలిగఁ దోడ్పడినది. సర్వసాధారణముఁగ బాబాను ఆశ్రయించిన అసంఖ్యాకులగు హైందవభక్తులు ఆతండొక ముస్లింఫకీరు అని తలంచినను తమతమ గురుదైవముగ విశ్వసించి మసీదునందు సేవించినారు. అట్టివ్యక్తిని ముస్లిము లేదృష్టితోఁ జూచినారు?- అనుప్రశ్న కలుగవచ్చును. నిరంతరము దైవసేవ— సర్వమానవసేవలో జీవితము అంకితముఁజేసి, సకల యోగసిద్ధులుగల 'అవాలియా'- అనియె ముస్లిములు బాబాను భావించి సేవించిరి, అతఁడు ముస్లింగానీ, హైందవుఁడుకానీ, జనులు వారికష్టసమయములందు సహాయము- చేయూఁత కొనురుజూతురు.

సకలయోగసిద్ధి ప్రపూర్ణుఁడైన యీ 'అవాలియా' ముస్లిములకు లౌకికముగ— పారలౌకికముగఁ దోడ్పడినాఁడు. బాబా తన ఆశ్రితులకందఱకు తిండి-గుడ్డ—ధనము వెదజల్లినాఁడు. ప్రతివ్యక్తికిని

అంతరాత్మ తానేయని- హృదయాసీనుఁడై సకలమానవుల- భూత ములనియమింపఁజాలు తన అద్భుతశక్తిని ప్రదర్శించినాఁడు. అట్టి అద్భుతశక్తి సమర్థతలుగల వ్యక్తిని ముస్లిములును సమాదరించి గౌర వింతురు. కాని, మసీదునందు విగ్రహములనుంచుట- విగ్రహారాధకు లను చేరదీయుట- వారిపూజలను స్వీకరించుట- ఇత్యాది సాంకర్యభావ ములుగల (వారిదృష్టికి) నైష్ఠికదూరుఁడగు 'అవాలియా'- విషయమున ముస్లిములెట్టిభావముగలిగి సేవించినారు? అనవచ్చును. సాధారణముగ ముస్లిములు ఇట్టి విరుద్ధాచరణములకు సమ్మతింపరు. కాని, బాబా వీని నన్నిటికి ప్రోత్సహించినాఁడు. గోకులాష్టమి- శ్రీరామనవమి మొద లగు ఉత్సవములను మేళతాళములతో మసీదునందు జరుపనిచ్చి నాఁడు. శ్రీరామనవమి ఉత్సవముతోబాటు ముస్లిములుజరుపు మంచి గంధపుటూరేగింపుగూడ మసీదునందు సాగినది. ఈ మంచిగంధపు టూరేగింపు 'అమీర్ షక్కర్ దలాల్'- 'కోరాహా'లోని మహ దీయభక్తుఁడు శిరిడియందు ప్రారంభించినాఁడు. ఇది గొప్ప ముస్లి సాధువుల గౌరవార్థముగ సాగింపఁబడిన ఉత్సవము [ఈవిషయము ద్వారకామాయిలీలలోఁ దెలుపఁబడినది. చూడుడు.] జెండాల ఊరే గింపు మంచిగంధపుటూరేగింపునందు హైందవులు ముస్లిములు పాల్గొ నువారు. నేటికిని ఈకార్యకలాపములు శ్రీరామనవమినాఁడే జరుపఁ బడుచున్నవి. ఈ ఊరేగింపులే హైందవులను ముస్లిముల నొకేవిధమున బాబా పాదములచెంతకేఁ జేర్పఁజాలినది అని విస్పష్టము గావించు నిదర్శనము.

నైష్ఠికుఁడైన హైందవుఁడుగాని, ముస్లింగాని యిట్టివిధానముల సమ్మతింపఁడు. కాని, బాబా ఆతా యిరుతెగల నైష్ఠికులనుగూడ సమాధానపఱచినాఁడు. ఉపాసనీశాస్త్రి- మేఘుఁడు, మూలేశాస్త్రి దక్షిణాభిక్షుఁ మొదలగువారి వృత్తాంతములను గమనింపుడు!

బాబా యిట్టి నైష్ఠిక హైందవుల ప్రతిబంధములఁ దొలగించి, మసీదు నందే వారు కావించు హైందవసాంప్రదాయసేవలను స్వీకరించినాఁడు. బాబా తానున్న మసీదును "బ్రాహ్మణమసీదు"- అనినాఁడు. దానికి 'ద్వారకామాయి'- ఎల్లరుప్రవేశించుటకు వీలగునటుల తెఱువఁబడిన ద్వారములుకలది- అని, పేరుపెట్టినాఁడు. శ్రీ రామకృష్ణపరమహంస మొదలగు మహాయోగిపుంగవులు 'మతము'- 'దైవము'- అనువిషయములగావించిన ప్రబోధలు సర్వవ్యాప్తములగుటచే బొంబాయిరాష్ట్రమున విద్యాధికులు- అసంఖ్యాకులగు హైందవులు ముస్లింఫకీరని తలంచినను బాబాను ఆశ్రయించి సేవించుటకు వెనుకాడినవారుకారు, కాని, యిట్టిసమర్థతలు గలిగినవాఁడైనను హైందవయోగి పుంగవుని ముస్లిములు ఆశ్రయించి సేవించుట మిక్కిలి అరుదు. రాజాబ్ అలీమహమ్మద్ [బొంబాయి] (వివేకానందస్వామిసేవను పరిగణించినవాఁడు) వంటివారు బాబాను సమాదరించి సేవించుటకు వెనుకాడలేదు.

బాబా వెదజల్లుధనము కొఱకు- ఆతండి ప్రదర్శించిన అద్భుత శక్తి సమర్థతలఁ దలంచి, ముస్లిములును బాబాను శ్రమ్మికొనినను ఆధ్యాత్మికసాధనకుఁగాని, పారలౌకిక కాంక్షనుగాని బాబాను ఆశ్రయించిన ముస్లిములులేరనియే చెప్పనగును. స్వామి వివేకానంద అనుయాయియైన రాజబ్ అలీ- ఛోటేఖాన్- మొదలగువారలే కొలఁది మందితప్ప బాబాను ఆశ్రయించిన ముస్లింభక్తులు లేరనియే చెప్పనగును. హైందవభక్తులు చేరుటకుపూర్వము అనగా 1890 నుండి బాబాను విడనాడక సేవించిన అబ్దుల్ [బడేబాబా] వృత్తాంతము ముందుఁ దెలిసికొని, తరువాత ఛోటేఖాన్ మొదలగు వారి విషయములఁ దెలిసికొందము.

♦ శ్లోకశ్చపూర్వం కృశాపశ్య తేనమః

# ఏమీ, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదియొకటవ ప్రకరణము

## 25 అనుగ్రహ లీల.

### అబ్దుల్ - (బడేబాబా)

ఈతఁడు సుల్తాన్ కుమారుఁడు, తపతీనదీతీరమునఁగల 'నాండ్'పురనివాసి. నాందేడునందు 'ఫకీరు- అమిరుద్దిన్' అను సాధువు సేవించుచు . 1889లో అబ్దుల్ శ్రీ సాయిప్రభువును సమాశ్రయించి, తన జీవితమంతయు శిరిడియందుఁ గడపెను. ఆ యుదంతము విచిత్రము. 1889లో శ్రీ సాయిప్రభువు 'ఫకీర్ అమిరుద్దీను'నకు స్వప్నమున గోచరించి, అతనిచేతులందు రెండు మామిడిపండ్లుంచి 'అబ్దుల్‌ను నాదగ్గఱకుఁ బంపుము'- అని నియమించెను. మఱునాఁడా ఫకీర్ తన స్వప్నవృత్తాంతమును అబ్దుల్‌నకుఁ దెలిపి, ఆ రెండు మామిడిపండ్లను అతనికిచ్చి, శిరిడికి వెళ్ళి సాయిబాబాను ఆశ్రయింపుమని ఆజ్ఞాపించెను. అబ్దుల్ తన 20వ ఏట శిరిడికిఁజేరి [1889లో) బాబా దర్శనముఁ జేసికొన- 'మేరా కావలా ఆలా'- "నా కాకి వచ్చినది''- అను పలుకులతో బాబా, అబ్దుల్‌ను ఆదరించెను. "నీకు వేఱుపనులువలదు. నా సేవ నెఱవేర్చుచుండుము!"- అని, బాబా అతని నియమించెను.

### అబ్దుల్ కావించు సేవలు:-

ప్రతిదినము మసీదు- ఆవరణము-వీధులు- బాబా సంచరించు ప్రదేశమంతయు నూడ్చుచుండుట, 'లేండి'వనమున- మసీదున- చావడియందు దీపములు చమురుపోసి వెలిగించుట- 'ధుని' యందు కట్టెలుచేర్చి, దానిని భద్రపఱచుట- సర్వకాల సర్వావస్థల యందు బాబా సేవచేయుట అతనిపని. మసీదునందు బాబా చెంతఁ

గూర్చుండి 'కోరాన్' చదువుచుండువాడు. అప్పుడప్పుడు బాబా కోరాన్ గ్రంథము తెఱచి, ఆ తెఱచిన భాగము నతనిచే చదువుమనువాడు. తెఱచుగ కోరాన్‌లోని భాగములను బాబా పలుకువాడు. శ్రీసాయీ ప్రభువునోటనుండి వెలువడు ప్రేమామృతవాక్యములన్నియు అబ్దుల్ వేఱే ప్రత్యేకముగ నొకపుస్తకమున మరాఠీలిపిలో గ్రథితముచేయుచుండువాడు. బాబా పలుకులందు అబ్దుల్‌నకు ప్రగాఢవిశ్వాసము కలదు. ఆవిధముగ నతడు ప్రతిసత్యము లిఖించిన బాబా పలుకులే యాతనికి ఒక పవిత్రమైన 'కోరాన్' గ్రంథమైనది. ఎల్లవేళల నా అమృతసూక్తులే పారాయణము చేయువాడు. ఎవరేనిభక్తులు చేరి వారివారి నిత్యకార్యక్రమములను గూర్చికాని, భవిష్యద్విషయములను గూర్చికాని, సందేహముల నివారించుకొనుటకు గాని, బడేబాబాను అడిగిన అతడు తాను వ్రాసియుంచిన గ్రంథమును తెఱచువాడు, ఆ తెఱవబడిన పుటయందు పృచ్ఛకునకు కావలసిన సమాధానముండెడిది, ఆ సమాధానము సత్యము—అమోఘమై పృచ్ఛకులకు సంతుష్టిసంతృప్తులు ప్రసాదించుచుండును. ఉదాహరణమున కొకటిరెండు విషయములను పేర్కొందము. సమాధిమందిరమున బావి త్రవ్వీరి. అందునీరు చవ్వగ నుండెను. అప్పటికి బాబా మహాసమాధి పొందియుండెను. అబ్దుల్ బాబా సూక్తుల గ్రంథమును తెఱచి చూచెను. అందు "బావియింకను లోతుగ త్రవ్విన మంచినీరుండును"- అని, సమాధానమతనికి గోచరించెను. ఆవిధముగ నొకగజములోతు త్రవ్వగ మంచినీరు భావియందూరెను. మఱియొక సందర్భమున 'బారిస్టరుగాడ్గిల్' తనకుమారుడు సీమకు వెళ్ళినవాడు తిరిగివచ్చునా? యని ప్రశ్నింప అబ్దుల్ ఆ గ్రంథమును తెఱచిచూచెను. అందు 'బిడ్డ తిరిగివచ్చును'- అని వ్రాయబడియుండెను. ఆవిధముగ గాడ్గిల్ కుమారుడు తిరిగివచ్చెను. శ్రీ సాయీసూక్తులను లిఖించియుంచిన ఆ గొప్పగ్రంథము బడేబాబా కొకపవిత్ర

1 జ్ఞానవిజ్ఞాన నిశ్చయాయ నమః

'ఖోరాన్'వలె నిత్యపారాయణ గ్రంథమైనది. ఆగ్రంథమును పారాయణముచేయుచు, తామరపూసలమాల చేతివ్రేళ్ళతోఁ ద్రిప్పుచు 'అల్లా' నామజపము కావించుట అబ్దుల్ కావించుపని. ఈపనులలో నతఁడు తన్మయతఁ జెందువాఁడు.

[పూజ్యశ్రీ బి.వి. నరసింహస్వామిగారికి అబ్దుల్ (బడేబాబా) తాను గ్రథితముఁజేసిన [illegible] పవిత్రసూక్తులుగల గ్రంథమును 1936 నఁజూపెను. అందు మహారాష్ట్రభాషలో దేవనాగరలిపిలో వ్రాయఁబడినవి పెక్కువిషయములుండెను. S.C.S. 147 నందుఁ దెలుపఁబడిన 'జగత్ సృష్టినిఁ' గూర్చినవివరము- దశావతారములు-మహమ్మద్ ప్రవక్త- మొదలగు అవతారపురుషుల పరంపర- ఇంకను మారుతిస్తోత్రాదులుగలవు. ఆగ్రంథము ననుసరించి శ్రీ సాయిప్రభువునకు- ఆ తండ్రిద్వారా అబ్దుల్ నకు అవతారపురుషులందు- మారుతి మొదలగు దేవతలందు ప్రేమాదర గౌరవములున్నటుల మనకు విదితమగుచున్నది. బడేబాబా ఆగ్రంథమును పారాయణగ్రంథముగ నేకాక, ప్రశ్న గ్రంథముగ భవిష్యత్ జ్ఞానసూచకముగ నుపయోగించువాఁడు.]

## లేండివనము - నంద దీపము :-

*'లేండి'వనమున నందాదీపమెల్లవేళల వెలుఁగుచుండును. పూర్వమొక గుంట [illegible]దుంచఁబడినది. తరువాత నొక స్తంభము ఏర్పాటు చే[illegible]బడెను. ప్రతినిత్యము [illegible] నియమితకాలమున బాబా ఆ స్తంభము ప్రక్కనఁ గూర్చుండువాఁడు. అచట రెండుకడవలనిండుగ అబ్దుల్ [illegible]నించును. ఆ [illegible]మున అబ్దుల్ తప్ప మరెవ్వరచటకుఁ బోరాదు. ఆకడవలలోని నీరమును బాబా ఎల్లదిక్కుల నేమేమియో లుకుచుఁ [illegible]లతో వెదజల్లువాఁడు. అచటనుండి లేచి [illegible] వల

* [illegible]

దిశలకు నడచుచు తనదృష్టిని సారించి తదేకదీక్షతోఁ జూచుచుండు వాఁడు. (ఆయాదిశలగల బిడ్డలను రక్షించుపనియేమో!)

అబ్దుల్‌ను నిద్రతో కాలము వ్యర్థము చేయవలదనియు, చాల తక్కువగ భుజింపుమనియు బాబా బోధించినాఁడు అబ్దుల్ భిక్షించుకొని జీవితముఁగడపినాఁడు. ¹ కౌలందు మోకాళ్ళపై వ్రాలి కొరాన్‌లోని అంశములను ధ్యానించుచు తల - నేలపై నిలిపిన చేతులందు చేర్చి బాబా చెంత వ్రాలియుండువాఁడు. అతఁడు పఠించుదానియందు ధ్యానము నిలుపుమని బాబా తెలుపుటచే నటులఁగావించువాఁడు. ఆవిధముగ నొకరాత్రి మోకాళ్లపై వ్రాలి శిరముముందు చేతులుంచు కొని యుండఁగ "చంద్రుని దర్శించుకొంటివా?" - అని బాబా పలికెను. ఆరాత్రి నిద్రమత్తున గద్దెపైనున్న బాబాపై అబ్దుల్ పడెను. బాబా అతనిపాదములఁదట్టి మేల్కొలిపెను. మఱునాడు మధ్యాహ్నము రెండుగంటలకు అబ్దుల్ దోసిట జలముఁగైకొన నా జలమునందు నిండు చంద్రుని దర్శించెను. కడచినరాత్రి 'చంద్రునిఁ జూడఁదలచుచున్నావా?' - అని బాబాపలికిన మాటలలోని ¹ -పమది - యని యతఁడు గ్రహించెను.

బడేబాబా [అబ్దుల్] శ్రీ సాయీప్రభువును సేవించుటచే నల్లరను సేవించినవాఁడే యయ్యెను. ప్రతినిత్యము బాబా ధరించు దుస్తు లను శిరిడిప్రక్కనఁగల వాగునందు ఉతికి శుభ్రపఱచి, ఆరవేయువాఁడు. మసీదునందు - వెలుపల ఆవరణము - వీధులు - లెండివనము - చావడి వీనినంతట నూడ్చి శుభ్రపఱచుచు చెత్తచెదారము నెత్తివేయు ~ఁడు. బాబా అతనిని "హాలల్‌కూర్" (పాకీవాఁడు) అనియు నా 'మిరియంబి' - యనియుఁ బిలుచుచుండువాఁడు. 'రాధాకృష్ణఆయి' యను ఆమె శిరిడికిఁజేరినది మొదట కొన్ని సంవత్సరములవఱకు వీధులఱ

శుభ్రపరచుచుండెడిది. వీరిరువురకు తరువాత గ్రామజనులును తోడ్పడినారు.

ధాత్పృష్ణఆయి- బాబా-లు సిద్ధిపొందినపిదప అబ్దుల్ కొన్ని సంవత్సరములు ధాత్పృష్ణఆయి యున్న మట్టిగోడలయింట నివసించి కాలముగడపినాడు. ఒకనాడా యింటిగోడలన్నియు నేకకాలమున కూలెను, అబ్దుల్ పైన ఆగోడలుకూలిన నతనికి ప్రాణాపాయము కలుగనీయక బాబా రక్షించినాడు. తరువాత దీక్షిత్ వాడయందున్న సమాధిమందిరమున అబ్దుల్ నివసించెను. తొలుత నాందేడునందు అబ్దుల్ సేవగావించిన ఆఫకీరు శిరిడికి వెళ్ళి అబ్దుల్ ను మరల తన దగ్గఱకు రావలసినదిగా కోరెను. బాబా అనుమతినిచ్చిన వచ్చెదన నియు అబ్దుల్ పలికెను. సాయీప్రభువు- అబ్దుల్ వెళ్లుటకు అను మతినీయని కారణమున ఆఫకీరు తిరిగివెళ్ళెను. బాబా తలచుగ అబ్దుల్ ను, సాహెబ్ లోగను తిట్టువాడు, కొట్టువాడు. అబ్దుల్ కు కావ్యరూపమున ఆశీస్సులను ప్రసాదించువాడు.

1. "తేరేకుధరియాకు పార్ ఉతర్ దియా"
   (నిన్ను సముద్రముల దాటఁజేసితిని.)
2. 'తేరా మట్టి సున్నా బనాదియా"
   [నీమట్టి (భౌతికతనువు) బంగారమైనది.]
3. "క్యా... మహల్ బంధియా"
   [ఎట్టి మహోన్నత భవనము!]

ఇట్టుల పలువిధముల బాబా ఆశీస్సులకు అబ్దుల్ పాత్రుఁడై బాబా అనుగ్రహమున బడేబాబాకు కొన్ని యద్భుతశక్తులు కవి. అబ్దుల్ తనను చేరిన ఆశ్రితులను దీవించి శుభములఁ ప్రసా

* అబ్దులాది పరాగతయే నమః

డించినాఁడు. 1954 ఏప్రియల్ వరకు అబ్దుల్ శ్రీ సాయీప్రభు సమాధి మందిరమున సేవలు కావించుచు సిద్ధినొందినాఁడు. శ్రీసాయీరాముని హనుమంతునివలె సేవఁగావించిన అబ్దుల్ [బడేబాబా] నకు వందన శతముల సమర్పించుదము. శ్రీ సాయీనాథుఁడు అబ్దుల్ – బడే బాబాను అనుగ్రహించినవిధమునే మనల ననుగ్రహించుగాతమని బాబాకు వందనసహస్రముల సమర్పించుదము.

॥ జ్ఞానశక్తి సమారూఢాయనమః ॥

ఓమ్ శ్రీ సాయీశరణ్!

కృతులఁగాఁ గాఘవ గౌరవంపు తలఁపున్ గిలింపకే, స్వార్థ మే
గతిలిన్ జేరఁగనీక, ప్రేమఁ బలువంగాఁజూడుమీ! శ్రీవసం
తతి; 'నబ్దుల్' చరితంబు నేమఱకు స్వాంతంబందు; నీప్రాపునై
కృతకృత్యుఁ గావరింతు; నమ్మమిది; ఏమీ, నిన్ను పేర్కొంతునా?

---

# బాబా, నిన్ను పరీక్షింతునా ?

## ముప్పదిరెండవ ప్రకరణము

## 26 అనుగ్రహ లీల.

## ఇమాంభాయి ఛోటేఖాన్

సద్విషయము :-

'చతుర్విధా భజంతేమాం జనాస్సుకృతినోఽర్జున
ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ'

[భగవద్గీత 7-16]

కష్టములందున్నవారు, సత్యము నెఱుఁగఁగోరువారు, ఐహిక కామితములఁ గోరువారు - జ్ఞానులు. అను పలువిధముల జనులు నన్ను భజింతురు. అని, భగవానుఁడు గీతలందుఁ దెలిపినాఁడు. ఏకారణమును పురస్కరించుకొనియైనను భగవంతుని సేవించువారు 'ఉదారాస్సర్వఏవ'- వీరందఱు ఒప్పిదమైనవారలే యనియుఁ దెలిపినాఁడు. అదేవిధముగ శ్రీసాయీనాథుఁడు నొకసమయమునఁ దెలిపినాఁడు.

ధనము- ఉద్యోగము- సంతానము- మొదలగు కోరికలతో [illegible]ను శ్రమ్ముకొనిన భిక్షలనొకఁడు వారించుచుండ, బాబా ఆతని అతనినటులఁ జేయవలదని మందలించి, యీవిధముగఁ దెలిపినాఁడు. 'నాభిక్షలు నాదగ్గఱకు ఆర్తికామితములకొఱకే వత్తురు. వారి హృదయముల కంతృప్తిపఱచుకొని, జీవితముల సుఖశాంతులఁబడసి, నన్ను ప్రేమించి ఆధ్యాత్మికముగ పురోవృద్ధిఁగాంతురు దూరదూరములందున్న వారలు ఏదోఒకకారణము పురస్కరించుకొని నన్ను చేరునటుల నేనే సం

• అనాదిపత్యశ బ్రహ్మణేనమః

ఘటనలఁ గూర్చునది. వారంతటవారు నన్ను తెలిసికొని రాఁజాలరు. పిట్టలకాళ్లకు త్రాళ్ళనుగట్టి దఱికి లాగుకొను పిల్లలవలె వేలకొలఁది మైళ్ల దూరముననున్న నాబిడ్డలను నేనే ఆకర్షింతును'. అని బాబా తెలిపినాఁడు. [S C.S. 56]

కావున బాబాను ఆశ్రయించినవారిలో నూటికి తొంబదితొమ్మిదిమంది హైందవులుగాని - ముస్లిములుగాని, తదితర మతానుయాయులుగాని, కేవలము ఐహిక కామితములకొఱకే - కష్టనివృత్తి - అభీష్టావాప్తికొఱకే బాబాను సమాశ్రయించినటుల మనకు విదితమగుచున్నది. అది లోపముకాదు. బిడ్డలు తాముకోరునవి తండ్రినిఁ బ్రార్థించుట తప్పుకాదు. కాని, బిడ్డలు ప్రార్థించు వాని నన్నిటిని తండ్రియిచ్చునా? ఈయఁడు. ఆబిడ్డకు ఏదిహితమో శ్రేయస్కరమో దానినే యిచ్చును, తన మేలేదో బిడ్డ తెలుసుకొనలేఁడు, తండ్రి యెఱుఁగును. ఆవిధముగ బాబాను మనము ఏకామితములకైనను ప్రార్థించుట తప్పుకాదు, మనము కోరినవాని నన్నిటిని బాబా అనుగ్రహించలేదని - ఆతండ్రికి ఇష్టములేదనికాని, సమర్థతలేదనికాని, భావించరాదు. మనకు శ్రేయస్కరము హితకరమేదో దానిని బాబా ప్రసాదించి తీరును. లోగడఁ దెలుపఁబడినవి - యిఁకముందుఁ దెలుపబడు భక్తుల విషయములను మనమాదృష్టితో గ్రహించుచుండవలెను.

## ఇమాంభాయ్ ఛోటేఖాను

ఇతఁడు ఔరంగబాదు జిల్లాలోని 'వాజపూరు' నివాసి. 1910లో దర్వేశ్ షా ప్రేరణమున నితఁడు శ్రీ సాయీప్రభువును సందర్శించెను. ఆ ఫకీరు ఖాన్ - అనుసరింపఁదగిన విధానముఁ దెలిపెను. ఛోటేఖాను శిరిడికిఁ జేర బాబా ఒకవీథిలో నిలిచియుండెను ఒక భక్తురాలు బాబా మ్రోల ప్రణమిల్లుచుండెను. ఆఫకీరు నిర్దేశించిన విధమున ఆతఁడు

బాబా వెనుక నిలఁబడి 'ఖొరాన్'లోని ప్రథమాధ్యాయమును [బిస్మిల్లాతో ప్రారంభమైన సూక్తము] పఠింపఁ బ్రారంభింపగా వెంటనే బాబా వెనుకకు దిరిగి 'ఎవఁడు వీఁడు? నా అబ్బవైనటుల ఏమో అడుగుట కేల వచ్చితివి'?— అని ఆగ్రహావేశమునఁబలికెను. ఆతనిఁ దూలనాడెను. వెంటనే మసీదుఁజేరి ఛోటేఖానునకు బోధపడని విధమున నిందించెను. బాబా అనుమతి లేనిదే మసీదులోనికి అడుగుపెట్టఁజాలక ఆతఁడు వెలుపల ముంగిటఁ గూర్చుండెను. రెండురోజుల తరువాత ఆతనికి అనుమతి యీయఁబడెను.

కాకాదీక్షిత్ ఛోటేఖానునిఁ జూపుచు 'బాబా! యీ బిడ్డలు మీవారు. వారియెడల కోపమేల?' అని పలికెను. "ఆతఁడు 'బిడ్డ' అని పిలువఁబడునా? ఆ ఉపాధ్యాయుని చావమోదినాఁడు"— అని, బాబా సమాధానమిచ్చెను. [ఇది యిటీవల జరిగిన దుష్కార్యమునకు [illegible] ఛోటేఖాన్ నైజాము రాష్ట్రమున మాహుర్ దాలుక చేరిలో సిపాయి. పోలీసులకు ఒక నేరము విచారణయందు తోడ్పడుచు సరియగు సమ [illegible] లేదని ఒక క్రైస్తవ ఉపాధ్యాయుని ఆతఁడు బాదఁగొట్టెను. ఆ ఉపాధ్యాయుఁడు నోట నెత్తురు క్రక్కి మూర్ఛపోయెను. మాహుర్ దాలు ఖానును ఉద్యోగము విడిచిపెట్టి ఆ రాష్ట్రమునుండి వెడలిపొమ్మని సలహాయిచ్చెను. అందుచే తన సిపాయి ఉద్యోగమునకు రాజీనామాయిచ్చి నైజాము రాష్ట్రమువదలి వచ్చినాఁడు. కాని, ఆతనిపై నేరమారోపించి శిక్ష విధింతురను భయము ఆతనికిఁ గలదు. బాబాను ఆశ్రయించుటకు ఇదియొక కారణము.] ఆదినమున బాబా ఆతని తన దాపునకు వచ్చుటకనుమతి నీయలేదు.

కొంతమూఁడుదినములు గడచినతరువాత కాశీంభాయి [బడేబాబా కుమారుఁడు] జోగ్-దీక్షిత్—ముగ్గురు ఛోటేఖానును వెంటఁ

* జ్ఞాన నిష్ఠాత్మకాయ నమః

పెట్టుకొని మసీదుకేగెను. అప్పుడు బాబా తనను సందర్శించుకొనుటకు ఛోటేఖానునకు అనుమతినిచ్చెను. ఆతఁడు బాబా పాదములకు మ్రొక్కఁగా 'భయము వలదు, అల్లామాలిక్! నీకు శిక్ష భయము వలదు'- అని బాబా అభయమిచ్చెను. అతఁడు దాదాపు రెండు నెలలకాలము శిరిడియందుండెను ఒక దినమున 'నీవు సురక్షితముగఁ దిరిగి వెళ్ళుము. నీ భూముల సంబంధమైన తగాదాలు సామ్యముగ పరిష్కారమగును'. అని బాబా పలికెను. అతనికి అతనిమేనత్త- (అత్త)కు గల భూముల సంబంధమైన తగాదాలు కలవు- బాబా అనుగ్రహమున అతని కనుకూలముగ పరిష్కారమై భూములతనికి స్వాధీనములయ్యెను. ఈ విషయమును బాబాకు తెలుపుకొనుటకై యతఁడు వచ్చిన కారణము మఱియొకటి.

అతఁడు రెండవమాఱు శిరిడీకి వెళ్ళినప్పుడు బాబా దగ్గర 'మహల్సాపతి'-'మూసీ'- యుండిరి. బాబా 'మూసీ' వంక చూచి' మనుష్యులు నామాటవినరు- దుర్మార్గులు—వెళ్ళి బాధలపడుదురు, కంటకము [ముల్లు] బాధచే పితరులు మరణింతురు (మొదటిసారి తిరిగి వెళ్ళునప్పుడు బాబా సెలవు [ఉధీప్రసాదము] తీసికొనకయే ఛోటేఖాను వెళ్లెను. ఆతఁడింటికి జేరిన రెండురోజులకు తల్లికాలులో ముల్లు గ్రుచ్చుకొని వాపుచే ఆమె మరణించెను. తల్లి మృతినొందిన నాల్గవ నాఁడు బాబాను సందర్శించి తన తల్లి శ్రాద్ధకర్మములకు ధనసహాయము పొందు తలంపుతో మఱల శిరిడీకిఁ జేరినాఁడు.] ఛోటేఖాన్ నెల దినములు శిరిడీయందుండెను. ఒకనాఁడు 'ఉధీ తీసికొని వచ్చినవాఁడు వెళ్ళవలయును' అని బాబా పలికినాఁడు. బాబా ఒకనిఁ జూచి మఱియొకనితో అన్యాపదేశముగ చెప్పుట ఆచారముకావున తాను వెళ్లుటకు బాబా అనుజ్ఞ నిచ్చుచున్నాఁడని 'ఖాన్' తలంచెను. కాని, ఆమాటలు అతని నుద్దేశించినవికావు. మఱునాఁడు ఛోటేఖాన్ బాబాను జేర

♦ అప్రమేయ గుణాకరాయ నమః

చేతిసంజ్ఞచేసి ఊది ప్రసాదించుచు "నీయింటి గుమ్మము ముందు నొక అవ్వ నిలిచియుండును ఆమె నీకు కొంతధనమిచ్చును. దానితో నీవు జరుపవలసిన నీతల్లి కర్మముల నిర్వర్తింపుము. ఆశీస్సులు చేరిరి. అందఱకు విందు నేర్పాటుచేయుము'- అని, బాబా పలికెను. ఇదియంతయు బాబా అంతర్జ్ఞానము - ఖాన్ ఆమాటలలోని భావము గ్రహింపలేదు.

ఛోటేఖాన్ ఇంటికి చేరగ నలుబదియవనాటి తల్లి శ్రాద్ధమునకు ధనమిచ్చుటకై ఒక ముసలికాంత (కాజీభార్య వితంతువు) వాకిట నిలిచియుండెను. ఆతనియందుగల స్నేహభావమున ఆమె ఏబది రూపాయలు ఖానునకిచ్చినది. అంతకుముందే నలుగురు అక్క చెల్లెండ్రు- వారిభర్తలు వచ్చియుండిరి. బాబా తెలిపిన అతిథులు వీరే. ఈవిధముగ తనపై ఆధారపడియున్న బిడ్డలకు బాబా కావించు సాయము తిల్లుండును. మఱియొకమారు ఖాన్ శిరిడికి వెళ్ళినపుడు 'గులాబ్ మీయింటికి వచ్చినాడు' అని బాబా పలికెను అతడు తిరిగి యింటికి వెళ్లగా కుమారుడు జనించెను. అతడే బాబా తెలిపిన 'గులాబ్' అని ఆబిడ్డకు 'గులాబ్'- అనుపేరు పెట్టుకొనెను.

మఱియొకమారు ఛోటేఖాన్ శిరిడికి వెళ్ళినపుడు తిరిగివెళ్ళుటకు బాబా అనుమతినీయలేదు. కాని విసుగొంది ఖాన్ ప్రయాణమయ్యెను. బాబా అనుమతినీయక- 'జనులు వెళ్లరాదు. వెళ్లిన తుపాకులు- అగ్నిపీడలు- కష్టములు'-అనెను. బాబా సర్వసాధారణముగ చెప్పుచుండు మాటలేకాని, తనకు సంబంధించినవికావని ఖాన్ బయలు దేరెను. అతడు 12 మైళ్ళ దూరమునగల 'వారి' అను నది దగ్గఱకు సాయంత్రము 6½ గంటలకు చేరెను. అచట 'సురల' అనుగ్రామము చేర అస్తమానమయ్యెను. ఆ గ్రామపటేల్ వెళ్లవలదని ఆతనిని వారించెను. తన గ్రామమింక 4 మైళ్లు మాత్రము కలదని యాతడు వెళ్ళ

1 అమిత

యుండెను. మూడునాళ్ళు చనినపిదప మబ్బులు క్రమ్మి గాలివాన ఉరుములు మెరుపులతో వీచెను. ఆతనిముందొక పెద్దవృక్షముపై పిడుగుపడి ఆవృక్షము రెండుముక్కలై కాలెను. ఆతనిదృష్టి చెదరెను. అతఁడు ముఖము వెనుకకుద్రిప్పెను. అతని వెనుక బాబా రెండు కపిలవర్ణముగల కుక్కలతో నిలఁబడియుండెను. ఖాన్ బాబాకు ప్రణమిల్లెను. బాబా అదృశ్యుఁడయ్యెను. అంత ఛోటేఖాన్ తన గ్రామము దగ్గఱకుజేరగా పెద్దవాగు దాటవలయును. లోతుతెలియక దానిని దాటెను. ఆవలిగట్టుఁజేరి వెనుకకు దిరిగిచూడ ఆవాగు గట్లను దాటి ప్రవాహము పొరలిపోవుచుండెను. దానెట్లు దాటఁగలిగెనో యని ఆతఁడాశ్చర్యపడెను. అది 20 అడుగుల లోతుండెను. బాబా ముందుగ అతనికిఁ దెలిపినవన్నియు సత్యములయ్యెను. అతెండ్రియే వెంటనుండి ఆతనిని సురక్షితముగ ఇంటికిఁ జేర్చినాఁడు.

(గమనిక :- 1918లో బాబా మహాసమాధికిముందు ఆతండ్రి కావించిన ఏర్పాటులు— అందు ఛోటేఖాన్ పాల్గొనిన విషయములన్నియు నిందు 'చరమలీల'లోఁ దెలుపఁబడినవిగ పాఠకులు గ్రహింపఁ బ్రార్థితులు-)

1936న 'గులాబ్' వివాహముచేయుటకై ఛోటేఖాన్ శిరిడికి వెళ్ళి మసీదునందు నిద్రించెను. ఆతని స్వప్నమున బాబా దర్శనమిచ్చి అనుగ్రహించి 'పూనాకువెళ్ళుము- నీకోర్కె సిద్ధించును'— అని తెలిపెను. అతడు పూనాకువెళ్ళెను. అచట 'లాడ్కర్' అనునతఁడు మలలవ్యాధిచే బాధపడుచుండెను. ఖానునకా విషయమతనికు తెలుపఁ తనకు బాబా తెలిపిన చికిత్సవలన నివారింతునని ఆమందు సిద్ధపఱచియిచ్చెను. లాడ్కర్ మలలబాధ తగ్గెను. పూనాలో గుఱ్ఱపు పందెములందు లాడ్కర్ పాల్గొని రు 1100 లు గెలిచెను. అందు 700 రూపాయలు ఛోటేఖానునకిచ్చెను. దానితో ఖాన్ తనకుమార్తె గులాబ్ యొక్క వివాహము నెరవేర్చెను.

## బాబా అంతర్ జ్ఞానముఁదెలుపు మఱికొందఱు ముస్లిం భక్తులు

### (a) రిసాల్దార్ - [రౌతు] - నూరుద్దీన్ :-

ఒకదినమున నితడు శిరిడీకివెళ్ళి బాబా దర్శనముఁ జేసికొని తిరిగి వెళ్ళఁగోరెను. బాబా సెలవీయలేదు. అతని పటాలము వెంట వెళ్ళవలసియుండెను. బాబా అతనికి 'ఊధి' ప్రసాదించుచు 'గుంట త్రవ్వి ఊధి భక్షింపుము' అనెను. అతఁడు ఊధి స్వీకరించి వెడలి పోయెను. కోపర్గాం దగ్గర శవమొకటి మోసికొనిరాబడు దృశ్యముఁగనెను, తరువాత స్వస్థానమునకుఁ జేరినాఁడు, అట్టి శవదృశ్యమతనికి గోచరించినదినమున మృష్టాన్నభోజనము ఆనందము కలుగుట, ఆదృశ్యము గోచరింపనినాఁడు ఎంత ప్రయత్నించినను తిండిదొరకనిస్థితి కలిగెను. దానితో నతఁడు క్రుంగిపోయెను. అంతట విసుగునొంది తన ఉద్యోగమును విడిచిపెట్టి, యది యంతయు బాబా మూలమున కలిగినదని తలంచి శిరిడీకి వెళ్ళెను. ఆరు నెలలట నివసించెను. ఆ శాపమంతటఁ దొలఁగిపోయెను. బాబా అనుమతిపొంది తిరిగివెళ్ళెను, 'దిమోలాలి'లో కాఫీ విత్తులు, తేయాకు, అంగడిపెట్టి సుఖసంపదల గడించెను.

### [b] అబ్దుల్ ఖాదర్ :-

ఇతఁడు 1915లో బాబాను సందర్శించెను. తాకియా [మహమ్మదీయుల వసతిగృహము]లో నుంచ . బాబా ఆదారినఁ బోవుచుండ మ్రొక్కి 'నేను సాధువును కాదలంచితిని. ఫకీరీ (విరక్తి) ప్రసాదింపు'మని బాబాను కోరెను, బాబా అతనియెదుట నిలఁబడి పిడికిలిఁ బట్టి చేతినిఁజాచి యతనిపై యేదో విసరినటుల విసరెను. విసరఁబడిన

వస్తువేదియుఁ గనఁబడలేదు. అపిడప ఖాదర్ పలుకులు- ప్రవర్తనము మారెను. ఏవేవియో నైతికధర్మములు పలుకుచు బాబా విధమున ప్రవర్తించెను. కొన్ని వేళల రాత్రిఁ జేతఁబట్టి యితరులఁ గొట్టఁబోవు చుండెను. కొన్ని సమయముల అనువుపడరాని విధమున వర్తించెను. ఇటుల 45 దినములు జరిగెను. అతఁడొక పిచ్చిఫకీరయ్యెను. ఖాదర్ బంధువులతనిస్థితినిఁగని విసుగొందిరి. బాబా యదియంతయు గమనించి యొకనాడు- మసీదు మంటపము దగ్గఱ నిలఁబడి, చేతి పిడికిలిబట్టిసాచి, ఖాదర్ నుండి ఏదో ఒకవస్తువును తనదఱికి లాగికొనువిధమున 'లావ్ బలే ఇధర్'-అనెను. అంతట ఖాదర్ తన ఎప్పటి మానసికస్థితినిఁ బొందెను. 15 దినములు శిరిడియందుండి, బాబా అనుజ్ఞఁబడసి, 'కిర్కి' అను పురమునకు వెళ్ళి బీడీ వర్తకము జరుపుకొనుచు బాగుపడెను.

## [c] షేక్ అబ్దుల్లా :-

ఇతఁడు విజపూర్ (ఛోటేఖాన్ గ్రామము) నివాసి. ఈతఁడు బాబాను సందర్శించినపుడు బాబా యితనికి వైరాగ్యముఁగూర్చి, 'నీవు ఈదినము మృతినొందిన మూఁడవనాటి కర్మ ప్రారంభమగును. అంతటజనులు విన్నమఱతురు. ఈగృహము సంపదలు మొదలగువాని వలన ప్రయోజనమేమి?' అని, బోధించెను. అబ్దుల్లాకు భార్య-కుమారుఁడు కలరు, అతఁడు విరాగియై తనగృహమును ఆస్తిని వారికి విడిచి పెట్టి యందందు సంచరించెను. ఎవరేని దయదలఁచి తినఁబెట్టిన భుజించును. లేకున్న ఉపవసించును. వీథులందు గ్రుమ్మరుచు రాత్రులందు స్మశానముల- గోరీల-దగ్గఱ నేమేమో పలుకుచుఁ గడపును. ఇటుల 10, 12 సంవత్సరములుగడపి గతించెను. అతనికి అద్భుతశక్తులు గలిగి నట్లు ఛోటేఖాన్ తెలిపినాఁడు.

అబ్బాస్ సేట్ అను బీడీవర్తకుఁడు- 'భార్యను బిడ్డను విడిచి పిచ్చివానివలె నీవేల తిరుగుచున్నావు?' అని, అబ్దుల్లాను ఒకనాడు

ప్రశ్నించెను. 'నీవే తెలిసికొందువు' అని, అబ్దుల్లాపలికి చేతి పిడికిలి పట్టి యేమో వినరానట్టుల వినుచు 'నీవు నాపతె యగుదువు' అని పలికెను. అది మొదలు అబ్బాస్ సేఠ్ పిండివ్యాపారమును గృహమును బంధువులను విడిచిపెట్టి సంచరించెనని 'ఖాకా' చెప్పినాడు.

## [d] వార్హాడ్ - (భోపాల్) నివాసి - అన్వర్‌ఖాన్:

ఇతడు బాబాను సమాశ్రయించి 'నాకు సంతానము కలుగు'- అని ప్రార్థించెను. శిరిడిలో చావడియందు 12 దినములుండెను. బాబా అతనికి మంత్రము తెలిపెను. [బిస్మిల్లాహలియా హియామా పాక్ షిఫోనో సబుడోమా బుదావా] అది ఖొరాన్‌లోని మొదటి అధ్యాయములోనిది. 101 మాఱులు పడిచేయుని వల్లించి, తరువాత 'దా ఫాతే' స్మరింపుమని తెలిపి, 'పేడా' ప్రసాదించినాడు. బాగ్దాహునకు పామ్రాని బాబా అనుగ్రహించెను. అన్వర్ ఖాన్ బొంబాయి చేరెను. బొంబాయిలోని హాజీకాశిం అతనికి అరేబియా వెళ్ళుటకు అధికార పత్రము [టిక్కెట్టు] ఉచితముగ నిచ్చెను, అతడు అరేబియాకు-[మక్కా] వెళ్ళి తిరిగివచ్చెను. ముస్లిములకు 5 విధులలో, మక్కా క్షేత్రము సందర్శించుట ఒక విధియైయున్నది.

## ఇస్లాం మతమున ముఖ్యవిధులు:-

1. కలామి (విశ్వాసము) ప్రకటించుట- అల్లాతప్ప వేఱుదైవము లేదు, మహమ్మద్ ప్రవక్త.
2. పాంచ్ నమాజ్. ఉదయము; 10గం; 12గం; సాయంత్రము 5గం; రాత్రి; 5సార్లు.
3. రంజాన్ 40 దినములు. ఇతర ముఖ్యదినముల ఉపవాసము.
4. అన్నదానము.
5. హాజీ- [మక్కా తీర్థయాత్ర.]

### (e) మహమ్మద్ ఖా:-

ఇతఁడు 'సెవాస్' అను పురమునకుఁ జెందిన రోహిల్లా. శ్రీసాయీ బాబాను సందర్శింప శిరిడికిఁ జేరి కొన్ని దినములుండెను. ఒకనాటిరాత్రి మహల్సాపతితో మాట్లాడువా రెవరోయని అడ్డముగనున్న తెరయెత్తి చూచెను. బాబా ఆచటనున్నను ఆతనికిఁ గానరాలేదు. దానితో ఆతనిమతి చెడెను. ఆతని తమ్ముఁడు అన్నను (మహమ్మద్ ఖాను) ఇంటికిఁ దీసికొనిపోవుటకై శిరిడికి వెళ్లెను. బాబా 'మహమ్మద్ ఖా'- కు ఊది ప్రసాదించిపంపెను. అతఁడు బాబా అనుగ్రహమువలన స్వస్థచిత్తుఁడై చక్కఁబడెను.

### (f) అన్వర్ ఖాన్:-

ఇతఁడు అహమ్మద్‌నగర్ ఖాజీ. అతఁడు 'తెలికమాఖ్' అను చోటఁగల మసీదు పునరుద్ధరింపఁదలఁచి ధనముకొఱకు బాబా దగ్గఱ కేగెను. మూఁడుదినములు వేచియుండెను. అంతట బాబా 'ఆమసీదు నీవలనఁగాని ఇతరులవలనఁగాని ధనము ఆశింపుటలేదు. ఆమసీదే కావలసిన ధనమును గూర్చును. ఆ మసీదులోని 'నింబర్' [అరుగు] క్రింద మూఁడు కుండలు త్రవ్వుము. ధనరాశిగలదు' అని తెలిపెను. ఆవిధముగ నతఁడు కావించి ఆవిషయమును మరల శిరిడికి వెళ్లి ఛోటేఖానునకు శిరిడి జనులకుఁ దెలిపినాఁడు.

### (g) ఫకీరు మద్దుషా:-

ఇతఁడు 'ఖాందేష్'– [జల్గాన్] లోని మీరన్ గ్రామనివాసి. 1913 నందతఁడు శిరిడికిఁ జేరెను. తనకు అత్యావసరముగ 700 రూపాయలు కావలయునని బాబాను ప్రార్థించి మిక్కిలిగ నేడ్చెను. అతనికి 700 రూపాయలిమ్మని బాబా- బాపూసాహెబ్ జోగ్‌తోఁ జెప్పెను.

1 జ్ఞానోపాస్తి మ.హ. మోహనోత్సవము

జోగ్ 700 రూపాయలు నాణెములు తెచ్చి బాబా ముందుంచెను. ఆ పైకము ఆ ఫకీరు కీయుమని బాబా చెప్పుచున్న 'బక్ష్రన్'–'గులాబ్' అను పిల్లలతో చెప్పెను. వారు 200 రూపాయలు మాత్రమే ఫకీరున కిచ్చిరి. తనకు 500 రూ. లు ఎం . . మాత్రమే ముట్టినవని ఆ ఫకీరు ఏడ్చి మొత్తి వ్యసనపడెను. కొంత మూఁడుదినములట్లు దుఃఖించెను. బాబా యేమియు పలుకలేదు, తరువాత అతనికి బాబా 'ఉధి' ప్రసాదించెను. ఆ ఫకీరు వెడలెను. అతఁడు శిరిడీకి రెండుమైళ్ళ దూరమునఁగల 'నీంగావ్' చేరఁగా ఒకటాంగా ఎదురుపడెను, నైజాంరాష్ట్రమునకుఁ జెందిన 'ఇటిస్టా' పార్శ్వ తహసీల్దారు ఆ టాంగానుండిదిగి 'నీవు ఈ ఆహారము భుజించి, యీ 200 రూపాయలు తీసికొనిపొమ్ము'. అని, యిచ్చి 'నీకిప్పుడు సంతృప్తి కలిగినదా?'– అని ప్రశ్నించెను. అంతట 'ఇటిస్టా' తాత్యాపటేల్ నూతనగృహముఁజేరి అచటివారితో తనస్వప్నమునవారమి 'నీవు టాంగాపై శిరిడీకి రమ్ము– మార్గమధ్యమున 'నింగోన్' అనుచోట పులిచర్మమును మోసికొనిపోవు ఫకీరునుజూతువు, అప్పుడు టాంగాదిగి, యతనికి ఆహారము పెట్టి, ధనముకొఱకై తపించుచున్న ఆ ఫకీరునకు 200 రూపాయలిమ్ము" అని తెలిపినట్లు ఆవిధముగఁ దాను కావించినటులఁ దెలిపెను,

b] నైజామురాష్ట్రములోని 'లాజూర్'నుండి ఒకముస్లిం బాబానుజేరి తన కత్యావసరముగ 400, 500 రూపాయలు కావలయునని కోరెను. 'నీవు ఉదయము మలవిసర్జనమునకు వటవృక్ష సమీపమునకు వెళ్ళుము. అచట ధనపుపాత్రను జూతువు.' అని బాబా పలికెను, ఆవిధముగ నతడు మఱునాఁడు మలవిసర్జనముఁగావించి ప్రక్షాళనమునకై వెళ్లుచుండ ధనపుపాత్ర కాలికిఁదగిలెను. ధనముతో అదిమిక్కిలి బరువుగనుండెను, దానినెత్తలేక అతఁడు చావడియందున్న బాబా దగ్గఱకువెళ్లెను, అతఁడు మరలవెళ్లగా ఆ ధనపుపాత్ర అచటఁగనఁ

# ఏ ఏరా, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదిమూడవ ప్రకరణము

## 27 అనుగ్రహ లీల.

### బాబా ఆశ్రితులు - ఇతర ముస్లింభక్తులు

**అబ్దుల్ రహీం రంగారి :–**

ఈయన ,థానా'లో నుండువాఁడు. 1913లందు బాబాను సందర్శింప శిరిడికి వెళ్ళెను. అతని భార్య వ్యాధిగ్రస్తయయ్యెను. కంఠము దవడలు వాపు ఏర్పడెను. ఆహారమేమియు దీసికొనలేకుండెను. వైద్య చికిత్సలేమియుఁ బనిచేయలేదు. థానాలోని ఒక న్యాయవాది సలహా ననుసరించి యతఁడు కుటుంబముతో శిరిడికి బయలుదేరెను. అంతవరకు ఏమియు భుజింపలేని అతనిభార్య 'ఇగత్పురి' చేరినతోడనే తేనీరు త్రాగఁగలిగెను, నాశిక్ చేర మజ్జిగొంచెము ద్రవపదార్థము త్రాగెను. వారు శిరిడి ప్రవేశించినతోడనే ఆమెపరిస్థితి చాలవఱకుఁ జక్కబడెను. ద్వారకామాయి మసీదుఁజేరి ఆ దంపతులు బాబాకు మ్రొక్కిరి.

'నీవేలవచ్చితివి? ఏమి పనికొఱకు వచ్చితివి?' అని, బాబా రంగారిని ప్రశ్నించెను. తనభార్య కంఠమువాపు మొదలగు బాధలను గూర్చి రంగారి, బాబాకు విన్నవించుకొనెను. 'ఆమెనిటు రమ్మనుము'- అని బాబా నియమింప, రంగారిభార్య మసీదుమెట్లెక్కి వెళ్ళి బాబా పాదములకు మ్రొక్కెను, బాబా ఆమెశిరమును స్పృశించి 'ఖుదా అచ్ఛాకరేగా' (దైవమనుగ్రహించును) అని, అనుగ్రహించినాఁడు. రంగారి– బాబాకు రు 1-4-0 సమర్పింప బాబా స్వీకరించినాఁడు. 'ఊదీ' ప్రసాదించెను.

అచట 2 గంటలుండినపిదప ఆమె కంఠమువాపు చాలవఱకు తగ్గుట గమనించి, బాబా అనుమతి తీసికొనకయే రంగారి తన కుటుంబముతో శిరిడినుండి టాంగాపై వెడలెను. అటుల వెడలినందుల కతఁడు శిక్ష అనుభవించవలసివచ్చెను. రాత్రి 10 గంటలవేళ మార్గమధ్యమున వారుపోవుచున్న టాంగా విఱిగెను. అది యొంటరిబాట. చలిగాలి వీచుచుండెను. ఇఁక ప్రయాణమునకు వేఱు ఆధారములేదు. సమీపమునఁగల యే గ్రామమునకేని భార్య బిడ్డతో నడిచివెళ్ళుట కష్టము. బాబా అనుమతిఁగైకొనక తిరిగివచ్చినందుకు పశ్చాత్తాపము పొందినాఁడు. ఏమిచేయుటకుఁ దోచలేదు. గత్యంతరమునుగూర్చి యోజించుచు విచారపడెను. అర్ధరాత్రమున నొకబండి వచ్చుచున్న ధ్వని, 'ధానావాలా' – 'ధానావాలా'-అని ఎవరో కేకవేయుచున్న శబ్దము వినఁబడెను. టాంగాతోలువాఁడు అటుల పిలుచుచు తనబండిని వారిదగ్గఱ ఆపెను. 'నేనే ధానావాలాను'- అని, రంగారి సమాధానమిచ్చెను. 'బాబా నన్ను పంపినాఁడు- మీబండివిఱుగుట తెలిసికొని, మిమ్ముఁదోడ్కొని రమ్మని బాబా నన్ను పంపినాడు-అని ఆ బండితోలువాడు చెప్పెను. అంతటవారు రాత్రి 2 గంటలకు శిరిడీకిఁ జేరిరి. 'నా అనుమతి గైకొనక వెళ్ళితిరి. కావున మార్గమధ్యమున నీకీ కష్టములు కలిగినవి'- అని బాబా మందలించెను.

ఆ మఱునాడు బాబా భిక్షాటనమునకువెళ్ళి తిరిగివచ్చి రంగారి కుటుంబమునకు రొట్టెలు- కూరపెట్టెను. అతనిభార్య ఆగట్టె పదార్థములను భుజింపఁగలిగెను. 'నీవిపుడు వెళ్ళుము'- అని బాబా సెలవిచ్చెను. రంగారీ టాంగాకొఱకు చూచెను. అచట టాంగాలేమియుఁ గనబడక మఱల బాబా దగ్గఱకేగెను. 'నీవిపుడు వెళ్ళుము- అదిగో! ఆ టాంగాను చూడుము' అని బాబా పలుక రంగారీ వెనుకకుఁ దిరిగి

* మహాభాగవతాయనమః * అన్నదాన సమానిష్ఠాయనమః

చూడ నచట టాంగావుండెను. అదాటున టాంగా అచట ఎట్లుం డెనా!- యని అతఁడాశ్చర్యపడెను.

[గమనిక :- ఇచట బాబా- అబ్దుల్ రహీం రంగారీల విషయములు శ్రీ సాయినాథ బోధామృతము, S.C.S. Para 551,202 పారషలు చదువఁదగును.]

## ఆదాం దలాలీ -

ఇతఁడు బాంద్రా (బొంబాయి) నివాసి- ఆస్తి సంబంధమగు 'దలాలీ'వృత్తితో జీవించువాఁడు. కేవలము ఐహిక కాంక్షలకొఱకే బాబాను ఆశ్రయించినాఁడు. ఇతనికి పెక్కురు మగబిడ్డలుగలరు. ఒకరి తరువాత మఱియొకరికి వివాహములు చేయవలసియుండెను. ముస్లిం ఆచారము చొప్పున పిల్లవానితండ్రియే ధనమీయవలయును. ధనము కొఱకు బాబాను సందర్శించినాఁడు. శ్రీ సాయిప్రభువు అతని మను గ్రహించి 'నీవిప్పుడు పొమ్ము- కుమారుని వివాహము జరుపఁగలవు.'- అని, పలికెను. అతఁడు తిరిగి వెళ్ళగా ఒకమంచి దలాలీవ్యాపారమున ధనములభించి కుమారునివివాహము జరుపఁగలిగెను, ఈవిధముగ ప్రతి పుత్రుని వివాహమునకు బాబాను ఆశ్రయించుట, ఆతండ్రి యనుగ్రహమున ధనము ప్రాప్తించుట జరిగెను.

ఒక సందర్భమున తాకట్టున్న ఆస్తి విక్రయింపఁబడి దానికి సంబంధించినవారందఱు దోషులుగా నిర్ణయింపఁబడిరి. తొలుత ఆదాం దలాలీనిఁగూడ దోషులలోఁ జేర్చిరి. బాబా అనుగ్రహమున నితడు నిర్దోషిగ నెంచబడెను. బాబా తోడ నితనికిఁగల సంబంధము [శ్రీ సాయినాథ బోధామృతము- S.C.S. పేరా- 888, 385, 575 చూడుడు.] శ్రీ సాయిప్రభు పటము నింటనుంచుకొని నిత్యము అగరువత్తులు వెలిగించువాఁడు- పటము ఇంటనుంచుట ముస్లిం మతస్థులకు విరుద్ధమైనను ఇతఁడు ఉదారాశయములుగలవాఁడు.

## అబ్దుల్లా జాన్.

ఇతఁడు పెషావర్ సమీపమున 'హజ్రా' జిల్లాలోని 'టూర్బెల్లా' లో జనించెను. పఠాన్ శాఖ- తుదకు సకోరీ సమీపమునగల కోర్హాలే గ్రామమున నివసించెను. బాబా యొక్క ముస్లింభక్తులలో నితఁడొకఁడు, భౌతికముగ ఆధ్యాత్మికముగ అనుభూతులను బాబా వలన పొందినాఁడు. పోషించువారులేని కారణమున బాల్యముననే 'టూర్బెల్లా' విడిచిపెట్టినాఁడు, అందందు సంచరించినాఁడు మక్కాక్షేత్రమునకు వెళ్ళఁదలచి పలువుర నాశ్రయించెను. కాలినడకతో 'మన్మాడ్' వరకుఁ జేరెను, అతఁడు తొలుతఁ దలంచినవిధమున బొంబాయికి వెళ్లలేదు. మన్మాడునకు దక్షిణముగ 30 మైళ్ల దూరమున శిరిడీయందున్న సాయీ బాబా విషయము విన్నాఁడు. బాబా ఫకీర్లకు ధనము వెదఁజల్లుచున్న వాడని, తనకు మక్కాప్రయాణమునకు ధనసహాయముఁ జేయునని తలంచెను, 1913న శిరిడికి చేరినాఁడు. అతఁడు ద్వారకమాయి వెలుపలిద్వారముఁ జేరినపుడు బాబా మసీదులోపలనుండెను. వారి యిరువురచూపులు కలిసెను. ఆక్షణముననే అబ్దుల్లా, బాబాను తన గురువుగ భావించెను,

బాబా ఫకీర్లండఱకు సమృద్ధిగఁ దినబెట్టుచుండుటచే మక్కాకు వెళ్ళుటకు బదులు అక్కడే నిర్విచారముగ బ్రతుకవచ్చునని తలంచి యతఁడు శిరిడీయందుండెను. అప్పుడతని వయస్సు 17 సంవత్సరములు. అతనికి వేఱుగ జీవితాశయములులేవు శిరిడీయందున్నకొలఁది అతని మనస్సు మార్పునొందెను. హైందవముస్లిం సఖ్యతఁగూర్చుటకై అవతరించిన బాబా అతనికి హృదయపరివర్తనము కల్పించినాఁడు. శిరిడికిఁ జేరినతొలుత ఇతర పఠానులవలే ఇతఁడును హైందవులందు వైరభావము గలిగియుండెను. 3 సంవత్సరములచట నివసించినపిదప నతని ద్వేషభావము నశించి, హైందవులను తన సోదరులవలె ప్రేమింపఁ

తొడఁగెను. జాతీయభావము పెంపొందెను. బొంబాయి మొదలగు పట్టణములందు హైందవులు- ముస్లిములు పరస్పరము ద్వేషించుకొనుచు- హింసించుకొనుచు- గుడులను మసీదులను ధ్వంసముఁ జేసికొనుటలు తలంచి విచారము పొందఁగడగినాఁడు. ఇంగ్లాండువారలు ద్వేషించుకొని హింసించుకొనుచుండిన అన్యదేశీయులీ దేశము నాక్రమించుకొందురని తలంచినాఁడు.

బాబా మహాసమాధి పొందినప్పుడు 1918లో నతఁడు 22 ఏండ్ల వాఁడు. అప్పటి కతనికి మతసంబంధములగు తీవ్రయోజనలేమియు లేవు. బాబా ఎడబాటునకు మిక్కిలి విచారపడినాఁడు. మరల దేశాటనము ప్రారంభించెను. 1926న ఉత్తరదిశగ ప్రయాణముఁ జేసెను. మాల్కండ్ యాజమాన్యమునకుఁ జెందిన 'స్వాట్' లోయయందు 'అకూన్ బాబా' యొక్క సమాధిఁ జేరెను. అతఁడు సయ్యద్ శాఖకుఁ జెందినవాఁడు. మహమ్మద్ ప్రవక్తయొక్క వారసుడు. ఆ యోగి యొక్క అద్భుతగాథల నచటిజనులు చెప్పుకొనుచుందురు. అకూన్ బాబా రాబర్స్ ప్రభువులను 3 నెలల 11 రోజులు బంధించివైచెనని చెప్పుదురు. అబ్దుల్లాజాన్ అచటనున్నపుడొక నాటిరాత్రి యొక సాధువు స్వప్నమున దర్శనమిచ్చెను. ఆ సాధువెవరో కాదు శ్రీ సాయీబాబా అతని తలవైపున నొక కుర్చీయందుఁ గూర్చున్నట్లుగ నతనికిఁ గనఁబడెను. వెంటనే మేల్కొని ఆస్వప్నమును దలపోసెను. బాబా మహాసమాధినొంది 8 సంవత్సరములైనను తానింకను బాబా రక్షణమునందున్నవాఁడుగ గుర్తించినాఁడు. శిరిడికి 150 మైళ్ళదూరమునఁ దానున్నను బాబా అనుగ్రహించి దర్శనమిచ్చిన కారణమున, తనకు, పూర్వము మక్కాకు వెళ్ళుటకు ధనసహాయముచేయక మోసగించినాఁడని బాబా నుగూర్చి తలచిన తన అభిప్రాయము పొరపాటని గుర్తించుకొనినాఁడు. బాబా యందు భక్తి క్రమక్రమముగ వృద్ధినొందఁజొ

1 అతిథిభుక్త శేషభుజే నమః

చ్చెను. శ్రీ సాయీప్రభువునందు గాఢవిశ్వాసము గలిగినవాడై భారతదేశమునకు దిరిగవచ్చెను.

1924న అతడు వివాహమాడెను. శిరిడికి 4 మైళ్లదూరమున 'ఖోర్హాలే' అనుగ్రామమున నివసించుచుండెను. బాబా అతనికి రెండు మూడు సంవత్సరములకొకమారు దర్శనమిచ్చుచుండును. బాబా భౌతిక తనువునందున్న నాటివైభవమును దలంచుకొనినప్పుడెల్ల అత్యంతానంద పరవశుడగుచుండును. ఒకసందర్భమున (1917 పూర్వము) 'బాబా! నీవు భౌతికతనువు విడిచినతరువాత నీతోడనే యీవైభవ మంతరించునేమో కదా!' అని పలికెనట. ఆమాటలకు బాబా 'తుర్బన్ హూంగా దండాహోని' [మరాటీ] (ఈసమాధినుండియే కర్రలతో మోదుదును) - అనగా నేను భౌతికతనువు విడిచినమాత్రమున నాయీప్రభావము తొలగదు- దినదిన ప్రవర్ధమానమగుచునే యుండును- అని భావము.

[గమనిక:- సాయీబాబా- మీర్ జమాన్ కాంధహార్ పఠాణ్ వృత్తాంతము- బాబా తనబిడ్డల నిమిత్తమై తన కంఠము ర్పింప సిద్ధపడినవిషయము, శ్రీ సాయీనాథ బోధామృతము (S.C.S. 522) పాఠకులు చదువప్రార్థితులు. హైందవద్వేషియైన మీర్ జమాన్ హృదయమును సైతము బాబా ఒకక్షణములో పరివర్తనము గల్పించినది విశదము కాగలదు.]

శ్రీ సాయీనాథు నందాదరణప్రేమలు బఱపిన ముస్లింభక్తుల నందఱ నభినందించుచు, వారల ననుగ్రహించినటుల మనయందును కరుణ బ్రసరింపుమని శ్రీసమర్థ సద్గురుదేవుడగు శ్రీ సాయీనాథునకు ప్రణతి సహస్రముల నర్పించుదము.

ఓం శేష భూతహ్నాత్ స్థాణవేనమః
ఓం అశోకమోహ శృంఖలాయనమః

ఓమ్ శ్రీ సాయీశరణ్ !

---

# ఏమిరా, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదినాల్గవ ప్రకరణము

## 28 అనుగ్రహ లీల.

### శ్రీ సాయీబాబా - క్రైస్తవభక్తులు - కొందరు.

సద్విషయము:-

శ్రీ సాయినాథుని పాదకమలములఁ గ్రమ్ముకొనిన భక్తబృందములలో హైందవ మతానుయాయులే అత్యధిక సంఖ్యాకులు. తక్కిన మతములకు సంబంధించినవారు మిక్కిలి తక్కువ అనియే చెప్పఁదగును. సాధారణముగ హైందవులు ఉదారాశయములుగలిగి, సర్వలక్షణ లక్షితుఁడైన సద్గురువు ఏజాతికి- ఏ తెగకుఁ జెందినవాఁడైననాతనిఁ జేరుటకు వెనుకాడరు. ఏతావునకైనను వెళ్ళి, సేవనీయమైన వస్తువును ఎందున్నను సేవించుటకు జంకరు. సర్వసాధారణముగ ముస్లిములు మత నియమములందు గట్టి పట్టుదలగలవారు. అందును, హైందవాశయములు ఆదర్శములుగలిగి, హైందవాచారములకులోఁగి, హైందవాచారములచొప్పున విగ్రహారాధనలుసలుపుట- మేళతాళములు భజనలతో మసీదునందు పూజాదులను స్వీకరించు నట్టి సాధు సత్పురుషునేని వారు సమ్మతింపరు. క్రైస్తవులలోను ప్రొటెస్టెంట్లు- విగ్రహారాధనలు జరుగుచోటులకు, మానవులు పూజింపఁబడు తావులకువెళ్ళుట- పాల్గొనరు. ఆకారణమున బాబా ఆశ్రితులలో ముస్లిములసంఖ్య చాలస్వల్పము. ఇఁక క్రైస్తవులలో ప్రొటెస్టెంట్లు తెగకుఁ జెందిన వారెవరేని బాబాను భక్తిభావముతో నాశ్రయించినవారు సర్వసాధారణముగ లేరనియే చెప్పవలయును.

చక్రనారాయణ్.

(ప్రొటెస్టెంటు క్రైస్తవులలో బాబాయందు గౌరవాదరణలు గలవారిలో నితఁడొకఁడు. ఇతఁడు బాబాయందు భక్తివిశ్వాసములు లేనివాఁడైనను ఆతండ్రియొక్క ఉదారాశయములను- అపారసద్గుణ గణములను ప్రేమించినాఁడు. ఇతఁడు పోలీసుసబిన్స్పెక్టరు.(ఫౌజుదారు) ఆ ఉద్యోగరీత్యా బాబాను కనిపెట్టియుండుటకు నియమింపఁబడినాఁడు బాబా ఆదాయముఁ దెలిసికొని రాఁబడిపన్ను విధించుటకుఁగా ప్రభుత్వము వారితని నియమించిరి. ఇతఁడు మఱికొందఱు బాబా విషయములను కనిపెట్టుచుండిరి.

(శ్రీ)సాయీ మహాప్రభువు కామినీకాంచన విముఖుఁడని గుర్తించిన యీతఁడు బాబా యందపార గౌరవప్రేమలు గలిగియుండెను. సన్నిధికి పలువురుకాంతలు ఘోషాలఁ దొలఁగఁజేసికొని బాబా పాదములకు (మ్రొక్కుచున్నను- ఆతండ్రి సమీపమునఁ గూర్చున్నను బాబాయందు లవమాత్రమేని కాముకప్రవృత్తిలేని విషయమితఁడు గ్రహించినాఁడు. ఆకాంతలవంక బాబా చూచియైన యెఱుఁగఁడు. (శ్రీ) సాయీశుఁడు మూర్తీభవించిన వైరాగ్యమని యితఁడు గుర్తించినాఁడు. జనులు [భక్తులు] తమంతటతామె అపారముగ ధనము బాబాకు సమర్పించువారు. దక్షిణలిచ్చువారిని ప్రేమించుటగాని యీయనివారియెడ ద్వేషభావము వహించుటగాని యెప్పుడు లేదు. ఆధనమునందు బాబా నిర్లిప్తుఁడు. భిక్షాటనవిషయము అంతే, తగరపురేకు డబ్బా- జోలె తీసికొని వెళ్ళును. ఘనపదార్థములు జోలెయందు ద్రవపదార్థములు డబ్బాయందు నుంచును. ఆయాగృహముల వారలేమియే నిపెట్టిన- పెట్టకున్నను బాబా నిర్లక్ష్యభావము వహించును. ధనమును సమర్పించిన, భిక్ష సమర్పించిన ఆధనమును- ఆహారపదార్థములను తన

౧ అభిమానాతిదూరాయనమః

దగ్గఱఁ జేరిన పేదసాదులకు పంచిపెట్టువాఁడు. బాబా మహానిర్యాణానంతరము అధికారులు బాబా ఆస్తియంతయు స్వాధీనపఱచుకొనిరి బాబా ధరించిన కఫ్నీ జేబులో 16రూపాయలు మాత్రమున్నవి. (ఆతండ్రి మహాసమాధి ఖర్చులకేమో!) బాబా దగ్గఱ ప్రతిఉదయమున గవ్వయైన నుండదు. ఆతండ్రికి సమర్పింపఁబడు ధనము స్వల్పమైనను ప్రతి దినము బాబా పెదజల్లుధనము- వందలకు వందలుండును. ఈ ధనమంతయు నెక్కడిదా? యని చక్రనారాయణ్ ఆశ్చర్యచకితుఁడగువాఁడు. పోలీసులకిది అవేద్యమైనది. కావున చక్రనారాయణ్ బాబా నుగూర్చి ఆతండ్రి దైవప్రభావము గలవాఁడని గుర్తించినాఁడు.

ఇతర మతానుయాయులయెడ బాబాకుఁ గల ఉదారబుద్ధి- సమదృష్టినిఁ దలంచి చక్రనారాయణ ఆశ్చర్యచకితుఁడైనాఁడు. ఈతఁడు రహతాలో పోలీసు సబిన్స్పెక్టరుగ నియమింపఁబడినప్పుడు బాబా ఆశ్రితులలో ద్వేషబుద్ధిగలవారు కొందఱు 'బాబా! రహతాలోని ఫౌజుదారు హైందవుఁడు కాఁడు- మహమ్మదీయుఁడు కాఁడు- అతఁడొక క్రైస్తవుఁడు- అని, తెలుప వెంటనే బాబా 'ఐననేమి?- అతఁడు నా సోదరుఁడు'- అని వారిని మందలించినాఁడు- (శ్రీ) -మహారాజ్! అని పిలువఁబడువాఁడు. ఆ సకల రాజలాంఛనములతో ఆశ్రిత జనసందోహములమధ్య బాబా నిజముగ నొక మహారాజువలె ప్రకాశించుచుండుట చక్రనారాయణ్ గుర్తించినాఁడు, అనన్యలభ్యములగు బాబాయొక్క అత్యద్భుతమహిమలు- అంతర్జ్ఞానము- దూరశ్రవణ- దూరదృష్టి ఋతంభరప్రజ్ఞ- ప్రతిభావిశేషములను గమనించి చక్రనారాయణ్ ఆశ్చర్యచకితుఁడైనాఁడు. ఒక పోలీసు ఉన్నతోద్యోగి విషయమాతఁడు ప్రత్యక్షముగఁ జూచినాఁడు.

ఒక పోలీసు ఉన్నతోద్యోగి బాబా దరిఁజేరి మ్రొక్కినాఁడు. బాబా ఆతని దక్షిణ నిమ్మనినాఁడు. ఆతఁడు తనదగ్గఱ పైకము లేదన

నీ 'పర్సు'లో చూడుము. 50 రూపాయలనోటు ఉన్నది, ఇమ్ము!' అనెను. అంతట నా ఉద్యోగి నోటునుతీసి బాబాకు సమర్పించినాఁడు. దానిలో ఏ స్వల్పమో బాబా స్వీకరించి మిగిలినది ఆ ఉద్యోగికి తిరిగి యిచ్చుచు- 'దీనితో నీవు అవసరముకలను. రాఁబోవుకష్టములకిది అవసరము- ఉంచుకొనుము' అనియిచ్చెను, జరిగినది అదియే. బాబా సెలవుతీసికొని వెళ్ళఁగ నతనికొక కష్టమేర్పడెను. దానినుండి తప్పించు కొనుటకు ఆద్రవ్య మవసరమయ్యెను. ఆతఁడు తనకష్టనివృత్తికి వ్యయ పఱచుకొనఁగాపోఁగ మిగిలినదానిని శిరిడీకి 'మనిఆర్డరు'ద్వారా పంపి నాఁడు, బాబా ప్రసాదించిన 'ఊధి' ఆశ్రితుల ఆధివ్యాధుల నివారిం చుట చక్రనారాయణ్ తన అనుభవమున గుర్తించినాఁడు.

మన మొకవిషయము జ్ఞప్తియందుంచుకొనఁదగును. శ్రీసాయీ మహాప్రభువును గురుదైవముగ సేవించినను- సేవించి పూజించకున్న ను ఆతండ్రితోడ నేవిధమైన సంబంధముగలిగిన వారైనను ధన్యులే. బాబాను ప్రేమించువారు- గౌరవించువారు ధన్యులే. అట్టివారు మన కందఱకు వందనీయులు. ఉద్యోగకార్య నిర్వాహణకు చక్రనారాయణ్ బాబాను జేరినను ఆబిడ్డను బాబా అనుగ్రహించినాఁడు. శ్రీ సాయీ ప్రభువునెడ గౌరవప్రేమలు పఱపిన చక్రనారాయణు నభినందించుచు ఆబిడ్డయెడ బాబా ప్రసరించిన కరుణ మనయందును ప్రసరింపుమని సమర్థ సద్గురుదేవుని శ్రీ సాయీనాథునిఁ బ్రార్థించుదము.

• అప్రాకృత పరాక్రమాయనమః

ఓమ్ శ్రీ సాయీశరణ్!

కల, యీజాతి మతాదులన్నిటను లోకస్వామి తానొక్కఁడై
వెలయున్; భక్తులు నామరూపపదముల్ వేర్వేఱఁగల్పింత్రు; త్రో
వలు వేరైనను గమ్యమేక, మిదివిస్పష్టంబు; నీబాలిన
ర్మిలినీ వేగుట శ్రేయమౌనన నెకి? ఏమీ, నిన్నుపేక్షింతునా!

# ఏపిరా, నిన్నుపేక్షింతునా ?

## నః ప్రవిధైౌనవ ప్రకరణము

## 29 అనుగ్రహ లీల.

### a] బాలాసాహెబ్ భాటే b) మద్రాసీ భజనసంఘము.

### సద్విషయము:-

సాధు సత్పురుషులందు జాతి కులాది భేదములు పాటింపఁదగనివి. ఆధ్యాత్మిక భక్తిమార్గగాములకు జాతి-మత-కుల విచక్షణలు పురోవృద్ధికి ప్రతిబంధకములని యెఱుఁగనగును.

'నాస్తితేషు జాతి విద్యారూపకుల క్రియాదిభేదః'

అట్టి భక్తులజాతి విద్యాస్వరూప
ధనకుల క్రియాదిక విభేదమ్ములేదు,

[ప్రేమామృతము. నా.భ.సూత్రములు 72]

'చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషామమ'

(మనీషాపంచకము– శంకరభగవత్పాదులు)

ఏకాంతభక్తుఁడై సర్వము వాసుదేవమయముగ స్వానుభవమున గుర్తింపఁజాలిన సాధుసత్పురుషుని విషయమున జాతివిద్యాదులు పాటింపఁదగనివి. బ్రహ్మజ్ఞుఁడు బ్రహ్మమేయగును. అట్టి సర్వజ్ఞునకుఁ బైతొడుగు శరీరమున్నను లేకున్న నొకటియే. ఏకదేశగతుఁడుగ గన్పించుచున్నను సర్వవ్యాపియేయగును.

దైవము నిరాకారుఁడు నిర్గుణుఁడు–అని విశ్వసించువారు దైవము సాకారుఁడు– సగుణుఁడు– అని తలంచుట కేవలము భ్రమయనియు,

సాధు సత్పురుషులనఁబడువారు మనుష్యమాత్రులేయని పలుకుటయుఁ గలదు. అట్టి మనుష్యమాత్రులఁ బోలు మనమేల తలవొగ్గి దక్షిణలు సమర్పింపవలయును? - అని కొందఱు పలుకుచుందురు. శ్రీ సాయీ ప్రభువువిషయమున నీవిధముగఁ బూర్వమున నిష్ఠురముఁ బలుకువారు కొందఱు లేకపోలేరు. తమ్ముఁజేరిన ఆశ్రితులను దక్షిణలీయుఁడని కోరుట సాధు సత్పురుషలక్షణమా? అనియు ప్రశ్నించుచుందురు. కేవలము పరిహసించుటకై శిరిడికి వెళ్ళి, బాబా సందర్శనమాత్రమున ఆతండిచ్చు అనుగ్రహాలేశమున శ్రీసాయీ మహాప్రభువునందు గాఢభక్తి ప్రేమలొంది యచట నిలిచిపోయినవారు, బుద్ధి పరివర్తనమునొంది బాగుపడినవారు పలువురుగలరు.

తనకు సంబంధముగల బిడ్డలెందెందుగలరో వారిని బాబా ఏదొక కారణముఁగల్పించి తనదఱికి నాకర్షించును. వారివారి కామితములు రాగద్వేషములు కారణములుకావు. ఇదియంతయు ఋణానుబంధమనియే ఆతండి తెలిపినాఁడు. లౌకికముగ పారలౌకికముగ వారెంతదనుక చక్కబడుదురో అంతవరకు తీర్చిదిద్దువాఁడు, కాని యెన్నిజన్మములనైనను దనబిడ్డను బాబా కనిపెట్టియేయుండును.

## a] బాలాసాహెబ్ భాటే.

భాటే కళాశాల విద్యార్థిగనున్నపుడు కేవలము నాస్తికునివలె వర్తించెను. విద్యాయోగ్యతలను గడించి రాజకీయ ఉద్యోగమున ప్రవేశించి 1904-1909 మధ్యకాలమున కోపర్గాం తాలూకా మామ్లత్‌దారు (తహసిల్దారు] ఉద్యోగము నిర్వహించినాఁడు. కోపర్గామున నున్నంతకాలము శ్రీ సాయీబాబా సందర్శనముకొఱకు శిరిడిక్షేత్రయాత్రకువెళ్ళుచు, తిరిగివచ్చు విద్యాధికులైన తనమిత్రులను హేళనము చేయుచు, బాబా ఒక పిచ్చివాఁడు అనిపలుకుచు నిరసించుచుండి

1 అరవింద దర్శనానము

గాఁడు. ఆదేశమిచ్చిరి 'బాబా నొకమారు సందర్శించి, ఆ పిదప తిరిగివచ్చు సంగతి నీవే నిర్ణయించుకొనుము'–అని హితముబోధించిరి.

1909యందు భాటే శిరిడీయందు ఉద్యోగరీత్యా మకాము వేసికొనెను. నాలుగుదినములు నిత్యము శ్రీ సాయినాథుని సందర్శించుచుండెను. అయిదవదినమున బాబా అతనిమీద నొక కాషాయవస్త్రమును గప్పెను. ఆదినమునుండి అతని ప్రవర్తనము మారెను. ఉద్యోగము సంసారము విషయములందతనికి విరక్తికలిగెను. ఆదినము మొదలు తుదివరకు శిరిడీయందు నివసించి, శ్రీ సాయిప్రభువు సేవచేయవలయుననీ, బాబా సమక్షమున అసువులు విడువవలయునను సంకల్పమాతనికి గలిగెను. భాటే మిత్రుడగు కాకాసాహెబ్ దీక్షితుచేత బాబా ఒక సంవత్సరము సెలవు వ్రాయించి, భాటేచేత సంతకముపెట్టించెను. అంతకుఁబూర్వము భాటే తన ఉద్యోగమును చక్కఁగ నిర్వర్తించి, అధికారులమెప్పు పొ[illegible]క జిల్లాకలెక్టరు సంవత్సరకాలము సెలవిచ్చెను. అంతకంతకు భాటేకు గురుభక్తి – లోకవిరక్తి హెచ్చుటచే అతనియెడ కనికరమువహించి ప్రభుత్వమువారు ముప్పది రూపాయలు పింఛన్, ఉపకారవేతనమిచ్చిరి

భాటే సహాధ్యాయుడగు కాశీనాథ్ ఖండేరావు–గార్డే [రిటైర్డు సబ్జడ్జి–నాగపూరు] అతని ప్రవర్తనమునుగూర్చి ప్రశ్నింప బాబా అతనిపై కాషాయవస్త్రము గప్పిననాటినుండి తన బుద్ధియందు పరివర్తనము కలిగినటుల, మారిన దృక్పథమతని కేర్పడినటులఁ దెలిపినాఁడు. ఆదినము మొదలు తన ఉద్యోగమునందు లౌకికవిషయములందు విరక్తికల్గినది– అది బాబా అనుగ్రహమని, తెలిపినాఁడు. శిరిడీయందు నివసించి, నిత్యకృత్యములు నిర్వర్తించుకొనుచు శ్రీ సాయిప్రభువు సమక్షమున ఉపనిషద్గ్రంథములను పారాయణము చేయుచుండెను. అప్పు

దప్పుడు బాబా ఆ గ్రంథములందలి ముఖ్యవిషయములఁగూర్చి వివరించువాఁడు. అతనిభార్యయు బిడ్డలును శిరిడికిఁజేరి యచటనే నివసించిరి. భాటే ఆధ్యాత్మికముగ నున్నతస్థితినిఁ బొందుటగని. ఉపాసనీ బాబా-జి.యస్. కపర్దే- నానాసాహెబ్ చందోర్కర్- కాకాదీక్షిత్ మొదలగువారు ఆశ్చర్యచకితులైరి.

ఆయాజీవులు పురాకృతాభ్యాసబలమున సాధు సత్పురుషుల సాంగత్యముగడింతురు. తోలుతవా రేబుద్ధితో సద్గురువులఁజేరినను-వారి పూర్వసుకృతము- అవతారపురుషుల అనుగ్రహమునేకమై ఆ జీవులనుద్ధరించును.

లోహశలాకానివహైః స్పర్శాశ్మని భిన్నమానేపి
స్వర్ణత్వమేతిలోహం ద్వేషాదపి విద్విషాం తథాప్రాప్తిః

పరుసవేదినొంట బలిమినిఁబట్టి ఛే
దించు లోహఖండ సంచయంబు
స్వర్ణమగు విధాన, వైరబుద్ధిని నేని
హరిని దాకరిపుల కమరు సుగతి,

(ప్రబోధసుధాకరము- సగుణనిర్గుణైక్యప్రకరణము)

భాటే అట్టివైరాగ్యభాగ్య భాజనుడగుట అతని పురాకృత సుకృతపరిపాకము- బాబా అనుగ్రహముకాని, యీజన్మమున నతఁడు ప్రకటించిన ద్వేషముకాదని పాఠకులు గ్రహింపనగును. శ్రీసాయీశుఁడు భాటేయందుగల ద్వేషమును సమాకర్షించి ఆస్థానమును భక్తితో నింపినాఁడు.

[ఈవిధముగ శ్రీ సాయీనాథుని హేళనముగావించిన 'సపత్నేకర్' వృత్తాంతము- పండరిపురము ప్లీడరువృత్తాంతము S.C.S. 367

• భూమ్నే నమః । ఆచార్యపరమాయనమః
• భాటేద్వేషం సమాకృష్య భక్త్యా తస్మైపర్యపూరితవతేనమః

420 541 శ్రీ సాయీనాథ బోధామృతమునఁ దెలుపబడినవి, ఆగ్రంథమునఁ జూడఁదగిన విషయములింకు ప్రత్యేకముగ నొకప్రకరణమున ఆగ్రంథములోని పేరానెంబర్లు గుర్తింపఁబడినవి. పాఠకులు గమనింపఁ బ్రార్థితులు]

## (b) మద్రాసీ భజనసంఘము

### సద్విషయము :—

శ్రీ సాయీప్రభువపార కరుణానిలయుఁడు. దర్శనము మాత్రి భక్తుల భవభయమునడఁచి, సకల సంకటముల నివారింప సమర్థుఁడు. ఆశ్రితుల అజ్ఞానమును దొలఁగించి ఆత్మప్రాప్తిఁ గూర్చుటయే సాధు సత్పురుషుల కృత్యం, సాధు చూడామణియగు శ్రీ సాయీశునిఁగూర్చి వేఱుగఁ బలుక నేల? శ్రీ సాయీనాథుని పదకమలములందు మనస్సు లగ్నముఁజేసినవారి సకలపాపములు పటాపంచలగును. అధ్యాత్మికాభ్యున్నతి లభ్యమగును. వివిధ పవిత్ర క్షేత్రములనుండి భక్తులేతెంచి ఆతండ్రి పాదములమ్రోల వేదాధ్యయనములను మంత్రానుష్ఠానములను గావించి తరించిరి. ఎట్టి యోగ్యతలులేని మన యట్టి యల్పులకు 'భక్తి'— అననేమో తెలియదు. కాని, యీ ఒక్క విషయమున మాత్రము గాఢమగు విశ్వాసముకలదు. మన ఆపత్కాలమున మనకాప్తులనుకొను బంధుమిత్రులందఱు మనలవిడిచి దూరదూరమైనను శ్రీ సాయీప్రభువుమాత్రము తనవానిని మఱువఁడు— విడువఁడు, ఏక్షణమున విడువక ప్రాపు— కాపునై యుండును, ఉండితీరును. ఆ తండ్రి అనుగ్రహమునకుఁ బాత్రుఁడైనవానికి దేహ—బుద్ధిబలములు నిత్యానిత్యవస్తువివేకము— జ్ఞానోపలబ్ధిఁజేకూరుట త్రిసత్యము.

### మద్రాసీ భజనసంఘము:—

1916లో మద్రాసునుండి భజనసంఘము కాశీక్షేత్ర సందర్శనార్థము బయలుదేరెను. ఆ సంఘమునందు సమర్థ రామదాసు అను

యాయియగు భక్తుడు- ఆతనిభార్య- కుమారి- యఱువలు మాత్రము కలరు. వారు మార్గమధ్యమున శిరిడియందు నొక సాధుసత్పురుషుఁడు కలఁడనియు, వివిధములగు సమర్థతలఁ బ్రదర్శించువారికి మిక్కిలి ఉదారముగ ధనము బహూకరించు చున్నాఁడనియు విని శిరిడికిఁ జేరిరి. అందు కొన్నిదినములుండి శ్రావ్యముగ భజనలను గావించిరి. ఆకుటుంబ యజమానిభార్య చిత్తప్రవృత్తివేఱు. వారందరు మధురకంఠస్వరముల మిక్కిలి మనోహరముగ భజనలనుగావించినను ఆమెకుతప్ప తక్కినవారి హృదయములు మాత్రము సాయీప్రభువు వెదజల్లు ధనముమీఁదనే యుండెను. బాబా సందర్శనము చేసికొనిన క్షణమునుండి ఆమెకు ఆతండ్రిపై గౌరవప్రేమలు పెంపొందినది. ఒకనాఁడు మధ్యాహ్న హారతిసమయమున ఆమె భక్తికిమెచ్చి సాయీనాథుఁడా భక్తురాలినేత్రముల కామె యిష్టదైవమగు సీతానాథుఁడుగ దర్శనమిచ్చెను. తక్కినవారి కాభాగ్యము కలుగలేదు. తన ప్రియతముఁడైన దైవమును- శ్రీరామచంద్రుని దర్శించిన యాభాగ్యవతి తనువు పులకరించెను. కనులనుండి ఆనందాశ్రువులు స్రవించెను. మనస్సుప్పొంగెను. చేతులు చఱచుచు మోదపరవశయయ్యెను. ఆచటఁ జేరిన వారామె చేష్టల కచ్చెరువొందిరే కాని కారణమూహింపకుండిరి.

ఆనాటి సాయంత్రము తానుబొందిన ఆనందానుభూతినిఁగూర్చి యాసతి తనపతికిఁ దదితరులకుఁ దెలిపెను. శ్రీ సాయీశుఁడు తన యిష్టదైవమగు శ్రీరామచంద్రుఁడే యని విశదపఱచెను. ఆమె పలుకులను నిర్లక్ష్యభావమునఁ ద్రోసిపుచ్చిరి. అదియంతయు నామె మనోభ్రాంతియని కేవల మమాయకభక్తురాలగుట వలన తోఁచెనని ఆమెభర్త తలంచెను. వారికందఱకు సాయీబాబాగాఁ గనఁబడిన యావ్యక్తి ఆమెకుమాత్రము శ్రీరామచంద్రుఁడుగఁ దోచుట కేవ

। తపస్సందీప్త తేజస్వినే నమః । భూశయాయ నమః
। ధనదేనసమత్యాగినే నమః

లము భ్రాంతియుఁ గల్పితము- అని యామద్రాసీ కీర్తనకారుఁ డీసడించెను. ధనాశచే కలుషితముగాని హృదయముగల ఆమె తనభర్త నిరసనవాక్యములఁ బాటింపలేదు. విమల భక్తియుక్తులితరుల నిందాస్తుతులను లెక్కింపకుండుట సహజమేకదా!

## అద్భుత దృశ్యము:-

అటులొకటి రెండుదినములు గడచినపిదప ఆ మద్రాసీకీర్తనకారుఁడొక కలఁగనెను. అతఁడొక పెద్దనగరమున నుండెను. అందలి రక్షకభటు లాతనిఁబట్టి పెడరెక్కలు విఱిచికట్టి యొక కటకటాల గదియందు బంధించిరి. ఆగదికి వెలుపల సాయిప్రభువు నిలిచియుండెను. ఆ స్వప్నముననే వారికీవిధముగ సంభాషణము జరిగెను.

భక్తుఁడు:- బాబా! నీకీర్తివిని నీపాదములాశ్రయించితిని. నీవు స్వయముగ నిచటనుండ నాకీ కష్టములు కలుగనేల?

సా.బా:- నీకర్మఫలముల నీవనుభవించి తీరవలయును.

భక్తుఁడు:- ఇట్టి దురదృష్టస్థితి ప్రాప్తించుటకు నేనీజన్మమున నట్టిపాపములఁజేసి యెఱుఁగనుగదా!

సా.బా:- ఈజన్మమునఁ జేయకుండిన పూర్వజన్మములఁ జేసియుండవచ్చును.

భక్తులు:- బాబా! పూర్వజన్మముల విషయములు నాకేమి తెలియును? ప్రభూ! ఒకవేళ తొంటిజన్మములందు పాపకర్మములఁ జేసియుంటినే యనుకొనుము- నీపరమపవిత్రరూప సందర్శనము మాత్రమున మహాగ్నియందు జీర్ణతృణములు భస్మమైపోవునటుల నా పాప పటలములేల పటాపంచలు కాకుండును?

సా.బా:- నీకట్టి విశ్వాసముకలదా?

భక్తుడు:- సత్యము! కలదు.

అంతట బాబా ఆతనికన్నులను మూసికొనుమనెను, ఆతఁడు కనుల మూసికొనినతోడనే యేదో కూలిపడినటుల పెద్దధ్వని వెడలెను. [ఆకలలోనే] అతఁడు కనులఁ దెఱచెను. బంధవిముక్తుఁడయ్యెను. రక్షకభటులు రక్తము స్రవింపఁ గూలిపడియుండిరి. మిక్కిలి భయము తో నాతఁడు వణకుచు బాబా వంకఁజూచెను.

సా. బా:- నీవిపుడు లెస్సగ చిక్కుపడితివి. అధికారులువచ్చి నిన్ను బంధింతురు.

[ఆకలలోనే యతఁడు బాబా పాదములపైఁబడి.]

భక్తుడు:- బాబా! నీకంటె నాకు రక్షకుఁడెవ్వఁడు లేఁడు. ఇపుడు నన్నే విధముననైన రక్షింపుము!

మఱల బాబా ఆతనిఁగన్నులు మూసికొనుమని ఆజ్ఞాపించెను. ఆతఁడు కనులమూసికొని, [ఆకలలోనే] తెఱచిన వెంటనే యతఁడా చెరసాలనుండి విడివడెను. బాబా ఒక్కఁడే యతని ప్రక్కనుండెను. అంతనతఁడు బాబా పాదములవ్రాలి మ్రొక్కెను.

సా. బా:- నీవిపుడు గావించిన నమస్కృతికిఁ, బూర్వము గావించిన దానికి భేదమేమైనకలదా ? బాగుగ ఆలోచించి సమాధాన మీయుము !

భక్తుడు:- చాల భేదముకలదు. పూర్వము నీవలన ధనమాసించి నమస్కారములను చేసితిని. ఇపుడు నిన్ను ప్రత్యక్షదైవముగ గుర్తించి మ్రొక్కుచున్నాఁడను, అదియుఁగాక నీవొక మహాత్ము

* మిత్రశత్రో సదాసమాయనమః
* ఇష్టదైవస్వరూప ధృతేనమః

దీనియందున, హైందవులను భ్రష్టులఁగావించుచున్నాఁడవను తలంపుఁగలిగి యుంటిని.

సా.బా:- మహమ్మదీయ దేవతలను నీవు విశ్వసింతువా?

భక్తుఁడు:- విశ్వసింపను.

సా.బా:- మీయింట హస్తచిహ్నము- [పంజా] లేదా? —

'తాబూత్'- మహమ్మదీయ పర్వదినమునందు దానినిఁ బూజింపవా?- నీయింట ముస్లిందేవత 'కాడ్‌బీబీ'- అను పేరుగల దేవత లేదా? వివాహాది శుభకార్యములకుముందు ఆదేవతను పూజించి తృప్తి పఱుపవా?

భక్తుఁడు:- నిజము. బాబా జ్ఞప్తికివచ్చినది.

సా.బా:- నీకింకేమి కావలయును?

ఆక్షణములోనే ఆతని మనస్సున 'సమర్థరామదాసు'ను దర్శింపవలయునను తలంపు పొడమినది. తోడనే దానిని గ్రహించి బాబా అతనిని వెనుకకు మఱలుమనెను. ఆతఁడు వెనుకకుమఱలి, తిరిగిచూచినంతనే 'సమర్థరామదాసస్వామి' గోచరించెను. అతఁడా స్వామిపాదములపైఁ వ్రాలి నమస్కరింప నతఁడదృశ్యుఁడయ్యెను.

భక్తుఁడు:- బాబా! నీవుచాల ముసలివాఁడవుగనున్నావే! నీవయస్సు ఎంతో ఎఱుగుదువా?

సా.బా:- ఏమీ!- ఏమంటివి? నేను ముసలివాఁడనను చున్నావా? ఏదీ నాతో పఱుగుతీయుము- చూచెదను,

అనుచు బాబా పరుగెత్తెను. ఆభక్తుడు బాబావెంటఁ బరుగిడెను. బాబా పదములఁదాకున రేఁగిన ధూళియందు బాబా అదృశ్యుఁ

* తప్తకాంచన సన్నిభాయ నమః
† ఆరోపణాపవాదైశ్చ మాయాయోగ వియోగకృతే నమః

చెయ్యెను. అంతట నతఁడు మేలుకొనెను. [ఆస్వప్నము పూర్తియయ్యెను.]

ఆ మద్రాసీభక్తుఁడు మేలుకొనిన తరువాత ఆ స్వప్నవృత్తాంతమును గూర్చి తీవ్రముగ నాలోచించెను, ఆతనిచిత్తప్రవృత్తి పూర్తిగ మారిపోయెను, బాబా మహత్త్వమతఁడు గుర్తింపఁగలిగెను. ఆతనికిఁగల సంశయములు, సందేహములు మాయమాయమయ్యెను. శ్రీ సాయిబాబాపాదపద్మములందు గాఢభక్తి యతని హృదయమున నాటుకొనెను. అదియొక స్వప్నమే కావచ్చును. కాని, యందలి ప్రశ్నోత్తరములు - వానివలన నతనికిఁగలిగిన మానసిక పరివర్తనము మాత్రము గుర్తింపఁదగినది. మఱునాఁడు మధ్యాహ్న హారతిసమయమున బాబా దర్శనార్థమై యతఁడు తన పరివారముతో మసీదున కేగ, బాబా ఆతనిని మిక్కిలి ప్రేమతో దగ్గఱకుఁబిలిచి, రెండురూపాయలు విలువగల మిసరీపదార్థములను ప్రసాదముగనిచ్చి, తనజేబునుండి రెండురూపాయనాణెముల నతని చేతిలోనుంచి, 'అల్లా నీకు సకలసమృద్ధి సమకూర్చును'- అని, ఆశీర్వదించెను.

ఆ భజనసంఘమువారికి బాబా వలన ధనము లభింపకపోయినను, వారాశించిన ధనముకంటె కోటిగుణితమగు బాబా అనుగ్రహసంపదవారికి ప్రాప్తించెను. మార్గమధ్యమున విశేషధనము వారికి లభించెను. వారు కావింపఁదలఁచిన తీర్థయాత్రలన్నియు ముగించుకొని సుఖసంతుష్టి సంతృప్తులతో వారి నెలవునకు తిరిగిచేరిరి. బాబా పలుకులఁ దలంచుకొనుచు సచ్చిదానందానుభూతి ననుభవించిరి. శ్రీసాయిమహాప్రభువు తన వారినిఁ జక్కదిద్ది అనుగ్రహించు పద్ధతులలో నిది యొకటి యని పాఠకులు గ్రహింపనగును.

• మహాత్మనే నమః । ఆదిమధ్యాంతవర్జితాయ నమః
। తత్త్వజ్ఞానార్థదర్శినే నమః

బాబా అనుగ్రహపాత్రులగు బాలాసాహేబ్ భాటేను మద్రాసీభజనసంఘమువారికి వందనశతము లర్పించుదము, వారి ననుగ్రహించినవిధమున మనల ననుగ్రహింపుమని శ్రీ సాయీ సద్గురుదేవునకు సహస్రప్రణామము లర్పించుదము,

ఓమ్ శ్రీ సాయీశరణ్!

నను గుర్తింపఁగలేక విభ్రమితుఁడైనన్ నాకు సంబంధి యౌ
జను, నేనే దత్తుఁజేసుకొందు, నిఁక వైషమ్యానురాగాల రెం
టినిఁ బోకార్చుదుఁ జక్కఁదిద్దెదను; భాటేన్ రామదాసానుయా
యిని, రక్షించిన చందముఁ గాఁగనవె? ఏమీ, నిన్ను పేక్షింతునా?

# ఏవిరా, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదియారవ ప్రకరణము

## 30 అనుగ్రహ లీల.

## చంద్రాబాయి బోర్కర్

### సద్విషయము:-

దయాపరిపూర్ణుఁడు– ఆనందవిగ్రహుఁడగు శ్రీ సాయిప్రభువు పలుమారులు మధురాతి మధురములగు పలుకులఁబలికినాఁడు. 'నన్ను ప్రియతమునిఁగ భావించువాఁడు నన్నెల్లవేళలఁ జూచును. నేనులేని యీసకల ప్రపంచమతనికి వ్యర్థము. నాకథలుదప్ప నితరమును పలుకఁడు. ఎడపక నన్నే ధ్యానించును. నా నామమునే స్మరించును. నాకు సకలము సమర్పించి సంపూర్ణ శరణాగతిఁజేసి నన్ను స్మరించువానికి నేను ఋణపడినవాఁడను. ఆతనికి విముక్తి– ఆత్మసాక్షాత్కృతిఁ బ్రసాదించి నేను ఋణవిముక్తుఁడనగుదును. నన్నుదలఁచుచు నాకై పిపాసఁగనుచు, దేనినేని ముందుగ నాకు సమర్పించుకొనువానికి నేను బానిసీడనగుదును. నది సముద్రమున లయమగునటుల ఆవిధముగ నన్నుఁ జేరువాఁడు నాయందు లయించును. కావున గర్వాహంకృతులను– తుదకు వాని వాసనలనుసైతము విసర్జించి నీ హృదయాసీనుఁడవగు నన్ను శరణొందుము!' అని పలికిన బాబా అమృతసూక్తులను మనహృదయమున నిలుపుకొనఁదగును.

### నన్ను – నేను – ఎవరు ?

పలుమారులు బాబా ఈ 'నన్ను'–'నేను'– అను పదములకు నిర్వచనముఁ గావించియున్నాఁడు. 'నన్ను' వెదకుటకు నీవెక్కడకు

వెళ్ళవలసిన పనిలేదు. నామరూపముల కతీతమై నీయందు- సకల భూతములందు అగపడుచు 'అస్తి'-'ఉన్నాను'-అను ఎఱుకయే 'నేను'. దీనిని నీవు గుర్తించిన నీయందు సకలభూతములందు నన్ను చూడఁగలవు. దీనిని నీవభ్యసించుకొలఁది నా సర్వ వ్యాపకత్వమును గ్రహించి నన్ను పొందఁగలవు.

దైవముయొక్క అవతారములను- సాధువులను భక్తులను ప్రేమింపఁదగును. ఇతరజీవముల నేవిధముగ నొవ్వఁజేసినను వాఁడు నాకు బాధకలిగించినవాఁడగును. ఇతరులు తనకుఁ గలిగించు బాధను- అవమతిని సహించి యనుభవించువాఁడు నన్ను మిక్కిలి సంతోషపెట్టు వాఁడగును'- అని. బాబా పలుమాఱులు తెలిపినాఁడు. బాబా యీ విశ్వమున సకలభూతములందు వెలిని లోపలనంతట నావరించి యున్న వాఁడు. కావున ఆతండ్రికిఁ గావలసినది సకలభూతములయెడ ప్రేమ- నిర్వంచిత- నిర్మలప్రేమ' మాత్రమే- శ్రీసాయీ మహాప్రభుకీర్తిని ప్రేమతోఁ గీర్తించువారు- వినువారు ఆతండ్రినిఁ జేరుదురు.

## చంద్రాబాయి బోర్కార్ - విల్లెపార్లె [బొంబాయి]

చంద్రాబాయి రామచంద్రబోర్కార్ యొక్క ధర్మపత్ని. ఈమె తన అనుభూతినిఁగూర్చి 1936లందు- (తన 66వ యేట) పూజ్యశ్రీ. బి.వి. నరసింహస్వామిగారికిఁ దెలిపిన విషయములను గ్రహించుదము.

చంద్రాబాయి 1900 సంవత్సరప్రాంతమున శిరిడికి వెళ్ళి శ్రీ సాయీప్రభువును సందర్శించినది. అప్పటికి ద్వారకామాయి మసీదు పునరుద్ధరింపఁబడలేదు, 'సాఠేవాడ'యు నిర్మింపఁబడలేదు. బాబా ఆ రోజులలో నెక్కుడుకాలము మధుర నింబవృక్షముక్రిందఁ గూర్చుండు వాఁడు. బాబా నీటితో దీపములు వెలిగించిన దృశ్యము నీమె స్వయ

• సర్వనాకాధిపాచితాయ నమః

• తత్త్వమస్యాది లక్షితాయ నమః

ముగఁజూచెను. మసీదునందు గుడ్డపేలికలతో వ్రేలాడఁగట్టఁబడి, నలువైపుల దీపపు ప్రమిదలుంచఁబడిన బల్లపలకపై బాబా పరుండుటయు నీమె చూచినది. ఆరోజులలో నామె యెపుడు శీరిడికి వెళ్ళినను ఆ గ్రామజనుల గృహములందు నివసించినది.

చంద్రాబాయికి శ్రీసాయీనాథునందు గాఢమగు భక్తికలదు, ఆమెభక్తికి సదృశమగు అనుగ్రహమును బాబా ఆమెయెడ ప్రసరించినాఁడు. తన అనుభవములనుగూర్చి తెలుపుచు చంద్రాబాయి తన నేత్రములనుండి అశ్రువులు స్రవించుచు భక్త్యావేశమున డగ్గుత్తిక నొంది పలుక లేకపోయెను. [గౌరవము- ఆదరము- ప్రేమ- ఆనందము- విశ్వాసము- కృతజ్ఞత- ఎడబాటువలనకలుగు ఆవేదన- మొదలగు మిశ్రమమే 'భక్తి'- అని మనము గ్రహించవలయును.] ఈమె భర్త రామచంద్రబోర్కర్ ఎన్నడును శీరిడికి వెళ్ళి బాబాను దర్శించుకొనకున్నను ఆయనయెడ బాబాకు ప్రేమగలదు.

1909లో రామచంద్రబోర్కర్- [ఇంజినీరు] పండరిపురమున నొకవంతెన నిర్మాణము చేయుపని యందుండెను. ఆ సమయమున చంద్రాబాయి శీరిడికిఁజేరి బాబా సేవ చేయుచుండెను. అంతట నొక నాఁడు 'అమ్మా! నీవు పండరికి వెళ్ళుము. నేనును నీవెంట వత్తును. నాకు వాహనములతో నిమిత్తములేదు'.- అని, చంద్రాబాయితో బాబా చెప్పెను. ఆమె పాటి యిరువురను తోడుతీసికొని పండరికిఁజేరెను. అచట నామెభర్త తనఉద్యోగమును విడిచిపెట్టి వెళ్ళెనని తెలిసికొనినది. ఆమె దగ్గఅవారు మువ్వురు 'కుర్డ్వాడి' వరకు వెళ్లుటకు మాత్రము ధనముండుటచే వారు 'కుర్డ్వాడి' చేరిరి. ఆమె కేమియుఁ దోచక అయోమయ పరిస్థితియందుండి యేమియో యోజించుచుండెను. అంతలో నొకఫకీరు ఆమెయెదుటఁ బొడమి 'ఏమి యోజించు

చుంటివి, అని, ప్రశ్నించెను. ఆమె సమాధానము చెప్పలేదు, ఆమె భర్త 'ధోండ్'లో నుండెనని, వారుముగ్గురు 'ధోండు'నకు వెళ్ళఁదగు నని ఆఫకీరు తెలిపెను. 'కుర్డ్వాడి- నుండి 'ధోండ్'నకు వెళ్ళుటఎలా? నాదగ్గఱ రైలుచార్జీలేదే! అని చంద్రాబాయిపలుక, వెంటనే ధోండ్ నకు మూఁడుటిక్కెట్లు నామెచేతికిచ్చి ఆఫకీరు అదృశ్యుఁడయ్యెను.

వెంటనే వారుముగ్గురు రైలులో ధోండ్‌నకు ప్రయాణము చేయుచుండిరి. ఆసమయమున ధోండునందు ఆమె భర్త తేనీరుత్రాగి కునుకు పాట్లొందుచుండెను. ఒక ఫకీరు ఆతనియెదుటఁ బొడమి 'మా తల్లిని మఱచితివేమి? ఆమె యీరైలులో- ఈ నెంబరుగలపెట్టెలో ప్రయాణమై వచ్చుచున్నది'- అని ఆమె యెక్కినరైలుపెట్టె నెంబరు గల చీటినిచ్చెను. రామచంద్రబోర్కర్ అదిరిపడి లేచి, తనను మందలించుచున్నవారెవరా?- యనిచూచెను. కాని, ఆఫకీరు అదృశ్యుఁడయ్యెను. ధోండ్ స్టేషన్‌లో చంద్రాబాయిబండి దిగినతోడనే ఆమె భర్తనుచూచెను. వారందఱు విడిదికిఁజేరిరి, ఒక ఫకీరు తన యెదుట బొడమిచెప్పిన మాటలనుదెలిపి రామచంద్రబోర్కర్- ఆమె పూజించు సాయీబాబా చిత్రపటమును జూపుమని తనభార్య నడిగెను. ఆమె చూపెను. తనదగ్గఱకువచ్చిన ఫకీరు ఆతఁడేయని రామచంద్రబోర్కర్ గుర్తించెను.

ఉపాసనీమహరాజు (శ్రీ) సాయీప్రభువు పర్యవేక్షణమున శిరిడి యందున్నప్పుడొక గురుపూర్ణిమనాఁడు బాబా ఆదేశానుసారము చంద్రాబాయి పూజాద్రవ్యాదులఁ దీసికొని ఖండోబా దేవాలయమున కేగి యందున్న ఉపాసనీ మహరాజునకు బాబా ఆజ్ఞదెలిపి పూజింప మొదలిడ నామె నాటంకపఱపలేదు, ఆపిదప ఆమె ఉపాసనిని పూజించియెఱుఁగదు. ఆయనయందు 'గురుబంధుదృష్టి'- మాత్రము కలిగి

1 తత్త్వమూర్తయేనమః 2 పరిత్యాగాత్మ నిదర్శకాయనమః

యుండెడిది. శిరిడిలోనిజనులు ఉపాసనీ మహారాజును ద్వేషించినటుల ఆమె ద్వేషించలేక, ఎవరియందును ద్వేషము- అసూయ- ఈర్ష్యవహించుట- కలహించుట తగదనియు, ఎవరేని మనల ద్వేషించిన దూషించిన ఆచోటువిడచి, నామజపమునకు గడంగుట తగునని బాబా పలుమారులు బోధించిన బోధలామెహృదయమున లెస్సగ నాటుకొనినవి. ఆబోధలనామె చక్కగ ఆచరణమందుంచుకొనినది.

చంద్రాబాయినిగూర్చిన విషయములను S.C.S. (శ్రీ సాయీనాథ బోధామృతము పేరా- 555A 400, చూడుడు. ఈమె 7 జన్మములనుండి తనసోదరి యని బాబా తెలిపినారు- S.C.S. 474 A చూడుడు. బాబా యీమెను ప్రేమతో 'బాయి' అని పిలుచువాడు. మహాసమాధికి రెండు నెలలకు పూర్వము 'బాయి! ఇక నీవిక్కడకు వచ్చి శ్రమపడవలసిన పనిలేదు, నీవెక్కడనున్న నేనెల్లవేళల నీవద్దనే యుందును.'- అనినాడు [ఆమాటలు తెలుపుచు నామె కన్నులవెంట బొట బొట నీరుకార్చెను] బాబా ప్రేమ అపారము. ఆ మహాప్రభువు పలుకులు త్రిసత్యములు, అంతటనామె సెలవుగొనివెళ్ళెను. 1918 దసరా ముందు ఆమె 'పంచగని' యందుండెను. 'నిన్నుగూర్చి తలచు తలంచుచున్నాడు. బాబా యింక ఎంతోకాలము జీవించుననుతలంపు నాకు గలుగుటలేదు.'- అని కాకాదీక్షిత్తు ఆమెకువ్రాసిన ఉత్తరము అందగనే బాబా భౌతికజీవితమున తుదిక్షణమునకు ఆమె శిరిడి చేరినది. బాబా తుదిక్షణమున గొంతులో నీరుపోయు భాగ్యమామెకు గలిగినది.

ఆపిదప 1919యందు 1933నందు నామె శిరిడికి వెళ్లెను, బాబా వాగ్దానము చేసినటుల ఆమె యెక్కడనున్న నామెను ఆమెభర్తను కాపాడుచునే యున్నవాడు, మరాటీభాషలో కొన్నిపద్యములు నేయ

* తత్త్వమాలాధరాయ నమః

ములుగ తన అనుభవములను దెలుపుచు రచించి 'సాయిలీలామాసిక్' పత్రికయందు ప్రకటించినది. 1921 యందామె భర్త బండిమీదనుండి పడెను. కాలు విరిగెను. ఊదితో పట్టువేయుటచేత ఆకాలు 6 నెలలకు నయమయ్యెను. 1921యందు అనగా ఆమె 51వ ఏట కుమారుఁడు జనించెను. ఆవృత్తాంతము విచిత్రము.

1918లో నొకనాఁడు బాబా చంద్రాబాయినిఁజూచి, 'బాయి! నీ హృదయకామితమేమి?' అని, యడిగెను. 'బాబా! నీవు సకలము నెఱుఁగుదువు. నేను చెప్పవలసిన దేమికలదు?'— అని ఆమె సమాధానమిచ్చెను. 3 సంవత్సరముల తరువాత నామె బహిష్టు ఆగెను. అంతవరకామె గర్భిణికాలేదు. కొన్ని నెలలు గడచిన తరువాత 'డాక్టరు పురందరే' ఆమెను పరీక్షించి, యది కడుపులోపల నొకవిధమగు గ్రంథియని, అది శస్త్రచికిత్సచేతనే సాధ్యమగుననెను. 51వ సంవత్సరమున గర్భధారణము దుర్లభమని పలువురుచెప్పిరి. ఏమైనఁగాని పదిమాసముల కాలమువేచి చూచెదనని ఆమె నిశ్చయించుకొనెను. అఘటిత ఘటనాసమర్థుఁడగు (శ్రీ) సాయిప్రభువు అనుగ్రహమున 1921 లో ఆమెకు 51వ ఏట కుమారుఁడు జనించెను. ఆప్రసవము 'చెంబూరు' అనుగ్రామమున జరిగెను- అచట డాక్టరుగాని, మంత్రసానిగాని— మందులుగాని లేవు. ఆప్రసవదినమున పగలంతయు నామె పనులను నిర్వర్తించుకొనినది. రాత్రి యందామె సుఖముగ ప్రసవించెను. ఆప్రసూతికిఁబూర్వము 4, 5 మాసములామె ఆరోగ్యము సరిలేదు— కాళ్ళు వాచెను. ఆహారములేదు. చాలదినములు నీరు- ఊదిమాత్రమే తీసికొనినది.

ఆమెభర్త రామచంద్రబోర్కర్ మరణవిషయమున బాబా అనుగ్రహముఁ బ్రకటించినాఁడు. ఆ విషాదఘట్టమునకు 2 నెలలపూ

1 ప్రసన్నవదనాయ నమః

ర్యమున ఆమె మనస్సునట్టి విచారము నెమర్పోనుటకు సిద్ధపఱుపఁ దలఁచినాడు. ఆమె భర్తమృతికి రెండునెలలపూర్వము బాబా ఆమె స్వప్నమునఁ బొడమి 'విచారమువలదు— నేను శ్రీరాముని [రామ బోర్కర్] తీసికొనిపోవుచున్నాను.'— అనెను. అంతటనామె 'బాబా! నన్ను ముందుగ దీసికొనిపొమ్ము'- అని, కోరెను, 'నీకింకను పనులు-బాధ్యతలుకలవు, నీ గుండెనిబ్బరముఁ జేసికొనుము— నీవిధులను నీవు నిర్వర్తింపుము'- అని, బాబా తెలిపెను. ఆ స్వప్నవృత్తాంతమామె తనభర్తకుఁదెలుప నతఁడది స్వప్నము మాత్రమేయని నిర్లక్ష్యముఁ జూపెను.

చాతుర్మాసములింకను రెండునెలలుకలవు. తరువాత కొంతకాలమునకు రామచంద్రబోర్కరునకు మూత్రపిండముల సంబంధమగు వ్యాధి కలిగెను. ఎక్కిళ్ళునేర్పడెను, చరమకాలము సమీపించుచున్నట్లుండెను. తన కంత్యకాలము చేరువనున్నదని, యీ చాతుర్మాసములు గడచినపిదప ప్రాణముల విడువవలయునను బలీయమగుకాంక్ష తనకు గలదని తెలిపెను. అంతలో మరణచిహ్నములు తోఁచెను. అవయవములు బిగువుపాఱెను. స్మృతితప్పెను. అంతట చంద్రాబాయి దైన్యముతో 'బాబా! చాతుర్మాసములు గడచువరకు ఈకొలఁది దినములు నాభర్త ప్రాణములను నిలుపవే!'- అని, ప్రార్థించెను. మఱునాఁడాతనికి స్మృతిగలిగెను. అవయవముల బిగువువీడినది. అతనికి ఉత్సాహముకలిగెను. చాతుర్మాసములుదాటి 7 దినములు గడిచినవి. 1931 కార్తీకపూర్ణిమ గడచి పాడ్యమి తిథివచ్చెను. ఆరాత్రి అతఁడు తేనీరుత్రాగి, 'బాబాకు హారతిసమర్పించి, విష్ణుసహస్రనామములను బిగ్గఱగ పఠింపుము'-అని భార్యతోఁజెప్పెను. ఆమె ఆవిధముగఁజేసెను. తెల్లవాఱినది. ఉదయమున డాక్టరువచ్చి పరీక్షించి ఆశాజనకముగ నున్నదనిచెప్పెను. కాని, ఆమె మాత్రము భర్త జీవింపఁడని యొఱుఁ

1 తత్త్వసార విశారదాయ నమః

నను, గంగాతీర్థ మొసంగకిచ్చినది. ఆ తీర్థము గ్రోలి కొంతసేపటికి "శ్రీరామ! శ్రీరామ!" అనుచు కన్నుమూసినాఁడు. శ్రీకృష్ణ భగవానుని వానివద్దకు తన భర్తను జేర్పుమని చంద్రాబాయి బాబాను ప్రార్థించెను. శ్రీ సాయికృష్ణ భగవానునందు గాఢభక్తితో ఆ స్మరణతో నతఁడు ప్రాణములు విడిచినాఁడు. బాబా అనుగ్రహమున నతనికి సద్గతి కలిగినది–

భర్త మరణానంతరము పుత్రసంరక్షణమున వారికిఁగల ఋణములు తీర్చుటయందు బంధువులవలనఁ గలిగిన బాధల సహించుటయందు చంద్రాబాయికి బాబా తోడ్పడినాఁడు. బాబా స్వహస్తమునఁ బ్రసాదించిన 'ఉధీ' నామెయింట పవిత్రముగ భద్రపఱచినది. శాంతను ప్రసాదించుచున్న బాబాను 20 సంవత్సరములకాలము ప్రేమించి సేవించినది. బాబా పల్లు, నొకదానిని 'తాయెత్తు'గ ఈమె ధరించెను.

శ్రీ సాయినాథునందు ప్రగాఢ భక్తిఁబడసి బాబా అనుగ్రహపాత్రులగు శ్రీమతి చంద్రాబాయి బోర్కరునకు వందనశతము లర్పించుచు ఆతల్లి ననుగ్రహించినట్టుల మనల ననుగ్రహింపుమని శ్రీ సాయిగురు దేవునకు ప్రణామసహస్రము లర్పించుదము–

కైవల్యపదదాయకాయ నమః
తర్జితాంతకదూతాయ నమః
ఓమ్ శ్రీ సాయీశరణ్!

ననుసేవించుచు నాదునామము ననన్యశ్రద్ధ స్వాంతంబునన్
మననంబుం బొనరించు నాశ్రితుల, సంబంధీయుతౌవారి చెం
తనె నేనుందు, హితంబుఁగూర్చుదును; చంద్రాబాయిపై ప్రేమనో
మినవృత్తంబు సమాలకింపవో కో? ఏమీ, నిన్నుపేక్షింతునా?

# ఏమి, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదియొండవ ప్రకరణము

## 31 అనుగ్రహ లీల.

a) అప్పాసాహెబ్ - కులకర్ణి

b] హరిభావ్ కార్ణిక్–

సద్విషయము:-

మహాపురుషులైన సాధువులకు వందనముల సల్పుదము. సాధు సత్పురుషుల ప్రభావము వర్ణనాతీతము. వారి కరుణాకటాక్ష వీక్షణము మాత్రె మనపాప పర్వతములు నిర్మూలములగును. అమృతములొలుకు వారి పలుకులవలన మనకు చక్కని ప్రబోధకలుగును. 'ఇదినాది–అది నీది'– యను భేదప్రతిపత్తి వారియందు లవమేనియులేదు. 'వసుధైవ కుటుంబకమ్'– ఈ విశ్వమంతయు వారి కుటుంబమే. అట్టి సాధుసత్పురుషులు మనకు ప్రసాదించు విజ్ఞానసంపదకు మనమెంతయు ఋణపడియుందుము. వారి ఋణమెన్ని జన్మములనేని తీర్పుకొనఁజాలము.

## అప్పాసాహెబ్ కులకర్ణి--

బాబా భక్తులలో నితఁడొకఁడు, 1917నందు (శ్రీ) సాయినాథుని సేవించి పూజించు భాగ్యమితనికిఁగలిగినది. ఉద్యోగరీత్యా యితఁడు 'థానా' పట్టణమునకు బదిలీచేయఁబడెను. అచటనుండగ బాబాకుఁగూర్పు భక్తుఁడైన 'బాలాసాహెబ్ భాటే'తో నితనికి స్నేహమేర్పడెను. భాటే– బాబా చిత్రపటమొకదానిని కులకర్ణికి బహూకరించెను. అత్యంత భక్తిశ్రద్ధలతో నతఁడు నిత్యము బాబా చిత్రపటమును

పూజించుచుండెను. షోడశోపచార పూజఁ గావించువాఁడు. శ్రీసాయీ ప్రభుని దర్శనభాగ్య మెప్పుడెప్పుడు కలుగునా! యని తహ తహ పడినాఁడు. శ్రీ సాయీనాథుని భౌతికముగ సందర్శించి సేవించుటెట్టిదో ఆతఁడే చిత్రపటమును దర్శించి సేవించిన నట్టి సత్ఫలమును ప్రసాదించుననుటకీ క్రింది నిదర్శనము మనకు విదితము చేయఁగలదు.

## బాలాబువా సుతార్:—

బొంబాయిలో 'బాలాబువా సుతార్'— అనునొక భక్తుఁడు కలఁడు. అతని సత్ప్రవర్తనము— భక్తి— భజనతత్పరతల గుర్తించిన వారందఱు 'అభినవతుకారాం'అని అతనిఁ బిలుచువారు. తొలిసారిగ నతఁడు 1917న శిరిడికి వెళ్ళెను. అతఁడు ద్వారకామాయి మసీదుఁజేరి బాబా పాదములకు మ్రొక్కినతోడనే శ్రీ సాయీశుఁడతని నిర్దేశించుచు 'ఈతని నాలుగు సంవత్సరములనుండి యెఱుఁగుదును'— అని, అచటఁ జేరినవారితోఁ బలికెను. 'తాను శిరిడికిఁ జేరినది యిప్పుడేకదా! అట్టియెడ బాబా తనను నాలుగుసంవత్సరములనుండి యెఱుఁగుదును. అనుచున్నాడేమా?— యని 'బాలాబువా' ఆశ్చర్యపడెను. కాని దీర్ఘముగ నాలోచించి, తాను 4 సంవత్సరములకుఁ బూర్వము బొంబాయిలో బాబా పటము మ్రోలవ్రాలి నమస్కరించినవిషయము జ్ఞప్తికిఁ దెచ్చుకొని, బాబా పలుకులలోని సత్యమును గ్రహించెను.

'ఆహా! బాబా సర్వవ్యాపి-సర్వజ్ఞుఁడనుటకెట్టి సందేహములేదు. సాధుసత్పురుషుల సర్వజ్ఞత— ప్రేమ— వారు తమ భక్తులందు ప్రసరించు కరుణ ప్రశంసనీయములు, నేను బాబా పటము మ్రోల మోకరిల్లి నమస్కరించిన మాత్రమున ఈతండ్రి నన్ననుగ్రహించి తన చిత్రపటమును భక్తితో నమస్కరించిన తన్ను భౌతికముగఁ జేరి మ్రొక్కినదానితో సమము— అనుభావము నాకు స్ఫురింపఁజేసినాఁడు గదా!'—

♦ నిర్ద్వంద్వాయ నమః

అని. 'బాలాబువా' ఆనందాశ్రువులు స్రవించుచు బాబా పాదముల మరల మరల వ్రాలి మ్రొక్కినాడు. సర్వవ్యాపియైన తండ్రిప్రభువు నందుమాత్రము లేదుగదా? సోదరసోదరభక్తులు తాము బాబాను భౌతికతనువునందున్నవానిని సేవింపలేకపోతిమే!- కేవల చిత్రపటము నందుమాత్రము బాబాను పూజించుచుంటిమే!- అను సందేహము నొందవలసినపనిలేదు. బాబా సర్వవ్యాపి- సర్వాంతర్యామి- సర్వజ్ఞుడు కావున మనము పూజించి సేవించుపటమునందు నధివసించి యున్నవాడను విషయము మనము మఱువరాదు.

ఇంక 'అప్పాసాహెబ్'- విషయము గమనింపుదము. అతడు 'థాన'లోనుండగ, 'భీమండీ'- అనుగ్రామమున నొకవారము దినములు పనికలిగి 'మకాము'నకు వెళ్లెను. అతడింట లేనిసమయమున మూడవనాడీ విచిత్రసంఘటనము జరిగెను. మధ్యాహ్నసమయమున నొక ఫకీరు అప్పాసాహెబ్ గృహమునకేతెంచెను, అతని పోలికలు బాబా చిత్రపటమునందలి పోలికలకు సరిగనుండెను. కులకర్ణి భార్య బిడ్డలు 'మీరు శిరిడీలోని సాయీబాబాగారా?'- అని, ప్రశ్నించిరి. 'కాదు-కాను, ఆయన విధేయుడను సేవకుడను. ఆయన పనుపున మీ కుటుంబ యోగక్షేమములు గనుగొనుటకేతెంచితిని'- అని, ఆఫకీరు సమాధానమిచ్చెను. దక్షిణనిమ్మని ఆ ఫకీరుకోరగ అయిల్లాలొక రూపాయి నొసంగెను. అతడొక "ఉధి" పొట్లమునొసగి, దానిని పూజామందిరమున పటముదగ్గఱబెట్టి పూజింపుడు!- అనిచెప్పి ఆఫకీరు వెడలిపోయెను. ఇంక ॐ సాయీప్రభువు విచిత్రలీలలను గమనింపుడు !

'భీమండీ'లో గుఱ్ఱమునకు జబ్బుచేసిన కారణమున అప్పాసాహెబ్- తానేర్పఱచుకొనిన మకాములకు వెళ్ళలేక ఆ మూడవనాటి

శ్రీ తెమసంపరాయి నమః

సాయంత్రమే యతఁడింటికిఁ దిరిగివెళ్ళెను. ఆతనిభార్య ఫకీరు వృత్తాంతమును దెలిపెను. ఆ సాధుసత్పురుషుని దర్శనభాగ్యము తనకుఁగలుగకపోయెనేయని విచారపడి ఒక్క-రూపాయి మాత్రమాతండ్రికిచ్చి పంపించినందుకు కటకటపడెను. తానేయుండిన పదిరూపాయలకుఁదక్షి-వయిచ్చి యుండెడివాడనుకానని పలికెను. అంతనతఁడు భోజనము చేయకయే ఆ ఫకీరుకొఱకు మసీదు- తదితర స్థలములన్నిటను వెదకెను, కాని ప్రయోజనము లేకపోయెను అంతట నింటికిఁదిరిగివచ్చి భోజనముఁజేసెను.

సోదరభక్తులీవిషయము గమనింపఁదగును. బాబా పలుమాఱులు తనబిడ్డల కెఱుకపఱచిన విషయమిది. 'ఆకలికడుపుతో భగవంతునన్వేషించవద్దు"— అని బాబా భక్తుల చరిత్రలలో నీవిషయము పలుతావులఁ దెలుపఁబడినది, బాబా తన పూర్వజన్మమున గురువును గూర్చి తెలిపినది, 'వనజారి' వృత్తాంతము S.C.S.175 చూడుడు. అప్పాసాహెబ్ నకు ఈ విషయము బోధింపఁబడినది. భోజనానంతరమతఁడుబుసుపోకకు బయలుదేరెను. అతని మిత్రుఁడు 'చిత్రే' అను వాఁడు వెంటనుండెను. కొంచెము దూరమేగ నొకవ్యక్తి త్వరత్వరగ తనదగ్గఱకు వచ్చుట నతఁడు గమనించెను, బాబా పటమునఁగల పోలికలతనికిఁ గలిగియుండుటచే ఆ మధ్యాహ్నము తన గృహమునకు విజయముచేసిన సాధువతఁడేయని అప్పాసాహెబు తలంచెను. ఆ ఫకీరు వెంటనే చేతినిసాచి దక్షిణనిమ్మని కోరెను. అప్పాసాహెబు ఒకరూపాయి యిచ్చెను. మరల మరలనడుగ రెండు రూపాయలిచ్చెను, కాని, ఆఫకీరు తృప్తిపడక మాఱలనడిగెను. కులకర్ణి తనవెంటనున్న మిత్రుని దగ్గఱ అరువుతీసికొని 3 రూపాయలిచ్చెను. ఇంకను తెమ్మని ఫకీరు అడుగఁ దనవెంట నింటికిరమ్మని అప్పాసాహెబు కోరెను. ఇంటికేగిన

* దక్షిణాప్రార్థనద్వారా శుభకృతత్త్వబోధకాయ నమః

తరువాత మరల మూఁడు రూపాయలిచ్చెను. దానితో మొత్తము తొమ్మిది రూపాయలైనవి. అప్పటికిఁ దృష్టివశత మరల దక్షిణకోర, తన దగ్గర పదిరూపాయలనోటు మాత్రము కలదని కులకర్ణి తెలిపెను. ఆనోటు తెమ్మని ఫకీరు కోరెను. కులకర్ణి యిచ్చిన పదిరూపాయలనోటు తీసికొని ఆ ఫకీరు 9 రూపాయలు తిరిగియిచ్చెను. అంతట నా ఫకీరు వెడలిపోయెను.

అప్పాసాహెబు తన భార్యతో 'నేనే యున్నయెడల పదిరూపాయలకు తక్కువయిచ్చి యుండెడివాఁడనుకాను.'— అని పలికినాఁడు. అందుచే బాబా ఆ పదిరూపాయలను స్వీకరించి తన దివ్యామృతహస్తమున పవిత్రీకృతములైన తొమ్మిది రూపాయినాణెములను అతనికిఁ బ్రసాదించినాఁడు. ఆ నవసంఖ్య (తొమ్మిది) గమనింపఁదగినది. అది నవవిధ భక్తులను సూచించును. [S.C S. 117] బాబా తన తుది గడియలందు 'లక్ష్మీబాయిసింధే'కు 9 రూపాయలు ప్రసాదించిన విషయము సోదరభక్తులు గమనింపఁదగును. [చూడుడు చరమలీల].

అప్పాసాహెబ్- ఉధిపొట్లమును పరిశీలించెను. అందు ఉధి- పత్రములు- పుష్పములు- అక్షతలుండెను. తరువాత కొన్ని దినముల కతఁడు శిరిడీకి వెళ్ళి బాబా సందర్శనముఁ జేసికొనినపుడు బాబా కేశ మొకటి అతనికి లభించెను ఆ కేశము ఉధిపత్రి పుష్పాక్షతలను ఒక తాయెత్తునఁ జేర్చి తన చేతికిఁ గట్టుకొనెను. బాబా అనుగ్రహము-ఉధి ప్రభావము నతఁడు స్వానుభవమున గుర్తించెను. తొలుత 40 రూపాయలు వేతనముగల గుమాస్తాగా ప్రారంభించిన అప్పాసాహెబ్ బాబా ఆశ్రయమున ఉధిప్రభావమున ఆనలుబదిక నేక మడుంగుల వేతనమును సంపాదింపఁ గలిగెను. ఈ లౌకిక కామితములనేగాక అప్పాసాహెబు

అతిత్వరితముగ ఆధ్యాత్మిక చింతనాభివృద్ధియు నొందెదరు. 'బాబా ఆశ్రయము'ను సోదరభక్తులు గమనింపఁదగును. ఊదీ ప్రసాదముపొందిన భాగ్యవతములు నిత్యము స్నానానంతర మొకింతనొసట నలఁదికొని, యించుకంత నీరమునఁజేర్చి ఆతీర్థమును పానించిన నిరామయ సుఖ సంతోషములఁ బడయఁగలరు.

హరిభావ్ కార్ణిక్:- [సాధువులందభేదసితి]

థానా జిల్లాలోని 'దహాన్' అనుపురమునుండి 1917 ఆషాఢ పూర్ణిమ [గురుపూర్ణిమ] నాఁడు 'హరిభావ్ కార్ణిక్'— అను నతఁడు శిరిడికివెళ్ళి సమ్యగ్విధానమున బాబా పూజగావించి బాబాకు వస్త్రములు దక్షిణ సమర్పించెను. ఆ మఱునాఁడు శ్యామాద్వారా బాబా సెలవుపొంది మసీదుమెట్లు దిగుచుండెను. ఆసమయమున నింకొక రూపాయి బాబాకు సమర్పించిన బాగుండునను తలంపుగలిగి వెనుకకు దిరిగి మెట్లెక్కఁబోవుచుండ శ్యామా ఆతనినివారించి సైగరూపమున, బాబా సెలవొందినతరువాత వెళ్ళవలయునే కాని, మరల తిరుగరాదు. అను భావమును దెలిపెను, అంతట కార్ణిక్ తనగ్రామమునకు బయలు దేరెను. మార్గమధ్యమున నాశిక్‌లోని 'కాలారాం' కోవెలలోనికి స్వామిదర్శనమునకై వెళ్ళెను. ఆ కోవెలలోపల భక్తజన పరివృతుఁడై యున్న సాధువు నరసింగ్ మహరాజు తనభక్తులనువిడిచి వెలుపలకు హరిభావ్ దగ్గఱకువచ్చి చేతినిఁబట్టికొని 'ఏది నారూపాయి నిటులిమ్ము!' అని యడిగెను. కార్ణిక్ ఆశ్చర్యపడి (శ్రీ) సాయీప్రభువునకుఁ దానీయఁదలఁచికొనిన రూపాయిని నాశిక్‌లోని నరసింగ్ మహరాజు రూపమున దాను రాఁబట్టుకొనఁ జూచెనని బాబా కరుణకు సంతోషించి అత్యాప్యాయతతో నారూపాయిని సమర్పించెను.

౹ భావగమ్యాయ నమః
౹ తామరసదళాక్షాయ నమః

ఈ వృత్తాంతమువలన సాధుసత్పురుషులందఱు నేకమేయనియు వారియందెట్టి భేదప్రతిపత్తి లేదనియు నెల్లరు నేకైకదృష్టితో నాశ్రితుల ననుగ్రహించువారను విషయము విదితమగుచున్నది. లోఁగడ నిట్టివిషయములు పెక్కుతావులఁ దెలుపఁబడినవి.

శ్రీ సాయీప్రభువుయొక్క అనుగ్రహమునకు పాత్రుఁడైన అప్పాసాహెబు కులకర్ణి — హరిభావ్ కార్ణిక్ లకు వందనశతము లర్పించుచు వారిననుగ్రహించినటుల మనల ననుగ్రహింపుమని శ్రీసాయీ నాధునకు ప్రణతి సహస్రము లర్పించుదము.

శ్రీ తీర్థపాదాయ నమః
ఓమ్ శ్రీ సాయీశరణ్!

ప్రతిమఁ జిత్రపటంబునందునను సంభావించినన్ లేక, ప్రాకృత దేహంబునఁగొల్చినఁ సమము; సాయీ సర్వభూతాత్మక స్థితిమాత్రంబెద విస్మరింపకుమినన్ సేవింప! 'బాలాబువా' యితివృత్తంబున బోధఁజేయనోకో? ఏమో, నిన్నుపేక్షింతునా?

# ఏమివ్వ, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదియొనిమిదవ ప్రకరణము

## 32 అనుగ్రహ లీల.

## బాపూసాహెబ్ జోగ్ (సఖారాం - హరి)

సద్విషయము:-

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః.

పెక్కుజన్మంబులెత్తినపిదప జ్ఞాన
వంతుడై 'యీసమస్తము వాసుదేవు
డొక్కడే' యంచు నెఱిఁగి నన్నొందఁగలుగు
నామహాత్ముఁడు దుర్లభుఁడనఘ చరిత !

[శ్రీమద్భగవద్గీతామృతము 7—19]

అవి, శ్రీకృష్ణభగవానుఁడు తెలిపినాఁడు. మానవుఁడై జన్మిం చినపిదప జీవితలక్ష్యము భగవానునిఁ బడయుటయే. అదియొక జన్మ మున సాధ్యమగునదికాదు. పురాకృత సుకృతపరిపాకమున సాధుసత్పు రుషుల సేవలచే వారి అవ్యాజ కరుణాకటాక్షమున లభ్యముకావలసి నదే. వేఱుమార్గము లేదు.

సమ సద్గురుదేవుఁడగు శ్రీ సాయినాథుఁడు తన శరణుఁ జొచ్చిన బి లను క్రమమున నైతికముగ- ఆధ్యాత్మికముగఁ జక్కదిద్ది తన అనుగ్రహమునకుఁ బాత్రులఁ గావించును. లోఁగడఁ దెలుపఁబ డిన భక్తుల వృత్తాంతములందు బాబా ఎట్టుల తన అంకితసంతతిని

జక్క-దిద్ది లౌకికముగ వారు పయనింపఁగలిగినంత దనుకఁ గొనిపోయి నాఁడో విశదము కాఁగలదు. సద్గురువు తన ఆశ్రితునియందు మొదట పాత్రతాశుద్ధిఁ గలిగించును. ఆకారణముననే బాబా తనగురువు తన్నుఁ గోరినది- తనబిడ్డలవలనఁ దానుగోరినది రెండు కానుకలని పలుమాఱులు తెలిపినాఁడు. 1. నిష్ఠ (గాఢవిశ్వాసము) 2 సబూరి [ధైర్యముతోఁ గూడినఓర్పు)

ఆయాజీవుల సంస్కారములు భిన్నములు. వానిని సమర్థసద్గురుదేవుఁడెఱుంగును. మాయాబద్ధులైన జీవులెఱుఁగరు. [తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థపరంతప'- (భ.గీ. 4-5)] అనుచే శ్రేయస్కాముఁడు తన గురుదైవమునకు సంపూర్ణ శరణాగతిఁజేసి ఆగురువు ఆజ్ఞలను ప్రత్యక్షరముఁ బాటించి తీఱవలయును. బాబా భక్తుల వృత్తాంతములలో- బాబా ఆయాబిడ్డల ననుగ్రహించి నడిపించిన విధానములలో మనము చదువఁదగినవి కథలు- చమత్కారములు- వింతలు వినోదములుకావు. ఆతండ్రి వివిధములగు అనుభూతులద్వారా తన వానికిఁ గఱపిన ప్రబోధమును మనము గుర్తించవలయును. ఒకొక్క భక్తుని పురస్కరించుకొని పెక్కునైతిక- ఆధ్యాత్మిక ప్రబోధలఁగావించినాఁడు.

## బాపూసాహెబ్ జోగ్ :- (సకారాంహరి)

ఈయన 'పూనా' నివాసియు, ప్రసిద్ధుఁడైన వార్కారి 'విష్ణుబువాజోగ్' యొక్క పినతండ్రి, P.W. డిపార్టుమెంటులో సూపర్వైజరు ఉద్యోగముచేసి, వయస్సుకారణమున ఉద్యోగమునుండి విరమించినాఁడు. 1909 యందు ఇతఁడు శిరిడికిఁజేరి, తనభార్యతో శిరిడియందే నివసించెను. వీరికి సంతానములేదు. ఈదంపతులిరువురు బాబాను మిక్కిలి ప్రేమించి, వారి జీవితశేషమంతయు శ్రీ సాయీసేవతోఁ గడ

పిరి మేఘుడు [మేఘశ్యాముడు]సిద్ధిపొందిన పిదప ద్వారకామాయి మసీదునందు– చావడియందు– బాబా పూజ– హారతులు మొదలగు పనులను జోగ్ కావించువాడు. అటుల బాబా మహాసమాధివరకు గావించినాడు. మహల్సాపతి– శ్యామా– తాత్యాపటేల్ తరువాత బాబాతో సన్నిహిత సంబంధముగలవాడు బాపూసాహెబ్ జోగ్ అని చెప్పదగును. బాబా పూజ– హారతులపనులేకాక, 'సాతేవాడ' లో నిత్యము జ్ఞానేశ్వరి– ఏకనాథభాగవతము చదివి శ్రోతలకు వినిపించు పనియు నీతనికి బాబా కల్పించినాడు.

## కోపమంతగదని జోగ్‌ను బాబా మందలించుటః-

ఒక సందర్భమున బాబా దక్షిణనిమ్మని బాపూసాహెబు జోగు నడిగెను. జోగు తనశాంతిని గోల్పోయి 'బాబా! నాదగ్గఱ పైసా కూడ లేదని నీవెఱుగుదువుగదా! నన్ను దక్షిణనిమ్మని అడుగుదు వేమి?' అని, ఉద్రిక్తుడై యనెను. 'ఉయకున్న [నీదగ్గఱలేకున్న] మానుము. నీకు కోపమెందుకు?'– అని, బాబా సౌమ్యముగ దెలియజెప్పినాడు. [S.C.S. 209] ఈ సందర్భమును పురస్కరించుకొని తనవాడు– ఇతరులతో– పేదసాధులతో– నెట్లు ప్రవర్తింపదగునో బాబా మనకు దెలిపినాడు.

## జోగ్—గోదావరి స్నానముః–

1910 నవంబరున బాపూసాహెబ్ జోగు బాబాను జేరి, 'బాబా! రేపు పర్వదినముగదా! వెళ్ళి గోదావరీజలమునందు స్నానముచేసి వచ్చుటకు సెలవిమ్ము!' అని, కోరెను. బాబా 'వలదు' అనెను. మన స్సునందసంతృప్తినొందినను బాబా ఆజ్ఞను మీఱరాదు కావున జోగు తన ప్రయాణమును విరమించెను, మఱునాటి ఉదయమున శిరిడిలోని జనులు బాబానుజేరి, 'ప్రభుత్వమువారు 1913 వరకు నీళ్ళవదలరాదని

ఉత్తర్వులిచ్చినను క్రొత్తగాత్రవ్విన కాలువనుండి గోదావరిజలము శిరిడికి వచ్చినవి' అని తెలిపిరి. అంతట బాబా మన జోగువంకఁజూచి, 'చూచితివా? జోగ్! ఆ భగవానుఁడెంత దయామయుఁడో!' అనెను. మనము కోరుకొను కోరికలు హితకరములైన దైవము వైళమ అను గ్రహించి తీర్చునని మనము గ్రహించవలయును. (S.C.S. 376)

## పితృశ్రాద్ధము - బ్రాహ్మణులు

పితృశ్రాద్ధము సమీపించుచుండగ జోగ్ ఒకనాఁడు బాబాను జేరి, 'బాబా! కోపర్గామునకువెళ్ళి, పితృశ్రాద్ధము జరుపుటకు నాశాఖ బ్రాహ్మణులను ఏర్పాటుచేసికొని రావలయును సెలవిమ్ము!'- అని, కోరెను. బాబా వలదనెను, 'అయితే, బాబా! పితృశ్రాద్ధమును మానుకొనుమందువా? యని, జోగ్ ప్రశ్నింప, ఇంక నాలుగుదినములు వ్యవధికలదుగదా! చూచెదముగాక! యని బాబా పలికెను. రెండుదినములు గడచినపిదప మరల జోగ్ శ్రీ సాయీప్రభువునుజేరి, మాశాఖ బ్రాహ్మణులు కావలయును నన్ను వెళ్ళనీయుము- అని, కోరెను. వారే వత్తురు- అని బాబా సమాధానమిచ్చెను 'ఇచట శ్రాద్ధవిషయము వారెఱుఁగుదురా? అని జోగ్ ప్రశ్నింప బాబా 'ఔ'ననెను శ్రాద్ధదినమున 'పుంతంబి'- అనుగ్రామమునుండి యిరువురు బ్రాహ్మణులు శిరిడికివచ్చి బాబానుజేరి 'ఇచట బ్రాహ్మణభోజనము దొరకునా?'- అని' అడిగిరి. బాబా వారిని జోగు గృహమునకు వెళ్ళుఁడనెను. వారువెళ్ళిరి. ఆవచ్చిన బ్రాహ్మణులు వేదశాస్త్రజ్ఞయున సంపన్నులైన తనశాఖ బ్రాహ్మణులని జోగు గుర్తించెను. అఘటిత ఘటనాసమర్థుఁడగు బాబా ఎఱుఁగనిది- కూర్పఁజాలనిది లేదుగదా? (S.C.S 377)

## జోగ్ ఇచ్చిన ఋణము :-

బాపూసాహెబుజోగు- ఔరంగబాదులోని యొకనికి 140 రూపాయలు ప్రోనోటు వ్రాయించుకొని అప్పునిచ్చెను. ఆనోటు వ్రాయి

దా వెళ్ళఁబోవుచుండగా తన బాకీ రాఁబట్టుకొనుటకు జోగుబాను నకు వెళ్లఁదలచి బాబా సెలవుకోరెను. ఆబాకీదారుఁడు తనకుదానే యిక్కడకువచ్చును- అప్పుడడుగుము- అని బాబా తెలిపెను. అంతట జోగు ఉద్రిక్తుఁడై 'నన్ను రెండు మూఁడువేల రూపాయలను వదలు కొమ్మందువా? రేపటినుండి నీపూజ- హారతి జరుపను, చేతిలో ధనము లేక నేనిక్కడ ఎట్లు బ్రతుకఁగలను,?' అని పలికెను. అంతట బాబా 'నీ ధనమెక్కడకుఁ బోవును ? కదలక యింటిలోఁ గూర్చుండుము! అదియే నీయింటికివచ్చును'- అని సౌమ్యముగ సమాధానమిచ్చెను. 'నీమాటలు వినఁజాలను. ఆ బాకీదారుఁడు తనకుఁదానై వచ్చునం దువా? నేను వానిదగ్గఱకు వెళ్ళినపుడు చెల్లించినవాఁడుకాఁడు. దావా వేసినఁగాని పైకము చెల్లించఁడు,' అని జోగుపలికెను. 'ఆవిషయమటు లుండనీయుము!'- అని బాబా తెలిపెను.

జోగు తనబాకీ రాఁబట్టుకొను విషయమై ఆసలు వదలుకొనెను. ఆనోటు వాయిదా వెళ్లిన చాలకాలమునకు ఆబాకీదారుఁడు శిరిడికి వెళ్లి తాను అప్పుగాఁ దీసికొనిన అసలు 1400 రూపాయలు జోగునకీయఁ జూపెను. జోగు అంగీకరింపలేను. అంతట బాబా ఆపైకముఁ దీసికొని నోటు రద్దువ్రాసి యిమ్మనెను. జోగు ఆధనముఁ దీసికొని బాబా ముందుంచెను. ఆధనమునందు కొంత బాబా తీసికొని మిగిలినది జోగున కిచ్చెను. కుసీదవృత్తి (వడ్డీవ్యాపారము) తగదని బాబా బోధించినాఁడని మనము గ్రహింపవలయును, [S.C S. 378-230]

తన అంకితసంతతితో ననేకజన్మములనుండి సంబంధముకలదని బాబా తెలిపినాఁడు- ఆయాభక్తుల వృత్తాంతములందు పాఠకులీవిషయముఁ గ్రహింపగలరు. ఒకసందర్భమున బాబా జి. యస్. కపర్దేతో

నేను - నీవు [కపర్డే] జోగ్ - కాకా (హరిసీతారాం దీక్షిత్తు) శ్యామా-
[మాధవరావు దేశపాండే] దాదాకేల్కర్ - మనమందఱము పూర్వ
జన్మమున గురువు దగ్గఱ చీకటిలోయ యందు జేరియున్న శిష్యులము.
ఆ కారణము చేతనే వీరినందఱను మఱల నొకచోటునకుఁ జేర్చినాఁడను' -
అని తెలిపినాఁడు. (S.C.S 502)

## బాపూసాహెబ్ జోగ్ - సన్న్యాసము:-

కొన్ని సంవత్సరములు గడచినపిదప ఒకసమయమున జోగ్ బాబాను జేరి, 'బాబా! అనన్యభావమున నిన్ను పెద్దకాలము సేవించితిని కాని, నామనస్సునకు శాంతి కలుగలేదు. సాధుసత్పురుషుల సాంగత్యము పెక్కుసంవత్సరములు గలిగియు ఆధ్యాత్మికనిష్ఠ పెంపొందలేదు. నన్నెప్పటికి అనుగ్రహింతువు?' అని ప్రార్థించెను. భక్తుని ప్రార్థనమును విని, 'క్రమముగ కొలదికాలములో నీ దుష్కర్మఫలములు క్షయించును. నీ సుకృత దుష్కృత ఫలములన్నియు నిర్మూలమైన పిదప ప్రతిబంధము లన్నిటినుండి విడివడి నిండుమనస్సుతో భగవానుని సేవించి - (నావలె కుప్ని దాల్చి, భిక్షాపాత్రఁబూని భిక్షించుచు సేవించునప్పుడు) సన్న్యాసము స్వీకరించినప్పుడు నీవనుగ్రహింపఁబడుదువు - నేను సంతోషింతును.' - అని, శ్రీ సాయీప్రభువు తెలిపెను.

కొంతకాలము జరిగినతరువాత బాబా పలికిన పలుకులు సార్థకములైనవి. బాపూసాహెబ్ జోగ్ భార్య ముందుగ గతించెను. ఇఁక తనికిఁగల ప్రతిబంధకములన్నియుఁ దొలగెను. బంధవిముక్తుఁడగుటచే పూర్ణవైరాగ్యము పొడకొనెను. చరమదశయందు సన్న్యాసము స్వీకరించెను. బాబా అనుగ్రహమున పురాకృత సుకృతవిశేషమున వితలక్ష్యము సద్గతిని పొందఁజాలెను.

శ్రీ సాయీనాథుని పెద్దకాలము సేవించి బాబా అనుగ్రహపాత్రుఁడై సద్గతిఁబడసిన బాపూసాహెబ్ జోగ్ [సఖారాం-హరి] నకు వందనశతము లర్పించుచు, జోగు ననుగ్రహించినటుల మంల ననుగ్రహింపుమని సద్గురుదేవుఁడగు శ్రీ సాయీనాథునకు ప్రణామసహస్రములర్పించుదము.

ధర్మసంస్థాపనసంభవాయ నమః
సఖారామ సశిష్యాయ నమః [S-C.S. 494?]
సనాతనాయ నమః

ఓమ్ శ్రీ సాయీశరణ్!

దురహంకార దురాగ్రహంబులవి శత్రుల్ వానిఁబోకార్చి, యె
త్తఱినిన్ లౌకికవాంఛలన్ దవిలి యుండన్‌బోక, వైరాగ్యవి
స్ఫురణన్ నిర్మలభక్తిసేయు, మిట బాపూసాహెబ్జోగునా
యురవున్ జేర్చి యనుగ్రహింపనోకో? ఏమీ, నిన్నుపేక్షింతునా?

# ఏవిరా, నిన్నుపేక్షింతునా ?

## ముప్పదితొమ్మిదవ ప్రకరణము

## 33 అనుగ్రహ లీల.

## రామచంద్ర ఆత్మారాం తార్ఖడ్ కుటుంబము

[ప్రేమతో సమర్పించుదానిని బాబా స్వీకరించును.]

సద్విషయము:-

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః,

ఎవఁడు భక్తితోఁ బత్రము నేనిఁ బుష్ప
మేని ఫలమేని జలమేని నిడునొ నాకుఁ
బార్థ! నిష్కామభక్తుఁడౌ వాఁడొసంగు
నట్టి భక్తికానుకఁ బ్రీతినారగింతు.

[భ.గీత. 9-26]

అని, శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునకుఁ దెలిపినాఁడు. ఇక మన కృష్ణసాయి తన బిడ్డలిడు భక్తికానుకలను స్వీకరించువిధముఁ దెలిసికొందము.

## తార్ఖడ్ కుటుంబము -
## (రామచంద్రఆత్మారాం తార్ఖడ్)

రామచంద్ర ఆత్మారామ్ (వరఫ్) - - తార్ఖడ్ తొలుత ప్రార్థన సమాజము (బ్రహ్మసమాజము)నకుఁ జెందినవాఁడు.

పిదప (శ్రీ) సాయీప్రభువునందు గాఢభక్తి నెలకొల్పినాఁడు. ఆయన భార్యయు- కుమారుఁడును ఆయననుసరించిన బాబా భక్తులు. ఒకసంవత్సరము మే నెల సెలవలకు తార్కాడ్ కుమారుఁడు తల్లితోఁడ శిరిడీకి వెళ్ళి బాబా సన్నిధినుండవలయునని తలంచెను. కాని, తాను వెళ్లిన బొంబాయిలోఁ దనయింటఁగల బాబా యొక్క పెద్ద చిత్రపటమునకు యథావిధిపూజలు జరుగవేమోయని, తన తండ్రి ప్రార్థనసమాజమునకు, జెందినవాఁడగుటఁ జేసి నిర్లక్ష్యము చేయునని ఆబిడ్డ శిరిడికి వెళ్లుటకు సందేహించెను. తండ్రి కుమారుని సందేహమెఱిఁగి, బాబా పూజ యందెట్టిలోపము గలిగించనని, సక్రమముగఁ బూజింతునని తన బిడ్డకు నచ్చఁబలికెను. అంతట తల్లికొడుకులు శుక్రవారమునాఁడు శిరిడికి బయలుదేరిరి.

మఱునాఁడు శనివారము స్నానాదులఁగావించి, తార్కాడ్ బాబా పూజామందిరమునఁ బ్రవేశించి, బాబా పటము మ్రోలసాగిలఁబడి, "బాబా! నాబిడ్డ నీకు నిత్యముఁ గావించు పూజాకార్యభారము నేను స్వీకరించితిని. ఇందెట్టిలోపము గలుగనీయక మన్నింపుము'- అని ప్రార్థించి, బాబా పూజసలిపి కలకండ నివేదించెను. ఆ ప్రసాదమును మధ్యాహ్నభోజనసమయమున నెల్లరు స్వీకరించిరి. ఆ మఱునాఁడు ఆదివారమున పూజ యథావిధిజరిగెను. సోమవారము తార్కాడ్ ఆఫీసునకు వెళ్ళవలసినదినము, ఆరోజునను పూజ సక్రమముగజరిపి, తానెన్నడు బాబా పూజఁగావింపకున్నను. తనబిడ్డకు మాటనిచ్చిన విధమున ఆమూఁడుదినములు పూజలు లోపములేకుండ జరిపినందులకు సంతుష్టి సంతృప్తులఁ బొందినాఁడు. మఱునాఁడు మంగళవారము ఉదయమున బాబా పూజసలిపి ఆఫీసునకువెళ్ళి మధ్యాహ్నభోజనమునకింటికిఁ జేరెను. భోజనసమయమున ప్రసాదము స్వీకరింపఁబోవనచట

1 తుల్యనిందాత్మ సంస్తుతయే నమః

ప్రసాదములేమి వంటనుగాని ప్రత్యేకమగు ఆకడవముముగ ప్రసాదము నివేదింపఁ బడలేదని అతఁడనెను. అంతట తార్ఖడ్ తనపీఁటనుండి, లేచి, బాబా పూజామందిరమునఁ బ్రవేశించి, సాగిలఁబడి మ్రొక్కి-తన ఏమరుపాటును క్షమింపుమని ప్రార్థించెను. అంతట నాదినమునఁ దనపెద్దకుఁ (శిరిడికి) ఉత్తరమువ్రాసి, దానిని బాబా పాదములమ్రోల నిలిపి, తనతప్పు మన్నింపుమని బాబాను ప్రార్థింపవలసినదిగ కోరెను. ఈ విషయము బాంద్రాలో (బొంబాయి) మంగళవారము మధ్యాహ్నము జరిగెను.

ఆసమయమున శిరిడీయందు మధ్యాహ్నహారతి జరుగనుండెను. బాబా తార్ఖడ్ సతినిఁ జేరఁబిలిచి, 'అమ్మా! బాంద్రాలోని మాయింటికిఁ దినుటకేమేని దొరకునేమో యని వెళ్ళితిని. తలుపులు మూయఁబడియుండెను, ఏదో యొకవిధమున లోనికిఁ బ్రవేశించి చూచితిని, భావ్ [తార్ఖడ్] భక్షించుటకు నాకేమియు సమర్పించినవాఁడు కాఁడు-ఆకలితోఁ దిరిగివచ్చితిని'- అని, పలికెను. ఆపలుకులు తార్ఖడ్ సతికి బోధపడలేదు. కాని, ఆమె చెంతనున్న ఆమె కుమారుఁడు వెంటనే గ్రహించి, బాంద్రాలో తనయింట బాబా పూజలో నేదో ఒక లోపము జరిగెనని తెలిసికొని, 'బాబా! నేను యింటికి వెళ్లుదును, సెలవిమ్ము!' అని, ప్రార్థించెను. బాబా నిరాకరించి, 'అచటకుఁబోవ నేల?- ఇచటనే పూజఁగావింపుము!' అని నచ్చపలికెను. అంతట తార్ఖడ్ కుమారుఁడు శిరిడిలోజరిగిన విషయముఁ దెలుపుచుఁ దండ్రికి ఉత్తరమువ్రాసెను. ఆ రెండుఉత్తరము లెదురుముఖములై మాఱు నాఁడికువ్వరకుఁ జేరెను. బాబా సర్వాంతర్యామిత్వము- సర్వజ్ఞత్వముఁ దెలుపు విచిత్రసంఘటనము లింతకంటె నేమికావలయును?

భాగవతప్రధానాయ నమః

తుల్యాధికవిహీనాయ నమః

## తార్ఖడ్‌సతి - (1భరీత్) - (2కాచర్యా)

ఒక సమయమున ఆర్.బి. పురందర్ కుటుంబముతో శిరిడికి వెళ్ళ సిద్ధపడెను. ఆవిషయముఁ దెలిసికొని తార్ఖడ్‌సతి కొన్ని వంకాయలు- సుగంధద్రవ్యములు- నేయి- పురందర్ భార్యకిచ్చి 1భరీత్ (వంకాయి పెరుగుబజ్జీ) 2 కాచర్యా (వంకాయ చక్రములతఱిగి నేతిలో వేల్చినకూర) సిద్ధపఱచి బాబాకు సమర్పింపుమని తెలిపెను. పురందర్ కుటుంబముతో శిరిడికి వెళ్ళెను. ఆతనిభార్య వంకాయపెరుగుబజ్జి సిద్ధము చేసికొని బాబా భుజించు సమయమునకుఁ గొనివెళ్ళెను. బాబా దానిఁజూచి 'కాచర్యా' [వంకాయ వేఁపుడుకూర] కావలయుననెను. ఆవార్త రాధాకృష్ణఆయీకిఁ దెలుపఁబడెను. అపుడు శిరిడిలో వంకాయలు దొరుకు సమయము కాకపోవుటచే బాబా అటులేల యడిగెనో యని తలంచి ఆవిషయము తెలిసికొనుటకామె మసీదునకు వెళ్లెను. పురందర్ సతి బొంబాయిలోని విషయము జ్ఞప్తికిఁదెచ్చుకొని ఆసంగతి రాధాకృష్ణఆయీకిఁదెలిపి వెంటనేవెళ్ళి ఆ వేపుడుకూర సిద్ధపఱచుకొని వచ్చి బాబాకు సమర్పించి, తన అవివేకమును క్షమింపుమని ప్రార్థించెను. బాబాకు తనబిడ్డలపైఁ గలప్రేమ- వారర్పించు ప్రేమపూరిత వస్తువుల నెట్లడిగి తెప్పించుకొని స్వీకరించునో గమనింపుడు !

## తార్ఖడ్ సతి - పేడా

1915 డిసెంబరు నెలలో గోవిందబలరాంమాన్కర్ శిరిడికి వెళ్లి అచట తనతండ్రి శ్రాద్ధమును జరుప నిశ్చయించుకొనెను. అతఁడు బయలుదేరు పూర్వము తార్ఖడ్ గృహమునకు వెళ్ళెను. తార్ఖడ్ సతి బాబాకు ఏమేనిఁ బంపఁదలచి యింటఁ బరికించెను. పేడా [లడ్డు] ఒకటిమాత్రముండెను. ఆమె పనిపిల్లవాఁడు గోవిందు ఆ లడ్డుకొఱకు ఏడ్చుచున్నను వానిని కాదని ఆ(పేడా)లడ్డు మాన్కరునకిచ్చి దానిని

బాబాకు సమర్పింపుమనెను. మాన్కరు శిరిడికిఁ జేరెను. ఆలడ్డు విష యమై మఱచిపోయెను రిక్తహస్తములతో వెళ్ళి బాబా దర్శనముచేసి కొనెను. ఆ దినము బాబా యేమియు నడుగలేదు. ఆ సాయంత్రము వట్టిచేతులతోనే మాన్కర్ బాబాను జేరెను, బాబా యింక సహింప పలేకుండెను. 'నా కొఱకేమి తెచ్చితివి?'- అని బాబా ప్రశ్నించెను. 'ఏమియుఁ దీసికొనిరాలేదు'-అని, మాన్కర్ పలుక, 'నాతల్లి తార్ఖాడ్ సతి నేనుతినుటకు పేడా (లడ్డు) పంపలేదా?' అని మఱల ప్రశ్నించెను. మాన్కర్ సిగ్గు భయమునొంది క్షమాపణముఁదెలుపుకొని, విడిదికేగి, ఆలడ్డు తీసికొనివచ్చి బాబా చేతియందుంచెనో లేదో, వెంటనే బాబా దాని నాప్యాయతతో నోటఁబెట్టుకొని నమిలిమ్రింగెను. ప్రేమతో సమర్పించు భక్తుల బహూకృతుల బాబా ఎట్లు స్వీకరించునో గమనింపుడు !

## బాబా సమృద్ధిగ భుజించిన కుక్క:-

ఒకసమయమున తార్ఖాడ్ సతి శిరిడీయందొక యింట విడిసి యుండెను. మధ్యాహ్న భోజనమునకందఱుఁ గూర్చుండిరి. పళ్ళెరములందు వివిధపదార్థములు వడ్డింపఁబడెను. ఆసమయమున ఆకలిగొన్న కుక్క యొకటివచ్చి అఱచెను. తార్ఖాడ్ సతి లేచివెళ్ళి ఒకరొట్టె దానిముందు పడవైచెను. అత్యాసక్తితో దానినితిని కుక్క వెడలి పోయెను ఆసాయంత్రము ఆకాంతమసీదుఁజేరి బాబాకు మ్రొక్కి కొంతదూరమునఁ గూర్చుండెను. అంతట సాయినాథుఁడామెవంకఁ జూచి, 'అమ్మా!' నాకు ఈదినమున కంఠమువరకు సమృద్ధిగఁ పెట్టి తనిపితివి. ప్రాణములు కుదుటఁబడినవి. ఎల్లప్పుడు నీవిట్లేఁ గావింపుము. నీకు సకలశుభములు కలుగును. ఈ మసీదునందుఁగూర్చొండి నేనెన్నడు కల్లలు పలుకను. ఈవిధముగ నాపై జాలిచూపుము.

♦ భాగవతోత్తమాయ నమః

ఆకలిగొన్నవారికి ముందిడి పిదప నీవుతినుము. ఈనా మాటలను మదినిఁ జక్కఁగ భద్రముచేసికొనుము' అని, బాబా పలికెను.

బాబా పలికిన పలుకులనామె మొదట గ్రహింపఁజాలకుండెను. 'బాబా! నీకు నేనెట్లు తినఁబెట్టఁజాలుదును? నేనే యితరులపై నాధారపడి యున్నదానను'—, అని, ఆమె విన్నవించెను. అంతట బాబా ఆమెకిట్లు విశదపఱచెను. 'ప్రొద్దున నీవిడిన మిక్కిలి రుచికరమైన రొట్టెనుతిని సంతృప్తినొందితిని. ఇప్పటికిని త్రేన్పులు వచ్చుచునేయున్నవి. నీవు మధ్యాహ్నము దేనికి రొట్టెముక్క నిడితివో ఆశునకము నేను భిన్నులముకాము. ఆవిధముగ సకల జీవసమూహములు నాకు భిన్నములుకావు. సకలజీవములందు నన్ను జూడనేర్చినవాఁడే నాకత్యంతప్రియుఁడు. కావున భేదబుద్ధినివిడిచి, యీదినము నీవు కావించినటుల నన్ను సేవింపుము.' ఆ వాక్సుధారసమునుగ్రోలిన ఆతల్లి హృదయము ద్రవించెను. కనులనుండి ఆనందాశ్రువులు స్రవించినవి. స్వరముగద్గదికనొందినది. ఒడలు పులకరించినది. ఆమె సంతోషమునకు మేర లేకుండెను.

యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి
తస్యాహం నప్రణశ్యామి- సచమే నప్రణశ్యతి.

ఎవఁడు సకలంబునందు నీక్షించునన్ను
ఎవఁడు నాయందు సకలమిూక్షించుచుండు
జగతివానికి నేఁబరోక్షంబునొంద
వాఁడునాకుఁ బరోక్షంబుఁగాఁడు;పార్థ! [భ.గీత.6-30]

అను ఉపనిషదుక్తులను శ్రీ సాయీనాథుఁడు స్వానుభవరూపమున తనబిడ్డలకు బోధపఱచి, సకలోపనిషద్వివరణ కర్తయైనాఁడు.

త్ప్రాత్మనే నమః । భుక్త్వాభోజనదాతౄణాం దగ్ధప్రాగుత్తరాశుభాయ నమః

శ్రీ సాయీప్రభువునకుఁ గావలసినది మన ప్రేమ– నిర్వ్యంచిత నిరవధిక ప్రేమ–సకలజీవములందు నెఱపుటయే. ప్రతిఫలాపేక్ష విడనాడి ఏజీవిని పోషించినను బాబా సంతృప్తినొందును. ఏజీవిని బాధించిన బాబా బాధ పడునని మనము గ్రహించవలయును.

శ్రీ సాయీప్రభువు అనుగ్రహమునకు పాత్రులైన తార్కాడ్ కుటుంబములోనివారలకు వందనశతము లర్పించుదము, తార్కాడ్ కుటుంబము ననుగ్రహించినట్లుల మనల ననుగ్రహింపుమని సమర్థసద్గురు దేవుఁడగు శ్రీ సాయీనాథునకు ప్రణతిసహస్రము లర్పించుదము.

॥ కృపాపేశాయ నమః ॥ సత్కర్మనిరతాయ నమః

ఓమ్ శ్రీ సాయీశరణ్!

అనురాగంబున భక్తి తత్పరత నీవర్పించునే స్వల్పమై
నను సంప్రీతినిఁ గొందు! జీవచయమున్ నన్నట్టు లీవాదృతిన్
గనుచుఁ జూచెదవేని మేలిదుదు; మా తార్కాడ్ కుటుంబంబునో
మినవృత్తంబు సమాలకింపవో? ఏమీ, నిన్నుపేక్షింతునా?

---

# ఏమి, నిన్నుపేక్షింతునా ?

## నలుబదియవ ప్రకరణము

## 34 అనుగ్రహ లీల.

a) హరిశ్చంద్రపితేల్ b] గోపాల్‌నారాయణ్ అంబాడెకర్

c) భక్త పంత్

సద్విషయము:- అవతారములు - సాధుసత్పురుషులు.

యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

ఎప్పుడెప్పుడు సద్ధర్మమెడలం జెందు
నెప్పుడెప్పుడధర్మంబు వృద్ధిఁబొందు
నప్పుడప్పుడ, మేఘవాహన తనూజ!
యేను ననుధరిత్రి సృజించుకొందు.

సకలసాధువులను సంరక్షణముఁజేయఁ
బాపజనులనెల్ల రూపుమాప
జగతియందు ధర్మసంస్థాపనార్థంబు,
యుగయుగంబునందు నుద్భవింతు.

(శ్రీమత్ భగవద్గీతామృతము- 4-7,8)

అని, శ్రీకృష్ణభగవానుఁడు తానవతరించుటకుఁగల కారణములఁ దెలిపినాఁడు. దైవముయొక్క విధియిది. ప్రపంచమునజనులు ధనము- సంపదలు- కాంతలు- లౌకికభోగములే ప్రధానములని తలంచి, యీసునసూయను పెంచుకొని, యొండొరుల ద్వేషించుకొనుచు, ప్రాపంచికార్థములకు ప్రాకులాడుచు, దైవమును విస్మరించి, వారివారి విధ్యుక్తధర్మములను పాటింపక స్వైరప్రవృత్తిని విహరించుసమయమున ఆదైవము- భగవానుఁడాయాదేశముల నాయాకాలముల నవతరించి, మానవసమాజమునకు ప్రబోధ కల్పించుచుండును. అట్లవతరించిన- తన నిరాకార- నిర్గుణస్థితినుండి సాకార-సగుణస్థితికి- మనుష్యునకందుబాటగు మానవత్వము- దైవమునకందుబాటగు దైవత్వమున కలిగిన స్థితికి వచ్చిన పరతత్త్వమే- దైవమే- అవతారము- సాధు సత్పురుషుఁడు అని మనము గ్రహింపవలయును. అవతార- సాధుసత్పురుషులకార్యములు దైవవిధానముల నిర్వర్తించుటయే. ఇట్టి అవతారములు- సాధుసత్పురుషులలో న్యూనాధిక్యతలు లేవు. ఎల్లరు దైవశక్తి సంపన్నులే. ఎవరినాశ్రయించినను ఫలముసమమే. నివృత్తినాథుఁడు జ్ఞానేశ్వరుఁడు- ఏకనాథుఁడు మొదలగువారు- సమర్థరామదాసు-అకల్ కోట మహారాజు- శ్రీసాయీనాథుఁడు- మొదలగు సాధు-సత్పురుషులు సమానులే. సర్వజ్ఞుఁడు- సర్వవ్యాపి- సమర్థుఁడు- సచ్చిదానందమయుఁడగునే యవతారుఁడైన సాధుసత్పురుషుని సమాశ్రయించి సేవించినను దైవమునాశ్రయించి సేవించినట్లేయగును, ఈవిషయమును మనమీక్రింది వృత్తాంతములవలనఁ దెలిసికొనఁగలము.

## ౩) హరిశ్చంద్రపిటేల్ - వృత్తాంతము:-

బొంబాయియందు హరిశ్చంద్రపిటేల్- అనునొక సంపన్నగృహస్థుఁడుగలడు. అతనిబిడ్డలలో నొకనికి [మూర్ఛ] అపస్మారవ్యాధి

ఓం శ్రీమన్మోక్షసంధాత్రే నమః ఓం [illegible] నమః

కలదు. ఔషధము లనేకములువాడెను. కాని, ప్రయోజనము కలుగలేదు. ఇంక దైవము- ప్రత్యక్షదైవమగు సాధుసత్పురుషుని అనుగ్రహమువలన ఆవ్యాధి నివారణముకాఁదగినదే- యను నిశ్చితాభిప్రాయముపొందెను. 1910లో దాస్ గాణూమహారాజుకావించు కీర్తనము (హరికథ) వినినాఁడు. ఆసందర్భమున శ్రీసాయీనాథుని మహత్త్వము ఆ కరుణామయుఁడైన బాబా యొక్క దివ్యామృతహస్త స్పర్శవలన- దయార్ద్ర వీక్షణమువలన తనబిడ్డ కారోగ్యము గలుగవలసినదేకాని, మఱియొండు మార్గములేదని నిశ్చయించుకొనెను. కావలసిన ఏర్పాట్లు చేసికొని, పండ్లబుట్టలు- మధురపదార్థములు- పూలమాలలు మొదలగునవి తీసికొని కుటుంబముతో శిరిడికిఁజేరెను.

పిటేల్ తనభార్య- బిడ్డలతో ద్వారకామాయీ మసీదుఁజేరి, బాబా పాదముల తనశిరముసోఁక వ్రాలి నమస్కరించి, జబ్బుస్థితిలో నున్న తనకుమారుని బాబా పాదముల నిలిపెను. శ్రీ సాయీనాథు నను గ్రహవీక్షణము లాబిడ్డపై ప్రసరింపఁబడిన క్షణముననే యొక అద్భుతసంఘటనము జరిగెను. ఆబిడ్డ కనుగ్రుడ్లను త్రిప్పుచు స్మృతి తప్పి పడిపోయెను, నోటివెంట నురుగు వెడలెను. మేనుబిట్టు చెమర్చెను. ప్రాణములుపోయెనా యన్నటులాబిడ్డ 'పడిపోయెను. ఆ బిడ్డ స్థితిఁగనిని తలిదండ్రులు భయభ్రాంతులై గడగడవణకిరి. తఱచుగ మూర్ఛలు వచ్చినను త్వరలో స్మృతి గలిగెడిది. ఆసమయము న ఆ మూర్ఛ చాలసేపుండెను. కనులువెంట నీరు కాలువలై పాఱనాతల్లి బిట్టేడ్చెను. తమమస్థితిఁ దెలుసుకొనుచువాపోయెను.

అంతట బాబా ఆతల్లినోదార్చి 'అటు శోకింపఁదగదు-కొంచెము ఓర్పువహింపుము. ఆబిడ్డను విడిదికిఁ దీసికొనివెళ్ళుఁడు ఒక అర

¹ భస్మపూతమశూధిష్ఠాయ నమః
² అనేంజస్త్రంపాపం స్మృతిమాత్రోధహారకాయ నమః

గంటలో నతఁడు మెలకువఁగనఁగలఁడు' అని ఆదేశించెను. వారు బాబా తెలిపిన విధమునఁ గావించిరి, అరగంట అయినపిదప ఆ పిల్లవాఁడు తెప్పరిల్లెను. వారందఱు సంతోషించిరి. వారి సందేహములు తొలఁగెను. అంతట పిటేల్ తనభార్యతోడ మసీదునకేగి బాబా పాదముల సాగిలఁబడి (మొక్కి - ఆలెండి) సన్నిధినిఁ గూర్చుండి పాదములొత్తు చుండెను. 'మీ భయసందేహములన్నియుఁ దీరినవా? గాఢవిశ్వాసము స్థైర్యముతోఁగూడిన ఓర్పుగలవానిని ఆహరి [ప్రభువు] రక్షించితీరు ను,' అని, చిఱునగవుతో బాబా పలికెను. అధనికుఁడైన పిటేల్ అచటఁ జేరినవారి కందఱకు మధురపదార్థములను కొల్లలుగ పంచిపెట్టి మంచిఫలములను తాంబూలమును బాబాకు సమర్పించెను.

పిటేల్ భార్య మిక్కిలి సాత్వికురాలు నిరాడంబరి. భక్తిప్రేమలు గలతల్లి సమీపమున నొక స్తంభము నానుకొని కూర్చుండి తదేకదృష్టితో బాబాను వీక్షించుచు నానందాశ్రుల నెడతెఱపిలేక స్రవించుచుండెను. బాబా ఆమె భక్తిప్రేమలకు ఆమె నిర్మలహృదయమునకు సంతసించెను. బుద్ధి మనస్సులేకముఁజేసి, భక్తి విశ్వాసములుగలిగి సేవించువారిని ప్రత్యక్షదైవమగు సాధు సత్పురుషుఁ డనుగ్రహించి తీరునుగదా !

అటుల కొన్ని దినములు శిరిడియందు బాబా సన్నిధినిఁగడపి యొకనాఁడు పిటేల్ తనకుటుంబముతోఁ దిరిగి బొంబాయి చేరవలయు ననితలఁచి మసీదునకేగి బాబా అనుజ్ఞనువేడెను. బాబా వారందఱకు 'ఊధి'ప్రసాదించి, అనుమతినొసఁగి హరిశ్చంద్రపిటేల్‌ను ప్రత్యేకముగ జేరఁబిలిచి, 'బాపూ! నేనునీకుఁ బూర్వము రెండురూకలిచ్చియుంటిని. ఇపుడీ మూఁడురూపాయలిచ్చుచున్నాఁడను. వీనిని నీ పూజామందిరమున నిలిపి పూజింపుము. నీకు సకలశుభములు కలుగును'- అని,అను

గ్రహించెను [S-C.S. 74] పిటేల్ వానిని కృతజ్ఞతాపూర్వకముగ 'ప్రసాద'మని స్వీకరించి, బాబా పాదములవ్రాలి నమస్కరించి, అనుగ్రహింపుమని ప్రార్థించెను. అతని హృదయమున నొకసందేహము కలిగెను, తాను శిరిడికిఁ జేరినది అదియే తొలిమాఱు. అట్టియెడ బాబా తనకుఁబూర్వము రెండురూకలనుగ్రహించినటులఁ దెలుపుచున్నాఁడే! ఇదియేమి? యని— ఆవిషయమతనికి బోధపడకుండెను 'ఆవిషయమెటులుంగ నుత్సాహపడియు మౌనము వహించెను.

బాబా సెలవుఁదీసికొని పిటేల్ తనకుటుంబముతో బొంబాయికిఁ జేరెను. జరిగిన విషయములన్నియు నతని ముదుసలి తల్లికిఁదెలిపి, బాబా తనకుఁ బూర్వము రెండురూపాయలిచ్చినటులఁ దెలిపినాఁడే! ఇదియేమియని యడిగెను. ఆతల్లికిని ఆలోచన తోఁచలేదు. తరువాత నామె దీర్ఘకాలము ఆలోచింపఁగ తెలియకున్న పూర్వవిషయము జ్ఞప్తికి వచ్చెను. చాలకాలముక్రిందట పిటేల్ తండ్రి మహాసిద్ధపురుషుఁడు సద్గురువైన అకల్కోట మహారాజును దర్శించెను. ఆమహారాజు పిటేల్ తండ్రికి రెండురూపాయలొసఁగి, వానిని పూజామందిరమున నుంచి పూజింపుమని ఆదేశించెను. ఆవిధముగ పిటేల్తండ్రి తన జీవితకాలమంతయుఁ బూజించెను. అతని యనంతర మారూపాయలెట్టులోపోయినవి. పూజలుకావించిన వారులేరు. ఈవిషయములన్నియు నావృద్ధమాత తనకుమారునకుఁదెలిపి, పూర్వము అకల్కోటమహారాజు ప్రసాదించినవానిని పోగొట్టుకొనిరి. ఇప్పుడేని యీ మూఁడురూపాయలను పూజామందిరమున నుంచి పూజించుచుండిన మీకష్టములన్నియుఁదీఱి సుఖసంతోష సంతృప్తుల బడయఁగలరని ఆ అకల్కోటమహారాజే శ్రీ సాయిబాబా రూపమున అనుగ్రహించినాఁడని— అటుల పూజ విడనాడక చేయుచుండుఁడని ఆతల్లి పిటేలునకు బోధించెను. తల్లిపలుకులు

వినిన పిటేల్ మిక్కిలి ఆశ్చర్యము- ఆనందమూపొందెను. (శ్రీ) సాయీ ప్రభువుయొక్క సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వముల గ్రహించెను. ఈవిధముగ (శ్రీ) సాయీనాథుఁడు తనకు- సమర్థసద్గురుఁడగు (శ్రీ) అక్కల్ కోట మహారాజునకుఁగల అభిన్నత్వమును నిరూపించినాఁడని, బాబా సందర్శనమునఁ దాను గడించిన మహాభాగ్యమును గుర్తించి, జీవిత పర్యంతము (శ్రీ) సాయీనాథునందు గాఢభక్తి విశ్వాసములుగలిగి సత్ప్రవర్తనముతో గడపెను,

(శ్రీ) సాయీనాథునకు అనుగ్రహపాత్రుఁడైన హరిశ్చంద్ర పిటేలునకు వందనము లర్పించుచు ఆవిత్త ననుగ్రహించినట్లు మమ్ముల ననుగ్రహింపుమని (శ్రీ) సాయీమహాప్రభువునకు సహస్రప్రణామముల సమర్పించెదము.

ఓమ్ (శ్రీ) సాయీశరణ్ !

---

## గోపాలనారాయణ అంబాడెకర్ - వృత్తాంతము:

అంబాడేకర్ బాబా భక్తులలో నొకఁడు. ఈతఁడు ఆబ్కారీ శాఖలో థానాజిల్లాయందు [జవ్హార్ సంస్థానమున] పనిచేసి వయస్సు కారణమున ఉద్యోగమునుండి విరమించెను. ఏదే నితర ఉద్యోగము దొరకునేమో యని ప్రయత్నించెను. కాని, లాభములేకపోయెను. ఆర్థిక కష్టముతో బాటు ఇతర సాంసారిక కష్టములచే నతఁడు క్రుంగిపోయెను. అటుల 7 సంవత్సరములు గడపెను. ప్రతిసంవత్సరము శిరిడికి వెళ్ళి బాబా సందర్శనముఁజేసికొని తనకష్టములు భరింపలేని దశకు వచ్చినవి ఇఁక మరణమే శరణమనుకొనినాఁడు. ఆసంవత్సరము భార్యతోడ శిరిడికి వెళ్ళి రెండు నెలలుండెను.

ఒకనాటిరాత్రి దీక్షిత్ వాడ ముందున్నబండిపై గూర్చుండి ఆలోచించుచు, చేంతనున్న బావిలోనికి దుమికి ఆత్మహత్య చేసికొనం దలచినాఁడు. ఆతని తలంపెటులుండ బాబాతలంపు వేఱుగ నిర్ణీతమయ్యెను. అతఁడా బావివైపునకు వెళ్ళనుద్యుక్తుఁడగుచుండఁగ నటుకొలఁది అడుగులదూరమునందున్న హోటల్ యజమాని సగుణ్ [సగుణ్ మేరు నాయక్] అనువాఁడు వెలుపలకువచ్చి మన అంబాడేకరును పిలిచెను. అంబాడేకర్ సమీపింపఁగ నతని కొకపుస్తకమిచ్చి "ఈఅకల్‌కోట మహారాజు జీవితచరిత్రము చదివితివా?' అని ప్రశ్నించెను. ఆసగుణ్ చేతినుండి పుస్తకమునందుకొని అంబాడేకర్ తెఱచెను. అది 'కాకతాళీయన్యాయము'- అనుకొనండి, దైవనియోగము అనుకొనండి, యతనికీ క్రిందికథ కంటఁబడెను.

అకల్‌కోట మహారాజు భక్తుఁడొకడుండెను. అతఁడు దీర్ఘకాలికవ్యాధిచే బాధపడుచుండెను. ఆవ్యాధి సహింపనలవికాని స్థితికివచ్చెను. అతడు తెగించి, ఒకనాటి రాత్రి బావిలోనికి దుమికెను. తత్క్షణమే అకల్‌కోట మహారాజు ఆ బావిదగ్గఱకేగి స్వయముగ నతనిని వెలుపలకుఁదీసి, యిట్లు బోధించెను. 'బిడ్డా! నీ పురాకృత కర్మఫలములు మంచివికాని, చెడ్డవికాని, నీవు అనుభవించి తీరవలయును. ఆ కర్మానుభవములు పూర్తికాకుండెనా- నీ ఆత్మహత్య యేమియుఁజేయజాలదు. నీవు మఱలజనించి అనుభవించి తీరవలసినదే. ఇటులాత్మహత్యకుఁ గడంగుటకంటె సహనబుద్ధితో ఆ నీపురాకృత కర్మఫలముల నిశ్శేషముగ ననుభవించి, విముక్తుఁడవగుటకేల జంకెదవు? ఇటుల చేయుట అవివేకిలక్షణము'- అని బోధించి, యాభక్తునోదార్చెను.

అటుల సందర్భోచితము- సుసంగతమగు నాకథను చదివిన అంబాడేకర్ హృదయము ద్రవించెను. ఆశ్చర్యచకితుఁడయ్యెను, ఆ

రూపమున బాబా సందేశము ఆతనికిలభింపకున్న బావిలోమునికి ఆత్మ
హత్య గావించుకొనియుండెడివాఁడే. శ్రీ సాయీప్రభువుయొక్క సర్వ
జ్ఞత్వము- సర్వవ్యాపకత్వము- అపారకరుణ గ్రహించిన యాతనికి
బాబా యందు- ఆతండ్రి రక్షణమందు గాఢవిశ్వాసము హెచ్చుకొని
నది. అంబాడేకర్ తండ్రి అకల్‌కోట మహారాజు భక్తుఁడు- అందుచే
నతని నతనితండ్రి యడుగుజాడల ననుసరింపుమని యారూపమున
బోధించెను:

అంబాడేకర్ బాబా ఆశీస్సులఁబడసి తిరిగి యింటికిఁజేరెను.
అతని కష్టకాలము గతించెను. జ్యోతిశ్శాస్త్రమును చక్కగ నేర్చెను.
దానిమూలమున నతని ఆర్థికపరిస్థితులు మెరుగయ్యెను. ఆరూపమున
నతని జీవితవిశేష మే విధమగు లోటు లేక సంతుష్టి సంతృప్తులతో
గడచెను.

## భక్తపంత్ వృత్తాంతము :-

పీరాన్ అనుపురమునఁగల యొక సద్గురువునకు భక్తుఁడైన
'పంత్' అనునతఁడు ఒకసమయమున B.B &C రైలులో ప్రయాణము
చేయుచుండెను. ఆరైలులోనే అతని బంధుమిత్రులు కొందఱు బొం
బాయిమీఁదుగ శిరిడీకి ప్రయాణమై వెళ్ళుచుండిరి. వారందఱు ఆ
'పంటు'నుగూడ తమవెంట రావలసినదిగ బలవంతపెట్టిరి. అతఁడు
కాదనలేకపోయెను. వారందరు బొంబాయిలోదిగిరి. అతడు 'వీరాన్'
నకు వెళ్ళి తనగురువు ననుజ్ఞఁగోరెను. ఆగురు వనుజ్ఞనిచ్చెను. పంత్
తన బంధుమిత్రులను బొంబాయిలో కలిసికొని, వారితో శిరిడీకిఁజే
రెను. వారందరు మధ్యాహ్నము 11 గంటలకు బాబా దర్శనార్థము
ద్వారకామాయి మసీదుఁజేరిరి.

ఐక్యభూతాత్మనే నమః
ఊర్ధ్వగతివిధాత్రే నమః    సంస్పృతే నమః

ఆ వెళ్ళినవారందరు అచట బాబా దర్శనార్థమై గుమిగూడిన జన సమూహమునుగాంచి మిక్కిలి ఆనందముపొందిరి. పంట్ మాత్రము విభ్రాంతుడై స్మృతి తప్పిపడిపోయెను. అతని బంధుమిత్రులందఱు భయచకితులైరి. అతనికి శైత్యోపచారములు గావించిరి. బాబా అనుగ్రహమున నతఁడు గాఢనిద్రనుండి మేల్కొనిన వానివలె లేచికూర్చుండెను. సర్వజ్ఞుఁడగు శ్రీ సాయిప్రభు వెఱుఁగని దేమికలదు? ఆ ఫంట్ ఒక సద్గురుపు భక్తుఁడని గ్రహించి, యతని నుద్దేశించి, 'ఏమైనఁగానిమ్ము- నీ అవలంబనమును నీవు విడువరాదు. నీ ఆశ్రయమును లేశమేని విడనాడక స్థిరీభూతుఁడవగుము. ఎల్లవేళల నెల్లపరిస్థితులందు నీ సద్గురువును హత్తుకొనియుండుము' అని, అతనిభయమును నివారించి, ఆతనిగురువునందతనికిఁగల భక్తిని దృఢపడునటుల బాబా అనుగ్రహించెను. బాబా బోధనుగ్రహించి, సంతృప్తి సంతోషములొంది ఆఫంట్- తనజీవితమున బాబాను మఱచినవాఁడుకాఁడు.

బాబా అనుగ్రహపాత్రులైన గోపాల్ నారాయణ అంబాడేకర్- భక్తఫంటులకు వందనశతము లర్పించుచు వారి ననుగ్రహించినటుల మనల ననుగ్రహింపుమని శ్రీ సాయిప్రభువునకు వందనసహస్రము లర్పించుదము.

♦ ఏకభక్త్యయే నమః

ఓమ్ శ్రీ సాయిశరణ్!

అవతారంబులు సద్గురూత్తములు ప్రత్యక్షంబునా దైవ, ము
ట్లవుటన్ సందియముల్ త్యజించి, చిరమత్యాసక్తి నేకైకల
క్ష్యవిధిన్ గొల్చిమి, నమ్మియోరిమి, పిటేలంబాడేకర్ పంటులం
దెవరిన్ గాదని త్రోసిపుచ్చితిని? ఏమిరా, నిన్ను పేక్షింతునా ?

---

# ఏమిరా, నిన్నుపేక్షింతునా ?

## నలుబదియొకటవ ప్రకరణము

## 35 అనుగ్రహ లీల.

1. తెండుల్కర్ కుటుంబము
2. బలరాం ధురంధర్
3. బాలాజిపాటిల్ నెవాస్కర్

సద్విషయము:-

సాధుసత్పురుషులకు సాగిలఁబడి ప్రణామములను సలుపుదము. అవ్యాజ కరుణాకటాక్షమున వారు మనపాప పర్వతముల నిర్మూలింప సమర్థులు. మన వక్రప్రవర్తనములఁ జక్కదిద్దవలంతులు. వారితోడ క్షణమాత్రము సంభాషించిన సత్ప్రబోధము కలుగును. సత్యసుఖానందానుభూతి ప్రాప్తించును, వారియెడ భేదభావము— (ఇదినాది— అది నీది— అనుభావము) లేదు. అట్టి మహాత్ములఋణమును ఈజన్మముననే కాదు— ఇఁక నెన్నిజన్మములనేని తీర్చుకొనఁజాలము.

వివేక- వైరాగ్యములు- బాబా ప్రబోధలోని ప్రత్యేకత. శ్రీ సాయినాథుఁడు పలువుర దగ్గఱనుండి ధనముకోరి తీసికొనువాఁడు. బాబా భౌతికతనువునందున్న తుది పదిసంవత్సరములందు నొకరాష్ట్ర 'గవర్నరు' ఆదాయముకంటె నెక్కుడుధనము దక్షిణలరూపమున బాబాకు లభించినది. కాని, యేదినముసకాదినమున ఆధనమునంతయు పేదసాదలకు పంచిపెట్టువాఁడు. ఏస్వల్పము మిగిలిన కట్టెలకు— దివా

రాత్రిములు పగ్లిబ్బారిల్లు 'ధుని'లో వేయుటకొఱకు వినియోగించు వాడు. ఆధునియందు శేషించుబూదిని— 'ఉధి'యందురు. దానిని బాబా తనబిడ్డలు సెలవుతీసికొని తిరిగి వెళ్లునపుడు ప్రసాదించువాడు.

ఈవిధముగ దక్షిణల స్వీకరించుట 'ఉధి' ప్రసాదించుట— ఈరూపమున బాబా కావించిన ప్రబోధము మనము గుర్తింపవలయును. ఉధిని ప్రసాదించుటవలన ఈదృశ్య ప్రపంచమంతియు నశ్వరము [ రేపటికుండు నిది] ఈ ఉధివలె పరిణామము నొందునది. పంచభూతాత్మకములైన యీదేహములు సుఖదుఃఖాదుల ననుభవించి తుదకీ 'ఉధి'వలె భస్మీభూతములగును— అను ప్రబోధముఁ దనబిడ్డలకు కలిగించుటకే ఉధిని ప్రసాదించుట. బ్రహ్మము— [దైవము] ఒక్కటే సత్యవస్తువు. ఈవిశ్వ మనిత్యము. తల్లి-తండ్రి-భార్య-పుత్రుఁడు వీరెవ్వరు వాస్తవముగ నీ వారుకారు. ఎవనికి వాఁడొక్కఁడే యీ ప్రపంచమునకువచ్చెను. తిరిగి తానొక్కఁడే వెళ్ళును— ఈరూపమున బాబా తనబిడ్డలకు 'నిత్యానిత్యవివేకము' (ఈవిశ్వమున నిత్యమైనవస్తువయేదో— అనిత్యమేదో గుర్తింపుడు! అని) గఱపినాఁడు. ఇదియే 'వివేకము'

వైరాగ్యము :— దక్షిణలరూపమున బాబా ధనము స్వీకరించుటను గూర్చి విచారించుదము. మానవులు సహజముగ అన్నిటికంటె ధనముపై అత్యాసక్తి వహింతురు. ధనత్యాగము చేయుట యనునది యేలేశమేని వైరాగ్యము కలిగినవాఁడుకాని చేయఁజాలఁడు. ప్రతిఫలాపేక్షకలిగి ధనమును త్యాగముచేసినను దానివలన కొంతఫలము కలిగితీరును. క్రమముగ నట్టి త్యాగశీలము నిస్స్వార్థబుద్ధినిఁ గల్పించి,వానిని వైరాగ్యభాగ్యభాజనునిఁ గావించును.

వివేక వైరాగ్యములురెండు మనకుఁ గలిగినపుడే యీ సంసార సాగరమును తరింపఁగలము. ఆకారణముననే బాబా తానను గ్రహింప

దలంచిన వానివద్దనుండియే కోరి దక్షిణారూపమున ధనము స్వీకరించు వాఁడు. సెలవుతీసికొని వెళ్ళునపుడు ఉధిని స్వయముగ వానినొసట నలఁది, ఉధిని ప్రసాదించి, వరదాభయదాన ప్రశస్తమైన హస్తమును వానిమస్తమున నిలిపి ఆశీర్వదించువాఁడు.

'ఉధి' యీరూపముగ ఆధ్యాత్మిక ప్రబోధకల్పించుటయేకాదు. సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయీమహాప్రభువు ప్రసాదించు 'ఉధి' ఆశ్రితుల ఆధివ్యాధులను సకలము నివారించి, లౌకిక పారలౌకికముగ ఉజ్జీవనముఁ గల్పించుచు సకలసుఖ భోగసంపదలను ప్రసాదించి సంతోష సంతృప్తులను శాంతినిఁ బ్రసాదింపదక్షమైనది. శ్రీసాయీపదాశ్రితుల కీవిషయము అనుభవైకవేద్యము. బాబా తఱచుగ 'ఉధి'ని గూర్చి అతిమనోహరముగ గానముచేయువాఁడని చెప్పుదురు. ఆగేయముయొక్క మకుటమిట్లుండును

'రమ్మా ! రమ్మా ! శ్రీరామా రామా
లీలామానుష వేషా ! రామా !
తెమ్మా - తెమ్మా "ఉధి" గోనెలనిండుగ
నిమ్ముగ బిడ్డల ననుగ్రహింపఁగ'

బాబా తనబిడ్డల ననుగ్రహించినమఱికొన్ని విషయములఁదెలిసికొందము

## టెండల్కార్ కుటుంబము - బాబా రక్షణము

బొంబాయి శివారు బాంద్రాపురమున టెండల్కార్ కుటుంబము నివసించుచుండెను. వారందఱు బాబా భక్తులు శ్రీమతి సావిత్రీబాయి టెండల్కార్ గొప్ప కవయిత్రి. బాబా లీలలు వివరించుచు 'శ్రీసాయీనాథ భజనమాల' అనుపేర నొకగ్రంథమును రచించినది. అందు 800 అభంగములుకలవు. మరాటీభాష నెఱిఁగిన బాబా భక్తులు ఆగ్రంథ

మును మిక్కిలి ఆసక్తితోఁ జదువుచుండురు. ఈమె భర్త రఘునాథ రావు తెండల్కర్.

## బాబా టెండల్కర్ పరీక్షలో జయము (S.C.S. 367)

సావిత్రీబాయి రఘునాథరావుల కుమారుడు బాబా తెండల్కర్ వైద్యపట్ట పరీక్షకై రేయింబవళ్ళు శ్రమించి చదువుచుండెను. ప్రసిద్ధ జ్యోతిష్కులకతఁడు తనజాతకముఁ జూపించుకొన, వారాతని గ్రహస్థితి బాగుగలేదనియు, ఆసంవత్సరము పరీక్షయందు జయము దుర్లభమని తెలిపిరి. ఆమాటలు వినినపిదప బాబా తెండల్కర్ మిక్కిలి నిరుత్సాహపడి, యాందోళన చెందుచుండెను. కొన్ని దినములతరువాత సావిత్రీబాయి శిరిడికి వెళ్ళి, బాబాను సందర్శించి, సమయముఁగనిపెట్టి తన కుమారుని పరీక్ష విషయము- జ్యోతిష్కుల మాటలవలన నతనికిఁగలిగిన నిరుత్సాహము- తనబిడ్డ పొందుచున్న వ్యాకులతనుగూర్చి ఆమె బాబాకు విన్నవించెను. అంతట బాబా ఆమెనుజూచి 'నాయందు గాఢవిశ్వాసముంచుము- జాతకములు- జ్యోతిష్కులు- సాముద్రిక శాస్త్రజ్ఞులు తెలుపుమాటలను దూరముగఁ ద్రోసివేయుము. ఈ సంవత్సరము పరీక్షకు వెళ్ళుము, నీకు జయము తథ్యము సమకూరును. నాపై భారము నిలిపి స్వస్థచిత్తుఁడవై యుండుము' అనినామాటలుగ బిడ్డకెఱిఁగింపుమని పలికెను.

ఆమె బాంద్రాకు తిరిగివెళ్ళి బాబా అభయప్రదానమును తన కుమారునకుఁ దెలిపెను, ఆబిడ్డ బాగుగచదివి వ్రాతపరీక్షకు వెళ్ళెను. ఆపరీక్షతరువాత 'ప్రాక్టికల్ ఓరల్' పరీక్షలు కలవు. తనకు వ్రాత పరీక్షయందు జయముకలుగదేమో అను సందేహమున నతఁడు నిరుత్సాహపడి రెండవపరీక్షకు సిద్ధపడకుండెను. కాని, ఆపరీక్షాధికారి వ్రాతపరీక్షయందు జయముఁ కలిగినదనియు, 'ఓరల్' పరీక్షకు హాజరు

కావలసినదిగ తోడివిద్యార్థులద్వారా అతనికి వర్తమానమంపెను. బాబా టెండల్కరు ఆరెండవ పరీక్షకువెళ్ళి మొత్తము పరీక్షయందు విజయముఁగాంచి బాబా అనుగ్రహమున పట్టభద్రుఁడయ్యెను.

## రఘునాధరావు టెండల్కర్ - పెన్షన్:-

రఘునాథరావు టెండల్కర్ విదేశీ వ్యాపారసంస్థయందు చాల కాలము ఉద్యోగము మిక్కిలి శ్రద్ధాశక్తులతో గావించెను. అతఁడు వృద్ధుఁడయ్యెను. విశ్రాంతికొఱకు సెలవుపెట్టెను ఆతని ఆరోగ్యము చక్కఁబడలేదు. మఱల ఉద్యోగమునఁజేరి నిర్వహించు శక్తిలేకుండెను. ఆ వ్యాపారసంస్థ యజమాని రఘునాథరావును పింఛన్‌మీద ఉద్యోగమునుండి విరమింపఁజేయఁదలచెను. ఆతని కప్పటిజీతము 150 రూపాయలు పింఛన్ తీసికొనిన 75 రూపాయలకంటే అధికమురాదు. ఆ రఘునాథరావు సత్ప్రవర్తనము— వృత్తినిర్వహణము— ఆతఁడు ప్రదర్శించిన శ్రద్ధాసక్తులను విచారించి యతనికెంత పింఛను ఇచ్చుటయా?- అని అధికారు లాలోచించుచుండిరి.

ఒకనాటిరాత్రి బాబా సావిత్రీబాయి స్వప్నమునఁబొడమి •అమ్మా! నీ భర్తకెంత 'పింఛన్' కావలయుననికోరిక? నూఱురూపాయలు పింఛన్ బాగుండునని నేను తలంతును• ఇది నీకు సంతృప్తియేనా?' అని ప్రశ్నించెను. ఆకలలోనే ఆమె 'బాబా! సన్నేలయడుగుదువు? నీయందు గాఢవిశ్వాసముగలిగియున్న మాకు ఏదిక్షేమమో నీవే యెఱుంగుదువు'- అని, సమాధానమిచ్చెను బాబా నూఱు రూపాయలనినను చివరకు ఆకంపెనీ యజమానులు రఘునాథరావు టెండల్కరునకు నెలకు 110 రూపాయలు పింఛను మంజూరుచేసి, ఆతనిని ఉద్యోగము నుండి విరమింపఁజేసిరి. భక్తజన యోగక్షేమ భారవాహుఁడగు సాయీ

నాథుఁడెఱుఁగనిది యేమికలదు? ఎవరెవరి కెట్లెంతెంత నేవిధమున నెప్పుడు ప్రసాదింపవలయునో ఆవిధముగ ననుగ్రహించి తనవారిని రక్షించును.

## బలరాంధురంధర్ :_

ఇతఁడు సాంటాక్రిజ్ [బొంబాయి]లోని పఠారేప్రభు శాఖకుఁ జెందినవాఁడు. బొంబాయి హైకోర్టులో న్యాయవాదిగ కొంతకాలము పనిచేసి, పిదప బొంబాయి రాజకీయ న్యాయకళాశాల ప్రధానాచార్యుడుగ నుండెను. ఆధురంధర్ కుటుంబములోని వారందఱు సదాచారసంపన్నులు నైష్ఠికులు. బలరాం ఆధ్యాత్మిక చింతగలవాఁడు. భగవద్గీతలు జ్ఞానేశ్వరీవ్యాఖ్యతో చక్కగ చదివినాఁడు. ఇతర ఆధ్యాత్మికగ్రంథములను పారాయణము చేయువాఁడు. ఇతఁడు పాండురంగ విఠోబా భక్తుఁడు. శ్రీ సాయిాప్రభువును 1912నందు దర్శించినాఁడు. దానికి ఆరు నెలలపూర్వము ఇతనిసోదరులు బాలాజీ- వామనరావు అనువారలు శిరిడికి వెళ్ళి బాబా దర్శనముఁజేసికొనిరి. వారు తిరిగి యింటికిఁజేరి వారి మహానుభూతులనుగూర్చి సోదరుఁడగు బలరామునకుఁ తమ కుటుంబములోని వారికిఁ దెలిపిరి. వారందఱుకలసి బాబా దర్శనముఁజేసికొన నిశ్చయించిరి, వారు చేరకపూర్వము 'ఈరోజున నాదర్బారుప్రజలు పలువురు వచ్చుచున్నారు'- అని, బాబా పలికెను.

ధురంధర్ సోదరులు శిరిడికిఁజేరి బాబా దర్శనముఁ జేసికొనిరి. అచటఁ జేరినవారు, వారు వచ్చుపూర్వము బాబా పలికినమాటలు తెలుప ధురంధర్ సోదరులాశ్చర్యపడిరి. వచ్చినవారందఱు బాబా పాదములకు మ్రొక్కి కూర్చుండఁగ 'ఇంతకుఁబూర్వము నాదర్బారు ప్రజలు అని నిర్దేశించినది వీరినిఁగూర్చియే' అని, బాబా ధురంధర్ సోదరులఁజూపి పలికి, వారివంకఁజూచి, 'మనము కలసిన ఆరువదిజన్మ

ములనుండి సంబంధము గలిగియున్నారము' అని, శ్రీ సాయీశుఁడు తెలిపెను. ఆ సోదరులందఱు విధేయులు నిర్మలహృదయులు. వారు చేతుల జోడించుకొని నిలిచి బాబా పాదములవంక దృష్టినిలిపిరి. కనుల వెంట మోదాశ్రువులు- పులకలు- డగ్గుత్తిక మొదలగు సాత్వికభావో దయములు వారికిఁగలిగెను. వారు పరమానందభరితులైరి. వారు బాబా సెలవుఁగొని విడిదికేగి, భుజించి, విశ్రమించి మఱల మసీదు నకు వెళ్ళిరి.

బలరాంధురంధర్ బాబా దాపునఁ గూర్చుండి యాతండ్రిపాద ములొత్తుచుండెను. శ్రీ సాయీప్రభువాసమయమున పొగగొట్టము జేఁబూని పొగత్రావుచుండెను. ఆ పొగగొట్టమును బలరామున కం దించి, పొగత్రావుమని ఆదేశించెను. బలరాం పొగత్రావు అభ్యా సముకలవాఁడుకాఁడు. కాని, దానినందుకొని అతికష్టముమీద పొగ త్రావి, తిరిగి దానిని అతి వినయవిధేయతలతో బాబా చేతులందుం చెను. అది బలరామునకొక పరమపవిత్రమైన గడియ. అతఁడు కడ చిన ఆరుసంవత్సరములనుండి ఉబ్బసము వ్యాధిచే బాధపడుచుండెను. ఆ ధూమపానమున నతనివ్యాధి నిర్మూలమయ్యెను.

ధురంధర్ సోదరులు గురువారమునాఁడు శిరిడికి వెళ్ళియుండిరి, ఆరాత్రి చావడికి ఊరేగింపు ఉత్సవమును వారు సందర్శించుభాగ్యము కలిగినది. చావడియందు హారతిసమయమున బాబాను దివ్యసుందర విగ్రహుఁడగు పాండురంగనిగఁ జూడఁగలిగెను. మఱునాఁడు కాకడ్ హారతి [ప్రభాతహారతి] సమయమున తన యిష్టదైవమగు పాండురం గఁడుగ బాబాను చూచుభాగ్యమాతనికిఁ గలిగినది.

వారు బాబా సెలవుపొంది స్వస్థానముఁ జేరుకొనిరి. ఆరుసంవ త్సరములు గడచినతరువాత హటాత్తుగ నొకనాఁడు బలరామునకు

ఉబ్బసమను జబ్బు కనఁబడినది. ఆచిత్రము గమనింపుడు! సరిగ ఆదినమునసే శ్రీసాయీ మహాప్రభువు మహాసమాధి నొందినాఁడు.

బలరాంధురంధర్ మహారాష్ట్ర సాధుసత్పురుషుఁడగు తుకారాంచరిత్రను మరాటీభాషయందు రచించెను. దానిని ప్రచురించు భాగ్యమతనికిఁ గలుగలేదు, 1928లో నతని సోదరులు దానిని ముద్రించి ప్రచురించిరి.

## బాలాజి-పాటిల్ నెవాస్కర్

ఇతఁడు శిరిడివాసి, మిక్కిలి కూర్చుభక్తుఁడు. శ్రీ సాయీ ప్రభువునకీతఁడు కావించిన సేవ ప్రశంసనీయమైనది. బాబా నిత్యము తిరుగు వీధులన్నిటి నితఁడు శుభ్రపఱచువాఁడు, కొంతకాలమైనపిదప నాపనులనట్టి ఉత్సాహప్రేమలతో బాబా భక్తురాలగు రాధాకృష్ణ ఆయి- కావించినది. అబ్దుల్లా (బడేబాబా) కూడ ఆపనులను కావించువాఁడు. ప్రతిసంవత్సరము జొన్నపైరుకోసి నురిచిన తరువాత ఆధాన్యమును బాలాజి బండికెత్తించి బాబా దగ్గఱకు గొనివచ్చువాఁడు. ఆ ధాన్యమును బాబాకు సమర్పించువాఁడు. అందు బాబా తనకు ప్రసాదించినదానిని గొనిపోయి తనకుటుంబమును పోషించుకొనువాఁడు. ఈ విధముగ పెక్కుసంవత్సరములతఁడు గడపెను. అతని యనంతరము అతనికుమారుఁడు నావిధముగనే జరిపెను.

### ఉదిపప్రభావము:-

ఒకనాఁడు బాలాజీ సాంవత్సరీక శ్రాద్ధదినమున విందునకు గొందఱాహ్వానింపఁబడిరి. వంటలు సిద్ధముచేయఁబడెను. భోజనము సమయమునకు తొలుత అనుకొనిన అతిథులకు మూఁడురెట్లుజనులువచ్చిరి. [రఘుపాటిల్ భార్య (బాలాజీకోడలు) మిక్కిలి ఆందోళనఁ జెందెను,

ఆవచ్చినవారికి తాము సిద్ధపఱచిన పదార్థములుచాలవని, ఎట్టిలోపము గలిగిన తమ కుటుంబగౌరవమునకు హానియగునని ఆమె భయపడెను. ఆమె భయమును గుర్తించి ఆమె అత్తగారు 'నీవెట్టి భయాందోళనలు పొందవలసినపనిలేదు. ఇవి మనవికావు. శ్రీ సాయీనాథుని పదార్థములు పాత్రలన్నిటిపైన వస్త్రములను కప్పుము. దానిపై 'ఊధి' నుంచుము. ఆ వస్త్రములను తొలగింపక ఆ పాత్రలనుండి పదార్థముల నతిథులకు వడ్డింపుము. శ్రీ సాయీప్రభువు మనకెట్టి పరిభవమును కలిగింపఁడు'- అని, ఆమెకు ధైర్యముచెప్పెను. ఆకోడలు ఆవిధముగఁ గావించెను. వారందఱ కాశ్చర్యసంతోషములు కలుగునట్లు ఆ పదార్థములందఱకు సంతృప్తిగ సరిపోవుటయేకాక యింకను సమృద్ధిగ మిగిలినవి. భావసదృశానుభవములను ఆయాభక్తులకు బాబా అనుగ్రహించును -అను విషయమిట నిరూపింపఁబడినది.

'భావసదృశమనుభవములఁ గూర్తువు
సేవకజనులకు - చిద్విలాసుఁడవు.'

[మధ్యాహ్నహారతి]

శ్రీ సాయీబాబా భక్తుఁడు (1st class) సబ్జడ్జి శ్రీ బి. వి. చాగలే తన అనుభవము నిటులఁదెలిపెను. 1943 ఫిబ్రవరియందు అహమ్మద్‌నగర్ జిల్లాలోని 'కర్జాత్'పురమున నొక పూజామహోత్సవసందర్భమున అనుకొనిన అతిథుల కైదురెట్లుగ భోజనమునకేతెంచిరి. బాబా అనుగ్రహమున ఆపదార్థములు వారందఱకుఁ దృప్తిగ సరిపోవుటయేకాక యింకను మిగిలినవి. భక్తుల విశ్వాసముకొలఁది అనుగ్రహము ప్రసరించునని మనము గుర్తింపఁదగును.

## బాబా సర్పరూపమున దర్శనమిచ్చుట :-

ఒకసమయమున శిర్డీ నివాసియగు రఘుపాటిల్- నివాస్‌గ్రామములోని బాలాజీపాటిల్ గృహమునకేగెను. ఆసాయంత్రము గోవుల

కొట్టమునందొక సర్పము బుసకొట్టుచువచ్చెను. అందలి పశువులు భయమున నటునిటు దిరుగఁజొచ్చెను. ఇంటిలోనివారందరు భయపడిరి. బాలాజీమాత్రము బాబా సర్పరూపమునఁ దనయింటికేతెంచెనని తలంచెను. లేశమేని భయములేక ఒకగిన్నెతో పాలనుదెచ్చి ఆ సర్పము ముందుంచి 'బాబా! నీవేల బుసకొట్టి అలజడిచేసెదవు? మమ్ము భయపెట్టఁదలఁచితివా? ఈగిన్నెలోపాలను ప్రశాంతముగఁ గ్రోలుము'— అని, నిశ్చలముగ ముందుఁగూర్చుండెను. ఆయింటిలోనివారందరు భయభ్రాంతులై యేమిచేయవలయునో యెఱుఁగకుండిరి. ఆపాలనుగ్రోలి, యాసర్పమటనుండి యదృశ్యమయ్యెను. అదియెటకేగెనో యెవరు నెఱుఁగకుండిరి. ఆపశువుల కొట్టమంతయు గాలించి వెదకిరి— కాని, సర్పముజాడలేదు.

[దక్షిణ హిందూస్థానమున కోయంబత్తూరుపట్టణమున 7-1-1943 సాయంకాలము 5-30 గంటలకు (శ్రీ) సాయిప్రభువు సర్పరూపమున దర్శనమిచ్చిన ఉదంతము 'సాయిసుధ' 1943 జనవరి మాసపత్రికలో విపులముగఁ దెలుపఁబడినది. ఆప్పురమున 'నాగసాయి' ప్రతిష్ఠఁగా వింపఁబడినది.]

బాలాజీకి యిరువురుభార్యలు పిల్లలుకలరు. నివాస్‌నుండి కుటుంబముతో బాబా దర్శనార్థ మప్పుడప్పుడు శిర్డీకి వెళ్లువాఁడు. బాబా చీరెలు వస్త్రములుకొని తెప్పించి వారికిపెట్టి పంపువాఁడు. తనభక్తులపై బాబాకు గలప్రేమ వర్ణించుటకెవరికి సాధ్యము?

♦ బ్రహ్మానందాయ నమః ♦ భూభృత్సమోపకారిణే నమః
♦ భావగమ్యాయ నమః ♦ [illegible] నమః
♦ సర్వరూపేష్వవస్థితాయ నమః
♦ భుజంగరూప మావిశ్యసహస్రజనపూజితాయ నమః

---

ఏమీ, నిన్నుపేక్షింతునా ?

# నలుబదిరెండవ ప్రకరణము

## 36 అనుగ్రహ లీల.

[S.C.S.] శ్రీ సాయీనాథ బోధామృతములోని వివిధవిషయముల

సూచిక.

**సద్విషయము:-** సద్గురు వెవరు?

వేద వేదాంతములను ఆరు శాస్త్రములను బోధించువాడు- అష్టాంగయోగము లభ్యసించినవాడు బ్రహ్మమునుగూర్చి చక్కగ ఉపన్యసించువాడు- కేవలము మంత్రోపదేశములఁ గావించి శిష్యుల నన్నిపర్యాయముల జపింపుమని ఆదేశించుచు ఫలితమునకుమాత్రము బాధ్యత వహింపనివాఁడును, స్వానుభవము లేకున్నను గ్రంథపఠనము భాషాపాటవముఁ బురస్కరించుకొని మనోహరముగ పరతత్త్వమును గూర్చి పలుకువాఁడును 'సద్గురువు' కాఁజాలఁడు.

తనప్రభావము- ఆత్మశక్తిచేత తనవానికి ఇహాపరముల విషయ భోగములందు విరక్తిఁగల్పించువాఁడు- ఆత్మజ్ఞానము నందభిరుచి కలిగించువాఁడు, జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడు- బ్రహ్మనిష్ఠుఁడు- బ్రహ్మజ్ఞుఁడగువాఁడు 'సద్గురువు'- అని చెప్పఁదగినవాఁడు. ఆత్మజ్ఞుఁడుకానివాఁడితరులకేమి తెలుపఁగలఁడు? సద్గురువు తనవానివలన నెట్టి ప్రత్యుపకృతిని స్వప్నమునసేని ఆసింపఁడు. తానే తనవానిగ సేవించును. తన శిష్యుఁడల్పుఁడని తానధికుఁడని యెన్నఁడు 1 తలంపఁడు. తనబిడ్డవలె తనవానినిఁ బ్రేమించుటయేకాక, తనకు సమునిగ, బ్రహ్మముగ నతని

1 సమానాతిశాయ నమః: 2 శ్రేష్ఠాయ నమః;

భావించును. సద్గురువు శాంతిధామము. ఎట్టిపరిస్థితులయందుఁ జలింపఁడు. తన విద్యాకౌశలముఁదలంచి గర్వింపఁడు. పేదలు ధనికులు, పిన్నలు పెద్దలు అతనిదృష్టియందు సములు.

మనపూర్వకృత సుకృతవిశేషముచేత సమర్థ సద్గురువగు శ్రీ సాయీ మహాప్రభువును సమాశ్రయింపఁ గలిగితిమి. బాబా మనకా శ్రయమిచ్చినాఁడు. నిండుజవ్వనమునను తప్ప మఱొకటిలేదు. బాబాకు కుటుంబముగాని, గృహముగాని మిత్రులుగాని, ఇతరాధారముగాని లేదు. పదునెనిమిదవయేటనుండి ఆతండి ఆత్మసంయమన మత్యద్భుతము- అసాధారణము. ఏకాంతముగ నిర్భయముగ నెల్లవేళల ఆత్మ నిష్ఠ యందుండువాఁడు తనభక్తులప్రేమ పాశములఁజిక్కి- తనవారికి యోగక్షేమములఁ గూర్చుచు వారికధీనుఁడైనాఁడు. భౌతిక దేహము నందున్న కాలమున మహాసమాధి అనంతరము నేటికినింకే నాటికిబాబా తినవారి దైనికప్రవర్తనములందుఁ ప్రకటించుచున్న అనుభూతులాయా ఆశ్రితులకు అనుభవైకవేద్యములు.

భక్తుఁడనువాఁడు తనహృదయమను ప్రమిదెను విశ్వాసమను తైలముననింపి, ప్రేమయను వత్తిని వెలిగింపవలయును. అంతట ఆత్మ జ్ఞానమను జ్యోతి ప్రకాశించును. ప్రేమ సహితముగాని జ్ఞానము వ్యర్థము- ప్రేమరహితమైన జ్ఞానమువలన నెవరికి నెట్టిప్రయోజనము లేదు. ప్రేమలేనియెడ సంతృప్తిలేదు. అవిరళము అపారమునగు ప్రేమను సంపాదింపనేరవలయును. ప్రేమ మహత్త్వమద్భుతము. దాని ముందు సకలములు క్షుద్రములు, ప్రేమసహితములుగాని విద్యలు- శ్రవణ పఠనాదులు నిస్సారములు- ప్రేమగల తావున భక్తి- విరక్తి- శాంతివిముక్తులు వానివాని సకలసంపదలతో నధివసించును. ఆసక్తి తో గ్రహించి అనుభవించినగాని ఆవస్తువునందు. ప్రేమజనించదు ఎచట

ఆసక్తి- భక్తి నెలకొనునో అచట భగవానుఁ డవతరించును. తనస్వ స్వరూపమును విశదపఱచును. అదియే ప్రేమావతరణము. అదియే మోక్షోపాయము.

ఈ ప్రకరణమునందు సూచింపఁబడినవి '(శ్రీ) సాయీనాథ బోధామృతము' Sri Saibaba's Charters and Sayings[S.C.S] అను గ్రంథమున విపులముగ వివరింపఁబడిన కారణమున గ్రంథవిస్తర భీతిచే పాఠకులు తెలిసికొనుటకు ఆగ్రంథములోని 'పేరా' నెంబర్లు మాత్రము గుర్తింపఁబడినవి. ఇవి వివిధములగు అంశములక్రింద విభ జింపఁబడినను ఇవియన్నియు (శ్రీ) సాయీనాథుని అవతారమహాత్మ్య ముఁదెలుపు విషయములే యగుచున్నవి. బాబా లీలలు మహిమలు అనంతములు- ఉపాసనీమహారాజు '(శ్రీ) సాయీమహిమ్న స్తోత్రమునఁ దెలిపినటుల 'అనేకాద్భుతా- తర్క్యలీలా విశేషము'లై యున్నవి.

(శ్రీ) సాయీనాథ బోధామృతము (S.C.S) అను గ్రంథమున బాబా తనబిడ్డలకు వారివారి అనుభవముల పూర్వకముగ పూర్వజన్మ ముల వృత్తాంతములు, నీతికథలరూపమున పెక్కువిషయములను దెలి పినాఁడు. 'ఏమీ, నిన్ను పేక్షింతునా?' [(శ్రీ సాయీబాబా చరిత్రము- భక్తుల వృత్తాంతములు) [Life of Sai Baba] అను ఈగ్రంథము నకు (శ్రీ) సాయీనాథ బోధామృతము- [S.C.S.] (Sri Sai Baba's Charters and Sayings] అనుగ్రంథము అనుబంధముగ సోదర సోదరభక్తులు గుర్తించి బాబా చరిత్రములోని విషయములన్నియు సంపూర్ణముగ గ్రహించుటకీ రెండుగ్రంథములను శ్రద్ధతోఁ జదువ ప్రార్థితులు.

। సర్వకర్మఫలత్యాగి నేనమః
। మార్జారోచ్ఛిష్ట భోజనాయ నమః

## వివిధ దేవతారూపములఁ శ్రీ సాయినాథుఁడు దర్శనమిచ్చుట.

| విషయము | S.C.S. శ్రీసాయినాథ బోధామృతము పేరా - నెంబరు |
|---|---|
| 1909 క్రిస్మస్‌లో శిరిడికి వెళ్ళిన దక్షిణాఫ్రికా డాక్టరు- శ్రీ సాయిబాబాను తన యిష్టదైవమగు శ్రీ రామచంద్రునిగ చూడఁగలిగెను.<br>* ఆఫ్రికాగతవైద్యాయ పరమానందదాయకాయ నమః<br>* రామరూప ప్రదర్శకాయ నమః<br>♦ సాయిరామాయ నమః | 222 |
| మూలేశాస్త్రికి(నాశిక్)ఆతనిగురువగు ఘోలప్ (ఘోలప్) మహారాజుగ బాబా దర్శనమిచ్చెను.<br>♦ మూలేశాస్త్రి గురుఘోలప్ మహారాజస్య మూర్తిధృతే నమః | 228 |
| మేఘుఁడు (మేఘశ్యామ్) శంకరునిగ బాబాను చూచెను.<br>♦ శివరూపాయ నమః । శ్రీ కంఠాయ నమః | 424 |
| శంకర్ బల్వంత్ కొహాల్కర్‌నకు దత్తాత్రేయుఁడుగ బాబా దర్శనమిచ్చెను.<br>♦ సర్వేశాయ నమః | 351 [356] |
| శంకర్ నిమోన్కర్‌నకు మారుతిగ బాబా దర్శనమిచ్చెను. ♦ శ్రీమతే నమః | నిమోన్కర్ వృత్తాంతము జూడుఁడు. |

బాలాసాహెబ్ బిన్నేవాలాకు- (నా.గో. చందో      D.E. Part III
ర్కర్‌తోడి అల్లుడు] అతని యిష్టదైవ      item No. 5
ముగు దత్తస్వామిగ దర్శనమిచ్చెను.

• త్రిమూర్తయే నమః

R.B. పురందర్ తల్లికి, భార్యకు బాబా పాండు      పురందర్ వృత్తాం
రంగడుగ దర్శనమిచ్చెను.      తము చూడుడు.

• శేషశాయినే నమః

బాబా గణపతిగ అనుగ్రహించుట బాంద్రా
శాంత - సి. కె. గాడ్గిల్      58, 172, 144

• ఆఖువాహనమూర్తయే నమః

• శుక్లాంబరధరాయ నమః

## బాబా ఇతరసాధువులుగ-ఇతరరూపములుగ నుండుట తోచ్చుట- విశ్వవ్యాపకత్వము-

బాబా - అకల్‌కోట మహారాజుగ-      74

* సాయి సత్తమాయ నమః

మాలేశా స్త్రీ గురువు ధోలప్ మహారాజుగ      228

• నిర్గుణాయ నమః

S.B. నాచ్నే యింటికి భోజనమునకు వెళ్ళిన సాధువు-      354

* సహస్రపాదే నమః

చంద్రాబాయి R. బోర్కరు కోపర్గాములో నుండగ
వెళ్ళిన సాధువు [1908]      355A

B.V. దేవ్ తల్లి ఉద్యాపనము వింపునకు సన్యాసి
రూపమున వెళ్ళుట 355

• సహస్రశీర్ష మూర్తయే నమః

ఆదం దలాలీ దగ్గఱకు మార్వాడీ వేషమున బాబా
వెళ్ళుట • నిర్ద్వంద్వాయ నమః 358

ధునిలో చేతినిదూర్చుట - కొలిమిలోబడిన కమ్మరి
వానిబిడ్డను రక్షించుట. 107

♦ అపార్థివదేహాయ నమః
• చర్మదాహస్వవిక్రియాయ నమః
• కుంభారాగ్నిశిశుత్రాత్రే నమః
• దగ్ధహస్తార్భకావనాయ నమః
• భక్తార్థం దగ్ధహస్తాయ నమః

మీనా తాయీప్రసూతి - రాంగిర్ బావు నా సో. చందోర్కర్
నకు ఊదీనిచ్చి జమ్నేరునకు పంపుట. వృత్తాంతముఁ జూడుడు
టాంగా - బంట్రౌతు...

• సహస్రాక్షాయ నమః
• అవాక్పాణి పాదోరవే నమః

చంద్రోర్కర్ హరిశ్చంద్రపర్వతముపై దప్పికొనుట ,, ,,
భిల్లునిరూపమునఁ బాబా - నీరున్నస్థలము నిర్దే
శించుట

ఉపాసనీబాబా - ఊపిరితిత్తులవ్యాధి వృద్ధ ఉపాసనీ వృత్తాంతము
ముసల్మాన్ రూపమునఁదోచి చల్లనీరు త్రాగవల జూడుడు.
దనుట.

సాలోక్య సామీప్య సాయుజ్యపదదాయ
కాయ నమః

రహా- జహా యుద్ధసమయమున జహాంగీర్-
(ఫ్రాంచీవసువాలా (Captain) స్టీమరులు నీటిలో Sri upermin
మునుగుచుండ బాబానుప్రార్థింప- బాబా కప్నీ [వామల్ రావ్ పిశ్రేల్]
ద్వారకామాయి మసీదు సాగరజలమయమగుట

• క్షిప్రప్రసాదదాత్రే నమః

S.B. నాచ్నే- భార్య కర్మాంతరములకు నాశిక్ నాచ్నే వృత్తాంతము
నకు అతనివెంట 'గణపతిశంకర్' పేర వెళ్ళ సక చూడుడు
లము నిర్వర్తించుట.

బాబా తనబిడ్డలను రక్షించుటకు తన నాలుగు 201
చేతులచాచుట.

చరాచర నివాసితస్య సంకటాయ నమః
- కృష్ణాయ నమః

కుక్క-రూపమున కపర్దేసతి యింటికి వెళ్ళగ కాలు
చున్న కొరివిని విసరుట, 259

* బ్రాహ్మణస్త్రీ విస్తృతోలాం రక్షితస్యాకృతయే
నమః

పిల్లిరూపమున డాసిన బాబాను హాన్సిరాజ్ కొట్టుట 73A, 452

† మర్కటరూపేణ భక్తస్యరక్షణే కేన తాడితాయ
నమః

† భూతప్రేత పిశాచాదీన్ ధర్మమార్గేణ
నియోజయతే నమః

## బాబానుండి ప్రకటమైన సిద్ధులు

మసీదుకప్పునకు రెండుమూరలక్రిందుగ వ్రేలాడ 295
గట్టబడిన చిన్నపలకపై బాబా పరుండుట(లఘిమ)

† సిద్ధప్రాకామ్యాయ నమః

యోజయతే నమః

మృతుల జీవితులఁజేయుట 35,37,327,536

♦ సుఖదుఃఖసహాయ నమః

దృష్టిని ప్రసాదించుట
(విఠల్‌రావు జస్వంత్ దేశపాండే తాతకు) 339

♦ వృద్ధాంధేక్షణ సంప్రదాయ నమః

♦ నష్టదృష్టిప్రదాత్రే నమః

## పూర్వజన్మవృత్తాంతములను గుర్తించుట

1. పూర్వజన్మవృత్తాంతము– గురువునకై అన్వేషణము– గురుమహిమ– నలుగురుసహపాఠులు 175

* గురుప్రేమసమాలబ్ధ పరిపూర్ణస్వరూపవతే నమః

2. బసప్ప- వీరభద్రప్పల వృత్తాంతము
[కప్ప–పాము] 473

♦ భేకంద త్తవరం స్మృత్వాసర్పాప్యాదపిరక్షకాయ నమః

♦ దుష్టజంతు పరిత్రాత్రే నమః

3. రెండుమేకల వృత్తాంతము. 471

♦ జన్మ జన్మాంతరజ్ఞాయ నమః

♦ అనేక జన్మవృత్తాంతం సవిస్తారముదీరయతే నమః

## సద్గతిని ప్రసాదించుట

1. నూల్కర్ 333

* సుక్షేమ విగతస్పృహాయ నమః

2. విజయానందస్వామి 334–124[2]

♦ భవలుంఠన కోవిదాయ నమః

## భక్తుల వారికుటుంబములను ఆపదలనుండి అధి వ్యాధులనుండి బాబా రక్షించుట

## వ్యాధులు

2. బల్వంత్ కపర్డేను ప్లేగువ్యాధినుండి రక్షించుట కపర్డేవృత్తాంతము
3. గోవాలోని పోలీసుఇన్స్పెక్టరును ,, ,,
4. ధుమాల్ కుటుంబమును ,, ,, ధుమాల్ వృత్తాంతము
5 శ్యామా వదినను ,, ,, శ్యామా వృత్తాంతము
† స్వీకృత భక్తరోగాయ నమః
6. నందరాం మార్వాడిని ,, ,, 37, 500
7. గోపాలరావుబూటీని వాంతులు విరేచనముల
నుండి బాబా కాపాడుట బూటీ వృత్తాంతము
8. సర్పదష్టుడైన శ్యామా ను- ఆజ్ఞామాత్రమున
సర్పవిషమునుండి రక్షించుట. శ్యామావృత్తాంతము
9. M.W. ప్రధాన్ బిడ్డలను బాబా రక్షించుట ప్రధాన్ వృత్తాంతము
10. S B నాచ్నేను- బిడ్డలను బాబా కాపాడుట నాచ్నే వృత్తాంతము
11. బాలాసాహెబ్ మిరీకర్ ను సర్పగండము
నుండి రక్షించుట 525
† మిరీకరం సర్పగండాత్ సైవాజ్ఞయా
ద్విమోచయతే నమః
12. శరణుజొచ్చిన పిచ్చికుక్కను రక్షించుట 290
• ఉన్మత్తశ్వాభి గోప్త్రే నమః
12a భగోజీ కుష్ఠురోగమును నివారించుట
* భగోజీ కుష్ఠురోగఘ్నాయ నమః

13. బాబా సేవకుడైన రఘు మొదలగు వారిపైన [illegible]
విధింపబడిన శిక్షను తప్పించుట
† కుష్ఠురోగ నివారకాయ నమః
† వైకుంఠ ప్రియ కర్మకృతే నమః

మహాసమాధితరువాత బాబా-భక్తులను రక్షించుటం.

1. 1937లో వఢేవార్ పత్నిని రైలుక్రింద పడిన ఆమెను కాపాడుట. — సాయీశరణానంద్ వామనరావుపటేల్ రచించినగ్రంథము- [Sri Sai the Super man]

§ ధూమయానపతత్ పాఢేవార్ పత్నీ సురక్షితాయ నమః

2. బొంబాయి మతకల్లోలములలో పోలీసుఇన్స్పెక్టరు ఆత్మారాంసామంతును రక్షించుట. „ „

§ యమకింకరసంత్రస్త సామంతస్యసహాయకృతే నమః

3. రాజకుమారి D/o. K.S మంజర్, కోయంబత్తూరు, ఆభక్తుని స్వప్నమున బాబా పొడమి అతని కుమార్తెను సమాధిదగ్గఱకు గొనిరమ్మని మూకత్వమును నివారించుట „ „

+ నాగసర్పమయాశేచ సమారూఢపదానాయనమః

4. ??-8-?? న C.C. మాన్కివాలాకు [అహమ్మదాబాద్] బాబా భౌతికముగ దర్శనమిచ్చి అతని వంజావ్యాధిని మాన్పుట. శ్రీ. బి.వి. నరసింహస్వామిగారికి సందేశమంపుమని తెలుపుట. „ „ (S.C.S. Addenda page xxii]

¶ సర్వలోక శరణ్యాయనమః

28-5-48 న సేత్ రతిలాల్ చిమన్‌లాల్‌ను గంగాపూర్ స్టేషన్‌లో రజకారుల దాడినుండి- పటాన్‌రూపమున బాబా వారి రైలుపెట్టెముందు నిలిచి- అపాయమునుండి రక్షించుట, — Sri Sai the Superman (వామనరావ్‌పటేల్)

† క్షాంతానంత దార్ఢ్యాయ నమః

బాబా అంతర్జ్ఞానము — ఋతంభరప్రజ్ఞ.

## భక్తయోగక్షేమభార నిర్వహణము

## యోగము — (లేనిదానిని సమకూర్చుట)



క్షేమము:— (ఉన్నదానిని రక్షించుట)



రావుబహదూర్ **S. B.** ధుమాల్

[౩ వ సంపుటము 18 ప్రకరణములో వీరి చరిత్ర కలదు.]



శ్రీ D. S. రసానే

[౩ వ సంపుటము 15 వ ప్రకరణములో వీరి చరిత్ర కలదు.]



శ్రీ H. V. సాతే

(౩ వ సంపుటము 19 వ ప్రకరణములో వీరి చరిత్ర కలదు)



(శ్రీ) మహాల్సాపతి          బాబా          భాగోజీ



శ్రీ నారాయణ ఆశ్రమ్

[౪వ సంపుటము ౪1 ప్రకరణము లో హరి చరిత్ర కలదు.]



శ్రీ పి. ఆర్. అవస్తే

[4 వ సంపుటము 43 వ ప్రకరణము]

6. కుష్ఠురోగి- పేడా- [తార్కాడ్ సతికి పారముఁ గలుపుట] 517
నాచ్నే మఱచిన రెండణాలు - అడిగితీసికొనుట,
శ్రీ బ్రహ్మవాదినే నమః

మలినచిత్తముతో సమర్పించువానిని- బాబా నిరాకరించుట

1. భిక్కుబాయి [బయ్యాజిపటేల్ కోటే భార్య]
మలినమనస్సుతో నర్పించినవానిని బాబా స్వీకరింపకుండుట- 519

2. శ్రీమతి కనిత్కార్ బ్రాహ్మలు. 520
బాబా శక్తులు సమర్థతలుగూర్చి
తత్త్వజ్ఞాన సమాజసభ్యురాలు- సందేహము 449
(కనిత్కార్ సతి ?)
శ్రీ బ్రహ్మణ్యాయ నమః
శ్రీ బ్రాహ్మణానాం మహాధిష్ఠాయ నమః

బాబా ఛాయాపటము తీయవచ్చిన వారితో బాబా తెలిపినది- 656

శ్రీ కామేరాశక్తినాశకాయ నమః

హరినామ స్మరణవలన హరి ప్రత్యక్షమై కాకా దీక్షిత్తుతోఁ దెలుపుట. 196, 198

శ్రీ జప్తనామ సుసంతుష్టిహరి ప్రత్యక్షభావితాయ నమః

———

# ఏ విరా, నిన్ను పేక్షింతునా ?

## నలుబదిమూఁడవ ప్రకరణము

## 37 అనుగ్రహ లీల.

**శ్రీ. పి. ఆర్. అవస్తే – (పూనా)**

(రిటైర్డు జడ్జి, గ్వాలియర్), (బి. ఏ. యల్. యల్. బి.)

**సద్విషయము:-** సాధు సత్పురుషులు – అభేదస్థితి.

అనేకజన్మ సుకృతవిశేషముగల జీవికిమాత్రమే సాధుసాంగత్య సల్లాపభాగ్యము లభించును. ఈవిశ్వమున సాధుసత్పురుషు లనేకులు గలరు. వీరందఱు నొకేసంస్థకుఁ జెందినవారు. పరమేశ్వరుని అవ్యాజ కారుణ్యమే తనకార్య నిర్వహణమునకై సాధుసత్పురుష రూపమున నవతరించుచుండును. వీరు వివిధకాలముల వివిధదేశములఁ బొడమిన వారుగఁ గనఁబడుచున్నను వీరందఱిలక్ష్యము– కార్యదీక్ష– ఒక్కటియే. ఆశ్రిత జనోద్ధరణమే వీరి ప్రధానకార్యము. వీరిలో నెవరెక్కడెక్కడ నేమికావించినది వారెఱుఁగుదురు. వారు ప్రత్యక్షభగవానుఁడు– అపాం తరాత్మయగుటచే వారిఎఱుక దేశకాల కారణాతీతము– అనిమనము గ్రహింపవలయును. దైవకార్య నిర్వహణమున వీరు పరస్పర సహాయ భూతులగుచుందురు. వీరిలో నెవరిని ఏజీవి యెప్పుడెక్కడ ఆశ్రయించి నను తక్కినవారెఱుఁగుదురు. బాబా తనబిడ్డల నుద్దేశించి పలుకున పుడు 'నిన్ను నాలుగు జన్మములనుండి, నిన్ను ఏడు జన్మములనుండి, నిన్ను ముప్పది జన్మములనుండి, నిన్ను డెబ్బదిజన్మములనుండి యెఱుఁ గుదునని పలికినాఁడు. అది పొల్లుకాదు, ఆయాజీవులు ఏయే జన్మము

లలో నేయే సాధుసత్పురుషుని ఆశ్రయించినను, ఆ సత్పురుషులకు భేదములేదు. కావున బాబాను- దైవమును- సమాశ్రయించినవారే యగుచున్నారు.

## (శ్రీ) పురుషోత్తమ్ ఆర్, అవస్తే (పి. ఆర్ - అవస్తే) పూనా

[బి.ఏ.యల్.యల్.బి. రిటైర్డుజడ్జి - గ్వాలియర్]

(శ్రీ) అవస్తేగారు (శ్రీ) సాయిబాబా భక్తులలో మఱియొకరు. భారతదేశమున- ప్రపంచమునందంతట (శ్రీ)సాయిభక్తి ప్రచారమునకై ఒక ఉపకరణముగ బాబాచే గ్రహింపఁబడిన పూజ్య(శ్రీ). బి. వి. నరసింహస్వామిగారు వీరి సహకారమువలన నింత అపార సేవ కావింపఁగలిగినారు- అనుట అతిశయోక్తి కాజాలదు భౌతికతనువునందున్న (శ్రీ) సాయినాథునితోడ సన్నిహిత సంబంధముగలిగి బాబా అనుగ్రహపాత్రులు- భక్తులైన బొంబాయిరాష్ట్రము లోనివారిని సందర్శించి, వారివారి అనుభూతులను సేకరించి, ఏర్చికూర్చి మనకందించిన మహాకార్యమున (శ్రీ) నరసింహస్వామిగారికి వీరు వెంటనుండి సాయపడినారు.

(శ్రీ) అవస్తేగారు 1870 ఫిబ్రవరిలో సదాచారసంపన్న బ్రాహ్మణకుటుంబమున జనించిరి వీరి చిన్నతనమునుండి సాధుసాంగత్యముకలిగియున్నవారే. పాశ్చాత్య విద్యావ్యాసంగముల మధ్యకాలమున కొంతవరకు భౌతికవాదమునకు లోఁగినను తఱచు సజ్జనుల సాంగత్యమున వీరియందు భక్తిభావము నెలకొనియే యుండెను. వీరికి 1914 సంవత్సరమున బాబా అంకితసంతతిలో నొకరగు (శ్రీ) జస్టిస్. యం బి. రేగే [వీరి వృత్తాంతము లోఁగడఁ దెలుపఁబడినది] గారి సాంగత్యము లభించెను (శ్రీ) రేగే మహారాజుగారివలన బాబా మహా

త్త్వమునుగూర్చి వినినాఁడు. (శ్రీ) రేగేగారు తనమిత్రునిఁగూడ బాబా అనుగ్రహపాత్రునిఁ జేయఁదలంచెను. 1914 డిసెంబరు (క్రిస్మస్) సెలవలలో శ్రీ అవస్తేగారు పండరీపురము వెళ్ళఁదలచిరి. ఇండూరు నుండి పండరీపురము వెళ్ళుటకు మధ్యలో శిర్డి కలదు. కావున శిరిడికి వెళ్ళి బాబా దర్శనము చేసికొని పండరికి వెళ్ళుమని శ్రీ రేగేగారు తెలిపిరి. ఆయనకు ఒకటి రెండు ఆటంకములు కలవని అవస్తేగారు తెలుప, వానినిఁ దొలగింపుమని శ్రీ రేగే మానసికముగ బాబాను ప్రార్థించెను.

మొదటి ఆటంకము —

(శ్రీ) అవస్తే అంతకు పూర్వమున ప్రసిద్ధములగు యోగశక్తులు గలిగి, గొప్ప పేరుపొందిన యోగినిని గురువుగ స్వీకరించినాఁడు. ఇప్పుడు (శ్రీ) సాయిబాబాను సందర్శించుటయే ఆమెయెడ గురుద్రోహమగునేమో! యని ఆయనసందేహము, "సకలగురువుల అంతరాత్మయే శ్రీ సాయిప్రభువు - కావున ఆయోగినియొక్క అంతరాత్మ సాయినాథునకు భిన్నముకాదు. శిరిడికి వెళ్ళి బాబాను సందర్శింతువేని సాయీశునందును ఆయోగినినిఁ జూడఁగలవు"- అని, రేగే తన మిత్రునకుఁ దెలియఁజెప్పెను.

రెండవ ఆటంకము :-

'జడ్జి' పదవికి సంబంధించిన పనులను నిర్వర్తించుటయందు 'అవస్తే' చాలనిదానము. అత్యవసరముగ ముగింపఁబడవలసిన పనులు చాల దిగఁబడియుండినవి. ఆపనులు. పూర్తియగువరకు సెలవు లుపయోగించుకొనరాదని పైయధికారులు ఉత్తరువులిచ్చిరి, సెలవుల మొదటివారములోనే పనులు పూర్తియయ్యెను. అట్లగుట ఆయనకే ఆశ్చర్యముకలిగెను, బాబా అనుగ్రహమని తలంచెను.

? కారిః స్త్రీదుఃఖితే - న్యాయసమః

రేగే- ఆవస్తే- ఇరువురుమిత్రులు శిరిడీకి ప్రయాణమైరి. అది ప్రపంచ సంగ్రామకాలము- 1914న రైళ్ళలో సైనికదళములు తరలింపఁబడుచుండెను, ఇండూరునుండి మన్మాడ్ పోవుమార్గమున "మౌ" అను సైనికశిబిరం స్టేషన్‌కలదు. అచట రైలులోనున్న ప్రయాణికులను దింపుచుండిరి. ఈ యిరువురుమిత్రులుగూడ దిగవలసిన స్థితి పట్టినది. రేగే బాబాయందు గాఢవిశ్వాస ప్రేమలుగలవాఁడు. వారు దిగఁబోవుచుండఁగ ఆ సేనాధిపతి అక్కడకువచ్చి 'ఇది చిన్నపెట్టె- సైనికులకుపయోగపడదు. కావున మీరు దిగవలసినపనిలేదు.' అని వారినచటనే కూర్చుండనియమించెను. అదియు బాబా అనుగ్రహమే. రైలు నందారాత్రియంతయు రేగే బాబా భజనము చేయుచునేయుండెను, వారు శిరిడీకిఁ జేరినపుడు బాబా యీ విషయములన్నియు ధ్రువపఱచినాఁడు. [[S,C.S. 402A] [S.C.S. 370A] చూడుడు!]

ఆవస్తేను వెంటఁగొని రేగే శిరిడీకిఁజేరి శ్రీ సాయీప్రభువునకు ప్రణమిల్లెను. బాబా రేగేనుజూచి 'ఈ చపలచిత్త సిశాచమెవరు?'- అని ప్రశ్నించెను. అది భవష్యత్సూచకమయ్యెను. (ఆవస్తే రానిదే తానుగూడ వెళ్ళఁదగదు, అను రేగే తలంపును బాబా తెలుపుచు) రేగే నుద్దేశించి "చూడుము- ఒంటరిగ రాజాలఁడయ్యెను. ఇతరులను వెంటఁగొని రావలసివచ్చినది, నాబిడ్డలను రైలునుండి దింపయత్నించినారు. నేనా సేనాధిపతితో 'వారు- నాబిడ్డలు: రానిమ్ము' అని చెప్పినాఁడను. (దీని ననుసరించి వారిరువురారైలులో ప్రయాణము చేయగలుగుట విదితము.) రాత్రి నాకు విశ్రాంతియే లేకుండెను. తెల్లవాఱులు 'బాబా! బాబా!' అని యీతఁడు (రేగే) నా ప్రక్కనఁజేరి గోల పెట్టుచునేయున్నాఁడు.'- అని బాబా పల్కెను. ఈ నాలుగు[1] నిదర్శనముల ననుసరించి శ్రీ సాయీప్రభువు నీడవలె తనబిడ్డల వెంటనుండి యెటుల రక్షించుచు, వారి పవిత్రాశయములను మన్నించుచు ఆటంక

[1] దానశౌండాయ నమః [2] పరాత్పరాయ నమః

ములఁ దొలగించుచు నెలల నభీప్సితార్థముల సమకూర్చుచున్నది. విది తమకు కాఁగలదు.

అవస్తే తనహృదయమున తనగురువగు యోగినియెడ గురుద్రోహముఁ గావించుచుంటినే అని బాధపడుచుండెను. దీనినిఁ దొలగించుటకు రేగే నాలుగు రోజాపుష్పములను దారమున ముడిచి ఆముడివిప్పుమని బాబాకు పంపెను. బాబా దానిని ముట్టుకొని అయినా యింటనే దానిని విప్పవలెనని తిరిగిపంపెను. మధ్యాహ్నము నైవేద్యమునకు ఒక అన్నముద్ద పాత్రియందు గుప్తపఱచి "బాబా ఈపిండమును స్వీకరించిన ఆసిద్ధినొందిన యోగిని (గురువు) బాబా యందుఁగలదు. అని విశ్వసించువాఁడను" అని అవస్తే మనస్సునఁ దలంచెను. ద్వారకామాయి మసీదు మెట్లెక్కుచుండఁగ నతఁడు తొణఁకెను. అన్నపుముద్ద క్రిందఁబడెను. దానినిఁ జేతఁబట్టుకొని యతఁడు బాబాను సమీపించెను. 'దానిని నాకీయుము- దానిని స్వీకరించి నీవు కోరుకొను తావునకుఁ బంపుదును'- అని, బాబా పలికెను. అవస్తే పరవశుఁడై 'నా గురువు మరణించెను- ఈతఁడు జీవించియున్నాఁడు'- అని ప్రలాపించుచు ఉద్రేకము- ఆవేశము వహించెను, అతనికి మనస్సున శాంతి హెచ్చెను. సాయిప్రభువు నెల్లెడలఁ జూచుచుండెను. ఉన్మత్తునివలె ప్రవర్తించెను. బాబా తన మాంత్రికశక్తి నుపయోగించి తనను చంపనున్నాఁడని తలంచెను. బసయందు అర్ధరాత్రమున లేచి 'నన్ను నాశనముచేసి చంపనున్న ఈ మాంత్రికుని దగ్గఱకుఁ జేర్చితివా!' అని అఱచుచుండెను. రేగే యింక సహింపలేకపోయెను. అంతట రేగే మసీదుదగ్గఱకేగి అవస్తేను రక్షింపుమని మానసికముగ బాబాను ప్రార్థించెను. ఆమఱునాఁడు ఉదయమున బాబానుజేరి రేగే ప్రొక్కఁగా 'ఈతని (అవస్తేను) శిర్డి పొలిమేర అవలకుఁ గొనిపోయి విడిచిపెట్టుము'- అని బాబా ఆజ్ఞాపించెను. రేగే అటులకావించెను. షిర్డీపొలి

మేర దాటినతోడనే ఆవస్తె తనపైశాచికచేష్టలుడిగి స్వస్థచిత్తుండ య్యెను. [S.C.S. para. 237. చూడుడు]

(శ్రీ) ఆవస్తె తరువాత బాబా అనుగ్రహపాత్రుండై బాబా భౌతికతనువు నందున్నంతవరకు ప్రతిసంవత్సరము మూడు నాలుగుపర్యాయములు శిరిడికి వెళ్లి శ్రీ సాయీనాథుని సందర్శించి వచ్చుచుండినాడు. శ్రీ సాయీనాథునకు అనుగ్రహపాత్రుండైన శ్రీ పి. ఆర్. అవస్తెకు వందనశతము లర్పించుచు ఆబిడ్డను అనుగ్రహించినట్టుల మనలననుగ్రహింపుమని (శ్రీ) సమర్థ సద్గురుదేవుండైన శ్రీ సాయీమహాప్రభువునకు ప్రణతి సహస్రము లర్పించుదము.

శ్రీ దాంతాయ నమః   శ్రీ నిరంజనాయ నమః

ఓమ్ శ్రీ సాయీశరణ్ !

చలచిత్తంబుం ద్యజింపుమీవికను విశ్వంబందు బ్రహ్మాజ్ఞలా
కలరెందెందటూ: వారభిన్నులని, యేకంబంచు గుర్తింపు; మె
వ్వాలనన్ నీగురుదేవునే కనుమి; ఆవస్తెయుదంతంబు సం
కెలమిన్ దెల్పనె సత్యతత్త్వమిటు; ఏమీ, నిన్నుపేక్షింతునా?

— — — —

# ఏ విూ, నిన్నుపేక్షింతునా ?

## నలుబదినాల్గవ ప్రకరణము

## 38 అనుగ్రహ లీల.

పూజ్యశ్రీ. బి. వి. నరసింహస్వామి
అఖిలభారత సాయీసమాజ వ్యవస్థాపకుఁడు
అధ్యక్షుఁడు.
( మైలాపూరు - మద్రాసు – 4 )

### సద్విషయము:-

శ్రుతిస్మృతి పురాణాదులుసైతము ప్రత్యక్షదైవమగు సద్గురువునుగూర్చి పలుకఁ జంకుచున్నవన నజ్ఞులమగు మనమెంత? మన తెలివియెంత? శ్రీ సాయీమహాప్రభువు మహత్త్వము మన పలుకులకుఁ దలఁపులకు నందనిది. ఈవిషయమున నూరకుంటలెస్స. వాస్తవముగ సద్గురు ప్రభావవిషయమున మౌనము సర్వశ్రేయస్కరము. కాని, బాబా కల్యాణగుణములు మన మౌనవ్రతమునకు భంగము కలిగించుచున్నవి. మన వ్రతనిష్ఠను మఱపించి యేమేమియో పలికించుచున్నవి. పలుకుమని ప్రేరేచుచున్నవి. స్వాదుమధురసము తానొక్కఁడే ఆస్వాదించుచున్న చప్పగనుండును. ప్రక్కన బంధుమిత్రాదులుచేర్చి పాల్గొనుచున్న నది రుచికరముగ నుండును. అదేవిధముగా శ్రీ సాయీలీలామృతము నెవనికి వాఁడొక్కఁడే ఆస్వాదించుచున్న పూర్ణముగ నానందింపలేఁడు. సోదరీసోదర భక్తులఁగూడి ఆనందించవలయును, అటులఁ బాల్గొనువారి సంఖ్యకొలఁది మన ఆనందము పెంపొందుచుండును.

# H. H. B. V. NARASIMHA SWAMYJI

FOUNDER, & PRESIDENT

All India Sai Samaj, Mylapore Madras - 4



## అంజలి

శ్రీసాయినాథ కథాసుధారసమును, విశ్వమంతటఁ ద్రావఁ బెట్టినాఁడు,
సాయీమహారాజ సత్సూక్తులభయప్రదానబోధలఁ బ్రజన్ దనిపినాఁడు,
సాయిబాబా విశిష్టావతారాంచిత, వృత్తమెల్లర కెఱిఁగించినాఁడు,
సాయీశ పదభక్తి - జాతిమతాది వైషమ్యదూరంబని చాటినాఁడు,

అఖిల భారతసాయి సంఘాధినేత
సాయి సద్గురు వ్యాసుఁడౌ, స్వామి - బీ.వి.
నారసింహుని దివ్యపాదారవింద
ములకు భక్తిమై నిత్యమంజలి ఘటింతు.

శ్రీ సాయినాథుఁడే తనవాని హృదయమున నధివసించి పలికించుచుండును. బాబాకు సంపూర్ణశరణాగతిఁజేసి, ధ్యానించుచుండుటయే మన విధ్యుక్తధర్మము. తీర్థయాత్రలు వ్రతములు- దానత్యాగాదులకంటె ధ్యానము శ్రేష్ఠము. సమర్థసద్గురు పూజాదులకంటె ధ్యానము ఉత్తమోత్తమమని చెప్పఁదగును. శ్రీ సాయిప్రభు నామమును జపించుచు, బాబా బోధలను స్మరించుచు, ఆతండిరూపమును ధ్యానించుచు, మనహృదయమున సకలభూత హృదయాంతరముల నధివసించియున్న శ్రీ సాయినాథునందు గాఢమగు ప్రేమ- నిర్వంచిత నిరవధిక ప్రేమఁ బఱపుచు, బాబా ప్రీతికొఱకు మనవిధులను నెరవేర్చుచుండవలయును. ఈ సంసృతి బంధవిముక్తికి మఱొండుమార్గము లేదు. ఈవిధముగ మనకు బాబా విధించినపనులను శక్తివంచనలేక నిర్వర్తించుచుండుమేని శ్రీ సాయినాథుఁడు మనకెల్ల విధములతోడై మనల గమ్యమునకుఁ జేర్చితీరును.

## పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారు.

శ్రీసాయి సుధారసమును భారతదేశమునసేకాక, ఖండఖండాంతరములఁ ద్రావఁబెట్టి శ్రీ సాయిభక్తి ప్రచారధురంధరుఁడై, 'శ్రీ సాయివ్యాసుడు'- అను ప్రసిద్ధబిరుదమును శ్రీ. యం.బి. రేగే మహారాజగారివలన బడసి, శ్రీ సాయిబాబాను కోట్లకొలది సోదరసోదరభక్తులకు కొంగుబంగారముగ- యింటిదైవముగఁజేసి, శ్రీసాయిప్రశస్తిమై అఖిలభారత సాయిసమాజ (మైలాపూర్ - మద్రాసు) వ్యవస్థాపకుఁడు- అధ్యక్షుఁడునై మనకెల్లరకు గురుస్థానమలంకరించి, మార్గదర్శకుఁడై శాశ్వతకీర్తిగడించిన పూజ్యశ్రీ. బి. వి. నరసింహస్వామిగారినిఁగూర్చి తెలిసికొందము.

• జ్యోతిస్స్వరూపాయ నమః । ప్రశాంతాత్మనే నమః

దక్షిణభారతము మద్రాసురాష్ట్రమున సేలంజిల్లాలోని 'భవాని' అనుపురమున సదాచారసంపన్న బ్రాహ్మణకుటుంబమున 1874 వ సంవత్సరమున శ్రీ బి.వి. నరసింహ అయ్యర్ గారు జనించిరి. వారి కుటుంబమునకు గురువులు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు శ్రీ శంకరాచార్యులుగారు. వారి కులదైవము శ్రీ తిరుపతి వెంకటాచలపతిస్వామి వారు. వారి బాల్యకౌమార యౌవనదశలు చాలభాగము విద్యావ్యాసంగమున సాధుసత్పురుషుల సేవించుటయందు, శాస్త్రాధ్యయనమున గడచినవి. ఆపిదప భగవద్గీతలు- ఉపనిషత్తులు- తదితర శాస్త్రములు సక్రమపద్ధతిని అధ్యయనముఁగావించి, మంత్ర జపానుష్ఠానముల సలిపిరి. ప్రత్యేకశ్రద్ధతో సంస్కృతవిద్య నభ్యసించిరి. అందు సంపూర్ణ పాండిత్యము గడించిరి. ఆంగ్లభాషయందు పట్టభద్రులైరి, న్యాయవిద్య [బి.యల్.] నభ్యసించుసమయమున పుత్తూరు సమీపమున వసించిన ప్రసిద్ధ యోగపుంగవులైన 'సొరకాయస్వామి'వారినిఁగూర్చి వీరు వినియుండిరి. బాల్యమునుండి సాధుసత్పురుష సందర్శన సేవాసక్తులగుటచే వీరు 'సొరకాయస్వామి'వారిని సందర్శించిరి. ప్రథమసందర్శనమునసే స్వామివారి కటాక్షవీక్షణము వీరిపై ప్రసరింపఁబడినది అన్యోన్య ప్రేమాదరణలు వెల్లివిరిసినవి. ఆధ్యాత్మిక ప్రబోధయుఁ గలిగినది. తరువాత అవకాశము కలిగినప్పుడెల్ల నరసింహఅయ్యర్ గారు స్వామివారిని సందర్శించుచుండిరి. తత్ప్రభావమున అయ్యర్ గారికిఁగల ఆధ్యాత్మిక పిపాస ఉపశమించి, మహోన్నతాశయము లెంతయేని దోహదము గాంచినవి.

న్యాయశాస్త్ర [బి.యల్] పరీక్షయందు త్తీర్ణులైనపిదప వీరు సేలంపట్టణమున స్థిరనివాసమేర్పఱచుకొని, న్యాయవాదియై, సత్యధర్మ ఆస్తిక్యభావములు దనర అచిరకాలముననే గొప్ప పేరుప్రతిష్ఠల సంపాదించుకొనిరి. న్యాయవాదవృత్తి నొకవైపున నిర్వహించుచు భక్తి

మార్గము నెల్లరకు ప్రబోధించుచుండిరి. సేలంనందు భజనమందిరము నిర్మించి నిత్యము సాయంసమయములందు భజనల సలుపుచుండిరి. తన తోడి న్యాయవాదులనే కాక పౌరులను జేర్చి భగవద్భజనల ప్రాముఖ్యము- దైవప్రాప్తికి సులభమార్గము వేఱు లేదని ప్రబోధించుచు, నిత్యభజనములందెల్లరు పాల్గొనునట్లు కావించిరి. వీనిమూలమున వారికీర్తి దినదినాభివృద్ధి నొందినది. సత్యధర్మము లాధారముగాఁగల వీరు చేపట్టిన వ్యాజ్యములన్నియు విజయవంతములైనవి. నాటి న్యాయవాదులలో గొప్ప పేరు సంపాదించిరి.

శ్రీ నరసింహఅయ్యర్ గారి ఉదాత్త గుణగణముల కనువుగ సేలంలోని పరపతిసంఘ- పురపాలక సంఘములకు అధ్యక్షులుగ నెన్నుకొనఁబడిరి. జనానీకమునకు మహోపకారములఁగావించి గొప్ప ప్రతిష సంపాదించిరి. ఉదారాశయములుగలిగి, ఆత్మవిచారణ నిపుణులగుటఁ జేసి, వీరు తత్త్వజ్ఞానసమాజమునఁ బ్రవేశించి యందు సముచిత స్థానము నాక్రమించిరి. శ్రీమతి డాక్టరు అనిబిసెంటుగారు స్థాపించిన 'హోంరూల్' సంఘమున వీరు ప్రవేశించి, భారతదేశమునకు స్వపరిపాలనావశ్యకతను గూర్చి ప్రజలకుద్బోధగావించిరి. లార్డ్ పెంట్లాండ్ గవర్నరుగ నున్నపుడు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ నకు గౌరవసభ్యులుగఁ గొంతకాలము ప్రజాసేవఁగావించి, ఆంగ్లమున నే సభలో మాటాడవలయునను నియమముఁదొలగించి, మాతృభాషలో మాటాడుటకు ప్రజలకు హక్కు-ప్రథమమున గల్పించినవారనుఖ్యాతి వీరు గడించిరి. 'హోంరూల్' ఉద్యమము సందర్భమున ఈ ఉద్యమమునందు ముఖ్యులైనవారితో శ్రీ నరసింహఅయ్యర్ గారిని సంప్రతింపుల నిమిత్తము బ్రిటిష్ ప్రభుత్వమువారు ఇంగ్లాండునకు ఆహ్వానించి మార్గమధ్యమున మొదటి ప్రపంచ సంగ్రామవ్యాజమున వారినందఱను 'జిబ్రాల్టరు'

నందు నిర్బంధము నందుంచిరి, ఆయెడ వీరు తమ విడుదలకై 'సౌర కాయస్వామి'వారిని మానసికముగ ధ్యానించిరి. తుదకు వారందఱు భారతదేశమునకు మరలింపఁబడిరి.

భారతదేశమునకుఁ జేరిన పిదప వీరు మరల సేలంపట్టణమున కేతెంచిరి. కొంతకాలమునకు వీరి పెద్దకుమారుఁడు మరణించెను. ఆ దుఃఖమును పాటింపక దేశసేవాకార్యమున నిమగ్నుఁడైయుండ మఱియొక ఘోరవిపత్తు ప్రాప్తించెను. తరువాత యిద్దఱుపుత్రులు కోనేరున స్నానమునకై దిగి ఏకకాలమున మరణించిరి. ఇఁక నొకపుత్రుఁడు నిరువురుపుత్రికలు మాత్రము శేషించిరి. సాధారణముగ నిట్టి ఘోర విపత్తులు కుటుంబములందచ్చటచ్చట కలుగుచుండును. కాని వీరికిఁ గలిగిన కష్టములు మఱపురానివి. దైవమును విశ్వసించి, సకలభారములను భగవానునందు నిలిపి, సన్మార్గమునఁ బ్రవర్తించు వీరికిట్టి ఘోర విపత్తులేల కలుగవలయును?- అని మనము సందేహింపవచ్చును. దైవవిధానము లనూహ్యములు- అగమ్యములు. జగన్నాటకసూత్రధారి-భగవానుఁ డేజీవి నేపని నిమిత్తము సృజించెనో కాలక్రమమునఁ గాని మనకు వేద్యముకాదు. బాల్యమాదిగ వీరుగడించిన శాస్త్రాధ్యయనసంపదలు- సాధుసాంగత్య సత్ప్రవర్తనలు వీరినిట్టి దుస్సహకష్టముల క్రుంగనీయలేదు. ఈ విషాదఘట్టములనన్నిటిని వీ రధఃకరించిరి. దైవమిఁటులేల కల్పింపవలె? ఈ దుఃఖనివృత్తికి పరమశాంతికి మార్గమేది?- అను అన్వేషణ దీక్ష వీరికిఁ గలిగినది.

ఈ సత్యాన్వేషణలోఁబడి- పేరుప్రతిష్ఠలు న్యాయవాదవృత్తి- శేషించినకుటుంబము- సకలసంపదలను పరిత్యజించి, వారి కులగురువైన శ్రీ శంకరాచార్యులవారిని సమాశ్రయించి, సన్న్యాసాశ్రమ స్వీకారమనుగ్రహింపుఁడని వారు ప్రార్థించిరి. సన్న్యాసాశ్రమమొకరు విధిం

ఽ జ్ఞానస్వరూపంమతాయ నమః

చునట్టిదికాదనియు అది దైవకరుణచే ప్రాప్తింపఁదగినదని శృంగేరీపీఠాధిపతులు వెంటనే సమాధానమిచ్చిరి. అట్టి పరిస్థితులలో వారు వానప్రస్థాశ్రమము స్వీకరించుట యొంతయు మేలని స్వాములవారు నరసింహఅయ్యర్ గారికి హితోపదేశముఁ గావించిరి.

అంతట 1926 ప్రాంతమున శ్రీ నరసింహాఅయ్యర్ గారు వానప్రస్థాశ్రమము స్వీకరించి మన దేశమునఁగల సకల తీర్థక్షేత్రములను పర్యటించి సాధుసత్పురుషుల పలువురను సందర్శించిరి. శ్రీ అరవింద యోగిని, శ్రీ భగవాన్ రమణ మహర్షి మొదలగు యోగిపుంగవులను సందర్శించిరి. శ్రీ రమణమహర్షి అనుగ్రహమున వీరికి జ్ఞానకవాటము తెఱువఁబడెను, జ్ఞానోదయమయ్యెను. శ్రీ రమణమహర్షి జీవితము-గుణ విశేషములు- శక్తిసంపదలు (Self-realisation) 'ఆత్మసాక్షాత్కారము'- అను పేర నొకగ్రంథము నాంగ్లమున రచించిరి. ఈ గ్రంథము భారతదేశమున ఖండ ఖండాంతరములందు ఆధ్యాత్మికమార్గ జిజ్ఞాసువులకు అందుబాటై శ్రీ అరుణాచలమహర్షి అనుగ్రహము సముపార్జించి లక్షోపలక్షలు జనులు తరణోపాయము గడించుటకు మిక్కిలి ఉపకరించినది. ఈగ్రంథప్రకటనమువలన అన్యదేశములనుండి ఆధ్యాత్మికాన్వేషణపరులు పలువురు ఆకర్షింపఁబడిరి. శ్రీరమణమహర్షి అనుగ్రహమున పలువురకాధ్యాత్మికనిష్ఠ ప్రసాదింపఁబడెను. శ్రీరమణ మహర్షి ఆశ్రమమున ఉపవాస- మౌననిష్ఠలతో చాలకాలము గడపిన పిదప 'శ్రీ బి వి. నరసింహస్వామి'- అని యెల్లరు గౌరవించి, ప్రేమించిరి.

శ్రీరమణమహర్షి ఆశ్రమమునుండి బయలుదేరి మరల తీర్థక్షేత్రసంచారములు సలిపినపుడు 'ఖుర్ద్వాడీ'లో సద్గురు శ్రీనారాయణమహరాజు అను యోగిపుంగవుని సందర్శించిరి. వారిని సందర్శించు ముందు తనమనస్సున 'నేనొక రత్న వర్తకుఁడను-అనువగు జాతిరత్నము లెచటలభించునో తెలుపఁ

గోరెదను''– అని, తలంచెను. భక్తులను– భక్తజనమనః ప్రవృత్తులను గుర్తించు యోగశక్తి సంపదలుగల నారాయణమహారాజుగారు వెంటనే 'నీవు శిరిడికిఁబొమ్ము. నీవుకోరు మహారత్నమట నీకు లభింపఁగలదు'– అని తెలిపిరి.

శ్రీ నరసింహస్వామిగారు శిర్డికి బయలుదేరిరి. మార్గమధ్యమునందును, శిరిడిలోను, శ్రీ సాయిబాబాయెడ సన్నిహితసంబంధముగల భక్తులను పలువురను సందర్శింపగలిగిరి. శ్రీ సాయిప్రభువు వీక్షణమున– పర్యవేక్షణమున సాధుసత్పురుషుఁడుగ పరిణామము నొందిన శ్రీ కాశీనాథ గోవిందఉపాసనీ మహారాజును [ఉపాసనీబాబాను] 'సకోరి' యందు సందర్శించిరి. శ్రీ సాయిమహాప్రభువు భౌతిక దేహము సందుండగ ఆతండి అనుగ్రహమునకుఁ బాత్రులైన పలువురు భక్తులను దర్శించిరి. సకోరి ఆశ్రమమున కొంతకాలము నివసించి శ్రీ ఉపాసనీ బాబా జీవితము (Saint of Sakori) 'సకోరి సాధుసత్పురుషుఁడు'– అను గ్రంథమును రచించిరి. ఇందు బాబా అనుగ్రహమున ఉపాసనీ మహారాజు ఎటుల సాధుసత్పురుఁషుడుగ పరిణతి నొందినది వివరించిరి.

శ్రీ నరసింహస్వామిగారి ఆశయము సత్– చిత్– ఆనందము పడయుటయే. అట్టి ఆశయముఁ దీర్పఁగలవారు ఏయొక్కతావున వీరికి లభింపలేదు. ఆకారణమున వీరు శిరిడికిఁజేరి, సమాధిమందిరమున– ద్వారకామాయి మసీదున 'ధుని' ముందు బాబా భౌతికతనువున నుండగఁ గూర్చుండుప్రదేశమునఁ గూర్చుండి బాబాను ధ్యానించినారు, ఒకదినమున సమాధిమందిరమున బాబా సమాధిదగ్గఱఁ గూర్చుండి ధ్యాననిష్ఠలో 'బాబా! నీ అనుగ్రహమునకుఁ బాత్రుఁడనై శ్రీసాయీ భక్తిని ఈభూతలమున వ్యాపింపఁజేయు భాగ్యము నాకుఁగలిగి ఒక పిచ్చుక నాతలపైఁజేరి కూర్చుంకునటుల ప్రసాదింపుము'అని ఆతండ్రినిఁ బ్రార్థించిరి.

అటులవారు శ్రీ సాయీశుని ధ్యాననిష్ఠయందుండగ నొక పిచ్చుకవచ్చి వారితలపై నిలిచెను. ఈ విచిత్రసంఘటనము వారిప్రశ్నమునకు సమాధానరూపమయ్యెను. ద్వారకామాయి మసీదున సమాధిమందిరమున బాబా చిత్రపటము మ్రోల ధ్యాననిష్ఠులైయుండగ శ్రీ నరసింహస్వామిగారికి సచ్చిదానందానుభూతి లభించెను. దానితో వారి ఆశయము సంపూర్ణముగ సిద్ధించునను విశ్వాసమేర్పడి శ్రీసాయీ బాబా అభయప్రదానములు- సూక్తులు, వివిధభక్తుల అనుభవములను సేకరింప మొదలిడిరి.

శ్రీ సాయీనాథుఁడు భౌతిక దేహమునందున్న కాలమున సన్నిహితసంబంధముగలిగి, బాబా అనుగ్రహమునకుఁ బాత్రులైన నానా సాహెబ్ చందోర్కర్, జస్టిస్.యం.బి. రేగే; జి.యస్. కపర్దే మొదలగువారి అనుభవములన్నియు సేకరించి గ్రంథరూపమునఁ గూర్చిరి. మరాటీభాషలో ప్రచురింపఁబడిన 'శ్రీ సాయీలీలామాసిక్' పత్రికలలోని పెక్కువిషయములను ఏర్చికూర్చిరి వీరి ప్రయత్నమునందు-బొంబాయిరాష్ట్రమున శ్రీ సాయీభక్తుల అనుభూతులను సేకరించుటయందు శ్రీ పి.ఆర్. అవస్తే (జడ్జి-గ్వాలియర్) గారు మిక్కిలిగఁ దోడ్పడిరి. (శ్రీ అవస్తేగారి వృత్తాంతములోగడఁ దెలుపఁబడినది) శిర్డీనుండి తిరిగివచ్చినపిదప వీరు మరల శ్రీరమణమహర్షి ఆశ్రమమునఁ జేరి యొక చిన్నకుటీరమునందు మౌననిష్ఠతో క్షీరము మాత్రమాహారముగఁగొని కొంతకాలము గడపిరి. 1936న శ్రీ సాయీబాబా జీవితచరిత్రను మద్రాసునుండి వెలువడు 'సన్డేటైమ్సు' పత్రికయందు ప్రచురింప ప్రారంభించిరి.

1940 ప్రారంభమున శ్రీ నరసింహస్వామిగారు మద్రాసుఁ జేరిరి. భక్తులప్రార్థనమును మన్నించి మౌననిష్ఠ చాలించిరి. శ్రీసాయీ

◆ దక్షిణామూర్తయే నమః

భక్తినిగూర్చి వివిధపరిదేశముల నుపన్యసించుచు, బాబా తనబిడ్డల ననుగ్రహించిన విధానములను శ్రీ సాయీలీలలను బాబా భక్తుల అనుభవములనుగూర్చి యాయా తావుల ప్రబోధ కల్పించిరి. మద్రాసులో పలువురుభక్తులు స్వామివారిని శ్రీ సాయీప్రతినిధిగ భావించి సేవించిరి. వీరందఱు శ్రీ సాయీ భక్తిప్రచారమున శ్రీ నరసింహ స్వామిగారికి తోడ్పడిరి. శ్రీస్వామివారు తననుజేరిన భక్తులందఱను 'శ్రీసాయీపూర్ణ ప్రసాదసిద్ధిరస్తు! బాబా మీకు సకలము సమృద్ధిగ ప్రసాదించుగాక!' యని ఆశీర్వదించువారు. మద్రాసునందు శ్రీసాయీ బాబా నిత్యభజనలు- పూజలు పలువురుభక్తులు నిర్వర్తింపఁదొడఁగిరి. స్వామిగారు మద్రాసురాష్ట్రముననేకాక ఆంధ్రమున నెల్లూరు తెనాలి, బెజవాడ, భీమవరము, రాజమహేంద్రవరము మొదలగు పట్టణముల నితరరాష్ట్రముల- కలకత్తా- ఢిల్లీ- ఇందూరు-బొంబాయి- బెంగుళూరు- కోయంబత్తూరు- తిరుచినాపల్లి మొదలగు పురములకు వెళ్లి శ్రీ సాయీ భక్తిప్రచారముఁ గావించిరి.

శ్రీ సాయీభక్తి ప్రచారసందర్భమున వీరు ఇందూరులోని శ్రీ యం.బి. రేగే (రిటైర్డు హైకోర్టుజడ్జి) మహారాజుగారిని దర్శించిరి. (బాబా అంకితసంతతిలోనివాఁడగు శ్రీ రేగే మహారాజుగారి వృత్తాంతములోఁగడఁ దెలుపబడినది) వీరి సంభాషణ సందర్భమున శ్రీ రేగేమహారాజు శ్రీ నరసింహస్వామిగారినిఁగూర్చి "శ్రీ రామకృష్ణ పరమహంస- భక్తిప్రచారమునకు వివేకానందస్వామిని స్వీకరించినటుల, శ్రీ సాయీభక్తిప్రచారము నిమిత్తము బాబాచే మీరు స్వీకరింపఁబడినారు"- అని తెలిపినాఁడు. తన సర్వస్వమునుత్యజించి, వానప్రస్థాశ్రమము స్వీకరించిన తనకీ కార్యనిర్వహణమెట్టులా? యని తన సందేహము స్వామిగారు తెలుప, వెంటనే "శ్రీసాయీబాబా ఉపకర

ణముగ స్వీకరించినకారణమున బాబా మీకు సకల సాధనసంపత్తిని సమకూర్చితీరును- అని, నేను గాఢముగ విశ్వసించు చున్నాను"- అని, రేగేమహారాజు తెలిపినారు. అచటనుండి శిరిడికి జేరి శ్రీ నరసింహా స్వామిగారు ద్వారకామాయి మందిరమున- సమాధి మందిరమున- ధ్యాననిష్ఠులై కొన్ని దినములు గడపిరి.

## విచిత్రసంఘటనము:-

ఒకదినమున శ్రీ సాయీబాబా సమాధిమందిరము ముందుగూర్చుండి ధ్యాననిష్ఠయందున్న శ్రీ నరసింహస్వామిగారి దగ్గఱకు బెంగుళూరునుండివచ్చిన వ్యక్తియొకడుచేరి, స్వామిగారి పేరు తెలిసికొని వారికొక కాగితపుసంచి కట్టనొసగి, 'యీధనమును శ్రీ సాయీప్రభువు నిమిత్తముపయోగింపుము'- అని తెలిపి వెడలిపోయెను. [బాబా ఆరూపమున ననుగ్రహించియుండవచ్చును.] ఆతడు వెళ్ళినపిదప స్వామిగారు ఆకవరును తెఱచిచూడగ నందు 11, 455 రూపాయలు [11 వేయిరూపాయలనోట్లు, 4 వందరూపాయలనోట్లు, 5 పది రూపాయలనోట్లు, 5 రూపాయినోట్లు] కలవు. వానప్రస్థాశ్రమమందున్న స్వామివారికాధనము చూడగ దిగ్భ్రమకలిగెను. శ్రీ యం.బి. రేగే మహారాజు విశ్వాసమురూపుదాల్చి, యీ విధముగ బాబా అనుగ్రహించెనని వారు తలంచిరి.'

అంతట స్వామిగారు మద్రాసుజేరి ఆధనమును విశ్వాసపాత్రులైన శిష్యుల చేతులందుంచిరి. అదిమొదలు పూజావిధి, అష్టోత్తరశతనామావళి, సహస్రనామావళి, శ్రీ సాయీబాబా అభయప్రదానములు- సూక్తులు [Sai Baba's Charters and Sayings] భక్తుల అనుభవములు (Devotees Experiences) భజనపద్ధతి- మొదలగు

గ్రంథములను ప్రచురించి, బాబా చిత్రపటములు-బిళ్ళలు (Lockets) వేనకువేలు సంపాదించి, శ్రీ సాయీసమాజమును సంస్థాపించిరి. శ్రీ సాయీభక్తి ప్రచారముల సందర్భమున కోరిన భక్తులకు వీనినందింపఁ దొడఁగిరి.

భక్తులగృహములందు నిత్యభజనలు- అర్చనలు- మంగళాభిషేకములు- అష్టోత్తరశత- సహస్రనామపూజలు- శ్రీ సాయీభక్తిఁ గూర్చి ఉపన్యాసములు- సాగినవి. భజనలసందర్భమున సాంఘికముగ 'శ్రీ సాయీరామ'- జపము 10 నిమిషములు- మానము 15 నిమిషములు విధిగ నిత్యకార్యక్రమము శ్రీ సాయీసమాజమున ప్రవర్తిల్లినవి. వీనిమూలమున భక్తుల ధ్యాననిష్ఠ దినదినాభివృద్ధ నొందినది. శ్రీ సాయీరామనామము భక్తులకర్ణముల మాఱుమోగఁ దొడఁగెను. ఈభజన ధ్యానజపాదులు భక్తుల ఆధివ్యాధి నివారక దక్షమయ్యెను. శ్రీ నరసింహస్వామిగారు ¹శ్రీ సాయీభక్తి ప్రభావమున పలువురుభక్తుల ఆధివ్యాధులను నివారించిన వృత్తాంతములు కోకొల్లలుగఁగలవు. ఆయుదంతములన్నియు "సాయీసుధ"- మాసపత్రికయందుఁ దెలుపఁబడినవి- గ్రంథవిస్తరభీతిచే నిటఁ జేర్పఁజాలేము. శ్రీ నరసింహస్వామిగారు స్వయముగను, ఆయాభక్తుల స్వప్నములద్వారా మార్గదర్శియై, వారిని చక్కదిద్ది, శ్రీ సాయీ భక్తినిష్ఠుల గావించిన వృత్తాంతములు పెక్కులుగలవు. [జనవరి 1958 'సాయీసుధ' మాసపత్రికఁ జూడుఁడు!]

## అఖిలభారత సాయీసమాజము :- (A.I.S.S)

1940నుండి శ్రీ సాయీ భక్తిప్రచారము విరివిగ ప్రారంభమైనను 'అఖిలభారత సాయీసమాజము' (All India Sai Samaj.

¹ శ్రీమద్భక్తినృసింహాది భక్తాళీభూర్యనుగ్రహాయ నమః

[A.I.S.S]) 1941లో సంస్థాపనమైనది. పూజ్యశ్రీ. బి.వి. నరసింహస్వామిగారు వ్యవస్థాపకులు- అధ్యక్షులుగనుండిరి. కార్యనిర్వాహక సంఘము- సభ్యులు నేర్పడిరి. మొదట మద్రాసు- రాయపేటలోను తరువాత మైలాపూరునందు అద్దెయింట్లలో ఈసమాజము పనిచేసెను. ఆపిదప శ్రీ నరసింహస్వామిగారు భక్తులతోడ్పాటువలన శ్రీ వెంకటేశ అగ్రహారమున కొంతస్థలము విలిచిరి. అఖిలభారత సాయీసమాజము అచటకు మార్చఁబడెను. ఇందు శ్రీ సాయీనాథ దేవాలయము పెద్దది నిర్మింపఁబడెను. ముందు పెద్ద'హాలు'- ఆఫీసుగది- పుస్తక భాండాగారమందిరము- పేదలకు వైద్యశాల- బాబా దేవాలయమునకు వెనుక స్వామిగారుండుటకొరకు కుటీరము మొదలగునవి నిర్మింపఁబడినవి. చరమదశయందు శ్రీ నరసింహస్వామిగారు ఈసమాజము స్థలమునకు ప్రక్కనుగల స్థలమునుకొని, భక్తుసాయమున కళామంటపమును నిర్మాణముగావించిరి. శ్రీ సాయీభక్తి ప్రచారము- గ్రంథముల ప్రచురించుట- చిత్రపటములు- లాకెట్లు- మొదలగునవి భక్తుల కొఱకు సమకూర్చుట మొదలగు సేవాకార్యములు నిస్వార్థబుద్ధితో గావింపఁబడి ఈ అఖిలభారత సాయీసమాజము శాఖోపశాఖలుగ మనదేశమునందంతట వ్యాపించి దినదిన ప్రవర్ధమానమగుచున్నది.

పూజ్యశ్రీ నరసింహస్వామిగారి శ్రీ సాయీభక్తి ప్రచారమూలమున మనదేశమున వివిధప్రాంతములందు శ్రీ సాయీదేవాలయములు- భజనమందిరములు- కుటీరములు- వేనవేలు వెలసినవి. లక్షోపలక్షల భక్తులగృహముల నిత్యపూజాదులు భజనలు జరుపఁబడు చున్నవి. శ్రీ సాయీనాథుని నామస్మరణ సేవలప్రభావమున బాబా అనుగ్రహమున భక్తులు కష్టనివృత్తి- అభీష్టావాప్తిఁ బడయగలుగు చున్నారు. స్వామిగారు మనకుఁదెలిపిన పరమరహస్యము గమనింపుడు.

మధ్యవర్తులలో పనిలేదు. శ్రీ సాయిబాబాను ఎవరికివారు స్వయముగ ఆశ్రయించి సేవించి బాబా అనుగ్రహప్రభావముల గుర్తించి, ఆనందించుచు నితరులకు మార్గదర్శకులరగుడు!-అని, తెలిపినారు. తనను జేరినవారికి ప్రబోధకల్పించి, ఆశీర్వదించి: శ్రీ సాయికరుణ- బాబా అనుగ్రహము ఎట్టిదో ఎవరికివారు స్వానుభవమున గుర్తించి ఆనందించవలసినదేకాని యితరులద్వారా తెలిసికొనదగదని స్వామిగారు తెలిపినారు. ఇది బాబా స్వయముగా దెలిపినవిషయమే. [బి. వి. దేవ్-మామ్లత్ దార్ వృత్తాంతముజూడుడు] స్వామిగారు మనకు గలిగించిన ప్రబోధలోని విశిష్టత- ప్రత్యేకత యేమన 'మీరు సాయిబుద్ధి (దైవబుద్ధి) గలిగియుండుడు! ఆ సద్గురుదేవుని దెలిసికొనుటకు బాబాను మీయందు సకలభూతములందు గుర్తింపుడు!' అని, తెలిపినారు. తనను జేరిన ప్రతిభక్తుని 'బాబా నిన్ననుగ్రహించునుగాత! నీకు ఏమి కావలసిన బాబాను ప్రార్థింపుము! ఆతండె మీకు సకలము ప్రసాదించును' అని స్వామిగారు ఆశీర్వదించువారు. తనను జేరిన ఆశ్రితులకు 'ఉధి' ప్రసాదించి అనుగ్రహించువారు- ఆ'ఉధి' ప్రభావమున బాబా అనుగ్రహమున ఎల్లరకు ఆధివ్యాధులు నివారణమగుచుండినవి.

## సులభ తరణోపాయము :-

శ్రీ సాయిబాబా సంపూర్ణకరుణకు బడయుటకు- అనుగ్రహింపబడుటకు మనగురువు పూజ్యశ్రీ. బి.వి. నరసింహస్వామిగారు తెలిపిన మిక్కిలి సులభమార్గమును సోదరిసోదరభక్తులు గుర్తింపదగును.

నీ పూజామందిరమున బాబా చిత్రపటమును ఉన్నతపీఠమున నిలుపుము. పుష్పములతో నలంకరింపుము, మువ్వత్తులదీపము వెలిగింపుము- అగరువత్తులను వెలిగింపుము. క్షీరము- అరటిపండ్లు కొబ్బరికాయ తాంబూలమునుంచుము, శ్రీ సాయిప్రభువునకు సాగిలబడి నమస్కరింపుము. బాబా చిత్రపటమున కెదురుగా గూర్చుం

డుము. నీచూపు బాబా నేత్రములందు కేంద్రీకరింపుము. నీకు చేత నైన విధమున సేవించి అష్టోత్తర శతనామముల- [అవకాశము ననుస రించి పర్వదినముల సహస్రనామముల] నుచ్చరించుచు పుష్పములతో పూజింపుము. కీర్తనలఁ గీర్తింపుము. నీకుఁగల పదార్థముల నివేదిం చుము- కర్పూరహారతి- సమర్పించి మ్రొక్కుము. గురు, శుక్ర, శని వారములందు నీకుటుంబములోనివారితో గాని. చేరిన సోదరీ సోదరభక్త లతోడఁగాని భజనలు సలుపుము- [ఒకవిషయము జ్ఞప్తియందుంచు కొనవలయును. నీ ఆడంబరములతో బాబాకు నిమిత్తము లేదు. ఆతం డిక్కఁ గావలసినది నీ ప్రేమపూరిత హృదయముకాని- నీవస్తు సంభా రములుకావు. ప్రేమతో నొకపుష్పమును సమర్పించి, 'బాబా! నీబిడ్డను నన్ను రక్షింపుము' అని నమస్కరించిన బాబా అనుగ్రహించును.] అటుల శక్తివంచనలేక భక్తితో సేవించువారు అతిశీఘ్రముగ బాబాను చూడఁగలరు. బాబాకరుణఁ బడయఁగలరు. బాబాను ప్రార్థించి నిన్ను చేరిన ఆధివ్యాధిగ్రస్తులకు 'ఊధి' ప్రసాదింపుము. బాబా ప్రసాదమును పడసినవారు సకలబాధలనుండి విముక్తులగుదురు. నీవుగాని, ఇతరులు గాని పడయు కష్టనివృత్తి, సుఖసంతోషప్రాప్తి, శ్రీ సాయీ కరుణ వలన గలిగినవేకాని, నీపూజాదులవలన కలిగినవిగ నెప్పుడు తలంచ రాదు. బాబా కరుణవలన కొందఱకు కొన్నిశక్తులు కలుగవచ్చును. అట్టియెడ తానే 'శ్రీసాయి' అని భావించి, విమోహియై గర్వించెనా- అట్టి ఆధివ్యాధి నివారణకార్యములన్ని తనశక్తియని తలంచెనా-వాఁడు తన జీవితపరమార్థముఁ బడయఁజాలఁడు- అనుట నిశ్చయము- అం తయు శ్రీ సాయీకరుణా ప్రభావమనియే గుర్తించుకొనవలయును.'

## పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారి సమాధి.

పూజ్యశ్రీ. బి. వి. నరసింహస్వామిగారు 19-10-'56న నిర్వా ణము నొందిరి. 20-9-56న స్వామిగారు కావించిన తుదిప్రకటనము

ననుసరించి, వారి భౌతిక దేహమును విసర్జించినను ఆత్మరూపమున వారే ఈసమాజమునకు, సభ్యులకు— ఈ అఖిలభారత సాయీ సమాజమునకు అనుబంధములై మనదేశమున వెలసి, శ్రీ సాయీభక్తి ప్రచారము గావించుచున్న సమాజములన్నిటికి ఆధ్యాత్మికమార్గదర్శి, నియంతయు స్వామివారే అగుచున్నారు. అఖిలభారత సాయీసమాజము (మైలాపూరు— మదాసు*)నకు వ్యవస్థాపక— అధ్యక్షపదవులు స్వామివారియందే నిలిచినవి. వారి భౌతిక తనూశేషము లాకుటీరమునందే స్థాపితములైనవి. అచట స్వామివారి సమాధిస్థాపనకుఁ దగునేర్పాటులు కావింపఁబడినవి. వారి తదనంతరము ఆ సమాజముయొక్క అధ్యక్షస్థానమునకు ఎన్నుకొనఁబడినవారు స్వామివారి ప్రతినిధులుగ విధులను నిర్వర్తించుచున్నారు. పూజ్యశ్రీ నరసింహస్వామిగారి పెద్ద చిత్రపట మాకుటీరమునందు నెలకొల్పఁబడినది. అఖిలభారత సాయీ సమాజవ్యవస్థాపక— అధ్యక్షస్థానము నలంకరించియున్న స్వామివారు నేటికి నికేనాటికి ఆశ్రయించు భక్తులెల్లరను శ్రీ సాయీ భక్తిమార్గమునఁ బ్రవర్తింపఁజేయుచు, మార్గదర్శి, గురువు— ఆధ్యాత్మిక నియంతగ విరాజిల్లుచున్నారు.

శ్రీ సాయీబాబా 50వ మహాసమాధి స్వర్ణోత్సవ సందర్భము [3-10—1968]న, శ్రీ సాయీబాబా తోడ సన్నిహిత సంబంధము గలిగి బాబా అంకితసంతతిలో నొకరైన శ్రీ యం. బి. రేగే మహారాజుగారు మద్రాసు-4లోని అఖిలభారత సాయీసమాజ యాజమాన్యమున జరుపఁబడిన స్వర్ణోత్సవమునఁ బాల్గొని పూజ్యశ్రీ. బి.వి. నరసింహస్వామిగారు సంస్థాపించిన యీ అఖిలభారత సాయీసమాజము శిరిడిని మఱపించుచున్నది.'— అని, తమ ఆనందమును విశదపఱచినారు. దీని ననుసరించి స్వామిగారు గావించిన శ్రీ సాయీభక్తి

* జ్యోతిషాం ప్రథమజ్యోతిషే నమః
శ్రీ బ్రహ్మణ్యాయ నమః

ప్రచారమేపాటిదో- వారి అవిరళకృషి యెట్టిదో పాఠకులు గ్రహింపఁ దగును.

శ్రీ సాయీ మహాప్రభువుచే నుపకరణముగ స్వీకరింపఁబడి, శ్రీ సాయీవ్యాసులై శ్రీ సాయీబాబానుగూర్చిన గ్రంథమాల నిరువదికెక్కుడుగ రచించి ప్రకటించి, శ్రీ సాయీభక్తిని మనదేశమున ఖండఖండాంతరముల వ్యాపింపఁజేసి బాబా అనుగ్రహపాత్రులైన పూజ్యశ్రీ, బి.వి. నరసింహస్వామిగారికి వందనశతము లర్పించుచు వారి ననుగ్రహించినటుల మనల ననుగ్రహింపుమని సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయీనాథునకు ప్రణామసహస్రము లర్పించుదము.

ఓమ్ శ్రీ సాయీశరణ్ !

కలుములేములు, సౌఖ్యదుఃఖములు ప్రాక్కర్మానుసారంబుగాఁ
గలుగున్ జీవికి,గాని, నేన్ శ్రితునకై కల్పించుమార్గాలు మో
హాలతాచ్ఛేదకరంబులౌను, నరసింహస్వామి వృత్తాంతముం
దెలమిన్ దెల్పనె? మద్విధానముల; ఏమీ, నిన్నుపేక్షింతునా?

——

# ఏమిరా, నిన్ను పేక్షింతునా ?

## నలుబదియైదవ ప్రకరణము

## IV. చరమలీల.

### సద్విషయము:-

సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయీ కరుణాజ్యోతి జననమరణ రూపమగు సంసారభీతిని బాపి, జీవితమున భక్తులకు బ్రాప్తమగు సుఖదుఃఖాది ద్వంద్వములకు జలింపనీక సంతుష్టి సంతృప్తిశాంతులను ప్రసాదించి సుశ్రేయకరమార్గమున నడిపించి గమ్యమును జేర్ప సమర్థమైనదని, లోగడఁ దెలుపఁబడిన వృత్తాంతములవలన విశదమగుచున్నది, సద్గురుదేవుని పదకమలములను హృదయమునసిలిపి, శ్రీ సాయీనామమును స్మరించుచు, బాబాను ధ్యానించువాని సంకటములన్నియు పటాపంచలగును. మృత్యువు వానిని చెనకలేదు. సంసృతి బంధములు విడివడును, కావున తమశ్రేయమును కాంక్షించువారు శ్రీ సాయీనాథలీలా కథాదికములను శ్రద్ధాళువులై చదివి, విని, మననము గావింపఁదగును.

### సీమోల్లంఘనము:- 1916 విజయదశమి. (S C.S. 329)

ఇంతవఱకు శ్రీ సాయీమహాప్రభువు తనభక్తుల ననుగ్రహించిన వృత్తాంతములఁ దెలిసికొంటిమి. ఇఁక బాబా భౌతికజీవిత చరమదశయందలి వృత్తాంతముల శ్రద్ధతో గమనింపఁదగును. బాబా మహాసమాధికి 15-10-1918నాటికి సరిగ రెండుసంవత్సరములకుఁ బూర్వము జరిగినవృత్తముఁ దెలిసికొందము. బాబా తన అవతారసమాప్తిని గూర్చి తనవారికిముందుగ సూచింపఁదలఁచినాఁడు. తాని భౌతికతను

సమాధిమందిరము - శ్రీ సాయిబాబా
సాయినగు నేన - ద్వారకామాయి నగుదు



వును ఎప్పుడు విడనాడఁదలఁచెనో ఆవిషయమును సాంకేతికముగఁ దన బిడ్డలకుఁ దెలుపనెంచెను, కాని, మా ప్రలల్పజ్ఞులు– మాయా సమావృతులగుటచే దైవలీలలందుఁగల సత్యమును యథార్థముగ గుర్తింపఁ జాలరుగదా! పలువిధములగు వేదశాస్త్ర పురాణాదులను చదువుచు, వినుచు, స్వానుభవమునఁ [illegible] దినదినము గమనించుచున్నను వెంటనే మానవుని చిత్తవృత్తియందు మాయ యలముకొనుచుండును.

1916న విజయదశమినాఁడు శిరిడిలోని జనులందఱు 'పాఱువేట' ఉత్సవము– సీమోల్లంఘనము– (గ్రామము పొలిమేరదాటి శమీవృక్షమును పూజించి తిరిగి వచ్చుచుండిరి, బాబా ఆసమయమున నత్యంతాగ్రహోదగ్రుఁడయ్యెను. తన రొమ్ముపైఁగల దుస్తులన్నియుఁ దీసివేసి చింపి పేలికలు పేలికలుచేసి మండుచున్న ధునియందు వైచెను. ధుని యందగ్నిజ్వాలలు పెల్లురేఁగెను. బాబా ఉజ్జ్వలుఁడై ప్రకాశించెను. దిగంబరుఁడై కనుల నిప్పులుగురియ 'రండిరా! రండి! చూడుఁడు! నేను మహమ్మదీయుఁడనో– హైందవుఁడనో చూచి మీరే నిర్ణయించుకొనరండు!'– అని, బిగ్గఱగ నఱచుచుండెను. అచటఁ జేరినవారెల్లరు భయభ్రాంతులైరి. ఒక్కరేని సాహసించి బాబాను సమీపింపలేకపోయిరి. కొంతసేపు జరిగినతరువాత "భగోజిసింధ్యా" (బాబా భక్తుడు కుష్ఠురోగి) ధైర్యమువహించి బాబా దగ్గఱకేగి, బాబా మొలకొక 'లంగోటి' [కటివస్త్రము] బంధించెను. బాబాను చూచి 'బాబా! ఏమి ఇది? ఈనాఁడు సీమోల్లంఘనము విజయదశమిగదా! ఈవింతచర్య ఏమి?'– అని, ప్రశ్నించెను. అంతట సాయిప్రభువుచేత సటా – (చిన్నకఱ్ఱ)ను బూని నేలపైఁగొట్టుచు ఇది నా 'సీమోల్లంఘనము' [మేలుచేయుట]–అని పలికెను, ఆరాత్రి 11 గంటలకును ఆతఁడిరి శాంతి వహించినవాఁడు

[illegible] నమః

కాఁడు. ఆదినమున జరుగనున్న చావడికి ఊరేగింపు జరుగదేమో! యని, యెల్లరు విచారుఁజెందిరి. ఒకగంట గడచినపిదప బాబా ప్రశాంతి బొందెను. స్వయముగఁ దనదుస్తులను ధరించెను. (లోఁగడ మహా ల్సాపతి వృత్తాంతమునఁ దెలుపఁబడినవిధమున) యథావిధి చావడికి ఊరేగింపునందు బాబా పాల్గొనెను. ఈరూపమున తన జీవితపారమును విజయదశమినాఁడు చేరఁగందునని బాబా తనవారికి సూచించినాఁడు. కాని ఆరహస్య మెవ్వరును దెలిసికొనలేక పోయిరి. తరువాతను అనఁగా 1918లో బాబా అవతారసమాప్తికిఁ బూర్వము మఱికొన్ని నిదర్శన ములను సూచించినాఁడు! వానిని ముమ్ముందుఁ దెలిసికొందము.

బూటీవాడ :-

[S.C.S. 331 శ్రీమంత్ బాపూసాహెబ్ గోపాలరావు-బూటీ వృత్తాంతమునఁ దెలుపఁబడిన విషయములు పాఠకులు చదువఁ బ్రార్థి తులు.]

1915న ప్రారంభింపఁబడిన బూటీవాడ పూర్తియగుటకు కోటీ శ్వరుఁడైన బూటీ అంతవానికి మూఁడుసంవత్సరములకాలము పట్టినది. అది దైవలీల- 1917లో బాబా ఆవాడను (కట్టడము ఇంకను పూర్తి కాని ఆభవనమును) నిర్దేశించుచు-

'దైలాఇల్లిలాఁ- క్యాబడా దర్బార్ హై-
మున్షీజీతో- ఆండైహైఁ- సర్దార్ జీ చు తాయ్
అల్లా మాలిక్ హైఁ- అల్లా అచ్ఛాకరేఁగాఁ'

అనినాఁడు. బాబా పలుకుల ననుసరించి ఆ బూటీవాడయే నేఁడు 'బడాదర్బార్'- అయినది- మున్షీజీలు- సర్దారులు నేఁడచటకుఁ జేరు చున్నారు.

## రామచంద్రపటేల్ - తాత్యాపటేల్ :-

1916న సీమోల్లంఘనము జరిగిన కొంతకాలమునకు రామచంద్ర పటేల్ [శిరిడి గ్రామాధికారి] వ్యాధిగ్రస్తుఁడయ్యెను. పెక్కు చికిత్సలు గావింపఁబడినవి. వివిధౌషధములనువాడిరి.- కాని, ప్రయోజనములేక పోయెను. అతఁడు జీవితముపై ఆసలు వదలుకొని తుది గడియకొఱకు నిరీక్షించుచుండెను. ఒకనాటి అర్థరాత్రిమున శ్రీ సాయీప్రభువతని తలగడదగ్గఱ నిలిచియుండెను. పటేల్ లేచి బాబా పాదములను పట్టుకొని 'బాబా! నాజీవితముపై ఆసలు వదలుకొంటిని. నేనెపుడు మరణింతునో నాకుదెలుపుము'- అని, దీనుఁడై ప్రార్థించెను. అంతట దయామయుఁడగు సాయీశుఁడు 'నీవు ఆందోళనము చెందకుము- నీమృతి సంబంధమగు ఉత్తరువు లుపసంహరింపఁబడినవి. నీవు త్వరలో ఆరోగ్యముఁ బొందుదువు. కాని తాత్యాపటేల్ 1918 విజయదశమినాఁడు గతింపనున్నవాఁడు. ఈవిషయము అతనికిఁగాని మఱి యెవరికిఁ నేనిఁ దెలుపవలదు, అతఁడెఱిఁగిన మిక్కిలిగ భీతినొందును.'- అని, బాబా పలికి అదృశ్యుఁడయ్యెను. రామచంద్ర దాదాక్రమ్మఱ స్వస్థతనొందెను. కాని, తాత్యా జీవితమునుగూర్చి భయచకితుఁడయ్యెను.బాబా పలుకులు అసత్యములుకావని, తాత్యా రెండుసంవత్సరముల లోపుగ మరణించితీరునని యాతఁడు భయపడఁజొచ్చెను. ఈ రహస్యమును బాలాషింపి (దర్జీ కిఁదప్ప మఱెవ్వరికి నతఁడు చెప్పలేదు. 1918 సంవత్సరము ప్రవేశించెను.

## బాబా ముందుగఁ గావించిన సన్నాహములు.

బాబా భౌతికతనువును విడుచుటకుఁ గొన్ని నెలల్పూర్వమే "ఇస్లాం" ఆచారముననుసరించి కొన్నిఏర్పాటులు కావించినాఁడు. బడేబాబా కుమారుఁడగు 'కాశీం'నకు 'పోలీ' [ఆహారము] పెట్టించెను

* దైవీసంపత్సంప్రాప్తాయ నమః

ఆపిదప నతనికి 250 రూపాయలిచ్చి, నీవు ఔరంగబాదునకేగి, అచట 'ఫకీరు షంషుద్దీన్ మియా'కు ఆపైకమిచ్చి, 'మౌలూ' - "కౌవాలీ" "న్యాస్"- కావింపుమని చెప్పెను. (1. మౌలూ- పైగంబరునుగూర్చి కావించు స్తోత్రగానము. 2. కౌవాలి= సాధువులనుద్దేశించి తబ్లా మొఱ యించుట. 3; న్యాస్=పెద్దయెత్తున వంటలువండించి యందఱకుపెట్టుట) ఆపిదప 'బన్నేమియాఫకీరు' దగ్గఱకేగి, ముందుగ పుష్పహారమతని కర్పించి 'నవ్ దిన్-నవ్ తారీఖ్- అల్లామియానే అప్నాధునియాలగాయా మర్జీఅల్లాకి'- [తొమ్మిదవనెల తొమ్మిదవతారీఖున అల్లా వెలిగించిన దీపము అల్లా తీసికొనిపోవుచున్నాఁడు. అల్లా అనుగ్రహమిది] అని పలికి 250 రూపాయలును ఒక పూలమాలను ఆతనికి బాబా ఇచ్చెను.

ఔరంగబాదు తనకు క్రొత్తపురమని కాశీం చెప్పుకొనఁగా ఛోటేఖాను నతనివెంటఁబొమ్మని బాబా నియమించెను. 'అమీర్' అను ఖాశీంసేవకుని వెంటఁగొని వారిరువురు ఔరంగబాద్ స్టేషన్ జేరిరి. ఛోటేఖానునకు పరిచితుఁడైన ఫకీరు షంషుద్దీన్ ఆస్టేషన్ దగ్గఱఁజేరి యుండెను. ఆతఁడు ఛోటేఖానునుజూచి, సాయీఫకీరు వద్దనుండి వచ్చిన అతిథులెవ్వరు?- అని ప్రశ్నించెను. ఛోటేఖాన్ ఆఫకీరు పాద ములవ్రాలి మ్రొక్కెను. కాశీంగూడ నావిధముగ ప్రణమిల్లెను. అంతట షంషుద్దీన్ ఫకీరు- శిరిడియందు బాబా పలికిన పలుకులు ప్రత్యక్షరము నుచ్చరించెను. వారి మువ్వురను షంషుద్దీన్ తనగృహమునకుఁ గొని వెళ్ళెను. కాశీం, బాబా యొసఁగిన 250 రూపాయలను ఆఫకీరునకు సమర్పించెను. బాబా తెలిపినవిధమున సకలము నిర్వర్తింపఁబడెను. ఆరాత్రికే అన్నిపనులను పూర్తిచేసికొనిరి.

మఱునాఁడుఉదయము 'బన్నేమియా'ను దర్శింపనేగిరి, బన్నే మియా ఒకచేతిని పైకెత్తి ఒకచేతిని క్రిందికిదింపి నిలిచియుండెను. అచ టనున్న అరబ్బీలు ఆతనిదగ్గఱకు వెళ్ళఁగూడదని, వెళ్ళిన ఆగ్రహించు

వనిచెప్పిరి. ఆముప్పరొక గంటసేపు వేచియుండిరి. అంతట ఛోటేఖాన్ ధైర్యముచేసి సాహసించి, బాబా సమర్పించిన జాజిపూలమాలను గొనిపోయి బన్నేమియా కంఠమున వ్రేలాడవేసెను. బన్నేమియా పైకెత్తియుంచిన చేతినిఁ గ్రిందికిదింపెను, ఛోటేఖాఁ బాబా పలికిన పలుకులు పలికెను. బన్నేమియా ఆకసమువంకఁజూచెను. ఆతని కనుల వెంట బాష్పములు స్రవించెను. ఈ దృశ్యప్రపంచమునుండి సాయీ బాబా నిష్క్రమించనున్నందులాకాసాధువు పొందిన విచారమును ఆ అశ్రుధారలు తెలుపుచున్నట్లుండెను.

(ఈ సంఘటనము జరిగిన నాలుగునెలల కావల బాబా మహా సమాధియని పాఠకులు గుర్తింపవగును. నవ్ దిన్ నవ్ తారీఖ్ - తొమ్మి దవనెలలో తొమ్మిదవదినము అని అర్థము. బాబా అరబ్బీ ఉర్దూభాష లెఱింగినవాఁడే- అది సరిగ 1918 సంవత్సరము ఆశ్వయుజ శుద్ధదశమి వెళ్ళగా ఏకాదశి.]

1918 సంవత్సరము భాద్రపదమాసము ప్రవేశించెను. బాబా తెలిపినవిధముగ తాత్యాపటేల్ జబ్బుపడెను. మంచము పట్టినాఁడు. బాబా దర్శనముకొఱకు మసీదునకు వెళ్ళలేని స్థితియందుండెను. అదే సమయమున బాబాకును జ్వరముతగిలెను. తాత్యాకు బాబాయందు గాఢవిశ్వాసముగలదు. బాబాకు సర్వరక్షకుఁడగు శ్రీహరి [అల్లా] యందు గట్టి విశ్వాసముగలదు. తాత్యావ్యాధి దినదినమువృద్ధి నొందఁ జొచ్చెను. కదల మెదలలేని స్థితిలోనుండెను. కాని, యాతనిమనస్సు బాబాయందు లగ్నమైయుండెను, సర్వదా హృదయమున బాబాను ధ్యానించుచుండెను.

ఇటుకరాయి పగులుట. (S.C.S. 178, 178A)

---

(గురుసేవాలీలలో ఇటుకరాయివృత్తాంతము పాఠకులుగమనింపఁదగును)

---

1918 భాద్రపదమాసమున భవిష్యత్సూచకమగు నొకవిషాద సంఘటనము జరిగెను. మసీదునందు బాబాదగ్గఱ నొక పురాతనపు

ఇటుక రాయి యుండెడిది. బాబా పగటివేళలందు తనగద్దెకు ప్రక్కగ నుంచి దానిపై చేతినుంచి కూర్చుండువాఁడు, రాత్రులందు దానిని తలగడగ నుంచుకొనువాఁడు. బాబా శిరిడీకిఁ జేరినది మొదలు తుది వరకిట్లు జరుగుచుండెను. భాద్రపదమాసమున నొకదినమున బాబా మసీదునందు లేనిసమయమున మసీదులోపల నేలనూడ్చు శుభ్రపఱచు పిల్లవాఁడు ఆరాతిని చేతిలోనికిఁ దీసికొనెను. దురదృష్టవశమున నా రాయిజారి క్రిందఁబడి రెండు తునియలయ్యెను. బాబా తిరిగివచ్చి యావిషాదవృత్తమును విని మిక్కిలిగ విచారపడెను. 'ఆవిఱిగినది ఇటుక రాయికాదు, నాభాగ్యము విఱిగినది. అది నాజీవితమిత్రము, మద్గురు పదాంకితము. దానిసహాయమున ఆత్మనిష్ఠనొందినాఁడను. అది నాప్రాణమునకంటెఁ బ్రియము, నేఁడునన్నది విడనాడినది.' అని, బాబా ఖిన్నుఁడయ్యెను.

కొందఱికీవిషయమున సందేహము గలుగుచున్నది. బాబా ఒక స్వల్పమైన రాతికై యిట్లు విచారపడనేల?–యని, ప్రశ్నింపవచ్చును. పరమ సాధు సత్పురుషరూపమున భగవానుఁడు దీనజనోద్ధరణకై భూమిపై నవతరించును. వారు చరించుచు పలుకుచున్న దైవమగుదురు. వారు జనులతోఁ గలిసిమెలిసి తిరుగుచు సాధారణ జనులవలె ప్రవర్తించుచు, నవ్వుచు– కోపించుచుఁ గ్రీడించుచు, విచారము ప్రకటించుచుండునట్లు మనకు గోచరింతురు. కాని, అంతర్యముగ ఆత్మనిష్ఠనుండి లవమాత్రి మేనియుఁదలఁగరు. వారెప్పుడు సచ్చిదానంద ప్రపూర్ణులై యుండువారే. అట్టి సాధుసత్పురుషుల చెయ్వులు మనకు దురవగాహములు.

## ముందుగ తగిన యత్నములు:-

హైందవులు సాధారణముగ జీవితచరమదశయందు భగవద్గీతలు– భాగవతము మొదలగు సద్గ్రంథములను చదివించి విను నాచా

రముగలదు. మనస్సును ప్రాపంచిక విషయములనుండి మరలించి, ఆధ్యాత్మికముగ దానిని ప్రవర్తింపఁజేసి శాంతినొందుట కటులఁగావింతురు. పరీక్షిత్తుమహారాజు వృత్తాంత మెల్లరెఱిఁగినదే. విప్రశాపత ప్తుఁడైన పరీక్షిత్తు నుద్ధరించుటకు అవధూతశిఖామణి- పరమ భాగవతోత్తముఁడైన శుకయోగి యేడుదినములలో భాగవతమును వినిపించి ఆ రాజవరునకు కైవల్యప్రాప్తిఁ గూర్చెను. ఈ ఆచారము నేటికిని గలదు. శ్రీ సాయీనాథుఁడు భగవదవతారుఁడగుట ఆతండికిని యేవియు నవసరములేదు, నిత్యానందప్రపూర్ణుఁడే- కాని,

> యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
> సయత్ప్రమాణంకురుతే - లోక స్తదనువర్తతే,
>
> శ్రేష్ఠుఁడగువాఁడు దేనినిఁజేయు దాని
> నితరజనములుఁజేయుదు రిందితనయ!
> జ్ఞాని- యెట్టిదానినిఁ బ్రమాణముగఁగొనునొ
> యట్టిదాని నఖిలలోక మనుసరించు.
>
> [శ్రీ మద్భగవద్గీతాను్వృతము-౩-౨౧]

కావున సాధు సత్పురుషులేమి కావించిన లోకసంగ్రహార్థమే చేయుదురు. ఈరహస్యమును- మరణకాలమున మనస్సును ప్రాపంచిక విషయములనుండి మరలించి, దైవచింతనమునఁ బ్రవేశపెట్టఁదగు నను రహస్యమును- బోధించుటకే బాబా, 'వాజే' అనునతనిఁ జేరఁబిలిచి 'శ్రీరామవిజయము'- [మరాట్భాషయందున్న శ్రీరామ చరిత్రమును] చదివి వినిపింపుమని నియమించెను. బాబా ఆజ్ఞ ననుసరించి శ్రీ వాజే వారముదినములలో శ్రీరామవిజయమును బాబా సన్నిధిఁజదివి పూర్తి చేసెను. మరల బాబా ఆగ్రంథమునే రెండవమారు చేయిఁబవిన్చ్య

సప్రమాదాఘనస్యాప్యజీతే నమః

చదువుమన, మూఁడుదినము లహోరాత్రములు చదివి రెండవ ఆవృత్తి పూర్తిగావించెను. అట్లు పదునొకండుదినములు గడచెను. మరల మూఁడుదినములు శ్రీరామవిజయముఁ బఠించి 'వాడే'- మిక్కిలి అలసి పోయెను. అంతట బాబా ఆపరవము ఆపుమని ఆత్మనిష్ఠుడైయుండెను.

## లక్ష్మీబాయిసిందే - బాబా సర్వాంతర్యామిత్వము

[ S.C.S. 69 ]

ఈమె మిక్కిలి సత్ప్రవృత్తిగలిగిన సంపన్నురాలు. రేయిం బవళ్లు మసీదునందీమె సేవచేయుచుండును. రాత్రులందు భక్త మహల్సాపతి- తాత్యాకోతే- లక్ష్మీబాయిసింధె తప్ప తదితరులు మసీదునందు ప్రవేశించుటకు అర్హతలేదు. ఒకదినమున బాబా మసీదునందు తాత్యాపటేల్‌తోఁ గూర్చుండియుండగా లక్ష్మీబాయి సింధెవెళ్ళి బాబా పాదములకు మ్రొక్కెను. అంతట బాబా 'లక్ష్మీ! నాకు మిక్కిలి ఆకలిగనున్నది'- అనెను, వెంటనే ఆమె "బాబా! ఒక్కక్షణ మాగుము!'- అని, వెళ్ళి, వైళమ రొట్టెలు- కూర పళ్ళెరమునఁ గొని వచ్చి బాబా ముందుంచెను. అంతలో నొకకుక్క అచ్చటకువచ్చెను, ఆ పళ్లెరమును బాబా కుక్కముందుంచెను, అదిచూచి, లక్ష్మీబాయి 'ఏమిది? బాబా! నీకని శ్రమపడి రొట్టెలు కూర తెచ్చితిని. నా శ్రమ మంతయు వ్యర్థముఁ జేసితివి' యనెను. అంతట బాబా 'అమ్మా! నీవేల వ్యర్థముగ విచారపడుదువు? ఈకుక్క ఆకలితీర్చిన నాఆకలి శమించును. దానికిని ఆత్మకలదు, జంతువులు వేఱుకావచ్చును. వానికిని ఆకలి కలదు. అందఱ ఆకలియు నొక్కటే. కొందఱు చెప్పకొందురు. కొందఱు చెప్పకొనలేరు. ఆకలినొందిన జీవిని సంతృప్తిపఱచువాఁడు నన్ను సంతృప్తిఁజేయువాడని గుర్తించుకొనుము. దీనిని త్రిసత్యముగ మనస్సున నిలుపుకొనుము!' అని, బోధించెను.

ఇదియొక స్వల్పమైన విషయముగ మనకు గనబడవచ్చును, కాని, బాబా యెవ్వరిమనస్సుల నొవ్వనీయనివిధమున దైనందిన కృత్యములందు ముఖ్యముగ మనము పాటింపదగిన గొప్ప ఆధ్యాత్మిక సత్యమును బోధించినారు. అదిమొదలు లక్ష్మీబాయిసింధే ప్రతిదినము మిక్కిలి ప్రే[illegible]తో రొట్టెలు పాలు సమర్పించుచుండెడిది. బాబా తానొకింతదిని మిగిలినది లక్ష్మీబాయిచేత రాధాకృష్ణఆయీకి బంపువారు. రాధాకృష్ణఆయి బాబా భుక్తశేషమును మహాప్రసాదముగ స్వీకరించుచుండెడిది. ఈ రొట్టెల వృత్తాంతమును మనమొక స్వల్పవిషయముగ దలంపరాదు.

యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయి పశ్యతి
తస్యాஉహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి.

ఎవడు సకలంబునందు నీక్షించు నన్ను
నెవడు నాయందు సకలమీక్షించుచుండు
జగతి వానికి నే బరోక్షంబునొంద
వాడు నాకు బరోక్షంబుగాడు; విజయ!

[శ్రీమద్భగవద్గీతామృతము 6-30]

అను భగవదుక్తిని దనభక్తులకు స్వానుభవపూర్వకముగ బోధించుటకు బాబా కావించిన లీలగా మనము గుర్తించి ఆకలిగొన్న జీవిని దనుపుటయె విశ్వంభరుడగు శ్రీ సాయీనాథుని దృప్తి పఱచుట యని భక్తులెల్లరు గ్రహింపదగును.

## లక్ష్మీబాయిసింధేకి బాబా బహూకృతి:-

ఇట్టి పరమ భక్తురాలగు లక్ష్మీబాయిసింధేని బాబా ఎట్లు మఱువగలడు? మఱువజాలడు- మఱువడు. 1918 విజయదశమినాడు

బాబా లక్ష్మీబాయినిఁ జేరఁబిలిచి తన జేబులో చేయి పెట్టి 5 రూపాయలు తీసియిచ్చెను, మఱల చేయి పెట్టి 4 రూపాయలు తీసి ఆమె చేతులందుంచెను. మొత్తము 9 రూపాయలను బాబా ఆమెకు బహూకరించినాఁడు. ఈ 9 సంఖ్య జీవసంఖ్య- నవవిధభక్తులు [S C S 117 — భక్తి] లేక సీమోల్లంఘనసమయమున బాబా ఆమెకుఁ గావించిన బహుమానమైనఁ గావచ్చును, లక్ష్మీబాయి సంపన్నురాలు. ఆమెకు ధనముతో నవసరము లేదు. కావున బాబా ఆరూపమున ఉత్తమ శిష్యులకుండఁదగిన నవవిధ సత్ప్రవర్తనల- (శ్రీ) మద్భాగవతము- ఏకాదశస్కంధము దశమాధ్యాయము— ఆరవశ్లోకమునఁ దెలుపఁబడినవి. మొదట 5 పిదప 4 సత్ప్రవర్తనల సూచించినాఁడని భక్తులు గ్రహింపఁదగును.

“అమాన్య[1]మత్సరో[2]- దక్షో[3]-నిర్మమో[4]- దృఢసౌహృదః[5]
అసత్వరో[1]ఽర్థజిజ్ఞాసు[2] రనసూయు[3] రమోఘవాన్[4]”

మొదటివి ఐదు:- 1, గర్వము లేనివాఁడు. 2. ఈర్ష్య లేనివాఁడు, 3. అలసత లేనివిధేయుఁడు, 4. మమత లేనివాఁడు [విషయాసక్తి లేనివాఁడు] 5, గురువునందు గాఢవిశ్వాసము కలవాఁడు.

రెండవ నాలుగు:- 1 శాంతస్వభావుఁడు. 2. సత్యము (ఆత్మతత్త్వము) నెఱుఁగ ఆసక్తికలవాఁడు 3. అసూయ లేనివాడు. 4. (ఆత్మప్రశంస- పరనింద- వ్యర్థ ప్రలాపములు లేని) అమోఘవచనుఁడు.- ఈ తొమ్మిది భక్తునకుండదగిన లక్షణములు.

ఈ శ్లోకమున మొదటిపాదమున 5, రెండవపాదమున 4 మొత్తము తొమ్మిది సద్గుణములను సూచించుటకు మొదట 5 రూపాయలు- పిదప 4 రూపాయలు బాబా, లక్ష్మీబాయిసింధేకి బహూకరిం

* ద్వంద్వాతీత వి
† పునరావృత్తినాశకాయ నమః

చినాఁడని మనము గ్రహించపలయును– ఈరూపమున బాబా తన బిడ్డలందఱకుఁ గావించిన చరమబోధ.

తుది దినములు:-

విజయదశమికి 2,3 దినముల ముందునుండి బాబా ఉదయకాలమున లేండీవనమునకుఁ బోవుట మానెను. భిక్షాటనము మానెను. తాత్యాపటేల్ ప్రమాదస్థితి యందున్నవాఁడు. రామచంద్రపటేల్– బాలాషింపి బాబా లోఁగడ తెలిపిన విషయమునుదలంచి భయపడుచుండిరి. విజయదశమినాఁడు తాత్యాపటేల్ నాడి సన్నగిల్లెను. తాత్యామృతి ఆసన్నమయ్యెనని అందఱుఁ దలంచుచుండిరి.

బాబా అచట మసీదునందు తుదిక్షణమువరకు వ్యక్తియైయున్నవాఁడు. తనబిడ్డలను భయపడవలదని బోధించుచుండెను. తానేక్షణమున భౌతికతనువు విడువఁదలఁచినది యెవరికిఁ దెలియఁబఱచినవాఁడు కాఁడు. కాకాసాహేబ్ దీక్షితు– శ్రీమంతుబూటీ అంతకుఁబూర్వము బాబాతో మసీదునందే భుజించుచుండువారు. 15–10–1918 మధ్యాహ్నము హారతితరువాత వారిద్దఱను విడిదికేగి భుజించిరండని బాబా నియమించెను. లక్ష్మీబాయిసింఢే– భగోజిసింధే– బయ్యాజీ, అప్పాజీ లక్ష్మణ్– బాలషింపి నానాసాహెబ్ నిమోన్కర్లుమాత్రము బాబా దగ్గఱనుండిరి. శ్యామా [మాధవరావు] మసీదుమెట్లపైఁ గూర్చుండెను. బాబా స్థితిని గమనించిన దీక్షితు–బూటీ బాబానువిడిచి వెళ్ళఁజాలకుండిరి. బాబా ఆజ్ఞ నతిక్రమింపరాదు. వ్యసనభరిత హృదయములతో నడుగుపెట్టఁగదలని పాదములతో వెళ్ళలేక నిల్లలేక మసీదునుండి వారిరువురు విడిదికి భుజించుటకై వెళ్ళిరి. వారి శరీరమాఁచట నుండెనేకాని,మనస్సు బాబా దగ్గఱనేయుండెను. భుజించుటకు గూర్చుండిరికాని, తినబుద్ధి కలుగదయ్యెను. అట్టిస్థితి అనుభవైకవేద్యము! పలుకుల కందదు.

## శ్రీ సాయీ మహాప్రభువు – మహానిర్యాణము[S.C.S.330]

బాబా తుదిగడియన బయ్యాజిఅప్పాజి– పటేలును ఆనుకొని కూర్చుండెను. ఆతనికి రహస్యముగ నేమియో బోధకావించెను. కొంచెము మౌనమువహించి 'ఈవిషయ మెవ్వరికేనియుఁ జెప్పితివా– నీవు మరణింతువు'– అని పలికెను ఆపిదప అచటనున్న వారందఱువినునట్లు 'మీాజాతోం– మేరేకు వాడాకు ఉచలూందే– సగలే బ్రాహ్మణోం భేకమాశ్యా జబ్ లూరాహాతీలూ' [నేను వెళ్ళుచున్నాను– నన్ను వాడకుఁ గొనిపొండు! బ్రాహ్మణులెల్లరు నాదగ్గఱ 'నివసించుచుందురు] అని, బాబా పలుకుచుఁ గన్నుమూసెను. బయ్యాజిమీాఁద వ్రాలెను. బాబాశ్వాస ఆగినట్లు భగోజి గమనించెను. నానా నిమోన్కరుతోఁ జెప్పెను. నిమోన్కర్ మంచినీరు గొనివచ్చి బాబా నోటిలోపోసెను. ఆనీరు వెలుపలకువచ్చుచుండ బయ్యాజి చేతిలోఁబట్టెను. అంతనిమోన్కర్ 'ఓ! దేవా!'– అని, పెద్దగనేడ్చెను, బాబా కనులొకింతఁదెఱచి, 'ఆ!' అనినట్లుండెను. అంతే!–(శ్రీ)సమర్థ సచ్చిదానంద సద్గురుదేవుఁడు– (శ్రీ) సాయీబాబా భౌతికదేహమును 15–10–1918 మంగళవారము మధ్యాహ్నము గం. 2–30 నిముషములకు [విజయదశమివెళ్ళగ ఏకాదశి గడియలందు] విడిచి సర్వవ్యాపియగు పరమాత్మయయ్యెను.

ఈవార్త క్షణములో శిరిడి యందంతట వ్యాపించెను. కాకాదీక్షిత్తు–బూట్టీ తినుచున్న అన్నమునువిడిచిపెట్టి పరుగెత్తుకొని వెళ్ళిరి. శిరిడి యందలిజనులు పిన్నలు– పెద్దలు– స్త్రీలు– పురుషులు, మసీదునకు పరుగునవెళ్ళిరి. వారి భాగ్యదేవత విడిచిపోయెనని పెద్దపెట్టున నేడ్చువారు– స్మృతితప్పి పడిపోవువారునై శిరిడియంతయు హా!హా! కారములతో మహా బీభత్ససముద్రమువలె నుండెను. దుఃఖాశ్రుప్రవాహములు శిరిడియందంతట ప్రవహించెను, బాబాకొఱకు శోకింపని జీవియచటలేదు, దీక్షిత్తు-బూటీ మసీదుఁజేరి చూచునప్పటికి బాబా

కూనను బయ్యాజి అప్పాజీతొడపై వ్రాలియుండెను. నేలమీఁద వ్రాల లేదు- ప్రక్కమీఁద పడుఁడలేదు. తనగద్దెపై బాబా కూరుచుండి తన చేతులతో తనవిధులను బహిష్కరించుచు భౌతికతనువును విడిచినాఁడు. సాధు సత్పురుషులు జనచయము నుద్ధరించుటకై భూమిపై నవతరించి, వారు కావింపఁదలచినవి సకలము నిర్వర్తించి, వారెటులవచ్చిరో యటుల సుఖప్రదముగ ప్రశాంతముగ నిష్క్రమించుచుందురు.

## మహాసమాధి :-

ఇఁక బాబా భౌతికదేహము నేమిచేయవలయునను సమస్య యుదయమయ్యెను. మహమ్మదీయులుకొందఱు బహిరంగప్రదేశమున బాబా దేహమును భూస్థాపితముఁజేసి, అచట గోరీ నిర్మింపవలయుననిరి. కుశల్‌చంద్ అమీర్‌షక్కార్ సైతము ఆ అభిప్రాయమునే వెలిఁబుచ్చెను. గ్రామాధికారి రామచందపటేల్ శిరిడివాసులు పలువురితో చర్చించి దృఢనిశ్చయుఁడై 'మీతలంపు మాకు అంగీకారముకాదు, భౌతికదేహమును బూటీవాడలోఁదప్ప మఱియెక్కడ స్థాపితముఁజేయుటకు వీలులేదు'- అని విస్పష్టఘణోతినిఁ బలికెను. ఈవిధముగ శిరిడిలోని జనులందు అభిప్రాయభేదములుగలిగి, 36 గంటలవరకు వాదోపవాదములు- చర్చలు- జరుగుచుండెను.

15-10-1918 రాత్రి వేకువజామున (తెల్లవారిన బుధవారము) బాబా లక్ష్మణ్ మామాజోషి స్వప్నమునగోచరించి (S C.S, 47) 'నేను మరణించితినని జోగ్'(బాపూసాహెబ్ జోగ్)తలంచుచున్నాఁడు. నేను జీవించియేయున్నాఁడను. రమ్ము! ప్రభాతహారతి (కాకడ్ హారతి) గావింపుము!' అని తెలిపెను.

లక్ష్మణ్ మామ ఆగ్రామములోని జ్యోతిష్కుఁడు శ్యామా (మాధవరావు దేశపాండే) మేనమామ. అతఁడు సదాచార నైష్ఠికబ్రా

హ్మణుఁడు. ఆతఁడు నిత్యము ప్రభాతమున బాబాను పూజించి, తరు
వాత ఆగ్రామములోని దేవళములందలి దేవతలను బూజించువాఁడు.
బాబా యందు గాఢవిశ్వాసముగలవాఁడు. ఆవిధముగ స్వప్నమున
బాబా ప్రబోధింప లక్ష్మణ్ పూజాద్రవ్యములను దీసికొని మసీదునకేగి
బుధవారము ఉదయమున మౌల్వీలు వారించినను సరకుగొనక యథా
విధి 'కాకడ్' హారతి పూజలనుగావించి వెడలిపోయెను. అంతట మధ్యా
హ్నసమయమున బాపూసాహెబ్ జోగ్– తదితరభక్తులతోఁ గూడి
మసీదునకువెళ్ళి మధ్యాహ్నహారతి– పూజలను యథావిధిఁగావించెను.

16-10-1918 ఉదయమునకుఁ బూర్వము పండరియందున్న
గణూదాస్ మహారాజునకు స్వప్నమున బాబా గోచరించి "మసీదు
కూలినది, తైలవర్తకులు నితరులు నాపై ఆగ్రహించినారు, నేనా
ప్రదేశమును విడిచిపెట్టితిని. ఆవిషయము నీకుఁ దెలుపవచ్చితిని.
కావున నీవు వెళ్లుము! త్వరగా శిరిడికి వెళ్ళుము! నాతనువు జాజిపూల
తోఁ గప్పుము!'– అని పలికెను. గణూదాసునకా ఉదయమున ఉత్తర
మందెను. అంతనతఁడు బుధవారము తచ్ఛిష్య సమూహముతో శిరిడికి
వెళ్ళెను. బాబా సమాధిదగ్గఱ నాటిదినము– మఱునాఁడు రేయింబ
వళ్లు హరిసంకీర్తనముఁగావించి హరినామస్థగితమైన పూలమాలలను
బాబా సమాధిపైనుంచెను. బాబా ప్రీతికై పెద్దయెత్తున పేదలకన్న
దానముఁ గావించెను. (S.C.S. 3,9) 15-10-1918 రాత్రి M.W.
ప్రధాన్ సతికి– ప్రధాన్ సోదరికి బాబా స్వప్నమునఁ బొడమి తెలిపిన
విషయములు M.W. ప్రధాన్ వృత్తాంతమునఁ జూడుడు.

బాబా శుభపలుకుల నాలకించి ప్రజలు బాబా భౌతికతనువును
బూటీవాడలో స్థాపితముఁజేయఁ గృతనిశ్చయులై ఆ మందిరమున
హాల్' మధ్యభాగమున త్రవ్వుట ప్రారంభించిరి. మంగళవారము

ఓం సకలతీర్థసన్నిధానాయ నమః ♦ ప్రపంచాయతాక్షాయ నమః

సాయంత్రమునకు 'రహాతా' నుండి పోలీసు సబ్ ఇన్స్పెక్టరు చక్రనారాయణ్ శిరిడికిఁ జేరెను. బుధవారముదయమున కోపర్గాం మామ్లత్ దార్ కులకర్ణియు నటకుఁ జేరెను. బొంబాయినుండి అమీర్ భాయి కూడ వచ్చెను. వారందఱు శిరిడిలోని అధికసంఖ్యాకులగు జనుల అభిప్రాయము ననుసరించి బాబా భౌతిక దేహమును సమాధి చేయదగునను అభిప్రాయముఁ గనబఱచిరి. అచటి హైందవుల - మహమ్మదీయుల అభిప్రాయములను మహజర్ల పూర్వకముగ మామ్లత్ దారు తీసికొనెను. బూటీవాడలో బాబా తనువును సమాధి చేయుఁదగునను వారి సంఖ్యవలదనువారి సంఖ్యకంటె గుణితముగనుండెను. కాని మామ్లత్ దారునకు ధైర్యముచాలక ఆవిషయము అహమ్మద్ నగర్ జిల్లాకలెక్టరునకుఁ దెలిపి, ఆయన ఉత్తరువుప్రకారము చేయఁదలఁచెను. కాకా దీక్షిత్తు స్వయముగ ఆపని నిర్వహింతునని సిద్ధపడెను. ఇంతలో బాబా అనుగ్రహమున ఆతండ్రి ప్రేరణమున వ్యతిరేక సంఘమువారి హృదయములు పరివర్తనఁజెందెను. అంతట శిరిడియందలి జనులందఱు నేకగ్రీవముగ శ్రీసాయీనాథుని భౌతిక దేహమును బూటీవాడయందే సమాధిచేయుటకు సమ్మతినిఁ దెలిపిరి.

బుధవారము 16-10-1918 సాయంత్రము బాబా భౌతికతనువును పెద్ద యూరేగింపుతో - మేళ తాళములతో భజనలతో వివిధ వాద్యములతో బూటీవాడకుఁ గొనిపోయిరి. ఆమందిరమున 'మురళీధరుని' ప్రతిష్ఠించుట కేర్పఱుపఁబడిన గర్భమందిరమున ఉచిత సంస్కారములతో బాబా తనువును సమాధిరూపమున సంస్థాపించిరి. వాస్తవముగ బాబా మురళీధరుఁడై నాఁడు ఆబూటీవాడ పరమ పవిత్ర శ్రీకృష్ణాలయమైనది. సకలభక్తులకు తీర్థక్షేత్రమైనది. నేటికి నీఁకేనాటికి అది పరమ సచ్చిదానందనికేతనము - శాంతిధామమై విరాజిల్లు

నది. బాలాసాహెబ్ భాటే- బాబా భక్తవర్యుడైన ఉపాసనీ మహారాజు- బాబా అంత్యక్రియలన్నియు యథావిధిగ నిర్వర్తించిరి.

బాబా తనువు 26 గంటలకాలము వెలుపల నుంచబడినను మేను మొద్దుబాఱుటగాని, అవయవములు బిగుసుకొనుటగాని లేదు. బాబా ధరించిన కఫినీని ప్రేల్చుటయే చేతులనుముడిచి వెలికిదీయుటకు అనువైన స్థితియందుండెను. ఈ అద్భుతవిషయము పాఠకులగు భక్తులు గమనింపదగినది.

## సమర్థ సద్గురుదేవ శ్రీ సాయిబాబా మహత్త్వము:-

ఈ విశ్వమున ఆస్తంబ బ్రహ్మపర్యంతముగల చేతనాఽచేతన వస్తుసముదాయము నందంతటను వ్యాపించియున్న సమర్థ సచ్చిదానంద సద్గురు శ్రీ సాయిబాబా మహాప్రభువు పాదపద్మముల ముందు సాగిలబడి శరణువేడుదము. ఈ ప్రపంచమున సకలవస్తు సమూహమున భేదరహితముగ- సమానముగ ఆతండు వ్యాపించియున్నాడు. సకలజీవులు ఆతండికి సములే, బాబాకు ఇష్టాఽనిష్టములుగాని, గౌరవాఽగౌరవములుగాని, రాగద్వేషములుగాని లేవు. శ్రీసాయినాథుని మనమేక్షణమున మఱువక ఆతండికి సంపూర్ణశరణాగతి చేసితిమేని బాబా మనకు సకలహితాభీష్టములను ప్రసాదించుటయే గాక, మనజీవితగమ్యమును- పరమశాంతి శోభిత పరంధామమును జేర్చి తీరును.

ఈ మహాభయంకర సంసారసాగరమును తరించుట మహాకష్టము. ఇందు మోహతరంగములు విజృంభించి, దుస్సంకల్పములను దఱుల నొక్కుమ్మడి డాఁకుచు మనస్థైర్యములను వృక్షములను గూల్చివేయుచున్నవి. అజ్ఞానఘోరఝంఝా మారుతము చెలరేగి దానిని కల్లోల

1 సాలోకవిపంబరాయ నమః 2 నానావిధికస్ఫూర్తాయ నమః

3 సంహర్త్రే నమః

పఱచుచున్నది. రాగద్వేషములను భయంకర మకరములు విచ్చలవిడి సంచరించుచున్నవి. అహంకార మమకారములను సుళ్ళు, నిరంతరసం దేహములను అఘాతములు నింద- ద్వేషము- అసూయ ఈర్ష్యలను ప్రబలమత్స్యములు చెరలాడుచున్నవి. ఇట్టి సంసారసముద్రము భయంకరమైనను శ్రీ సమర్థసద్గురువు శ్రీ సాయీప్రభువు అగస్త్యుడు. శ్రీ సాయీ పదాంకితులగు భక్తుల కీదేమాత్రము భయము కలిగింపదు. ఈ భయంకర భవాంభోధిని గటె [illegible] న సమర్థమగు నౌక శ్రీ సాయీప్రభువు.

## ప్రార్థన

శ్రీ సాయీబాబా పాదకమలములకు సాష్టాంగ సాగిలబడి రెండు పదములను గాఢముగ బట్టుకొని, మనమీవిధముగ ప్రార్థించుదము.

'బాబా! మా మనస్సును చలింపనీయకుము. నిన్నుగాక యే యితరమును గోరనీయకుము. ఈ నీదివ్యచరిత్రము ప్రతిగృహమున ప్రకాశింపనిమ్ము. నిత్యము దీని నెల్లరు పారాయణము జేయునట్లను గ్రహింపుము. దీనిని నిత్యము పఠించువారల సకల కష్టములనుండి రక్షించి సుఖశాంతి సంతృప్తి సంతుష్టులు ప్రసాదింపుము.

## ఫలశ్రుతి :-

పరమపావన గౌతమీనదియందు స్నానమాచరించి, శిరిడియందుగల ద్వారకామాయీమస్జీద్ అయిన సమాధిమందిరమునందుగల శ్రీ సాయీబాబా సమాధిని దర్శించువారు ధన్యులు. అచటగాని లేక భక్తులెందున్నను వారివారి నిలయములగాని, మఱెచటనేని బాబా విగ్రహమునకుగాని చిత్రపటమునకుగాని మ్రొక్కి, హృదయముల ద్వారకామాయిని గావించుకొని, శ్రీ సాయీ మహాప్రభువు సన్ని

ఓం నిగమాగమ గోచరాయ నమః । ఓం మేఘస్వనే నమః

థినిఁ గల్పించుకొని యీచరిత్రి పఠించువారికి, శ్రద్ధతో వినువారికి త్రివిధతాపములు నశించును. సకలాభీష్టములు సిద్ధించును. ప్రస్తావవశమున బాబా లీలలఁగూర్చి చెప్పుకొనినమాత్రమున ఆయాధ కుల కెఱుకబడకయే ఆధ్యాత్మిక చింతన కలుగును. తగిన ప్రేమతో పఠించువారి సకలపాపములు పటాపంచలగును. ఈ జననమరణరూప సంసార చక్ర భ్రమణమునుండి విముక్తిఁగోరువారు శ్రీ సాయిప్రభులీలలను బఠించుచు, బాబాను ఏమఱక స్మరించుచు మనోహంసను ఆతండ్రి పాదకమలముల స్థిరముగఁ జేర్పనగును. శ్రీ సాయినాథుని చరితామృతాబ్ధియందు మునిఁగి లోతునకుఁ బోవుకొలఁది భక్తులు నిత్యనూతనశోభలను ప్రసరించు అమూల్యరత్నములను సంపాదించి, సోదరసోదరభక్తుల కందించి వారికి శ్రేయస్కరమగు భవిష్యత్తు నను గ్రహింపఁగలరు. శ్రీ సాయిప్రభువు దివ్యమూర్తియందు సాధకుఁడు మనస్సునిలిపి, ధ్యానింప నభ్యసించునేని, ఆమూర్తి నురిగి యాతఁడాత్మ సాక్షాత్కారముఁ బడయఁగలఁడు.

ఆత్మ- పరమాత్మ పరబ్రహ్మముయొక్క నిజస్థితినిఁ దెలిసికొని, దానిని బడయుట మిక్కిలిదుర్లభము. కాని, సగుణ నిర్గుణాత్మక బ్రహ్మమగు శ్రీ సాయినాథునిద్వారా ఆ పరతత్త్వమును బడయఁజూచు సాధకుఁడు మిక్కిలి సులభముగ పొందఁగలఁడు. భక్తుఁడగువాఁడు పరతత్త్వమగు శ్రీసాయి మహాప్రభువునకు సంపూర్ణ శరణాగతిఁ జేయునేని వాఁడు తన వ్యక్తిత్వమునువిడిచి, సముద్రగామియైన నది సముద్రమున నైక్యమగునట్టులా పరతత్త్వమున లయమొందును.

త్రివిధస్థితులగు జాగ్రత్స్వప్న సుషుప్తులందేస్థితి యందైన నొక క్షణమేని నైక్యభావానుభూతిఁ గనఁజాలినవాఁడు సంసృతినుండి

ఓం పరంజ్యోతిషే నమః ఓం నిరాకారాయ నమః
ఓం నిత్యసత్యస్థితాయ నమః ఓం పరమార్థనివేదకాయ నమః

విముక్తిఁబడయ యోగ్యుఁడగును. స్నానముఁజేసి శుచియై యీసద్గ్రంథమును వారముదినములలో (సప్తాహమున) గాఢ విశ్వాసప్రేమలతో పారాయణము గావించువాఁడు సకల కష్టములనుండి విముక్తుఁడగును. ప్రతిదినము శ్రద్ధతో దీనిని పఠించిన వినిన సకలాపదలు తొలఁగును. సంపత్కాముఁడు దీనిని శ్రద్ధనై పఠించిన సకలసంపదల బడయును. ఈగ్రంథ పాఠకశ్రోతలు వారివారి జీవితముల సర్వతో ముఖాభివృద్ధి నొందుదురు. వారివారి విశ్వాసము భక్తికొలఁది వారికి ఫలసిద్ధికలుగును! ఈ సద్గ్రంథమును సాదరప్రేమలతో పఠించుదురేని శ్రీసాయీ ప్రభువు వారి అజ్ఞానమునుదొలగించి, జ్ఞానవిజ్ఞాన సంపదైశ్వర్యములను ప్రసాదించును. ప్రతిదినమొక ప్రకరణమేనిఁ జదువువార లపారసుఖ సంతోష సంతృప్తిశాంతులఁ బడయుదురు. శ్రేయస్కాములై దీనిని శ్రద్ధతో పఠించుచు శ్రీ సాయీశుని స్మరించువారలు భవభవముల [వారికర్మానుసారముగఁ గలుగుజన్మముల] శ్రీ సాయీభక్తులరై సుఖానందములఁ బడయుదురు. ఈ సద్గ్రంథమును గురుపూర్ణిమ (ఆషాఢశుద్ధ పూర్ణిమ) గోకులాష్టమి- [శ్రీకృష్ణజయంతి] శ్రీరామనవమి- విజయదశమి- బాబా మహాసమాధి దినములందు ముఖ్యముగ పఠింపఁదగును. హృదయమునందు శ్రీసాయీ పాదకమలముల సతతము నిలుపుకొనువారీ భవసాగరము ననాయాసముగఁ దరింతురు. ఈ సద్గ్రంథ పఠనమున ఆధివ్యాధిగ్రస్తులు శాంతి సుఖారోగ్యములఁ బడయఁగలరు. అల్పులు- దీనులు- కుమతులేని యీ గ్రంథపఠనమువలన సకలగుణ సంపన్నులై దుశ్చింతలనుబాసి నిర్మలప్రేమ శాంతిశోభిత మనస్కులగుదురు.

ఓం నిత్యాగ్నిహోత్రవర్ధనాయ నమః
ఓం నిత్యకర్మనియోక్త్రే నమః
ఓం నైష్కర్మ్యపరినిష్ఠితాయ నమః
ఓం నిర్వికల్పాయ నమః
ఓం క్షేత్రీకృతస్వశిర్డికాయ నమః
ఓం నిరాకారాయ నమః
ఓం నిరాలంబాయ నమః
ఓం శిర్డిత్యక్తగురూద్దేహాయ నమః
ఓం శిర్డిత్యక్తకళేబరాయ నమ
ఓం సత్యసత్వస్థాయ నమః

ప్రేమపూర్ణులు- భక్తులకు పాఠకశ్రోతలగు మీయందఱకుఁ ప్రణమిల్లుచున్నవాఁడను. మీయందఱను ఈమాత్రవరము నభ్యర్థించుచున్నవాఁడను. ఏ తండ్రినిగూర్చినకథలు- లీలావిశేషములను దినదినము- మాసమాసము మీరు పఠించుచు ఆలకించుచుందురో ఆతండ్రిని- శ్రీ సమర్థ సద్గురుదేవుఁడగు శ్రీ సాయిబాబాను మనవవలను. మీరెంతెంత ప్రేమాసక్తులతో దీనిని పఠించుదురో విందురో బాబా అంతలంతలు ఉత్సాహము- మనస్థైర్య సుఖశాంతులను మనకందఱకుఁ ప్రసాదించి మీ యందఱసేవఁజేయ వీని ననుగ్రహించును. వివిధభాషలలో శ్రీసాయి చరితామృతమును త్రావఁబెట్టిన రచయితలను- పాఠకశ్రోతలను శ్రీ సాయిబాబా సర్వదా సర్వథా అనుగ్రహించునుగాత!

## ప్రసాద యాచనము:-

సర్వేశ్వరుఁడు- సర్వనియంత- సర్వవ్యాపియగు శ్రీసాయి భగవానుని ఈప్రసాదము యాచించుచు ఈగ్రంథమును సంపూర్ణము చేయుదము.

బాబా! 'ఏమీ, నిన్నుపేక్షింతునా?' అనుచు నీ శ్రీముఖోద్గతమైన అభయప్రదానము నిన్నాశ్రయించు ప్రతిజీవివిషయమున ప్రత్యక్షరసత్యముఁ గావించుకొందువుగాత!

ఈకృతి పాఠకశ్రోతలగు భక్తులెల్లరు శ్రీ సాయిబాబా పదాబ్జములందు సంపూర్ణవిశ్వాసముఁ బడయుదురుగాత! ఆతండ్రి దివ్యసగుణరూప మీ వీరలందఱ హృదయఫలకములందు స్థిరముగఁ బ్రకాశించునుగాత! ఈవిశ్వమునఁగల సకల చేతనాఽచేతన పదార్థములందు శ్రీసాయి స్వరూపమును వీరెల్లరు దర్శింతురుగాత!

ఓమ్ తత్ సత్.

హరిః ఓమ్, పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# హారతి

శ్రీరామసాయి! సిద్ధావతార! - శ్రితజనమందార !
ద్వారకామాయీ భవనవిహారా! - భవభయ పరిహార !

హారతి- కర్పూరహారతి- మంగళ- హారతినర్పింతు.
కారుణ్యమున జీవాళిసంరక్షింతు- కరములజోడింతు.

నీబిడ్డలమిదె! నీపదరజమున- నెమ్మినివ్రాలెదము
బాబా! ఆసల పాల్పడఁజేయక - పరమపదంబిడుము!

ఎవరెవ రెటులాశ్రయింతురో వారి - నీవటులేలుదువు.
వివరింప నీ మహాత్త్వమపారము - విశ్వాధారుఁడవు.

నీనామతరణి నిశ్చయముగ భవ-నీరధి దాటించు
దీనజనంబుల దిక్కువు సాయీ-దేవా! కరుణించు !

సగుణబ్రహ్మముగ జగతిఁ బొడమితి-సాయీ! హరివీవు.
అగణితనిగమాగమాదులకే ని-న్నరయంగ నేరవు.

శరణాగతదీన రక్షకుఁడవను - శపథంబు నిల్పుము!
వరదా! వరదాఽభయ కరముఁబఱపి - ప్రణతులనొప్పుము!

అనయము నీశుభ పదసేవన భా-గ్యంబును మాకిడుము!
హానూమచాతకమును సాయీవన - దాంబువులఁ దన్పుము!

తో॥ నీరాజనంబు నీకిదె-సాయీ!- నితాంతజగదాధార !
ద్వారకమాయీ భవనవిహారా! స్వాశ్రిత జనమందార !

————

# సాయిబాబా, నిన్నుపేక్షింతునా?

## శ్రీ సాయిబాబా చరిత్రము - భక్తుల వృత్తాంతములు

## పంచమ సంపుటము.

(Adopted mainly from H.H.B.V. Narasimha Swamyji's Life of SAI BABA English Original)


రచయిత

కీ॥ శే॥ బాపట్ల హనుమంతరావుగారు

శ్రీ సాయికుటీరము

చిన్నగంజాము



ప్రచురణ కర్త:

బాపట్ల వేంకట పార్థసారథి,

చెరువు.

# 5 వ సంపుటము (విషయసూచిక)

# సమీక్ష



పుటలు



గమనిక:- 'శ్రీ సాయిబాబా పూజాస్తవములు' ప్రత్యేకముగా క్రౌనుసైజులో ముద్రించిన ఎక్కువ అనుకూలముగా ఉండు నని భావించుటచే ఇందు చేర్చబడలేదు, శ్రీ సాయిప్రభుని వర్ణచిత్రముతోసహా అది త్వరలోనే భక్తులకంద చేయబడును.

## 1. శ్రీ సాయిబాబా మతసిద్ధాంతము:-

సర్వసాధారణముగ మతవిషయములందు జనులు తామడుగుచున్న ప్రశ్నలఁగూర్చి యోచించకయే- ఆ ప్రశ్నలగూర్చి విస్పష్టమైన భావములేకయే ప్రశ్నలు వేయుదురు. ఒక వ్యక్తినిగూర్చి "ఆయన ఏమతానుయాయి?" అని ప్రశ్నింతురు. అట్టి ప్రశ్న మసంగతము. తానేదోయొక మతసిద్ధాంత సాంప్రదాయములను చదివి క్షుణ్ణముగ గ్రహించినవాఁడనని గర్వించువానికే యిటుల ప్రశ్నించు తలంపుగలుగును, అట్టివాఁడు తాను విశ్వసించినదే సత్యమని తక్కిన మతసిద్ధాంత సాంప్రదాయములు అసత్యములని భావించును. సాధారణ మానవునకెట్టి తాత్త్విక శాస్త్రవాసనలుండవు. తత్త్వజ్ఞానమున పరాకాష్ఠనొందిన శ్రీ సాయిబాబా వంటి సత్పురుషులకే మతసిద్ధాంత సాంప్రదాయములు అసంగతములు కావు. సకల ఆధ్యాత్మికభావములు- సకల తాత్త్వికజ్ఞానములు వారివే. అట్టివారొక దానిని సమాదరించి మఱియొక దానిని త్రోసిరాజనరు, కావున 'సాయిబాబా' ఏమతసిద్ధాంత సాంప్రదాయమునకుఁ జెందినవాఁడు?- అను ప్రశ్నమునకు- 'ఏ సాంప్రదాయమునకు చెందఁడు'- అను సమాధానమునకంటె వేఱులేదు. కాని, పృచ్ఛకునకు ఏదొక సమాధానము చెప్పవలయునుగదా!

శ్రీ సాయినాథుఁడు ఋతంభరప్రజ్ఞ- చిత్సంవిత్తుగలవాఁడని మనము జ్ఞప్తియందుంచుకొనవలయును- సచ్చిదానందప్రపూర్ణుడై విశ్వమున ప్రకటమైన విశ్వాత్మ- పరబ్రహ్మము- సర్వజ్ఞుఁడై యున్నవాఁడు. వివిధకాలముల- వివిధదేశముల పలువిధములైన మానసిక తత్త్వములు కలవు. అట్టి మానసికతత్త్వములు తలంపులు ఆపర తత్త్వమునకుఁ జెందినవే- కాని, ఆపరతత్త్వము వీనిలో దేనికిని పరిమితమై అంటుకొనియుండలేదు- శ్రీ సాయిబాబా ఆపరబ్రహ్మస్థితియందుండి తన ఋతంభరప్రజ్ఞచే నెట్టి ప్రశ్నమునకేని సమాధానమీయఁగలఁడు. ఎట్టి సంశయమేని నివారింపఁగలఁడు. సర్వసాధారణ

ముగ బాబా తనను జేరినవారి స్థితిగతుల ననుసరించి, తదనుగుణ్యముగ పలుకువాఁడు. ఆకారణమున ఒకసమయమున ఒక మతసాంప్రదాయమును మతియొకతటి వేఱొక మతసాంప్రదాయమును అంగీకరించినవాఁడని జనులు తలంతురు వాస్తవముగ బాబా అంగీకరించినది పరతత్త్వము- పరమసత్యమునే ఆపరమసత్యమునకు సంబంధించిన-అందుబాటైన ఏమతసిద్ధాంతమైనను బాబాకు సమ్మతమే. అదియే శ్రీసాయీబాబా మతసిద్ధాంతము.

సర్వసాధారణముగ బాబానుజేరు ఆశిష్యులు శ్రీశంకర భగవత్పాదులు ప్రవచించిన-ప్రబోధించిన అద్వైతసిద్ధాంతమును గ్రహింపఁజాలనివారు కావున ఆ అద్వైతసిద్ధాంతమును యథాతథముగ బాబా తనవారియెదుటఁ బలుకలేదు. కాని, యీ విశ్వమున సకల మానవసమాజమునందు ఆ అద్వైతభావము నెలకొనునటులఁ గావించినాఁడు

భగవద్గీతలకు మరాటీవ్యాఖ్య "జ్ఞానేశ్వరి" [జ్ఞానదేవుని కృతి] శ్రీశంకర భాష్యానుసారముగ అద్వైతసిద్ధాంతమునే ప్రతిపాదించుచున్నది. జ్ఞానదేవునెడ- జ్ఞానేశ్వరియందు బాబాకు మిక్కుటమగు ఆదరాభిమానములు కలవు జ్ఞానోపార్జనాశక్తుఁగు నానాసాహెబ్ చందోర్కర్ మొదలగు ఆశ్రితులకు జ్ఞానేశ్వరీ పారాయణమును [పోటీ] బాబా విధించినాఁడు. మానవజీవితమున నెంతవరకు అద్వైతసిద్ధాంతము ఆచరణీయమో బాబా నిరూపించినది తెలుపు నవసరము లేదు శ్రీ సాయీమహాప్రభువు 1908కి పూర్వమునగాని ఆపిదప వేనకువేలు బిడ్డలు బాబాను క్రమ్ముకొనుచుండినప్పుడుగాని యెట్టి ఉపన్యాసములనిచ్చి యెఱుఁగఁడు.

దాస్‌గాణూమహారాజు మరాటీభాషలో రచించిన భక్తిసారామృతము [26, 52-53, అధ్యాయములు శ్రీసాయీ వారికథలందు బాబా ప్రవచించిన అద్వైతభావ ప్రకటనలుగల విషయములు పెక్కులు

గలవు. కాని, బాబా తనవారికిఁ దెలిపిన ప్రతివిషయమున ఇతర మత తత్త్వసాంప్రదాయములకు సంబంధించిన విషయములు మిశ్రితములై యుండును. ఏవిషయమునుగూర్చి మనము చర్చించుచున్నను ఆయా సందర్భౌచిత్యము ను లెస్సగ దృష్టియందుంచుకొనవలయును. చందోర్కరునకు బాబా తెలిపిన అద్వైతతత్త్వ ప్రవచనములు జనసామాన్యమునకంతకు అన్వయించునవి యని మనము తలంచరాదు. ఆవిషయము లందఱనుద్దేశించి బాబా పలికినవికావు.

వాస్తవముగ శ్రీ సాయీశునిఁజేరిన జనసమూహమున వేయింటికొకఁడేని యు ఉన్నతజ్ఞాన- వేదాంతరహస్యములను గ్రహింపఁగలశక్తి గలవాఁడు లేఁడు. అటుల బాబాను ఆశ్రయించిన జనులు సామాన్యమైన బుద్ధిగల సాధారణమానవులు వారివారి కష్టనివృత్తి – అభీష్టావాప్తికొఱకు మాత్రమే బాబా యందు వారికిఁగల ఆదరాభిమాన గౌరవాసక్తుల కతనఁ జేరినవారేకాని' తత్త్వజ్ఞానము వేదాంతరహస్యములను గ్రహించుటకై బాబాను సమాశ్రయించినవారుకారు. కాని, అట్టివారలకును కష్టనివృత్తి అభీష్టప్రాప్తి బాబా ప్రసాదించుచున్నను అద్వైతతత్త్వ రహస్యమునుగూడ సూక్ష్మఫణితిని ప్రబోధించువాఁడు.

S C.S. 'శ్రీసాయీనాథ బోధామృతము'నందు Pera 130-131 గమనింపుఁడు !

1) S.C.S. Pera 120 "నేనెవఁడను? మనమెవరము?–" అని తలంచుచుండవలయును. R.A. తార్కాడ్ – (బొంబాయిలోని మిల్లు యజమాని) శిరిడికి వచ్చుచు 'మన్మాడ్' స్టేషన్‌లో చీఁకటియందు రైలుపెట్టెలో నెక్కి- కూర్చుండు స్థలముకొఱకు ఒక పోలీసు ఉద్యోగితో తగవులాడెను. అతఁడు శిరిడికిఁ జేరి బాబా పాదములకు ప్రణమిల్లెను.

సా. బా:- ఈఉదయమున ఎవరితో వాదించుచు తగవులాడుచుంటివి? భావ్ ! [సోదరా!] అటుల జనులతో మనమెప్పుడు కలహించ

రాదు. 'మనమెవరము?' అని, యెప్పుడు విచారించుకొను చుండవలయును.

ఖాపర్డే- బాబా తెలిపినవిషయము సాంఘిక సమాన-సమత్వభావమును పెంపొందించుకొనుటకై అంటుల పలికెనని తోచుత గ్రహించెను. తరువాత 'అట్టుల వాదోపవాదములు చేయరాదు- ఉభయులు ఆధ్యాత్మికముగ ఏకము-కాని, భిన్నులుకారు'- అని గ్రహించినాడు.

'త్వయిమయి సర్వత్రైకోవిష్ణుః' (ఆదిశంకరుడు)

2] R.S కేస్:- S.C.S 415 ............ గురువులతో నేమియు అవసరము లేదు. అంతయు నీలోనే యున్నది,.... ........ మనము అంతర్ముఖులము కావలయును. ప్రబోధకుడు- నిజముగ నీలోనేయున్నాడు. మనము తెలిసికొనవలసినది 'మనమెవరము?'- అనుమాత్రమే

3] S.C.S. 121. 1917 అక్టోబరునందు బొంబాయినుండి వచ్చిన కాంతతో.

సా.బా:- నీకేమికావలయును? దానిని కోరుకొనుము!

బొం కాం:- బాబా! ఈజనన మరణములనుండి నన్ను విడిపింపుము.

సా.బా:- [నవ్వుచు] నీకు కావలసినదంతయు నిదియేనా? ఏమి? మరణించుటకు వచ్చితివా?

బొం.కాం:- [చకితయై] బాబా! నీపలుకులు నాకేమాత్రము బోధపడ లేదు.

సా.బా:- నీవెవరవో ఆలోచించుకొనుము!

బొం.కాం:- నేను గ్రహింపజాలకున్నదానను.

సా.బా:- [ఆమెభర్తను నిర్దేశించుచు] ఈతడు నీకు తెలుపును-

[తరువాత ఆమె తనభర్తతో విడిదికేగి, బాబా అభిప్రాయము తెలుపుమనికోరెను.]

భర్త:- బాబా పలుకులు నిగూఢములు- ఆశ్చర్యకరములు- బాబా అభిప్రాయము నేను గ్రహించితినను నమ్మకము లేదు. బహుశః బాబా అభిప్రాయమిదియై యుండవచ్చును.

దైవ [ఆత్మ] సాక్షాత్కార ప్రాప్తికలుగువరకే జీవి పెక్కుమాఱులు జనన మరణములను పొందుచుండును. బాబా భగవానుఁడు. కాని, జనులు బాబాను సందర్శించియు గాఢవిశ్వాసము వహించి "బాబాదైవము"- అని గ్రహింపఁజాలరు. కావున వారికి ముక్తి లేదు.

శాస్త్రానుసారము పారమార్థికముగ "జీవుఁడు - శివుఁడు" ఏకము. నీవో 'నేను జీవిని'- అని తలంచుచున్నావు- కాదా?

బాం.కాం:- అవును.

భర్త:- బాబా- శాస్త్రములు నీవు 'శివుఁడవు- దైవమవు'- అని తలంపుమని తెలుపుచున్నవి.

బాం.కాం:- కాను-కాదు- నేనొక పాపిని. ఒకజీవినే కాని, ఆ మహాశివుఁడను కాను.

భర్త:- నిజమే- అది నీతలంపు; కాని, బాబా అభిప్రాయము నీవు నిరంతరము 'నేను ఆత్మను- దైవమును'- అని, భావించుకొలఁదినీయందు గాఢముగ పాదుకొనిన 'నేనొక అల్పజీవిని'- అనుబుద్ధి తొలఁగును, అట్టిభావన పెంపొందినకొలఁది, పెక్కుజన్మములు గడచిన పిదప, సాధు సత్పురుషుల సాంగత్యమున- వారి అనుగ్రహమునను నీవు బ్రహ్మవవు అను ఎఱుక ప్రాప్తించును- అని బాబా అభిప్రాయమైయుండును.

అనంతరము ఆదంపతులు ద్వారకామాయిఁ జేరిరి.

సా.బా:- అమ్మా! నేనిక్కడనుండియే నీభర్త నీకుఁ దెలిపినదంతయు వినినాఁడను. ఆవిషయమును నీవు మనస్సున భద్రపఱచుకొనుము!

బాబా తనబిడ్డలతో నాయీవిషయములఁగూర్చి భాషించుచున్నను తఱచుగ 'నేనెవఁడను?'- అని యోజించుకొనుచుండుము!- అన పలుకువాఁడు. ఆత్మవిచారమునకు 'నేనెవఁడను?'- అనునది పరీక్షా ప్రశ్నము. యోగవాసిష్ఠమున

"రామ' స్వాత్మవిచారోఽయం
కోఽహం-సోయమితిరూపః
అవిద్యాజాతి సంసార
దహనే దాహనస్మృతః

శ్రీరాముఁతో వసిష్ఠమహాముని తెలుపుచున్నాఁడు. 'ఓ రామా' ఇది ఆత్మవిచారము. ఇది 'నేనెవఁడను?'- అనురూపమును ధరించును- అది అవిద్యను భస్మీభూతముఁజేసి రూపుమాపును.

బాబా అంతర్విషయముల- ఆంతరంగిక విషయముల గూర్చి తఱచుగఁ బలుకును.

ఉదాహరణమునకు- ఆ సి-సంపదలు :-

సాధకుఁడు ఆధ్యాత్మికమార్గమున ప్రయోగమించుటకు 'నేను-నాది' అనుదాని కారణముఁగూర్చి బాబా ఎఱుకపఱచుచుండును సాధకుఁడు 'నాసంపద'- అనుకొను భావమును నిర్మూలించుకొనవలయును. సంపదలు- అవిద్య- సాధకుని సత్యదృష్టిని కప్పిపుచ్చి తానెవఁడో- తన ఆత్మనుగూర్చి యథార్థముగ గుర్తింపనీయకుండును. నేను- ఆత్మల విభేదమిది. నేను అనునది అవిద్యచే నావరింపఁబడిన ఆత్మ. ఈశరీరమే 'తాను' అను గాఢమగుభావన. ఆత్మ మిక్కిలిని గూఢమై 'నేను' అను స్ఫురణమునకు మూలకారణమగుచున్నది.ఆత్మ-ఏకమై సకల జీవకోటియందు అనుస్యూతమైయుండును. అదియే 'విశ్వాత్మ' అదియే 'పరమాత్మ'- అదియే 'పరబ్రహ్మము, అదియే "దైవము"

ఇక నాది అనుకొనఁబడు ఆస్తి-సంపదలు- వీవి విషయమై కల హించుట లెంత హేయమో. బాబా ఒక సందర్భమునఁ దెలిపినాఁడు. (S.C.S. 254 చూడుఁడు)

"ఒకతఱి నేను 'పుంతంబి' అను చోట నుంటిని. అచట ఇరుపక్షములవారు కలహించుచుండిరి వారేల తగవులాడుచున్నారా?- అని ఆశ్చర్యపడితిని. వారిసమీపమున ధనముతో నింపఁబడిన కుండ నొక దానినిఁ జూచితిని. వారి కలహకారణమది- నేను మెల్లగ నచటకుఁ జేరి ఆకుండను తీసికొనివెళ్లితిని. వారిసంపద నశించుటఁగని వారు మిక్కిలి దుఃఖింపసాగిరి"- అని బాబా పలికి, నేనెవఁడను? ఆకుండ ఎవరిది?-అని ప్రశ్నించి,"ఆకుండను నేను-ఆకుండనాది." అని చెప్పుచు ఈ ఆస్తివిషయక సమాధానమెంత హాస్యాస్పదమో! గమనింపుఁడని తెలిపినాఁడు.

'ఈ విశ్వమునాది- ఎవఁడేని ఈభూతలమున నేవస్తువు నేని నా తలంపునకు- పనికి ఇతరుని ప్రతిఘటనము లేనంతదనుక అనుభవింపఁ గలను- ఆనందింపఁగలను'-అని ఒక సందర్భమున 'ఆలివర్ గోల్డుస్మిత్' పలికినాఁడు. కావున బాబా తనబిడ్డల విషయమున వారివారి ఆస్తిసంపదలఁగూర్చిన వారి తలంపులను చక్కదిద్దినాఁడు.

ఉదాహరణార్థము- కొండాజి-గడ్డివాము తగులఁబడుట [S.C.S 341 A.]

ఒకదినమున కొండాజి [మార్వాడి] గడ్డివాము నిప్పంటుకొనెను, దానిని నివారింప బాబా ఆతనినివెళ్ళి గడ్డివామిని చూచుకొనరమ్మనెను. అతఁడువెళ్ళి తిరిగివచ్చి, యేమియు లేదనియు, నప్పటాలకు తన నాయెం డలో పంపినవాడవనియు బాబాతో పలికెను. అప్పుడు బాబా 'ఇప్పుడు నీవు తిరిగిచూడుము!' అనెను- ఊరిలోని జనులందఱు పఱుగులెత్తు చుండిరి. కొండాజి గడ్డివాము తగులబడుచుండెను. దానిచుట్టును ఆ గ్రామములోనివారి గడ్డివాములుకలవు.వారందఱు బాబానుజేరి, తక్కిన

వాములను రక్షింపుమని ప్రార్థించిరి. గాలి విపరీతముగనుండెను. అది మధ్యాహ్నవేళ వారి ప్రార్థనము మన్నించి బాబా వెళ్ళి ఆ కొండాజి వామిచుట్టు నీటిధారపోసి 'ఈ వామిమాత్రమే తగులఁబడును'- అని ఆజ్ఞాపించెను, తన ఆస్తి నష్టమయ్యెనని కొండాజి బిట్టు విలపించెను. అంతట బాబా 'ఇదియెంత అవివేకమో! గమనింపుము! ఈ మార్వాడీ చర్మ రక్తమాంసమేదో అస్థులతో గూడిన దేహము తానని తలంచు చున్నాఁడు. ఆగడ్డివామి వేఱువిధము. వీనితో ఆగడ్డివామికేమి సంబంధము కలదు? ఓయీ! మార్వాడీ! పొమ్ము- నీకు కలిగిన నష్టమును వేఱొక వ్యాపారమున కూడగట్టుకొనుము'- అని అతని దుఃఖమును నివారించుటకు లౌకికముగ బోధఁ గావించినాఁడు. అటుల బోధించుచు 'నేను-నాది'- అను భావమెటుల ఆధ్యాత్మికముగ నిరాధారమైనదో సూచించినాఁడు ఆత్మశ్రేయస్సు కోరువాఁడు 'నేను-నాది'- అని నిరంతరము పరిశీలించుట ఎటుల వినాశకరమో తెలిపినాఁడు. 'నేను'- అను కొను నతఁడు ఆ 'నేను' లోని అంతర్గతవస్తువును- ఆత్మను గుర్తింపఁడు దానిని గుర్తింపక అసంగతము- వ్యర్థములగువానిపైఁ దన బుద్ధినిఁ జొనుపును,

మార్గమున మనకెదురైన ఒకబాలుని 'నీవెవఁడవు'- అని ప్రశ్నించిన వివిధములుగ నతఁడు సమాధానమీయఁగలఁడు. 'నేను బాలుఁడను- నాపేరు రాముఁడు- నేను కృష్ణుని కుమారుఁడను. నేను హైందవుఁడను. 16 సంవత్సరములవాఁడను నేను ఆపాఠశాలలో విద్యార్థిని' మొదలగు సమాధానములీయవచ్చును. అనఁగా ఈవిషయములన్నియు నతఁడు కాఁడు. ఇవియన్నియు నతనికి హత్తుకొని సంబంధించిన విషములే యగుచున్నవి ఈ అనుబంధములన్నియు నెచట కేంద్రీకరింపఁబడినవో అతఁడు ఎఱుఁగఁడు.

వేదాంతులు శుద్ధచైతన్యమున నొకఅంశము మార్పులుపొందునని చెప్పుదురు. అది అసంగతము, అభిమానము- అమితమైనప్రేమ-

ఆసక్తియందును, 'నేను-నాది'- అను భావము 'దేహాత్మబుద్ధి'-[దేహమే ఆత్మ అనుబుద్ధి] ననుసరించి కలుగును. బాబా తనబిడ్డలకు ఈ 'నేను-నాది'[దేహము-దేహమునకు సంబంధించిన సంపదల]యందు ఆసక్తిని వదలుట శ్రేయస్కరమని బోధించి మహోపకారముఁ గావించినాఁడు. సాధకుఁడగువాఁడు ముఖ్యముగ గమనింపఁదగినది యిదియే- దేహభావన ననుసరించి కలుగు 'నేను—నాది' అను తలంపునుండి విడివడుటయే.

మతసిద్ధాంతము- వేదాంతజ్ఞానము అనునది ఊహామాత్రమై శాస్త్రజ్ఞానము కొఱకు కృషిసలుపు పండితులకు, విద్యార్థులకుమాత్రము పరిమితమైనది. శాస్త్రజన్యజ్ఞానము అనుభవమున నిలువదు. ఆధ్యాత్మికముగ పురోగమించి, ఒకస్థానమునకుఁ జేరఁగలిగినవానికి ఊహాజనితమైన యీమతసిద్ధాంతములందుగల భేదములు తోఁచవు. ఆయామతసిద్ధాంతములందుగల భేదప్రతిపత్తిని సమన్వయముచేసికొను యత్నము వానికవసరము- వ్యర్థముగఁ బొడగట్టును. శ్రీ సాయీనాధునివంటి సాధుసత్పురుషులకు విశదపఱుపరాని తాత్త్వికసమస్యయే లేదు. ఈమతసిద్ధాంతములు ఊహామాత్ర జనితములై, భేదబుద్ధినిఁ బురస్కరించుకొని పిడివాదములఁజేయు పండితులకుమాత్రము పరిమితములైనవి. పిడివాదములు తీవ్రతర్క వితర్కములకు దారితీయును. ఆధ్యాత్మికముగ నున్నతస్థానముఁ జేరఁజాలిన వాని వ్యక్తిత్వము [జీవితము]పూర్ణమే.

ఆతని పూర్ణస్థితి- ఆతనిఁ బరివేష్టించిన వివిధస్థానములకుఁ జేరఁగలిగిన ఇతరప్రాణుల వ్యక్తిత్వములు విశదములు— సక్రమములు- అధీనములు- ఏకమునగుచున్నవి. అట్టి మహాసిద్ధపురుషులు వారి ప్రవర్తనలందెట్టి కష్టములనుపొందరు, ఔఁగాములు- అసంగతములు-సమాధానపఱుపరానివి వారికి లేనేలేవు. ఆధ్యాత్మిక పరాకాష్ఠనొందిన స్థితి గనుఁడు !

"కాదన డెవ్వరినేవియు
వాములకుంబోఁడు, వెఱ్ఱివానివలెనుతా
భేదాఽభేదముఁ దెలుఁగడు,
వేదాంతరహస్యమెల్ల వేమఁ యెఱుఁగున్.

[వేముఁ ల వాడ భీమకవి]

వీధికొనయందు నిలఁబడి చూచువానికి ఆ వీధి యిరువైపులొక చోటఁ గలిసియున్నట్లు గోచరించును. ఆవీధియందు నడుమవానికి—పైగా నెగురువానికి ఆవీధి కలియుస్థానము గోచరింపదు. వానికామార్గమంతయు నాటంకరహితమై విశదముగఁ బొడగట్టును. ఆ సత్యవస్తువును గ్రహించుటకు వివరించుటకు మనపలుకులు బుద్ధులు మిక్కిలి అల్పములు— అవిద్యాపీడితుల సమస్యలనుగూర్చి చర్చించుటకు— అట్టి వారలుగావించు వాదోపవాదములందుఁ బాల్గొనుటకు సాధుసత్పురుషులు వారి అమూల్యకాలమును వ్యర్థపఱచుకొనకుండుట వారి సుదృఢ నియమము.

బాబా పలుకులనుగూర్చి వాని వివరణములనుగూర్చి చందోర్కరు— కపర్దే మొదలగువారు చర్చించుకొనుచుందురు అట్టి చర్చలు వలదని, ఆపలుకులలోని భావము క్రమముగ వారికే బోధపడునని బాబా తెలుపుచుండువాఁడు.

జీవితమున పరమసత్యవస్తువును జేరినపిదప— అంతకుఁబూర్వ మావస్తువునుగూర్చి కావించినచర్చలు— వాదోపవాదములవలన వారు 'ఇదమిత్థం'అనుకొనిన ఊహాలు భిన్నములుగ వేద్యములగును. ఆత్మను దైవమును—గూర్చి తెలిసికొనఁదలఁచినవారు బ్రహ్మజ్ఞులఁజేరి, వారిని ఆవిషయమునుగూర్చి ప్రశ్నించి వారివారి సందేహములను నివృత్తిఁజేసికొన సమీపించి అట్టి సత్పురుషులను చూచినతోడనే ఎట్టి ప్రశ్నముల తోడ పనిలేక మౌనముగఁగూర్చుండి, సంశయనివృత్తి పొందినవారును పలువురుగలరు. శ్రీభగవాన్ రమణమహర్షి సన్నిధియందిట్టుల జరిగిన

సందర్భములు పెక్కులుగలవు. తనవారి సందేహములను నివారించు టకు బాబా ఒకటి మాత్రమే పలుకువాఁడు. దానితో సంశయవిచ్ఛేదము కావించువాఁడు. సత్యవస్తువునుగూర్చి గ్రహించి సమన్వయపఱచుకొనుటలో కష్టము వేదాంతశాస్త్ర వివరణములో లేదు. సాధకుఁడా సత్యవస్తువును గ్రహించుటలో కలఁడు. మనస్సు అధీనమునలేక రాగద్వేషాదులలముకొని అవిద్యచే సత్యదృష్టి కప్పఁబడినప్పుడు మనకు పొడమినకష్టములు- ఆధ్యాత్మికపథమున నొక్కొక్క అడుగు పురోగమించినకొలఁది తొలఁగి, అసత్యతత్త్వము క్రమముగ బోధపడుచుండును. సమర్థ సద్గురువర్యుఁడగు శ్రీ సాయినాథునివంటి సిద్ధపురుషుఁడు తనఆశ్రితుని మనస్తత్త్వమును- దానిస్థితి- కలుగు కష్టములనుగుర్తించి, తనవాని పురోభివృద్ధి కెట్టి నిరోధములను కలుగనీయక గమ్యమునకుఁ గొనిపోఁగలఁడు

విభిన్నములగు తత్త్వవిషయకజ్ఞానములు- ఆధ్యాత్మికాభ్యున్నతికి హానికరములు- అని, సందేహనివృత్తి శాస్త్రజన్య జ్ఞానదృష్టివలనఁ గాక- నూతనపథమును- గాఢవిశ్వాసపథమును సమాశ్రయించి అనుసరించుటవలన సిద్ధించునని శ్రీసాయి మహాప్రభువు మనకు తన అనుభవపూర్వకముగ విశదపఱచినాఁడు. (S.C.S. Pera 175 చూడుఁడు!]

## సాయిబాబా - పూర్వ(జన్మ) గురుమహిమ

తనగురువును దానెటులఁ గలిసినది బాబా తెలిపినాఁడు. తాను- మఱి ముప్వురు సహపాఠులు శాస్త్రగ్రంథములను చదివి జ్ఞానసిద్ధిఁ బడయుమార్గములను చర్చించుచుండిరి, వారిలో నొకఁడు 'ఉద్ధరేదాత్మ నాత్మానం' [భగవద్గీతలు 6-5] తనఆత్మను ఆత్మచేత నుద్ధరించుకొనఁ దగునను గీతావచనముల ననుసరించి మనమీఁదనే మన మాధారపడ వలయునుగాని, యితరుల-(గురువుల)పై ఆధారపడరాదని పలికెను.

రెండవవాఁడు తలంపులను- సందేహములనువిడిచి, మన మనస్సును అధీనము నందుంచుకొనవలయును- ఎల్లెడ నెల్లవస్తువులనున్నది

మనమే 'సర్వభూతస్థమాత్మానం-సర్వభూతానిచాత్మని" (భ.గీత 6-29) అని పలికెను. మానవులకు ఈ దృశ్యప్రపంచము నిరంతరము మార్పు పొందునది-నిరాకారమైన వస్తువే మార్పులేనిది- "అవినాశితుతద్విద్ధియేన సర్వమిదంతతమ్" [భ.గీత 2-17] కావున విచారణచేత నిత్యమైనవస్తువు నుండి అనిత్యమైన వస్తువును వేర్పఱచుటచేత [నిత్యానిత్యవస్తువివేకమున] మనము జ్ఞానసిద్ధి పొందవలయును.' అని పలికెను.

బాబా మాత్రము గ్రంథపఠనమునఁ బడయుజ్ఞానము నేవగించుచు, 'మన విధ్యుక్తధర్మములను సమాచరించుచు, మనతలంపును వాక్కును జీవితమును సర్వవ్యాపియైన గురుదేవునకు సమర్పించుదము. మనకుఁగావలసినది మనగురునందు గాఢవిశ్వాసముమాత్రమే'- అని పలికెను.

వారు (విద్యా) అరణ్యమునఁబడి సంచరించుచుండగ నొక వనజారిని [అడవుల మార్గమెఱిఁగి సంచరించువానిని] కలిసిరి 'ఈఎండలో అడవులలోఁబడి యెచటకుఁ బోవుచున్నారు?'- అని అతఁడు వారి నడిగెను. వారు సమాధానమీయకున్న 'అగమ్యమై దారి కనరాని యీ యడవుల సంచరించవలదు!'- అని, ప్రేమతో నతఁడు హెచ్చరించి, తనతో భోజనముఁ జేయరండు! అని వారిని ఆహ్వానించెను. ఆవనజారి హితబోధ వారాదరింపక ముందునకుఁ జనుచుండిరి. ఆ యడవులందు దారితప్పి తిరుగుచుఁ దిరుగుచు మరల ఆవనజారి కెదురుపడిరి.

'మీ తెలివిపై నాధారపడుటచే పెడదారి పట్టినారు. మార్గమెఱుకపఱచుటకు దారి యెఱిఁగిన తోడు అవసరము- 'భుజింపరండు!'- అనిన నిరాకరింపఁదగదు. అట్టి పిలుపు శుభప్రదము. చేయు ప్రయత్నము సకది విజయసూచకము.-' అని పలికి, మరల వారిని తనతో భుజింపరండు'- అని ఆహ్వానించెను. బాబా ఆకలి నొందియుండుటచే ఆవనజారినిఁజేరి రొట్టెముక్కను తిని నీరుత్రాగెను. తక్కిన ముగ్గురు ఆతనిఁజేరక వారిదారిన వెడలిరి.

అప్పుడావనజారి (గురువు) 'మీ వివాదమేమి?'— అని ప్రశ్నించెను బాబా వారి సంభాషణమంతయుఁ దెలిపెను. సగౌరవముగ నతనికిఁ బ్రణమిల్లెను. ఆతఁడు బాబాను ఒక నూతిపర్కకుఁ గొనిపోయి నూతిపైకి వ్రేలాడు ఒక చెట్టుకొమ్మనుండి నూతిలో నీటికి 3 అడుగుల ఎత్తున వ్రేలాడునటుల తాళ్ళతో బాబా కాళ్ళు బంధించి తలక్రిందుగ వ్రేలాడఁగట్టెను. ఆ గురువెక్కడకో వెళ్ళి, 4, 5 గంటల తరువాత తిరిగివచ్చి, బాబాను వెలుపలకుఁ దీసి, కాళ్ల కట్లువిప్పి "ఎట్లుగడిపితివి?" అని ప్రశ్నించెను. "బ్రహ్మానందముగ కాలముగడచెను"— అని, బాబా సమాధానమిచ్చెను. బాబా పలుకులకతఁడు మిక్కిలి సంతోషించి, దగ్గరకుఁ జేర్చుకొని, బాబా తనువును తనచేతితో నిమిరి ప్రేమరసమొలుకు పలుకులఁబలికి, బాబాను తనబడిలోఁ జేర్చుకొనెను. ఆ బడియందున్న కాలమంతయు బాబా తన తలిదండ్రులను— బంధువులను— సకలకామితములను మఱచినాఁడు.

ఆ గురుదేవునందే తనదృష్టిని నిలుపుటచే బాబా మిక్కిలి ఆసక్తిగనువాఁడు. ఆతఁడు తనయెదుటలేనియెడ తన కనుల కలిమినే యేవగించువాఁడు. బాబాకు తిరిగి యింటికి వెళ్ళవలయునను కోరిక కలిగినదికాదు. గురువునుదక్క సకలమును మఱచినాఁడు. బాబా ప్రాణములు తనచూపులందు—చూపు గురువునందు కేంద్రీకరింపఁబడెను. అదియే బాబా ధ్యానము—లక్ష్యము—మౌనముగఁ గురువునకుఁ బ్రణమిల్లువాఁడు. అనఁగా ఎట్టిప్రయత్నములు— అధ్యయనాదులు లేకయే తన గురుదేవుని అనుగ్రహమున 'ఎఱుక' దానియంతట నదియే కలిగినది, గురుదేవు ననుగ్రహము కరుణారసార్ద్రదృష్టి— యొక్కటియే మనసాధనము. దానివలన జ్ఞానసిద్ధి అనుభూతమగును, అని యీకథారూపమున దృష్టాంతము బాబా మనకు విశదపఱచినాఁడు.

ఇపుడు బాబానుగూర్చిన ప్రశ్నమును విచారించుదము. బాబా మతసిద్ధాంతమేమి? సత్యమైనవస్తువు ఒక్కటియే— ఈవిశ్వమున మనము

చూచు సకలము (ప్రకృతి) మాయావికారమే– అను అద్వైతసిద్ధాంతముచు ప్రతిపాదించినాడా?– ఈదృశ్యప్రపంచము సత్యమే-అను భౌతికవాదియా? నిర్గుణోపాసన ప్రతిపాదించినాడా! దైవముయొక్క వివిధ రూపముల ధ్యానించి సేవించువాడా? ఆయన బోధించినది భక్తిమార్గమా? యోగమార్గమా? కర్మమార్గమా! అనుప్రశ్నములకు సమగ్రముగ సమాధానమిచ్చుట గ్రంథవిస్తృతమగును.

మొదటిప్రశ్నము– బాబా మతసిద్ధాంతమునుగూర్చి విచారించుదము. (శ్రీ) శంకరభగవత్పాదులు 'వివేకచూడామణి' మొదలగు గ్రంథములం బ్రతిపాదించిన శుద్ధాద్వైతసిద్ధాంతము బాబా మతమా? అను విషయమున బాబా ఆశయము– వ్యక్తిత్వము లెవరికిం దెలియరానివనుటయే సంక్షిప్తసమాధానము.

బాబా భౌతికదేహమునందున్నంతకాలము వివనాటక ఆతండి పలుకులు– పనులు గమనించుచు సన్నిహితసంబంధముగలిగిన వారెవ్వరునులేరు. ఇంక 1918 తరువాత బాబాలీలలు– ప్రబోధలు– కృపలు అంతకుం బూర్వమునకంటె అధికముగంగలవు. ఈవిషయము లన్నిటినిం బురస్కరించుకొని '(శ్రీ) సాయీబాబా' ఏదోయొక ఊహా మాత్రమైన వస్తువుకాండని, ప్రతివ్యక్తికి సకలము అగుచున్నాండని చెప్పందగును. అనంగ ప్రతివ్యక్తియొక్క భావమునకు అనుగుణ్యముగ బాబా కలండని చెప్పందగును.

"యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్"

"ఇంద్రనందన! యెటులెట్టు లెవ్వరెవ్వ (భ.గీ. 4-11)
రాశ్రయింతురో వారినేనట్టులటుల"
అనుగ్రహింతునని (శ్రీ)కృష్ణసాయి పలికినాండు
"మేరే బాబాకు మర్మనజానా రేకోయీ– ॥మేరే॥
(శ్రీ) బాబాకు సిద్ధావస్థా జిస్కైసా జానా రే॥

ఎఱుఁగలేరురా బాబా మర్మంబెంతవారలేని
మాబాబా తత్త్వం బెంతవారుగాని-" [శ్రీసాయీకరుణ. 176 పుట]

పరబ్రహ్మస్థితియందుండి బాబా "మైఁ అల్లాహూఁ-" అని నాఁడు. కావున ఆపరతత్త్వ లక్షణములన్నియుఁ గలిగియున్నవాఁడే. భక్తులు బాబాయందు తమతమ యిష్టదైవస్వరూపములను-(శ్రీరామ-దత్త- విఠోబ- ఖండోబ- గణపతి- మారుతి మొదలగురూపముల) గురుదేవమూర్తులను [గురుఘోలప్ మహరాజు- అకల్‌కోటమహారాజు మొదలగువారి రూపములను] చూడఁగలిగినారు. వేదాంతమార్గాను యాయులైన హైందవయోగులు బాబాను 'సాధుచూడామణి-' అని తెలిపిరి. ముస్లింభక్తులు 'అవాలియా'- అని శ్లాఘించిరి. సామాన్య జనులు అద్భుతశక్తి మహిమలుగలవాఁడని బాబాను గౌరవించి ప్రేమిం చిరి. గురువు అవసరములేదు, అనుభావముగలవారితో 'గురువులతో నీకు పనిలేదు. నీగురువు నీలోనేయున్నాఁడు' అని తెలుపువాఁడు [S.C.S 415] శుద్ధ అద్వైతవాదులకు వారికిఁదగిన బోధకావించువాడు.

అద్వైతవాదులమని చెప్పుకొనువారు పలువురు ఆచరణమందు ద్వైతులే. దక్షిణభారతమున- మహారాష్ట్రమున నిట్టివారు లక్షోపలక్షలుకలరు. ఉద్ధవమరమునకుఁజెందిన ఆదిశంకరుల అద్వైతభావము కలిగియు, ఉపాసనీమహరాజు మొదలగువారు ఆచరణమున శ్రీరామానుజ-శ్రీ మధ్వాచార్యుల అనుయాయులవలె వర్తించుచు ధ్యానపూజాము లందు ద్వైతపద్ధతినే ఆదరించుచు నొకకాలమునకు అద్వైతసిద్ధి ప్రాప్తిం చునని విశ్వసింతురు. అద్వైతమతాచార్యులగు శ్రీమధుసూదన సర స్వతులు

"వంశీ విభూషితకరా న్నవనీరదాభాత్
పీతాంబరాదరుణ బింబఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందరముఖాదరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపితత్త్వమహం నజానే"-అని

ఆపరతత్త్వమును శ్రీ బాలకృష్ణరూపమున ధ్యానించి సేవించి నాఁడు. శ్రీ వేమనయోగి యీద్వైత- అద్వైత తత్త్వరహస్యమును సంగ్రహముగఁ దెలిపినవిధము గమనింపుఁడు!

"అంతరంగమందు నద్వైతమేయుండు
బాహ్యమందు ద్వైతభావముండు,
అల్లుఁగాక తత్త్వమలవడనేరదు"—అనినాఁడు.

శ్రీ సాయీనాథుని ఉపాసనీమహారాజు ఆశ్రయించినపుడు బాబా ఆయన అర్హతను భావమును గుర్తించి అనుగ్రహించినాఁడు. ఉపాసనీమహారాజు అద్వైతసిద్ధి- పరమాత్మైకప్రాప్తి ఎప్పుడో చరమ కాలమునఁ గలుగనున్నదను తెలంపుగలవాఁడు గావున ఆయన ఇష్టదై వమునందు భక్తి పెంపొందునట్లు బాబా అనుగ్రహించినాఁడు, గురు దేవునందు దృఢభక్తిని ప్రసాదించినాఁడు.

యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ
తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశంతేమహాత్మనః
ప్రకాశంతే మహాత్మన ఇత్యుపనిషత్-

[శ్వేతాశ్వతరోపనిషత్]

కావున ఉపాసనీమహారాజును శిష్యునిగ బాబా గ్రహించి, తన అనుగ్రహపాత్రునిఁ గావించుటకు ముందు తనయందు [శ్రీ సాయీ మహాప్రభువునందు] గాఢభక్తికలిగి సకలమునకు తన గురుదేవునిపై ఆధారపడియుండునట్లుఁ జేయవలయును. అందుచే శ్రీసాయీశుఁడు తనశిష్యునకు తనశక్తిని- సమర్థతను- వ్యక్తిత్వమును ప్రకటించి, తనను గాఢముగ ప్రేమించు నవకాశముఁ గల్పించినాఁడు. తనకు అంకితుఁడైన బిడ్డయొక్క సకలలౌకిక పారలౌకికభారములను శ్రీసాయీప్రభువు వహించువాఁడు. ఆధ్యాత్మికబీజమును జల్లుటకు తనవాని హృదయక్షేత్రమును చక్కఁజేసి సిద్ధపఱచుటకై బ్రహ్మచర్య- సత్యవైరాగ్యాది

మాఖ్యాసద్గుణములను పాదుకొలిపినాఁడు. ఆవిధముగ ఉపాసనిమహా రాజును సద్గురుస్థాయికిఁ జేర్చినాఁడు. ఇట్లు గావించుచున్నను గమ్యస్థానము నెఱుకపఱుపక యుండలేదు. కాని, ఉపాసనీమహారాజు "తాను- సకలభూతములు- గురుదైవము-" ఏకము- అనువిషయము గ్రహింపఁజాలకుండెను. విశ్వాత్మయందుఁ దన వ్యక్తిత్వమును విస్మరింపలేకుండెను. పుట్టుకచేత ఉపాసనికి వాత్తుకొనిన ఆ ఉద్ధవమత ప్రభావమిది. సకలవిశ్వమున దానికావల కలది ఒకేసత్యమని శ్రీసాయీ మహాప్రభువు బోధించినాఁడు. ఆవిధానమును గమనింపుఁడు!

శ్రీశంకర భగవత్పాదులు ప్రతిపాదించి ప్రబోధించిన ఈ అద్వైతసిద్ధి, వైరాగ్యసహితమైన విచారణవలన- శమదమాది సాధన షట్కమువలన పడయఁదగినది. కావున బాబా ఉపాసనిని విచారణ మార్గమున ప్రత్యేకవిధానమున నడువఁబనిచినాఁడు, ముందుగ కామినీ కాంచన విముఖునిఁ గావించినాఁడు. వివిధదృశ్యములద్వారా ఈవిషయమును బోధించినాఁడు. "గురువుమాటలను వినవలదు"- అనుచు వెంబడించు ఉపాసనీ ప్రతిరూపమును- మలిన వస్త్రధారియగు పాపపురుషునిఁ బట్టికొని బాబా తగులఁబెట్టినాఁడు. "బాబా! నీవు తగులబెట్టుచున్నది నన్ను- నన్ను కాల్చుచున్నాఁడవు"- అని ఉపాసని అఱచినాఁడు. "అవును-నిన్నే-పాపపురుషుఁడవుగనున్న నిన్నే- కాల్చితిని"- అని బాబా తెలిపి .అటులఁ గావించినగాని మనము సాధింపవలసినపను లెటుల సిద్ధింపగలవు?'- అని పలుకుచు ఉపాసని పాపపురుషుని దగ్ధము చేసినాఁడు.

[S.C.S. Para 641] కాంచనవిముఖునిఁ గావించుటకు ఉపాసని మఱియొకదృశ్యము బాబా ప్రదర్శించినాఁడు. అందు ఉపాసనిరూపమున నున్నవాఁడొకఁడు పెద్ద ధనరాశిపై దివ్యవస్త్రాభరణాలంకృతుఁడై కూర్చుండుటచూపెను. 'అదిచూడుము!-అతఁడు నీపుణ్యపురుషుడు'- అని బాబా పలికెను.

ఆ రెండవ పద్ధపురుషుని జూచినపిదప 'నీవు పట్టి తగులఁబెట్టినది నా పాపపురుషుఁడైన నీకు నేనెవఁడను?-' అని, ఉపాసని ప్రశ్నించెను. ఇదియే 'ఆత్మవిచారము'- ప్రతిపత్తునకు తగినట్లుగ ప్రశ్న హించికొని వేఁడగినది యీస్థానమువలనకే, అందుచేతనే బాబా తెలు చుగ 'మనమెవరము?- ఎక్కడనున్నవారము? ఎట్టివారమైయున్నా రము?'- ఇత్యాదులఁగూర్చి విచారింపుఁడని, తనబిడ్డలకుఁ దెలుపువాఁడు. ఉపాసనికి ఆతనియందు పాపపురుషుఁడు పుణ్యపురుషుఁడు- ఇరువురు కల రని బాబా నిరూపించినాఁడు. అపుడు ఉపాసని 'నేనెవఁడను?'- అను ప్రశ్నమడిగినపుడు బాబా వెంటనే సరియగు సమాధానమిచ్చినాఁడు. [ఇదియే విచారబీజము నాటుట.] 'నీవు ఆరెండవపు కావు. నేను ఏవస్తు వునో- నీవును ఆవస్తువే'- అని, అంతటితో ముగించినాఁడు. అవిద్యా బద్ధుఁడైన శిష్యుని తెలుపుమించిన పలుకు (అది) పలికినాఁడు.

తరువాత ఉపాసనీమహారాజు 'అవధూతగీతలు' పారాయణము గావించినపిదప శిరిడియందు నాటఁబడిన బీజము అంకురించి ఆకుఁదొడిగి వృక్షమై ఫలించినది. ఆదిశంకరుల బోధానుసారము 'నేను' అని ఉపాసని అడిగినది సకలమున మనకు గోచరించు వివిధరూపముల ప్రకటమగు ఆ సత్యవస్తువే- ఆపరబ్రహ్మమే- యగుచున్నది.

నీదైవము- పరబ్రహ్మము- అని పలుకబడినదియేది?- ఎందుండి యీసకలము ప్రకటమగుచున్నదో- ఈసకలము ఎందు లయమగుచున్నదో-అదియే బ్రహ్మము,ఆబ్రహ్మమే 'నీవు'-అదియే యీవిశ్వముగ ప్రకటమైనది. అదియే జీవుఁడుగ ప్రకటమైనది ఈజీవి ఇతర భూతములవలె ఆబ్రహ్మమే అందుచే బాబా తెలిపినది- నేను ఏవస్తువునై యున్నవాఁడనో- నీవును ఆవస్తువే- ఈతత్త్వబోధ కలుపఁబడిన పిదప ఆదృశ్యము పూర్తియయ్యెను.

1936 నాటికి యీబోధ ఉపాసనియందు విదితమైనది. అనుభూతమైనది. ఈజీవి తన ప్రత్యేకతను- వ్యక్తిత్వమునుబాసి, పూర్వబ్రహ్మ

మునందెటుల లయమొందఁగలఁడో గుర్తింపఁగల్గినాఁడు. అభేదబ్రహ్మ మెట్టిదో యెఱుకగలిగినది.

## 2. శ్రీసాయీ భక్తిప్రచారము

'ప్రచారము'- అన, వ్యాప్తముచేయుట- ప్రకటించుట- అని అర్థము. ఏదేని నొకసద్విషయమును- విశ్వజనోపకారకమైన విష యమునుగూర్చి తెలిసికొనిన- లెస్సగ గ్రహించినదానిని జనోపకార బుద్ధితో నితరుల కెఱుకపఱచుట మంచిది. జనుల ఆదరణ నిరాదర ణాలతో నిమిత్తములేదు. తనబుద్ధికి శ్రేయస్కరమని తోచినదాని నితరు లకుఁదెలుపుట ధర్మము.

'ఏకఃస్వాదునభుంజీత'— మధురపదార్థముఁ దానొక్కఁడేతిని ఆనందించరాదు. ప్రక్కననున్న వారలకును 'అంతో ఇంతో' పెట్టి, వార లతోఁగూడి తానును ఆనందించవలయును. సకలశాస్త్ర పురాణేతి హాసాదులు ఈతలంపుతోడనే వ్యాప్తములై సజీవములై యున్నవి. ఉత్తమపురుషులఁగూర్చి కాని, ఉత్తమవిషయముఁగాని విశ్వజనోపకార బుద్ధితో వ్యాప్తముఁజేయుట సాధుజన లక్షణములలో నొకటి.

శ్రీసాయీ భక్తిప్రచారము- అనగా శ్రీ సాయీబాబాను గూర్చి మానవసమాజమునకు ఎఱుకపఱచుటయే. శ్రీ సాయీబాబా ఒక మహాపురుషుఁడై, ఆతండిి మనదేశమున నొకప్రాంతమునఁగల వేనవేలు ఆశ్రితులను రక్షించిన— రక్షించుచున్న విషయము సత్యమై నపుడు అట్టిసమర్థ సద్గురువునుగూర్చి ప్రపంచమున మానవసమాజ మున కెఱుకపఱచుట వాంఛనీయము మాత్రమేకాదు— మన విధు లలో నొకటియునగును శ్రీసాయీ మహాప్రభువు కరుణాప్రసాద సిద్ధికి సాధనమునగును.

శ్రీసాయిాబాబా సహజస్థితి- వ్యక్తిత్వము- ఆతండి కిరూప్పు సంఘటనలు- వానివలన పలువురకుఁగలిగిన శ్రేయముఁనుగూర్చి - అట్టి అనుభూతులనుపొంది యెఱుఁగనివారికి శ్రీ సాయిాభక్తి ప్రచారకుఁడు స్వయముగ ననుభవించినవియు- ఇతరులవలన విని, చదివిన వానిని పలువుర కెఱుకపఱచుట తేలికయైన పనికాదు. భౌతికతనువునందున్న కాలముననే బాబా తన ఆశ్రితులగువారిని గొందఱను దామపొందిన దివ్యానుభూతుల ఇతరులకు ప్రకటించుకొనఁదగదని ఆనతిచ్చినాఁడు

['ఇదంతే నాతపస్కాయ నాభక్తాయకదాచన.........'

[భ. గీత 8-67]

శ్రీకృష్ణభగవానుఁడు శాసించిన విషయమును గుర్తింపుడు!]

మానవులలో పలువురు సహజముగ రజస్తమోగుణ పూరితులగుటచేత శ్రీ సాయిాభక్తి ప్రచారకుల పలుకులను విశ్వసింపకపోవుటయేగాక వారిని- వారు ప్రచారముగావించు సత్పురుషులనుగూర్చి అవహేళనముఁ జేయుచుందురు. అటుల హేళనఁజేయువారితో- అట్టి హేళనప్రియులుగల సంఘములలో సత్పురుషులను- సద్గురువులను గూర్చి పలుకకుండుట శ్రేయస్కరము. బాబా భౌతికతనువునందున్న కాలముననే బాబానుగూర్చి, శ్రీసాయిా భక్తప్రచారకులనుగూర్చి, నిరాదరణబుద్ధితో హేళనముఁ గావించినవారు- బాబాను అవహేళన జేయుటకై చేరినవారు కలరు. అటులఁజేరినవారు సంపూర్ణముగ హృదయపరివర్తనముఁబొంది, బాబాను విడనాడఁజాలక మాతుకొనిన వారలునుకలరు. ఉదాహరణార్థము- బాలాసాహెబ్ భాటే- (మామ్లత్ దార్) వృత్తాంతము- [చూడుడు. Life of Sai Baba Vol. IV Pages 24,25, 26] [2] ఏమిా, నిన్ను పేక్షింతునా 35 ప్రకరణమ్ము అనుగ్రహలీల-29 (a)] ♦ భాటేద్వేషంసమాకృష్య భక్తింతస్మై- ప్రదత్తవతే నమః (బాబా సహస్రనామావళి)

బాలాసాహెబ్ భాటే— కోపర్గాం మామ్లత్ దార్— బాబా యందు ద్వేషము గలిగి, బాబా ఆశ్రితులను- బాబాను హేళనముచేసి నవాఁడు. తుదకు ఆతండ్రి అనుగ్రహమున బాబా భక్తులలో నగ్రశ్రేణికిఁ జెంది, జీవితపర్యంతము శ్రీ సాయీప్రభువునందు గాఢభక్తి నెఱపి ఉత్తమలోకప్రాప్తి నొందినాఁడు. ఎవరో కొందఱు బాబాను నిరాదరించుచున్నారని బాబా భక్తిప్రచారము మానరాదు. శ్రీసాయీ మహాప్రభువు నేటికి యిఁకేనాటికిఁ దన ఆశ్రితకోటిని అనుగ్రహించి, శుభ్రస్నిగ్ధమార్గమున నడిపించి, వారాజీవితమున పురోగమింపఁగల యంతదనుకఁ గొనిపోవుచు నేయున్నాఁడు. ఎన్నిజన్మములకేని ఆశ్రయించిన బిడ్డను విడువఁడు.

కావున శ్రీ సాయీప్రభువు మహత్త్వమును— ఆతండ్రి తన బిడ్డల ననుగ్రహించు విధానములనుగూర్చి ప్రచారముచేయుటలో నెట్టిలోపములేదు. బాబా అనుగ్రహపాత్రుఁడైనవాఁడు- ఆతండ్రిచే ప్రేరేపింపఁబడినవాఁడు 'శ్రీ సాయీభక్తి'-ప్రచారముఁ జేసితీరవలయును. చేయవలసినదే—

పూజ్యశ్రీ. B.V. నరసింహాస్వామిగారు. 1935 ప్రాంతమున మద్రాసునుండి వెలువడు "Sunday Times"- అను ఆంగ్ల వార పత్రికయందు (దక్షిణాదిస్వామి) Sorutheru Swamy - పేర శ్రీ సాయీబాబానుగూర్చి పెక్కువ్యాసములనువ్రాసి ప్రచురించినపుడు- ఉపాసనీమహారాజుద్వారా శ్రీ సాయీప్రభువే శ్రీ నరసింహాస్వామి గారిని ఆకర్షించి, శ్రీసాయీభక్తి ప్రచారకార్యమును నిర్వర్తింపఁజేసి కొనుచున్నాఁడను విషయము గ్రహింపఁజాలక శిరిడిలోని శ్రీసాయీ సంస్థాన ధర్మకర్తలు భ్రమపడి, శ్రీ నరసింహాస్వామివారి స్వార్థపరత యిందేదో కొంతగలదని శ్రీ స్వామిగారు కావించుచున్న శ్రీ సాయీ భక్తి ప్రచారమునుగూర్చి విరుద్ధములగు ప్రకటనములను గావించినారు. కాని, 1940 సంవత్సరమున బాబా తన భక్తి ప్రచారకార్యమునకు-

ఆ పరిచారనిర్వహణమునకై పెద్ద మొత్తమూధనము శ్రీ నరసింహ స్వామివారి చేతులంగీకరించ జేసి తోడ్పడినారు. అదిమొదలు ఎల్లర ఆక్షేపణములు శమించి శ్రీసాయీ భక్తిప్రచారము విరివిగసాగి దేశ మందంతట ప్రసిద్ధమైనది.

[చూడుడు! ఏమీ,నిన్ను పేక్షింతునా? 44వ ప్రకరణము అనుగ్రహాలీల- 88. పూజ్యశ్రీ.బి వి. నరసింహస్వామిగారి[Founder] and Parsident A.I.S.S. Mylapore Madras4వృత్తాంతము]

హేమాద్రిపంతు (అన్నాసాహెబ్ దభోల్కర్) మరాటీభాషలో రచించిన 'సచ్చరిత్రను' గుణాజీ ఆంగ్లమున పరివర్తనముచేసిన దానిని శిరిడిలోని శ్రీ సాయీసంస్థానము ధర్మకర్తలు ప్రచురించిన పిదప శ్రీ గణూదాస్ మహారాజ్- శ్రీ B.V. నరసింహస్వామివారియెడ శ్రీ సాయీ సంస్థానము- శిరిడి- వారికిగలిగిన భ్రమ- భేదాభిప్రాయములు పూర్తిగ శమించినవి, తమ పొరపాటును సరిదిద్దికొనినారు.

అదిమొదలు శ్రీ నరసింహస్వామిగారు కావించుచున్న శ్రీసాయీ భక్తిపరిచార విధానములనుగూర్చి, అటులఁ గావించునది శ్రీ నరసింహ స్వామిగారి నొక ఉపకరణముగఁ గావించుకొని, దయామయుఁడైన శ్రీ సాయీనాథుఁడే కావించుకొనుచున్నాఁడని శ్రీశిరిడిలోని శ్రీసాయీ సంస్థానము ధర్మకర్తలు- తదితరులు గ్రహించగలిగిరి. దీనికి నిదర్శన ముగ నెల్లూరు- కాకినాడ- కోయంబత్తూరు రామచంద్రపురము (తూ.గో.జిల్లా) తోటపల్లికొండలు- [ప్రశాంతి ఆశ్రమము] మొదలగు ప్రదేశములలో శ్రీసాయీ మహాప్రభువు నేటికి నెటుల ననుగ్రహించు చున్నది భక్తులకువిదితము అగుచున్నది. ఆనాఁడేకాదు- శ్రీసాయీనా థుఁడు- నేటికి ఇఁకేనాటికి సర్వవ్యాపియై ఆశ్రితులగు భక్తుల ప్రార్థన లను మన్నించి అనుగ్రహించుచు తననిత్య సత్యస్థితిని నిరూపించుకొను చున్నది సోదరీ సోదరభక్తుల కెల్లరకు విస్పష్టమగుచున్నది.

## 3. శ్రీసాయిబాబా నైతికప్రబోధములు.

శ్రీ సాయిబాబా నైతికప్రబోధలను కావించినాడా? మోక్షమార్గము నుదెలిపిన గురువా?- అని ప్రశ్నించినవారికి సరియగు సమాధానముఁ జెప్పుట మిక్కిలి కష్టము. తుదిక్షణమువరకు బాబా తన మహత్త్వమునుగాని వ్యక్తిత్వ- సహజ స్వభావములనుగాని, తన చర్యలనుగాని జనసామాన్యదృష్టికి విశదపఱచినవాఁడు కాఁడు. ఏకొలఁది మంది- అంకితసంతతికిఁ జెందినవారుమాత్రమే కొంతవరకు బాబా మహత్త్వమును గుర్తించి, ఆతండె సమర్థసద్గురువు- ప్రబోధకుఁడు- సర్వాసియంత- అనువిషయమును గ్రహింపఁగలిగిరి.

"జోసమచ్చా అంకితజీవప్రాణా
తయాంచ ఆసేభార నిరంజనీలా. [ఆరతిగేయము]

[సద్గురువుచే అంకితసంతతిగ గుర్తింపఁబడినవారి సకలభారములు ఆసద్గురుదేవునిచేతనే భరింపఁబడుచుండును] ఆవిషయములు మిక్కిలి గోప్యములగుటచేత అప్పుడు-ఇప్పుడుఁగూడ-బాబా కావించు బోధలేవి? ఆయన స్థాపించినమతమేది? ఇత్యాదిప్రశ్నలు- బాబాశక్తి సమర్థతలు జనసామాన్యమునకు అజ్ఞాతములగుటచే ఈ ప్రశ్నలు దయించుచునే యుండును.

బాబా భక్తుఁడైన 'రఘు' తదితరులు శిరిడిలోని విరోధివర్గము వారిచే అన్యాయముగ నిందమోపఁబడి చెరయందుంచఁబడిన వారి విషయమున S.B. ధుమాల్ పని కల్పించుకొని అహమ్మదాబాద్ జిల్లా- మేజస్ట్రేటువలన బంధవిముక్తులఁ గావించిన వృత్తాంత- చూడుడు [S.C.S. Para 404] (ఏమీ, నిన్ను పేక్షించునా? 18 ప్రకరణము- అనుగ్రహలీల- 13. రావుబహద్దూర్ యస్. బి. ధుమాల్ వృత్తాంతము చూడుడు.)

ఆసందర్భమున జిల్లా మేజస్ట్రేటు ధుమాల్ నుచూచి, [1911లో] బాబా కావించు ప్రబోధము లేమి? అని ప్రశ్నించెను. 'బాబా తనను జేరువారికి అనుగుణములగు బోధలను గావించువాఁడు. బాబా బోధలను దెలిసికొనవలయుననిన అతఁడే [జిల్లా మేజస్ట్రేటు] బాబా దగ్గఱకు స్వయముగ వెళ్ళి గ్రహింపవలయును.'' అని ధుమాల్ సమాధాన మిచ్చెను అవిధముగ సత్యజిజ్ఞాస- ఋజుబుద్ధి- ఆసక్తిలేక బాబా కావించు బోధలనుగూర్చి ప్రశ్నించువారు పలువురుగలరు.

అట్టివారికిఁ దెలుపఁదగినది, 'తీవ్ర ఆసక్తిగలిగి, బాబాభక్తులను జేరి. వారిద్వారాగాని, బాబాను గూర్చి రచింపఁబడిన సద్గ్రంథములు 1, బాబా జీవితచరిత్రము- LIFE OF SAI BABA- ఏమీా, నిన్ను పేక్షింతునా?- 2. శ్రీ సాయీసచ్చరిత్ర. 3. శ్రీ సాయీబాబా అభయప్రదానములు- సూక్తులు- (Gospel of Sai Baba)- శ్రీసాయీనాథ బోధామృతము, మొదలగు గ్రంథములను పఠించి తెలిసికొనఁదగును'- అనిమాత్రమే ఆ గ్రంథములను శ్రద్ధతోఁజూచిన బాబా విషయమున వారికిఁ గొంతవరకు బోధపడును. కాని అందరు ఆగ్రంథములను సావధానబుద్ధితోఁ జదివి గ్రహింపఁజాలరు కావున నట్టివా బాబానుగూర్చి తెలిసికొనగోరువారికి, బాబా భక్తులైనవారు తెలుపఁదగును.

శ్రీ సాయీనాథుఁడు ఏ నూతనమతమును స్థాపించినవాఁడు కాఁడు. 'మతము'- అనునది- సంకుచితమగుటచేత- సకలవిశ్వమునకు సమన్వయింపదు- ఈజగమునగల సకలమతములు శ్రీ సాయీప్రభువునకు సమ్మతములే. శ్రీసాయీబాబా సంపూర్ణమైన దైవీసంపదలు గలిగి, ఉత్తమోత్తమస్థాయికిఁ జేరినవాఁడు, కావున బాబా ఆశ్రితులగువారు ఆతండినిగూర్చి యేదో కొంతవరకు గుర్తింపఁజాలిరి. బాబా శిరిడియందున్న 60 సంవత్సరములకాలమున బాబాను పలువురు ఆశ్రితులు సమాశ్రయించి, బాబావలన వారుపొందిన ఫలములను [లౌకిక

పారలౌకికముల) వారు గ్రహించిన విషయములన్నిటిని సమకూర్చుకొని పరిశీలించిన బాబా కావించిన ప్రబోధములకు- ఆతండు తనశిష్యులను చక్కదిద్దిన విధానములును మనకు కొంతవరకు విశదములుకాగలవు. వానినన్నిటి నిక్కడ వివరించుట సాధ్యములుకావు. కావున మచ్చునకొకటిరెండు విషయములను బేర్కొంటిని. పైన పేర్కొనబడిన గ్రంథములను పరిశీలించు పాఠకులు శ్రీ సాయిప్రభావమునుగూర్చి విపులముగఁ దెలిసికొనఁగలరు.

1936—37నందు పూజ్య శ్రీ బి.వి. నరసింహస్వామిగారు శ్రీరామకృష్ణ పరమహంస ఆశ్రమము [మద్రాసు] నందున్న సమయమున ఆ ఆశ్రమఅధ్యక్షుఁడు "శ్రీసాయిబాబా ఒక ఇంద్రజాలకునివలె యేవేవియో చమత్కారములు ప్రకటించినాఁడుగదా! వానివలన నేమి ప్రయోజనమో? నాకర్థముకాలేదు— వానిమూలమున బాబా కావించిన బోధలేవో తెలియుటలేదు. బాబా మార్గమేదియై యుండవచ్చును?"- అని స్వామివారిని ప్రశ్నించెను. స్వామివారి కేమియుఁదోఁచక బాబాను ప్రార్థించినాఁడు. బాబా అనుగ్రహమున స్వామివారికి సమాధానము స్ఫురించినది. 1936 ప్రాంతమున స్వామివారు బాబానుగూర్చి ఆంగ్లమున Sunday Times పత్రికయందు వ్యాసములను రచించినాఁడు. ఎంత నేర్పరియైనను అన్యభాషలో తనభావములను అవితథముగ విశదపఱుపఁజాలఁడు.- కావున స్వామివారికి మాతృభాష తమిళమున శ్రీ సాయిచరిత్రము రచింపఁదగుననను సంకల్పముకలిగి ఆరచనమున కుపక్రమించినాఁడు. తోడనే బాబానుగూర్చిన వివిధ విషయములు మెఱపు మెఱసినటులాయనకు విశదములయ్యెను.

బాబా కేవలము బోధలనుగావించు గురువు మాత్రమేకాఁడు. సంపూర్ణ శరణాగతిఁజేసి సమాశ్రయించిన బిడ్డలను తుకారాం పలికినటుల "అపనాసరిఖా కరితత్ కాత్" తనకు సమానులుగఁదీర్చి చక్కదిద్దగల సమర్థసద్గురువు- పరమభాగవతోత్తముఁడు- అనుభావము

స్వామివారికి విశదమైనది. ఆవిధానము సమర్థసద్గురువగు శ్రీ సాయీ బాబాయొక్క సమస్తశక్తులు- సంపూర్ణ దైవీసంపద్విశేష జనితములగు సకల యోగమహిమలు తన ఆశ్రితులం దీర్చి సరిదిద్దుటలో నొక అంతర్భాగములే యైయున్నవి- అను సత్యవిషయము స్వామివారికి స్ఫురించినవి.

ఇఁక బాబా మార్గమేదియో బాబా స్వయముగ పలికిన పలుకులవలన- బోధలవలన మనకు విస్పష్టమగుచున్నవి. [S.C.S, 59]

ఉద్ధవేశ్ భావ్ బాబానుచేరి మ్రొక్కగా తాను పూర్వమున ఉద్ధవునకుఁదెలిపిన- కృష్ణుడు తెలుపుచున్న విషయములుగల పురాణము చదువవలెనని ఆశించెను. ఉద్ధవేశభావునకు బోధపడలేదు. అది గ్రహించి, బాబా "నా తేవాడలో పఠింపఁబడుచున్న గ్రంథమును తీసికొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను. అది శ్రీ మద్భాగవతమున ఏకాదశస్కంధము [ఏకనాథవ్యాఖ్యకలది] దానిని గొనివచ్చినపిదప బాబా అదాటున ఆగ్రంథములో తనవ్రేలును జొనిపి తెఱచెను. ఉద్ధవేశభావును చూడుమనెను. అందు ద్వాపరయుగమున శ్రీ కృష్ణుఁడుగఁ దాను ఉద్ధవునకుఁ దెలిపిన బోధలనే కలియుగమున ఉద్ధవేశభావునకుఁ దెలుపుచున్నటుల బాబా విశదపఱచెను. శ్రీమద్భాగవతము- ఏకాదశస్కంధమున శ్రీకృష్ణోద్ధవసంవాదమే ప్రధానమైనది- దీనినే "ఉద్ధవగీతలు-" అందురు. కావున బాబా శ్రీకృష్ణుఁడేయని ఉద్ధవేశభావ్ గ్రహించినాఁడు.

"మైఁ అల్లాహూఁ" అను బాబా పలుకు లీసత్యమును విదితముఁజేయుచున్నవి. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" [బ్రహ్మము నెఱిఁగినవాఁడు బ్రహ్మమేయగును- (శ్రుతి) ఇది ఆధ్యాత్మికసత్యము. ఈవిషయము స్ఫురించినతోడనే శ్రీ నరసింహస్వామిగారికిగల సంశయము విచ్ఛేదమై, బాబానుగూర్చి తనను ప్రశ్నించువారికి, వాదించువారికి,

సందేహముల వెలిబుచ్చువారికిఁ దెలుపఁదగు సమాధానము బోధ పడినది.

బాబా బోధలేవి? అనిన శ్రీమద్భగవద్గీతలోని బోధలే బాబా బోధలు. అర్జునగీత- ఉద్ధవగీత- ఇత్యాదులు- బాబా మార్గమేది? అనిన గీతలందు దెలుపఁబడిన మార్గమే బాబా తనభక్తులకుఁ జూపిన మార్గము. అనగా అన్నిమార్గములు బాబా మార్గములే. అన్నిమార్గములు దైవమును జేర్చితీరును- అనుబోధయే బాబా బోధ. బాబా సిద్ధాంతమేది?- అనిన ఒకవ్యక్తియొక్క- మతసిద్ధాంతమును పరికీలించిన అది సంకుచిత- భావప్రేరితమైయుండును. శ్రీరామ- శ్రీకృష్ణ- శ్రీ సాయిబాబా మొదలగు సత్పురుషులు దైవీసంపత్ప్రపూర్ణులు- సంపూర్ణ అవతారులు- ఋణానుబంధమున తమ్ముఁజేరి సమాశ్రయించు భక్తులను- తమకు సంబంధముగల జీవులను సముద్ధరించుటయే వారి జీవితాశయములు- సిద్ధాంతములునగును. కావున శ్రీ సాయిబాబా మతసిద్ధాంత మేయొక్కటియోకాదు. అన్ని మత సిద్ధాంతములు బాబా సిద్ధాంతములే అన్నిమతములును బాబాకు సమ్మతములే యనదగును.

"పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే [భ.గీత. 4-8]

సాధుజనసంరక్షణము- దుష్టజనశిక్షణము [దుష్టహృదయ పరివర్తనము] సనాతనధర్మ సంస్థాపనము- అవతారపురుషులకార్యములు- శ్రీ సాయినాథుఁ డీకార్యములనే సంఘటిల్లఁజేసినాఁడు.

ఈగీతల నన్నిటిని ప్రవచించిపోయిన అవతారపురుషుల మతసిద్ధాంతమువేమి?- అని ప్రశ్నఁజేయుట అర్థరహితము. సాధు సత్పురుషులు అన్నిమార్గములు-లేక అందు కొన్నిమార్గములు- (ఆయా దేశకాల పాత్రానుసరణముగ) విశదపఱతురు, వారిని సమాశ్రయించిన భక్తుల కేదిహితమో- శ్రేయస్కరమో దానిని అనుసరింపుమని నియమిం

తుడు. బాబా ప్రతిపూర్ణముగ వివరపఱచెను. కేవలము వేదశాస్త్రాది గ్రంథములతో తృప్తిపడక పరతత్త్వము— పరమాత్మ— ప్రతిజీవియం దును అధిష్ఠించియున్నాడు— అను ఎఱుక తనవారికిఁ గలిగించుటయే బాబా బోధలలో ప్రాధాన్యతవహించినది. బాబా తనకభిముఖమైన ప్రతివ్యక్తిని ఉద్ధరించువాఁడే. బాబానుండి స్వీకరించు తలంపుతో జేరిని 'వాలంబి' (స్టేషన్ మాష్టరు) వంటి వారివిషయమున బాబాయేమి చేయఁగలఁడు? (S.C.S. Para 131 చూడుడు)

తఱచుగ బాబా తన గురువునుగూర్చి తెలుపుచుండువాఁడు. తనగురువు తనకు సంపూర్ణముగ ప్రసాదించెననియు తననుసమాశ్రయిం చుచు బిడ్డలను సంపూర్ణముగ ననుగ్రహింతుననియుఁ దెలిపినాఁడు— [S.C.S. Pera 40-45]

ఋజుబుద్ధితో సమాశ్రయించువారలకు ఐహికసుఖభోగము లేకాదు— ఆధ్యాత్మిక సుఖశాంతులను ప్రసాదింతునని బాబా తెలిసి నాఁడు.

"అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవసమంతవ్యః సమ్యగ్వ్యవసితోహిసః" [భ.గీత. 9-30]

ఎట్టి దురాచారుఁడైనను నాయందు మనస్సునిలిపి సేవించునేని వాఁడు సాధువు— మంచివాఁడు— అనియే భావింపఁదగును. ఏలన— వాఁడు సక్రమమార్గమునకు మఱలినవాఁడు. కావున సత్ప్రవర్తనప రుఁడై ఆధ్యాత్మికాభ్యున్నతినిఁ బడయఁగలఁడు.

శ్రీ సాయీప్రభువు తనను సమాశ్రయించిన దురాచారులైన వారినిఁ జక్కదిద్దినాఁడు. బాబా చక్కదిద్దిన 'సుదురాచారులు'— పలు వురుగలరు. ఉదాహరణార్థము. D.V. సంబారే వృత్తాంతముగనుఁడు! ఈతనిని త్రాగుడు దురభ్యాసమునుండి మరల్చి చక్కదిద్దినాఁడు (S.C.S. Pera 292-A) [Life of Sai Baba Vol. IV pages 38-

39-40] బాబా మహాసమాధి తరువాతనేనియు బాబాను సమాశ్రయించి మేలుపొందినవారు లక్షలుగలరు. వీరినందఱను చక్క దిద్దుట సామాన్యమైనపనికాదు.

[S.C.S. Para 153-చూడుడు!] 'నేను చాల కాలమునుండి యోజించుచున్నాను- అందఱుదొంగలే- కాని అట్టివారి తోడనే మనము మెలఁగకతప్పదు. అట్టివారినిఁ జక్కదిద్దుమని రేయింబవళ్ళు 'అల్లా'ను బ్రార్థించుచున్నాడను, నాప్రార్థన మంగీకరించుటలేదు, ఒకటి రెండు నెలలు వేచి చూచెదను.జీవించియున్నను అసువులఁ బాసినను నా ప్రార్థనము తప్పక మన్నింపఁబడును. నేను వారిని 'వీరినిఁజేరి ప్రార్థింపను. జనులు సాధారణముగ ఋజువర్తనులు- సాధులుకారు. చాంచల్యమనస్కులు. ఏ కొలఁదిమందియో చేరి సద్విషయములఁ బ్రస్తావించుకొనుచు ఆధ్యాత్మసాధనలఁ గావింతురు" ఆవిధముగ 1918 లోను బాబా తెలిపినాఁడు. 'జనులు అల్పులై బాధలను గలిగింతురు. ఐహిక భోగ ధనాదులకొఱకు నన్ను బాధించుచున్నారు. వారికి సిగ్గులేదు. నాకు విసుగు జనించుచున్నది'- అని తెలిపినాఁడు.

బాబా తాను గావింపఁదలఁచినపనిని సక్రమపద్ధతిని నిర్వర్తింపఁ జేయుటకు ఉపాసనీమహారాజువలన ఆశించినాఁడు. 4 సంవత్సరములు శిరిడి యందుండుమని ఆజ్ఞాపించినాఁడు. ఆతని పాపపురుషుని దగ్ధము గావించినాఁడు, కాని, ఉపాసనీమహారాజు ఆశయము వేఱైయున్నది. బాబా అనుగ్రహమున నతఁడు కొన్నిసిద్ధులను బడసెను. నియమిత కాలమువరకు శిరిడి యందుండక 3 సంవత్సరములు మాత్రమందుండి, బాబా సెలవుతీసికొనక- తుదకు- 'వెళ్ళుచున్నవాడను'- అనియేని తెలుపకయే- శిరిడి విడిచి వెళ్లెను.

ఋణానుబంధమునఁజేసి ఆశ్రయించినవారిని బాబా వారా జీవితమున నెంతవరకు ఆధ్యాత్మికముగ పురోగమించగలరో అంతవరకు

నియమితుఁడైనాఁడు. అతనికి పలువురు విద్యాధికులైన మిత్రులు ఉద్యోగస్థులు కలరు. అతనిమిత్రులు సహపాఠులు తఱచుగ శిరిడికి వెళ్ళి బాబాను సందర్శించి వచ్చుచుండువారు. వారి రాకపోకలు కోపర్గాం మీఁదుగ జరుగుచుండును. ఆకారణమున తమ మిత్రుఁడైన భాటేను తఱచుగఁ గలియుచుండురు. వారినిఁజూచి, భాటే—'మీరెంతచదువులు చదివినది ఒక పిచ్చిఫకీరును చూచుటకేనా?'— అని అధిక్షేపించి, వారిని, బాబాను అవహేళనము చేయుచుండువాఁడు 'నీవును ఒకపర్యాయము బాబాను దర్శింపుము!'— అని వారు చెప్పినను నిరాదరణ- అవహేళనము చేయువాఁడు.

1909లో భాటే— తనఉద్యోగము పనిమీఁద శిరిడీ కొన్నాగ్రామమగు 'రహాతా'కు వెళ్ళి అచట పనిని పూర్తికావించుకొని, ఆతని పురాకృత సుకృతమువలన శిరిడికిఁజేరి, బాబాను సందర్శించెను. ఆ సంఘటనము— అటుల బాబాను సందర్శించుటయు నాతని ఇచ్ఛకాదు, అది బాబా ఆకర్షణశక్తియే— ఏజీవి నెప్పుడు అనుగ్రహింపఁదగునో దయామయుఁడైన ఆతండ్రికే యెఱుక.

బాబాను సందర్శించినతోడనే ఆతండ్రి కటాక్షవీక్షణ మాతనిలో నొక అద్భుతమైన పరివర్తనము కలిగించినది- అరగంట- గంట- రెండుగంటలు- మూఁడుగంటల కాలముగడచినను బాబాను విడువఁదలచినవాఁడుకాఁడు. ఆతని వెంటవచ్చిన వారలెంతో బలవంతముమీఁద ఆతనిని శిరిడికి గొనిపోయినారు. తనను నిరాదరించి అవహేళనము జేసిన 'భాటే' మనస్సును బాబా తనవైపునకు మరల్చుకొనినాఁడు-తనయందనురాగము రేకెత్తించినాఁడు. బాబా— ఆసమయమున రెండు మూఁడు దినములవరకు భాటే శిరిడివిడిచి వెళ్ళలేకపోయెను, ఆతఁడు తన జీవితాశయము- లక్ష్యము— గమ్యము శ్రీ'సాయీబాబా' అని గుర్తించినాఁడు. బాబా సన్నిధియందే యుండఁదలచినాఁడు. భార్యా— బిడ్డలు— ఉద్యోగము— ఆస్తి మొదలగునవియన్నియు ఆతని మనస్సు

నుండి తొలఁగిపోయినవి. ఆతనిదృష్టిలో శేషించినది. ఏకైకవస్తువు-శ్రీ సాయీభగవానుఁడొక్కఁడే.

తరువాత శిరిడివిడిచి వెళ్లినను మరల వెంటనే తిరిగి శిరిడికిఁజేరి నాఁడు. సెలవులేకయే- ఉద్యోగధర్మములను పాటింపకయే శిరిడియం దుండెను ఉద్యోగవిధులు- సంసారము ఆతని మనస్సునలేవు. ఆతని కొఱకు సెలవువా్రియించి; ఆయనచే సంతకముపెట్టించి, పైయధికారు లకు పంపించుఁడని బాబా తన భక్తులగు చందోర్కర్ మొదలగువారికి జెప్పెను. వారటులగావించిరి. భాటేకు సెలవుపెట్టవలయునను తలం పేనియులేదు. ఆతని జీవనాధారమైన ఉద్యోగమునందు ఇచ్ఛయు నశిం చినది. ఆజిల్లాలోని మామ్లత్దారులందఱకంటె ఉద్యోగధర్మములను నిర్వర్తించుటయందు- మిక్కిలి సమర్థుఁడై జిల్లాకలెక్టరు మెప్పుపొం దినవాఁడు. బాబా ఆతని ననుగ్రహింపఁదలఁచినాఁడు.

భాటే శిరిడికిఁజేరిన ఏవ నాఁడు బాబా ఒక కావివస్త్రమును ఆతనిభుజములపై కప్పెను. దానితో నతని హృదయపరివర్తనము సం పూర్ణమయ్యెను. ఈవిషయము 1913లో శిరిడికిఁజేరిన ఆతని సహాపా ఠియు- మిత్రుఁడునగు G. K. గార్డే [ఖామ్‌గోఁవ్-సబ్‌జడ్జి]తో వివరించి నాఁడు. భాటే విషయమున నతని మూర్ఖత-భౌతికదృష్టి యేవిధములైన నైతికబోధలచే మార్పునొందినదికాదు, బాబా అనుగ్రహావిశేషమున భాటేకుఁ గలిగిన ఆంతరంగిక పరివర్తనమే. ఆతని పురాకృత సుకృత విశేషమే.

* భాటేద్వేషం సమాకృష్య భక్తింతస్మై ప్రదత్తవతే నమః
(శ్రీసాయీ సహస్రనామావళి)

బాబా కావించిన యిట్టి హృదయపరివర్తన వృత్తాంతము లనేక ములుగలవు. నైతికబోధలను నోటిమాటల రూపమున బాబా తన బిడ్డలకు తెలిపియుండలేదు. వారివారి అనుభూతుల రూపమునసే

మెలుకపలచినాఁడు. ఆనాఁడు ఈనాఁడు నిఁకేనాఁడును బాబా విష యమున ఇదేవిధము. బాబా భక్తుల వృత్తాంతములలోని నైతికబోధన రూపములైన విషయములన్నియు- లౌకికములుగాని- పారలౌకికములు గాని, వారివారి హృదయప్రవృత్తులను చక్కదిద్ది ఆధ్యాత్మికముగ వార లను పురోగమింపఁజేయ సమర్థములైనవి. అవి కేవలము ఆబిడ్డలను ద్దేశించి తెలుపఁబడెనవిమాత్రమే అని మనము తలంచరాదు.అవి సార్వ కాలికములు— సర్వమానవులనుద్దేశించి తెలుపఁబడినవిగ మనము గుర్తించుకొనవలయును. బాబా సన్నిధానము— దృష్టి- స్పర్శ- వాని వాని ప్రత్యేకములైన అమోఘశక్తులు వానికిఁగలవు.

నారాయణఆశ్రమ్ [సన్యాసి] తెలిపినట్లు బాబా తనబిడ్డల మస్తకములను నాలుగైదువిధముల స్పృశించువాఁడు, ఒకసమయమున భక్తుని శిరమును మెల్లగ తాకుచున్నటులుండును. ఒకతఱి తనవాని శిర మునుండి యేదియో పిండివైచుచున్నట్లు పిసుకును ఒకయెడ తాకకయే తనచేతిని శిరమునకు పైన నుంచువాఁడు. ప్రతివిధానమున బాబా సం కల్పము ననుసరించి దేనిశక్తి దానికిఁగలదు.

సదాశివతార్కాడ్ సతి— మొదలగువారు తెలిపినటుల బాబా చూపులలోనే ఒక అద్భుతశక్తికలదు. తన ఆశ్రితునివంక చూపునిలిపిన మాత్రమున ఆతనిలోని విషయములన్నియు బాబా గుర్తించుచున్నటు లుండును. బాబానుండి దాచఁదగిన ఆంతరంగికవిషయము లేవియు లేవని వానికి స్ఫురించును. బాబా తనవాని హృదయాసీనుఁడు మాత్ర మేకాదు. తనవాని దేహమందంతట నావరించియున్నాఁడు. భౌతిక తను వున బాబా ఉన్నపుడేకాదు, నేటికిని ద్వారకామాయి మసీదునందుఁ గల బాబా చిత్రపటమునను- ప్రతిగృహమునఁగన శ్రీసాయీ మహా ప్రభువు చిత్రపటమునందు— ఈచూపుయొక్క అద్భుతశక్తి విశదమగు చునేయున్నది.

G.B. దాతార్ [ధార్వా ప్లీడరు] ఒకపరి బాబాను దర్శించెను. అతఁడు లౌకికాభిమానుఁడు. కావున తనను బాబా దక్షిణలడుగునని జంకువాఁడు. 'ఖేడ్‌గాఁవ్'లోని నారాయణమహరాజు తనకు ఆశ్రితు లర్పించు దక్షిణను తిరిగియిచ్చుచు కలకండప్రసాదము పెట్టువాఁడు'- అని అతఁడు తలంచుచుండువాఁడు. ఆదాతార్ 1931లో 'శ్రీసాయీ చరిత్రము'- ఉపాసనీలీలామృతము- చదివిన పిదప శిరిడీకి వెళ్ళి ద్వారకామాయి మందిరమున బాబా చిత్రపటమున బాబా నేత్రములను చూచినాఁడు. ఆచిత్రపటములోని బాబా నేత్రములందుగల అద్భుతశక్తినిగమనించి 'బాబా ఒక్కఁడే నాప్రభువు- గురువు'- అని ప్రకటించుకొనినాఁడు. నైతిక- ఆధ్యాత్మికసుగుణ సంపదలకు- ధ్యాననిష్ఠకొఱకు చిత్రపటమునందలి బాబా నేత్రములందు దృష్టినిలుపువారు అట్టి అభిప్రాయమునే వెలిపుచ్చుదురు.

శ్రీ సాయీప్రభువు పలువిధములుగ తన ఆశ్రితులగు భక్తుల హృదయక్షేత్రములందు వారలకెఱుక పడనీయకయే నైతిక- ఆధ్యాత్మికబీజముల నాటువాఁడు, అట్టుల లౌకికఫలసిద్ధి నొందువాఁడు బాబా యందు గాఢభక్తి విశ్వాసములను- ప్రేమగౌరవములను గలిగియుండువాఁడు, అటుల నైతికఆధ్యాత్మిక బీజములను తనవాని హృదయక్షేత్రమున నాటిన ఆతండ్రియే ప్రేమామృత రససేచనమున ఎరువువేసి పోషించిపెంచి దానిని మహాభక్తి విశ్వాసవృక్షముగ రూపొందించువాఁడు. కేవలము లౌకికకామిత ఫలసిద్ధికై బాబాను ఆశ్రయించినవాఁడును క్రమక్రమముగ మహోన్నత ఆధ్యాత్మికస్థాయికిఁ జేరుకొనజాలినాఁడు, ఇట్టివి నైతికబోధలనఁగరాదు- నైతికాభ్యున్నతికి నైతికోన్నతస్థాయికిఁ జేర్చుటలే- చేరుకొనుటలేయగును. బాబా తనబిడ్డలకు గావించిన నైతికశిక్షణలు అనంతములు,

బాబాబోధలు సర్వసామాన్యములే. వానినన్నిటి నేర్చికూర్చి పిల్లలచూచి వ్రాతపుస్తకములందు ప్రతిపుటముపైన వ్రాయఁబడ

'బరపడిపంక్తుల'వలె నుండును. ఎల్లరకుఁ దెలిసినవాని నేకరువుపెట్ట నేల?- అని అనవచ్చును. కాని, బాబా క్రొత్తలు- అద్భుతములనేవి యు బోధించినవాఁడుకాఁడు. బాబా తెలిపిన మిక్కిలి పురాతనము లైన నైతిక- ఆధ్యాత్మికసత్యములే. కాని, వేఱుకాదు. అవి ప్రతివ్యక్తి హృదయఫలకమున నొక్కపిడి గావింపఁబడి దైనందిన జీవితాచరణమున పాటింపఁదగినవి. కావున బాబా తమను అవకాశము గలిగినపుడు- సందర్భోచితముగ తనవారియెదుట నుంచినాఁడు. అట్టి వానిఁ దెలిసికొన నుత్సహించు సాధకులకుఁ దెలుపఁదగును. బాబా కావించిన నైతిక ఆధ్యాత్మిక బోధలను కేవలము ఉత్సుకతతో చదివి ఆపల పారవేయక శ్రేయస్కాములగు సాధకులు [పాఠకులు] వానిని శ్రద్ధతో పఠించి, గ్రహించి, జీర్ణించుకొని, నిత్యాచరణమందు గమనించుచు, వానిని తమలో నంతర్భాగముగ నిముడ్చుకొనదగినవి.

'సంతృప్తి'- 'శరణాగతి'- వీనినిఁగూర్చి బాబా తెలిపెనది గమనింపుడు! భగవానుఁడు మహాప్రభువు- మిక్కిలి గొప్పవాఁడు 'అల్లా మాలిక్' (అరబ్బీపదము)- బాబా నాలుకపై ఈపదమెప్పుడు వర్తించుచుండును. జనులు బాబాను 'గొప్పవాఁడవు'- అని శ్లాఘించినపుడు 'దైవము ఎంతగొప్పవాఁడు ! ఆప్రభువుతో నెవ్వరు సాటిరారు. సృష్టించి, పోషించి, లయము గావించువాఁడా మహాప్రభువు. ఆతండ్రి లీల లవేద్యములు- ఆస్వామి మనల నిలిపినటుల నిలిచి సంతృప్తి సంతోషము లొందఁదగును. మనసంకల్పములన్నియు ఆతండ్రి సంకల్పముల ననుసరింపఁజేయనగును. ఈ విధేయత-సంపూర్ణ శరణాగతి సిద్ధాంతము 'అల్లారఖేగావహిసారహేన'- దైవము నిలుపఁదలఁచినటుల నిలుచుదము. ఏది- యెప్పుడెటుల ప్రాప్తించిన స్వీకరించి సంతృప్తి- సంతుష్టులొందుదము. దేనికిని ఆందోళనము పొందకుము- ఆస్వామి ఆజ్ఞలేక ఆకేనిఁగదలఁజాలదు. మనము ఋజువర్తనము-నిష్కాపట్యము గలిగి సుగుణవంతులమై యుండఁదగును. మంచి చెడుగులను గుర్తింపఁ

దగును. ఎవరివిధులను వారు గుర్తించి, శక్తివంచన లేనివిధమున నిర్వర్తింప నేర్వవలయును— మోహబుద్ధితో మనము కర్తలమని స్వతంత్రులమని, మనమీపనులఁగావించు చున్నారమని తలంపరాదు. సర్వకర్త– ఆదైవమే– ఆ మహాప్రభువు స్వాతంత్ర్యము మనపారతంత్ర్యమును గుర్తించి, సకల కార్యములు ఆస్వామివిగ గ్రహింపవలయును. అటుల ప్రవర్తింతుమేని మనము దేనిచేతను చిక్కుపడక సకలకర్మ బంధవిముక్తిఁ గాంచఁగలము.'– అని బాబా మనకు బోధించినాఁడు.

సకలమత సిద్ధాంతములందు ప్రాధాన్యతవహించు అంశమిదియే. బాబా జీవితమంతయు ఈఆశయముతోడనే ప్రవర్తిల్లినది. బాబా నిరంతరము కార్యనిమగ్నుఁడై యుండువాఁడు. ఇటుల అవిరళకృషి సలుపువాఁడయ్యును 'కర్త' దైవమనియు, తానాభగవానునిచేతిలో నొక ఉపకరణముమాత్రమే అను ఎఱుక గలిగియుండువాఁడు. (S.C.S. Paras 90, 91 చూడుడు) 'దైవముయొక్క సేవకుఁడను నేను– దైవముయొక్క ప్రతినిధులు సర్వత్రగలరు. వారలకు అపారశక్తి సమర్థతలుగలవు. నేను గొప్ప శక్తిసమర్థతలను గలిగియున్న వాఁడను.!– అని బాబా తెలిపినాఁడు. 'నేను కర్తను—' 'నేను చేయుచున్నాను'— అను అహంకారము— అభిమానము— మాత్రము నిశ్శేషముగ నశించవలయును— అప్పుడుగాని ఆధ్యాత్మికాభ్యున్నతి— శాంతిసుఖములు కలుగవు.

శాంతి— సత్యసుఖప్రాప్తికి మఱియొక ముఖ్యవిషయము సకల జీవములందు ప్రేమకలిగి యుండవలయును.

'అద్వేష్టాసర్వభూతానాం మైత్రః కరుణఏవచ' [భ. గీతలు. 12–13]

బాబా నైతికబోధలన్నియు ఆతండుగావించు పనులద్వారా జీవితముద్వారా ప్రదర్శింపఁబడినవి. 'నేను మీయందటునెట్లు ప్రేమించుచున్నాఁడనో మీరు నొండొరులనట్లు ప్రేమించుకొనుఁడు'ఁ అని, బాబా ఒకసందర్భమునఁ దెలిపినాఁడు. బాబా సకలజీవములను ప్రేమించువాఁడు. ఆతండుగావించు ప్రతికార్యము ప్రేమపూరితమైనది. మఱియు

శ్రీసాయీ మహాప్రభువు తనబిడ్డలకిటులఁ దెలిపినాఁడు. [S.C.S.Para 268] 'సకలభూతములను ప్రేమించుఁడు. ఎవరిని ద్వేషించకుఁడు. ఎవరితోడను కలహింపకుఁడు ప్రతీకారబుద్ధితగదు. ఎవరిని నిందింపకుఁడు. నిన్నుగూర్చి యెవరేనికటువులు పలికినను కలతనొందక తొలఁగిపొమ్ము ఎదుటివానిపలుకులు నీతనువున గ్రుచ్చుకొనవు. ఇతరులచెయ్వులు వారినే కలంచునుగాని నిన్ను కలంచవు.'-

బాబా నిరంతరము ఏదోఒక సత్కార్యనిమగ్నుఁడై యుండువాఁడు. అలసత ఎఱుఁగఁడు. బాబా తెలిపినది గుర్తింపుడు. [S.C.S. para 269] "సోమరితనము విడువుము- ఏదోఒక మంచిపని చేయుచుండుము. ఏపనియుఁ జేయఁజాలవేని దైవనామమును స్మరింపుము-సద్గ్రంథములను పఠించుము."

బాబా కావించిన హితబోధలెల్లర కెల్లవేళల సుసాధ్యములు- సులభములైనవి. దుర్బలులు- పామరులు- స్త్రీలు- పిల్లలు ఎల్లరంగీకరించి ఆచరణమందుంచుకొనుటకు సులభములైనవి.

చంద్రాబాయి బోర్కర్‌తో 'అమ్మా! ఎవరితోడను ఈర్ష్య- అసూయ- వైరబుద్ధి కలహస్వభావము వహింపఁదగదు. ఇతరులెవరేని మనలద్వేషించి నిందించిన అట్టి జనకూటమినివదలి నామజపము సలుపఁదగును" అని, బాబా బోధించినాఁడు.

బిడ్డయైన బాపూరావ్ చందోర్కరుతో 'నీతలిదండ్రుల మాటలను పాటింపుము- నీతల్లికి పనులందు తోడ్పడుము- ఎల్లవేళల సత్యమును- కేవలము సత్యమునే పలుకుము.'- అని బాబా హితముఁదెలిపినాఁడు. బాబా సత్యవచనాభిరతి యెల్లరకు విదితము- ఆతండ్రికి స్వార్థప్రయోజనము లేదు, సత్యఋజుపథమునుండి రవంతయేని తొలఁగవలసిన అవసరము లేదు.

M.W. ప్రధానసతి కోపతత్త్వముగలది- 'ఎవరేని మనలగూర్చి పదిమాటలాడిన సమాధానము చెప్పవలసియున్న ఒకమాటతో

సమాధానమీయుము, వదఁటి— కలహము చుటు. ప్రతీకారవాంఛగనుట తగదు 'దెబ్బకు-దెబ్బ'— అనరుము," అని ఆతల్లితో బాబా హితము దెలిపినాఁడు.

శ్రీ సాయీప్రభుప్రుకు అతిబాల్యమునుండి పెంపుడుతండ్రి— గురువు— ఫకీరు— 'శ్రద్ధ'— 'సబూరి' హృదయమున నాదుకొలిపినాఁడు. 'సబూరి'— అనునది ఉత్సాహధైర్యములతోగూడిన కార్యదీక్షయందు 'ఓర్పు'— సమానబుద్ధి— ఓర్పులేనిబిడ్డలకు బాబా సబూరి నాదుకొలుప వలయును. నర్మదాతీరమునగల ఓంకారక్షేత్రము నుండివచ్చిన 'ఉద్ధవేశభావ్' 'నామోక్షగురువు ఎచటఁగలఁడు? అతఁడు నాకెపుడు లభ్య పడును?'— అని, బాబాను ప్రశ్నించెను. 'సబూరి' [ఓర్పు] గలిగి 5 సంవత్సరములు వేచి యుండుము. నీవు తెలిసికొనఁగలవు— రొట్టెనొక్క సారిగ నోటుల మ్రింగఁగలవు?'— అని, బాబా సలహా ఇచ్చెను.

ఉత్సాహముతోగూడిన కార్యదీక్షను హృదయమున నాటఁ జేయుటకై బాబా తన ఆశ్రితుని చక్కదిద్దు విషయమును గమనింపుడు! ప్రార్థన సమాజమునకుఁజెందిన ఒకవ్యక్తి బాబా యందొకింత విశ్వాసముగలిగి, దర్శింప శిరిడికి వెళ్ళుచు, మార్గమధ్యమున నెవరితో డనో (భ.గీతలు II 48-52 శ్లోకములలోఁ దెలుపఁబడిన] స్థితప్రజ్ఞుని లక్షణములనుగూర్చి వాదోపవాదములనుగావించి, అట్టి స్థితప్రజ్ఞలక్షణ ములు బాబా యందుగలవేమో పరీక్షింపఁదలఁచి, కలతఁజెందిన మన స్సుతో బాబానుజేరి, మ్రొక్కెను. శ్రీ సాయీప్రభువు ఆతని మానసికాందోళనమునుగుర్తించి శ్యామా [మాధవరావు దేశపాండే] వంకఁ జూచి, 'శ్యామా! ఈతని నీవెంటఁగొనిపోయి ఏదేని సద్విషయముఁ దెలుపుము'— అని ఆనతిచ్చెను.

ఆప్రార్థన సమాజమునకుఁజెందిన వ్యక్తిని శ్యామా తనగృహ మునకు గొనివెళ్ళి 1. "అసంగతములైన యితరులపలుకులను పాటింప

క్రమ:- 2. నీమనస్సును బాబా పాదములందు లగ్నము చేయుము. సకలము భద్రమగును. 3. ధైర్యోత్సాహములతోఁగూడిన 'ఓర్పు' గలిగియుండుము. నీకు క్షేమముగలుగును"- అని తెలిపెను. వారిరువురు బాబాను జేరినపుడు 'శ్యామా కావించినబోధను పాటించుదము!' అని, బాబా ఆప్రార్థన సామాజికుని ఆశ్వాసించెను.

శ్రీ సాయినాథుఁడు తన ఆశ్రితులందఱను సామరస్య సమన్వయభావములను గలిగియుండుఁడని బోధించువాఁడు. వైషమ్యద్వేషములను విడనాడితిరేని దైవము మిమ్ము రక్షించితీరును- అని బాబా కావించినబోధ బాబా భక్తులలో వారి పరిసరములందు హైందవ-ముస్లిముల కలయికకు- అన్యోఽన్యప్రేమల పెంపొందించుకొనుటకు నెంతయేని ఉపయోగపడును. 'కీడునకు కీడుచేయకుము! కీడునకు మేలు కూర్చుము- ఇతరులమాటలు నిన్ను బాధింపవు'. అని బాబా తెలిపినాడు.

నిరంతరకృషి- సహనములనుగూర్చి బాబా పలుమాఱులు తెలిపినాఁడు. (S.C.S. Pera 290 చూడుడు] 'యోగ యాగతపోజ్ఞాన సాధనకుఁగాని జీవితము వ్యర్థము. నీవు సోమరిగఁగూర్చుండి భుజించుచుందువా? ధైర్యోత్సాహములతోఁగూడిన ఓర్పు గలిగియుండుము'- అని బాబా తెలిపినాఁడు. తపశ్చర్య యెట్టిదో బాబా స్వయముగఁ దెలిపినాఁడు ద్వారకామాయి మసీదునందు 6 అడుగులయెత్తున గుడ్డ పేలికలతో వ్రేలాడగట్టబడిన బల్లపలకపై నిర్ణిద్రుఁడై, కనులు తెఱచి సమాధి నిష్ఠయందుండి రాత్రములందు నామస్మరణతోఁ గడపువాఁడు. నేలమీఁద పరుండునపుడు మహాల్సాపతిని దనప్రక్కన కూర్చుండుమని ఆతనిచేతులను తన [బాబా] హృదయముపైనిలిపి, నిద్రపట్టినటుల తోచినతోడనే మేల్కొలుపుమని బాబా ఆజ్ఞాపించువాఁడు (నిద్రయందు సమాధినిష్ఠయందు హృదయస్పందనములు భిన్నములుగ నుండును.) ఇట్టి కఠినము అసాధారణమగు జాగరణమువలనను-వేలకొలఁది

ఆశ్రితులు దివారాత్రములు ఐనపనికి— కానిపనికి బాబాను బాధించుట వలనను శ్రీ సాయీశుని ఆరోగ్యము చాలవరకు చెడినది.

పెద్దకాలము నిరంతరము సేవచేసిన అబ్దుల్ (బడేబాబా) తో మాత్రమే— 'స్వల్పముగ భుజింపుము— వివిధభోజన పదార్థములకు ఆసింపకుము— ఒకటి— రెండు అనుపాకములతో తృప్తినొందుము. అధికముగ నిద్రింపకుము— పఠించునది ధ్యానింపుము— అల్లాను(హరినామము) స్మరింపుము' అని బాబా బోధించినాఁడు. [దైవప్రాప్తిగోరు ప్రతిజీవ సాధకుఁడును ఈనియమములను పాటింపఁదగును.] పరాపవాదము జీవహింస— ఇతర విపరీత ప్రవర్తనములను బాబా నిరసించువాఁడు.

శ్రీసాయీ మహాప్రభువు సర్వవ్యాపి— సర్వజ్ఞుఁడు అగుటచేత ఎక్కడ ఏమి జరుగుచున్నది తెలిసికొనఁగలఁడు. శిరిడిలో 'సగుణమేరు నాయక్' అంగడిదగ్గఱ పరదూషణము జరుగుచుండెను. అచటనుండి మధురదాస్ ద్వారకామాయి మసీదుఁజేరెను. 'S.M. నాయక్ ఏమి అనుచున్నాఁడు?'— అని బాబా మధురదాసును ప్రశ్నింపనతఁడు సిగ్గున తలవంచుకొనెను. 'ఇచటకు మంచివారు— చెడ్డవారు వచ్చుచుందురు. వారివారిదోషముల నేకరువుపెట్టి నిందించుచు నెల్లరతోఁ బలుకనేల?'— అని బాబా మందలించెను.

కాకాదీక్షిత్తు— తనవాడలో 'జీసెస్‌క్రైస్తు'నుగూర్చి లాఘవముగపలికెను. తరువాత దీక్షిత్తు బాబా దగ్గఱకువెళ్ళెను, బాబా అతనిఁ జేరనీయక వెడల నడిపెను. తరువాత అతని అనుచిత ప్రవర్తనమునకు నిజమైన పశ్చాత్తాపము పొందినపిమ్మట దనదఱికి బాబా రానిచ్చెను—

శిరిడియందొకభక్తుఁడు ఇతరభక్తులనుగూర్చి వారి పరోక్షమునందు నిందించుచుండెను. బాబా మసీదునుండి వెలుపలకువెళ్ళుచు అతనిని 'లేండి'వనము దగ్గఱకలిసెను. అచట అశుద్ధమును దినుచున్న ఒక పందినిఁజూపి 'అది యేమిచేయుచున్నది?'— అని బాబా ప్రశ్నించ 'అది

మలము భక్షించుచున్నది'– అని అతఁడు బదులుచెప్ప 'అదియెంత ఆతురతతో తినుచున్నదో గమనించితివా? ఆపని మనకసహ్యము గలిగించును. నీప్రవర్తనము దీనికి తుల్యము– కొందఱు మనుష్యులు తమ తమ హృదయములు సంతృప్తి నొందునటుల ఇతరులనుగూర్చి నిందించుచు దుర్భాషలాడుచుందురు. విశేష సుకృతమున మానవజన్మము లభించును. అట్టి మనుష్యజన్మము పొందియు– శిరిడికిఁ జేరి, ఆత్మహత్య గావించుకొనుటయా?'– అని, బాబా ఆతనికి హితబోధఁ గావించెను.

## జీవముల నితరప్రాణులను హింసించుట :–

బాబా, భక్తులెందెందు నేయేజీవులయెడ కారిన్యతవహించి, హింసించుచున్నది కనిపెట్టుచుండువాఁడు. మహల్సాపతి తనయింటి సమీపమున రోగిష్ఠియైన కుక్కను కర్రితో కొట్టినాఁడు. ఆదినమతఁడు బాబానుచేరఁగా 'భగత్! ఈగ్రామమున నావలె రోగిష్ఠియైన ఒక కుక్క గలదు– చూచినవారెల్ల దానిని కొట్టుచున్నారు.'– అని బాబా పలికెను, తాను కావించిన అకార్యమునుగూర్చియే బాబా మందలించుచున్నాఁడు అని మహల్సాపతి గ్రహించెను.

G.S. కపర్దేసతి పూర్వాచార పరాయణి– శిరిడియందు ఆమె విడిదిలో వంటఁ జేసికొనుచుండగా నొకకుక్క అచటకువచ్చెను. ప్రొయ్యిలో కాలుచున్న కట్టెకొరివిని ఆమె ఆకుక్కపై విసరెను. తరువాత ఆమె బాబాను సమీపించి, 'బాబా! మాయింటికి భోజనము నకు రమ్ము!'– అని, ఆహ్వానించెను. 'ఆలాగే–వత్తును, నేను వచ్చినపుడు కాలుచున్న కట్టెకొరివిని నాపై విసరుము' అని, బాబా ఆతల్లికిఁ దెలియఁబలికినాఁడు.

జీవహింసనుగూర్చి బాబా అభిప్రాయము అసాధారణమైనది, ఒకపరి కాకాదీక్షిత్తు 'బాబా! సర్పములు మానవులనుచంపును. అట్టి సర్పముల నెవరేనిఁజూచిన వానినిచంపుట తగునుగదా!'– అని ప్రశ్నిం

చెను. అంతట బాబా, 'తగదు. దైవమాావిధముగ నిర్ణయించిన ఎవ రును తప్పించుకొనఁజాలరు. కావున సర్పములఁ జంపఁదగదు'— అని సమాధానమిచ్చెను. అది మొదలు పాములను, తేళ్ళను, నల్లులను, దోమ లను హింసించుట దీక్షితు మానెను.

ఒకతఱి పిచ్చికుక్క ఒక చిన్నకుక్కను కఱచెను. ఆచిన్నకుక్కకు పిచ్చెత్తినదని జనులు తలంచిరి. దానిఁజేరక పెద్దకుక్కలును దూర దూరముగ పరుగెత్తఁ దొడఁగెను. ఆచిన్నకుక్కను చంప జనులు కర్ర లతో వెంటఁబడిరి. అది వీధులవెంటఁ బరుగులెత్తి తుదకు మసీదుఁజేరి బాబా శరణుఁజొచ్చెను. దానిని చంపవచ్చిన మనుష్యులను వెడల నడిపి, బాబా దానిని రక్షించెను. అది పిచ్చిదికాదని విదితమయ్యెను. బాబాకుగల భూతహితరతిని సూచించు వృత్తాంతము లనేకములు గలవు.

'ఋణసంబంధము లేక యే జీవియు దఱిఁజేరదు. మానవుఁడుగాని లేక యే యితరప్రాణిగాని నిన్నుఁజేరెనా—నిరాదరణమున వానిని తఱిమి వేయకుము. ఉచితరీతిని ఆయా జీవులనాదరింపుము, దప్పికనొందినవానికి నీరము, ఆకలినొందినవానికి పట్టెడన్నము, వస్త్రహీనునకు వస్త్రము విశ్రమించవచ్చినవానికి నీపంచ నీవొసంగుదువేని శ్రీహరి సంతోషిం చును. అనుగ్రహించును. ఎవరేని ధనసహాయమర్థించినన నీయఁదలఁ చిన నీయుము. ఈయఁదలఁపవా— అట్టి యాచకుని చీదరింపకుము— కటువులు పలుకకుము. ఎవరేని నీకు అనిష్టములైన మాటలు నూటు పలికినను వారితో కలహింపకుము— కఠినముగ పలుకకుము. అట్టి పలు కులను నీమనస్సునఁ జొఱనీయకుందువేని నీవు శాంతి సుఖములను తప్పక పడయఁగలవు. ఈప్రపంచమంతయుఁ దలక్రిందులు కానిమ్ము— నీస్థానమునుండి చలింపకుము. నీయెదుట ప్రవర్తిల్లుచున్న విషయము లను ప్రశాంతమనస్సుతో గమనించ నేర్చుకొనుము. నిన్ను— నన్ను వేర్పఱచుచున్న ఈభేదకుడ్యమును పడఁగూల్చుము. అపుడు మనమిరు

పురము కలియుటకు- ఏకమగుటకు నెట్టి ఆటంకములుండవు. 'నేను- నీవు'—అను భేదబుద్ధియే శిష్యుని గురుస్వామినుండి వేర్పఱచుచున్నది. భేదబుద్ధి నశించినగాని 'ఐక్యత' సిద్ధించదు. 'అల్లామాలిక్'— దైవము సర్వనియంత— మనరక్షకుఁడు- దైవమునకంటె వేఱొకఁడులేఁడు. ఆ మహాప్రభువు పనులు అద్భుతములు- అమూల్యములు- అగమ్యములు- అనూహ్యములు- అమోఘములు. ఆప్రభువు ఇచ్ఛించినటుల జరిగి తీరును. మనకు మార్గదర్శకుఁడా నియంతయే. మన హృదయకామిత ములఁదీర్చి, సత్యసుఖ శాంతులను ప్రసాదించునది ఆస్వామియే. మన పూర్వ ఋణానుబంధమునఁజేసి యిచటఁ జేరినారము. మన మొండొ రులము ప్రేమించి, సేవించి శాంతిసంతోషములఁ బొందుదము. జీవిత పరమావధినిఁ జేరఁగలిగినవాఁడు అమృతుఁడు- సుఖవంతుఁడు- అటులఁ గానివారు ప్రాణయుతులై యుచ్ఛ్వాస నిశ్శ్వాసములను సలుపువారలే.' అని, ఆయా సందర్భములందు బాబా తనబిడ్డలకు బోధచేసినాఁడు.

శ్రీ సాయీమహాప్రభువు కావించిన నైతికబోధలను ఈఅధ్యా యమున చదువు పాఠకులీవిషయము జ్ఞప్తియందుంచుకొన ప్రార్థితులు.

బాబా తానొక బోధకుఁడైన గురువుగ నెప్పుడు తెలుపుకొనిన వాఁడుకాఁడు. బాబా ఆశ్రితులలో 100 కి 99 మంది బాబాను తమ లౌకిక కామితప్రదాతగ గుర్తించినవారే. అటుల ఐహిక కామితములను పొందుచుండియు వారు బాబా అనుగ్రహమున నైతిక ఆధ్యాత్మిక ఫల ములను కొంతవరకేనిఁ బడయఁజాలినారు. ఆశ్రితులగుబిడ్డలు గ్రహిం చఁజాలినకొలది నైతికాధ్యాత్మిక బీజములను బాబా వారివారి హృద యక్షేత్రముల నాటినాఁడు.

పాఠకులీవిషయము మఱువఁదగదు. శ్రీ సాయీనాథుఁడు మూర్తీభవించిన సుగుణపుంజము- బాబా బోధాచరణములందు ఇసు మంతయేని భిన్నముకానరాదు. బాబా తెలుపనివిషయము లేవియు

నాచరించియెఱుఁగడు. ఆచరించనిది తెలిపి యెఱుఁగఁడు- బాబా హృదయము సర్వగుణములకు కేంద్రమైనది. అతిశైశవదశనుండి గురుప్రేమ-దేశకాల కారణాతీతమైన అపారప్రేమ బాబా ఆపాదమస్తకము నిండి యున్నది. కృతజ్ఞత-సేవ-సమత్వము-న్యాయము- ఔదార్యము-మొదలగునవి బాబా తన ఆచరణబోధలలో ప్రకటించిన సుగుణగణ విశేషములు ఇట్టి ప్రేమసంజనితములే. అట్టి ప్రేమయే లేదేని ఇట్టిసుగుణగణములకు స్థానమే లేదు. బాబాను గూర్చి మనము తెలిసికొనఁదగిన ఏకైకవిషయమిదియే.- 'ప్రేమ'. ఈప్రేమయే శిష్యుని గురుదేవునిసన్నిధికిఁ జేర్చునది. నిరంతరధ్యానమున గురువునకు అభిన్నునిఁ గావించి, [తుకారాంపలికినట్లు] 'అపనాసరికా కరితత్ కాల్' గురునితో సమానునిఁ గావించునది. (భ్రమరకీటకన్యాయము) గురుదేవుని అనుగ్రహమే శిష్యునందట్టి పరిణామముఁగూర్చును.

శిష్యుఁడు ప్రేమయందు పెంపొంది, గురుప్రేమను జీర్ణించుకొని, తాను గురుప్రేమిగ- గురువునకు ప్రేమపాత్రుఁడుగనగు విషయమునకంటె మఱియొకటి యెఱుఁగడు. ఆవిధముగ నైతికప్రపూర్ణత- ఆధ్యాత్మికప్రపూర్ణత- సిద్ధిప్రపూర్ణత- సర్వప్రపూర్ణత- పొందఁజాలును. బాబా బోధలవలనఁగలుగు సహజఫలమిదియే.

---

## 4. దైవమెవరు?

ఇది కొందఱకు చిన్నపిల్లలడుగు ప్రశ్నవలెతోచును. వారువెంటనే 'దైవము'- 'భగవంతుఁ'డనిన ఎఱుఁగనివారున్నారా?- అని మాఱు ప్రశ్నవేయుదురు. అపుడు మనము విజ్ఞాపనము పూర్వకముగ నిలువదీసి సమాధానమర్థించిన వారు తడబిడపడి నోటమాటరాక గుటకలుమ్రింగుచు జంకుదురు. తొలుత వారు తలంచినంత తేలికగకాక ఆప్రశ్నమునకు సమాధానము కష్టతమముగతోచి తీరును.

వాస్తవముగ 'దైవము-' అనుభావము వాయువువలె విశ్వవ్యాప్తమైయున్నది. ఆవస్తువు మనస్సున నిలుపుకొనుటకు- హృదయమున బంధించుటకు- గుప్పిటం బట్టికొనుటకు- ఏవేవియో పలుకులద్వారా నిరూపించుటకు సాధ్యమగునదికాదు. కారణము "దైవము" అనునది అనంతభావముగాని- కేంద్రిభావముకాదు-[అవ్యక్తముగాని వ్యక్తము-గాదు] వెండి- బొగ్గు- కలము- పుస్తకము మొదలగువస్తువులు.పాంచభౌతికములై ఇంద్రియగోచరములై మనస్సుచే నూహింపఁదగినవి. అనగా- దేశ- కాల- ప్రమాణ- వర్ణ- భారాదుల పరిజ్ఞానము అట్టి వస్తువుల విషయమై పూర్ణముగఁ బడయనగును. తెలుపవచ్చును.వీనినిఁ గూర్చి, వానికి సంబంధించిన విషయములఁగూర్చి వివరించుచున్న మనకు వాని విషయమైన సంపూర్ణజ్ఞానముకలదని తలంపవచ్చును.

తాత్త్విక [వేదాంత] విషయమప్పుడు పొడచూపును, మన మెఱునదియంతయు ఆయావస్తువుల గుణాదివిశేషములే. కాని, వాస్తవముగ ఆవస్తువుల గుణరూపాదుల కంతెఖ్యాతమైన ప్రధానతత్త్వమేదో మన మెఱుఁగజాలమని తోఁచును, ఎంతవారును నిరూపింపఁజాలరు. ఆవిధముగ భగవానుని- దైవమును మనము ప్రార్థింపవచ్చును. ఇతరులను ప్రార్థింపుఁడని చెప్పవచ్చును. వివిధగుణ విశేషములను దైవమునకుఁ గూర్పవచ్చును. కల్యాణగుణ లీలావిశేషములను విస్పష్టభావములతో గీర్తింపవచ్చును, వీనినన్నిటిని వేర్చికూర్చి పరిశీలింతుమేని 'దైవము"- అనుబడునది 'అవ్యక్తవస్తువు'- అనియే మనకు స్ఫురించి తీరును. మన కార్యకలాపములను నిర్వహించుటకు ఆవస్తువునుగూర్చి యేదో అతిసూక్ష్మమైన ఇట్టిట్టనరాని- 'కమపి'- భావము మనకుఁగలుగుట సహజము, కాని, వెండి- బంగారము- బల్ల- కలము మొదలగు వస్తువులయెడ మనకు 'వ్యక్తభావము'- కలదని, 'దైవము'- విషయమున అవ్యక్తభావమే- అని మనము చెప్పుదుము.

దీపదృష్టాంతమును గమనింపుడు. 'Torch Light' దీపము కేంద్రీకరింపఁబడినచోట వస్తువు స్పష్టముగ గోచరించును. అచటనుండి ఆదీపముకాంతి యెల్లవైపుల పరివ్యాప్తమగుకొలఁది, వెలుఁగు క్రమక్రమముగ సన్నగిలుటచే ఆయాతావులగల వస్తువులు స్పష్టముగ గోచరింపవు. ఆ కాంతిప్రసారమునకు అంతముండదు, మనశిరముపై భాగమున గోచరించు ఆకాశమువలె ఆ వెలుఁగు వృత్తపరిధి అనంతమైయుండును. పరిధియున్న యట్టుల మనకు తోఁచునుగాని, అది యెచట అంతమైనదో తెలియదు– దైవమునుగూర్చి, యితరవస్తువులఁగూర్చిన మన పరిజ్ఞానము ఆవిధముగనుండును. కావున దైవమునుగూర్చి తఱచి ప్రశ్నింపఁబడిన గురువులు సాధుసత్పురుషుల సమాధానము భక్తులను శిష్యులకు విస్పష్టము– కేంద్రీకృతమైనది– కాక కలవరపెట్టును. ఆశ్రితులగుభక్తులు ప్రాథమికపరీక్షార్థము గురువులనిటుల ప్రశ్నింతురు. 'మీరు దైవమునుగూర్చి యేమేమియో తెలుపుచున్నారు. మీరు దైవమును జూచితిరా?'– అని అడుగుచున్నాడను,'– అందుకు, దానికి సమాధానము ఆగురువులు పలుకువిధానము ననుసరించియుండును.

శ్రీ రామకృష్ణ పరమహంసనుజేరి నరేంద్రుఁడు– [వివేకానందస్వామి] పైవిధముగ ప్రశ్నించినపుడు ఆ పృచ్ఛకుని హృదయమును (ఆత్మను) ఆకర్షించి, తన అధీనమునందుంచుకొని, యీ విశ్వమున నైతిక– ఆధ్యాత్మిక ప్రబోధఁగావించుటకు తన ప్రతినిధిగ తీర్చిదిద్దుటకు 'అవును– నేను దైవమును చూచితిని.' అని సమాధానమిచ్చి, ఆతనిని [నరేంద్రుని]గూడ దైవమునుచూచునటు చేసెదనని అభయమిచ్చెను. ఒకవిధముగ నిది యథార్థమే. సత్యమైనవిషయమే. ఒకవ్యక్తి దైవమునుచూచినాఁడు– అని స్ఫురింపఁజేయుటకు కొన్నివిషయములుకలవు. 'దైవమునుచూచుట సాధ్యముకాదు'– అని, తమ అల్పజ్ఞతను ప్రకటించుకొని లాఘవమొందుగురువులు వందలకొలది కలరు. కాని, వేదాంతులగువారు 'దైవమును చూచితిని'– అని చెప్పకొనువారి వెనుక

జేసి, 'మీరు చూచినది దైవమును కాదు- అది మఱియొకటి' అని, పలుకుచున్నను- వారు దైవమును చూచిన వారమనియే భావింతురు.

పూర్వము ఋషులు ఉపనిషత్తులను ప్రవచించుచుండిన కాలము నందును ఈ వేదాంతులున్నవారే. ఉదాహరణముగను- కేనోపనిషత్తు నందు ప్రతిశ్లోకమును 'దైవము ఇంద్రియగోచరుడు కాడు'— అనియే తెలుపుచున్నది చూచుటకు— వినుటకు— తాకుటకు తుదకు ఊహించుటకు సాధ్యము కాదనియే తెలుపును.

'యచ్చక్షుషా న పశ్యతి- యేన చక్షూంసి పశ్యతే
తదేవ బ్రహ్మత్వంవిద్ధి- నాఇదం యదిదం ఉపాసతే.'
'యద్ మనసా-న మనుతే- యేనాహుర్మనో మతమ్
తదేవ బ్రహ్మ-త్వంవిద్ధి నాఇదం-యదిదం ఉపాసతే'.

నేత్రములకు గోచరముగాక నేత్రములు దేనికలిమిచే నిజూడగలుగు చున్నవో అది [బ్రహ్మము] కాని (జనులు దేవుడని సేవించి పూజించు) ఇది— బ్రహ్మముకాదు. దేనిని మనస్సు ఊహింపజాలదో- దేని సత్తాచే మనస్సునకు ఊహించు శక్తికలుగుచున్నదో అది (బ్రహ్మము) కాని, జనులు దేవుడని సేవించి పూజించు ఇది (బ్రహ్మము)కాదు. ఈ విధానము బ్రహ్మమును నిరూపించుటకు శ్రుతులందు దెలుపబడిన 'నేతి'— 'నేతి' (న+ఇతి—న+ఇతి- ఇదికాదు, ఇదికాదు) అని త్రోసివేయు పద్ధతి, దీనిలో నొకించుక సత్యముకలదు. ఈవిషయము తరువాత నిర్ణయించుదము. 'బ్రహ్మము'—'దైవము'- అనునవి యిందు పర్యాయ పదములుగా గైకొందము.

దైవమెవరు? ఒకవ్యక్తి కష్టములందున్నపుడు ఆకష్టములనుండి తప్పుకొనుటకు స్వశక్తి చాలనపుడు- ఆపత్కాలమున రక్షింతురని విశ్వసించియున్న బంధుమిత్రాదులకాపని అలవికానియపుడు— మాన

వాతీతమై, దయాప్రపూర్ణమై సర్వశక్తియుతమై, తనఆశ్రితుని పడనీయక చెడనీయక ఆదుకొని రక్షించువస్తువే– 'దైవము'– కావున భగవానుఁడు– దైవము సర్వసమర్థుఁడు– దయామయుఁడు– మానవాతీతుఁడు మనమాశ్రయింపఁ దగినవాఁడు. అటుల కష్టనివృత్తి– అభీష్టావాప్తిఁ గూర్చువాఁడు– అని, దైవమునుగూర్చి జనసమాన్యము భావించును. తక్కినదంతయు దేశకాలకారణబద్ధమై, పరిణామమును పొందుచు– నశించునదియగును. మానవహృదయము వీనికన్నిటికి అతీతమై దేశకాలకారణ బద్ధముగాక– పరిణామనాశములు లేక– ఎల్లరఁ దనదరికి ఆకర్షించి తనయందుఁ జేర్చుకొని యీ మార్పులన్నిటినుండి రక్షించి, సత్యతృప్తి, సుఖశాంతులను ప్రసాదించు 'వస్తువును'– పొందుటకు సర్వదా కోరుచుండును.

కావున 'దైవము' అన పరిణామశీలమై ప్రకటమగు ఈ సకల విశ్వమునకు అతీతమై జీవాత్మను తనలోనికి లయింపఁజేసికొని, యీ ప్రాపంచక సంకటములనుండి– జననమరణాదులనుండి– విముక్తినిఁ గూర్చువస్తువు– అని చెప్పఁదగును. లోఁగడఁ దెలుపఁబడిన దానికంటె జనసామాన్యదృష్టియందిది శ్రేష్ఠమగుభావము. దీనికి తరువాత దైవమునుగూర్చిన భావములు– సూక్ష్మాతిసూక్ష్మములగు– తత్త్వవిచారక నిశ్చితభావములు మనకు విదితములగును.

తైత్తరీయోపనిషత్తునందు 'దైవము'నుగూర్చిన సంశయములు మనుష్యాతీతులైన దేవతాదులందును కలిగినటులఁ దెలుపఁబడినవి. దేవతలప్రభువగు ఇంద్రుఁడు. అసురశ్రేష్ఠుఁడగు విరోచనుఁడు. 'బ్రహ్మ'మునుగూర్చి పలువురు పలువిధములఁ దెలుపుచున్నారు. కావున బ్రహ్మమునుగూర్చి స్పష్టముగ– నిశ్చితముగఁ దెలిసికొనవలయునను తలంపు గలిగి విశ్వపితయగు ప్రజాపతినిఁజేరి ప్రశ్నించిరి. వారిచేత సక్రమబ్రహ్మచర్యదీక్షను నిర్వర్తింపఁజేసి, ప్రజాపతివారికి ఉత్తమోత్తమ తత్త్వనిరూపణము– బ్రహ్మమునుగూర్చిన ఎఱుకను అనుగ్రహించెను.

ఆ ఉపనిషత్తులోనే వరుణభృగుసంవాదముఁ జూఁడుడు! భృగు మహర్షి తనతండ్రియైన వరుణుని 'బ్రహ్మమును'గూర్చి ప్రశ్నించెను, వరుణుఁడిటులఁ దన తలంపునుదెలిపెను. 'ఈవిశ్వమంతయు వాక్కు- మనస్సు- ఇంద్రియము లకూడలి. బ్రహ్మము [వీనికన్నిటికి] విశ్వమునకు మూలకారణము తననుండి బహిర్గతమైన యీ విశ్వమునకు 'బ్రహ్మము' ఆధారభూతుఁడు- రక్షకుఁడు- తుదకు ఈ విశ్వమునంతయుఁ దనలోనికి లయింపఁజేసికొనువాఁడును- బ్రహ్మమే. తండ్రిపలుకులువినిన భృగువు తాను 'విశ్వము'- అని గ్రహించిన విశ్వమును గూర్చి విచారింపఁదొడఁగెను. కారణ-కార్యవిచారణచేయ మొదలిడెను. ఆవిచారణము విశ్వమున ఏక దేశగతమునుగూర్చి గాక విశ్వమంతట సంబంధించినది. వరుణుఁడు దెలిపినది బ్రహ్మము' విశ్వమునకు ప్రథమ కారణము. విశ్వసృష్టి- స్థితులకుఁ బూర్వమునందున్న ప్రధానశక్తియే దీనికి ఆధారభూతమై దీని (విశ్వము) నంతయు నీవిధముగ ప్రవర్తింపఁ జేయుచున్నది ఈవిశ్వమున ఇంద్రియగోచరమగు ప్రతివస్తువు ప్రతిక్షణము పరిణామము [మార్పు] పొందుచుండును. అంత మొందుచుండును. కావున ఈ విశ్వమంతయు తుదకు అంతముగలది. ఈవిశ్వమునకు చరమస్థానము 'బ్రహ్మమే.' ఇట్టిపరిణామ వస్తుసంతతికి కారణము- ఆధారభూతము- రక్షకము-లయస్థానమై తానుమాత్రము ఎట్టిమార్పు నొందని తత్త్వమే "బ్రహ్మము".

ఈ తత్త్వవిషయము నవగాహనముచేసికొనుటకు కొంతకాలము పట్టెను. దానిని గ్రహించి స్వానుభవమున గుర్తించి, అట్టి ఎఱుకను బడయుటకు మఱికొంతకాలముపట్టెను. జీవి యీ ఎఱుకను విస్పష్టముగఁ బడయఁజాలినపిదప 'దేహాత్మబుద్ధి'- (దేహమే నేను అనుబు ) పూర్ణముగ నిర్మూలమై మూలబ్రహ్మముతో ఐక్యతనొందును. ఆ 'ఐక్యత'-వలన ఆజీవాత్మ బ్రహ్మమేయగును. వరుణుఁడు తనకుమాడగు భృగువునకుఁ దెలిపిన తత్త్వబోధ- యిదియే. ఇంతకంటె శ్రేష్ఠమగు తత్త్వబోధ మనకింతవరకు మఱియొకచోటఁ గానరాదు.

అద్వైతవాదులు (శ్రీ) ఆదిశంకరాచార్య ప్రభృతులు వారివారి అనుభవములను పురస్కరించుకొని తెలిపినది యిదియే. ఇది నిర్గుణ బ్రహ్మతత్త్వరహస్యము,

విశిష్టాద్వైతులు ద్వైతులు- ఈ విశ్వమూలకారణము సగుణ బ్రహ్మమనియే విశ్వసింతురు. వీరు వీరి అనుయాయులందఱు వారివారి వ్యక్తిత్వమును నిర్మూలించుకొనఁ దలంచరు. మహాప్రళయమునందును. ఈ యిరుతెగల మతానుయాయులు దాడిమపండులోని విత్తనములవలె- పరతత్త్వము- మూలకారణమైన పరబ్రహ్మమునకు భిన్నముగనే కలిసియుందురని వారి విశ్వాసము. దైవమునుగూర్చి హైందవ శాస్త్ర సిద్ధాంతమున బోధపడు సంగ్రహావిషయము ఈమాత్రమే కావున దైవమునుగూర్చి తెలిసికొనఁగోరు వ్యక్తి- సక్రమ సాధనము- బ్రహ్మచర్యాదినియమల నభ్యసించి, ఎటుక [illegible] నేకాని, కేవలము గ్రంథపఠనములవలన- పలుకులవలన బోధపడునది కాదు. ఆవిధానమునే 'బ్రహ్మజ్ఞానము'- అందురు, 'ఇదేమి బ్రహ్మవిద్యా? [జ్ఞానమా?] అను నామెతకలదు. తక్కుంగలవిద్యలనేర్చుట సులభమనియు, బ్రహ్మజ్ఞానముపడయుట- 'క్షురస్యధారా' కత్తివాదరపై నడచుటవంటిదనియు- పెద్దలందురు. అనగా- అందఱకు సాధ్యమగునదికాదని భావము, సాధారణ పురోభివృద్ధికైనను సక్రమసాధన మవసరము- సాధకుడు కడజీవి- పవిత్రత- సద్విషయము స్వీకరించుబుద్ధి గాఢవిశ్వాసము ధైర్యోత్సాహములతోగూడిన ఓర్పు- ప్రాణికి ఇష్టదైవమునందు- గురువునందు అచంచలవిశ్వాసము కలిగియుండవలయును. ఈస్థితిఁ బడయుటకు సాధకుఁడు 'తాను' అనుకొనుదానిని- 'తనది'- అని తలంచుకొను దానినంతయు 'గురుదేవునకు' సంపూర్ణసమర్పణముఁ గావించుకొనవలయును సంపూర్ణశరణాగతి చేయవలయును. అట్టివాఁడు మాత్రమే (ఆత్మ) బ్రహ్మజ్ఞానాధికారి.

శ్రీసాయీ మహాప్రభువును సమాశ్రయించిన వేనవేలు భక్తులలో నిట్టిజ్ఞానముఁ బడయఁగోరినవారు మిక్కిలి అరుదు. అటుల జ్ఞానలబ్ధిఁగోరినవారలలోను నిజమైనఅధికారులు [అర్హతిగలవారు]చాల తక్కువ బాబా తనను సమాశ్రయించినవారిలో ఏకొలఁదిమందినోతప్ప తక్కినవారిని త్రోసిపుచ్చినాఁడు. తఱచుగ నట్టివారి అనర్హతను నిరూపించుచుండువాఁడు. కోపర్గాం స్టేషన్ మాస్టరు "వాలంబి" బాబా యందు విశ్వాసములేనివాఁడు, దాస్‌గాణూ ప్రోత్సాహమువలన బాబా ఎట్టివాఁడో చూచిపోవుటకు- బాబావలన గ్రహింపఁదగినది ఏమేని కలదా?- అని పరీక్షించుటకు శిరిడికి వెళ్ళినాఁడు. గాణూదాస్-వాలంబి మేష్టరు ద్వారకామాయి మసీదుఁ జేరునప్పటికి, బాబా మట్టిపాత్రలను శుభ్రపఱచి బోరగిల పెట్టుచుండెను ఆస్టేషన్ మాస్టరు సహనముపీడి 'ఇదియంతయునేమి?'- అని గాణూదాసును ప్రశ్నించెను. గాణూదాస్ బాబానుఅడిగెను. గాణూదాసునకు బాబా ఇటుల సమాధానమిచ్చెను, 'నా దగ్గఱకుఁజేరు ప్రతిపాత్రము అధోముఖముగ వచ్చుచుండును.'- అనగా బాబాను జేరువారు ఆప్రభువువలన స్వీకరించుటకు వీలుకాని విధమున హృదయమును కప్పిపుచ్చుకొని అధోముఖులై వత్తురు. (అట్టి వారి ముఖములద్వారా హృదయపాత్రలను ప్రేమామృతముతో నింపుటకు సాధ్యముకాదు) అని బాబా తెలిపెను.

ఇంకను, బాబానుజేరు ఇతరభక్తులు- ఆశ్రితులు- బాబాకుగల సకలయోగసిద్ధి సంపదలను వారివారి లౌకికాభీష్టములను ప్రసాదించుటకై వినియోగించి అనుగ్రహింపఁగోరివారు కొందఱు బాబా వలన బ్రహ్మజ్ఞానమును అంగడిలో వస్తువులను విలిచి స్వీకరించువిధమున బడయవచ్చునను తలంపుతోఁ జేరినారు. ఉదాహరణమునకు ఒకఁడు బాబానుచేరి, దేవుఁడెవరు? ఎట్లుండును? అనిప్రశ్నించెను. బాబా ఆత నికి సమాధానమీయక సమీపమునఁనున్న ఒకభక్తుఁబిలిచి, 'భాగ్‌చంద్‌మార్వాడి దగ్గఱకువెళ్ళి 'బాబాకు రు 100/లు కావలయును

అని, అడిగి తీసుకొనిరమ్ము' అని పంపెను. ఆభక్తుఁడు వెళ్ళి వెంటనే తిరిగివచ్చి, 'నాదగ్గఱ నూరు రూపాయలు లేవు- నమస్కారములని చెప్పుము" అనినాఁడని తెలిపెను. బాబా మఱియొక ధనికునిదగ్గఱకు ఆభక్తునిఁబంపెను, ఆభక్తుఁడు వెళ్ళి 'తనదగ్గఱ పైకము లేదనినాఁడు'- అని చెప్పెను. అంతట బాబా నానాసాహెబ్ చందోర్కరును పిలువనంపెను, చందోర్కరు సమీపించగా నాతనిని 'నూరు రూపాయలు కావలయు'నని కోరెను. చందోర్కరు ఒక చీటివ్రాసి భాగ్‌చంద్ మార్వాడి దగ్గఱకుపంపెను. ఒక నిముసములో పైకము అందెను. చందోర్కరు ఆధనమును బాబా చేతులందుంచెను. అంతట బాబా 'ఈ ప్రపంచమున సకలము నిట్లుండును'- అని పలికెను, దేవునిఁగూర్చి తెలిసికొనుటకై వచ్చినవాఁడు, అసహనముతో 'తాను దేవునిఁగూర్చి ప్రశ్నించిన బాబా దానికి సమాధానముచెప్పక నూరు రూపాయల కొఱకై ఎవరినో అక్కడకు- ఇక్కడకు పంపుచున్నాడు- ఇదేమి?' అని యతఁడు గాణూదాసును ప్రశ్నించెను, దాస్ గాణూమహారాజు ఇటులఁ దెలిపెను. 'బాబా నీకు సమాధానముచెప్పినాఁడు.' అన అది యెట్లు? అని ఆ పృచ్ఛకుఁడడుగ 'ఇతరులు అడిగిన ధనము లభ్యము కాలేదు- చందోర్కర్ చీటివ్రాసి పంపిన క్షణములో అందినది కావున దేవుఁడెవరు? ఎట్లుండును? అని ప్రశ్నించువాఁడు తెలిసికొనలేఁడు. తగిన యోగ్యతగలిగి- అర్హుఁడైనవాఁడే తెలిసికొనఁగలడు. అట్టి జ్ఞానము పడయఁగలఁడు.'- అని గాణూదాస్ వివరించి తెలిపినాఁడు. కావున బ్రహ్మమును- దైవమునుగూర్చి తెలిసికొనుటకు అర్హతఁబడయవలయును- 'అర్హతనుబొంది యావల నడుగఁబొమ్ము'- అని బాబా తెలిపినటుల మనము గ్రహించవలయును.

మఱియొక సమయమున నొకధనికుఁడు ఒక అరగంటలో తిరిగి వత్తునని, ఖర్చులు తగ్గించుకొనుటకై కోపర్గాంనుండి శిరిడికి తిరుగు బాడుగకు ఒక టాంగాను మాట్లాడుకొని శిరిడికిఁ జేరెను. ఆ ధనికుఁడు

త్వరత్వరగా బాబాను సమీపించి, మ్రొక్కి, 'బాబా! నాకు దైవమును- బ్రహ్మమును జూపుము. నేనింత దూరమువచ్చినది ఆపని కొఱకే- జనులందఱు శిరిడిబాబా బ్రహ్మమును క్షణములో జూపఁ గలఁడు అని చెప్పుకొనుచుందురు.'- అని, అడిగెను. అంతట బాబా— 'నీవు భయపడకుము క్షణకాలములో నీకుఁ స్పష్టముగఁ జూపుదును- ఇది కాలము వ్యర్థపుచ్చదగిన విషయముకాదు. నీవలె దైవమునుగూర్చి ప్రశ్నించువారలు మిక్కిలి అరుదు (బాబా పలుకులలోని హాస్యభావ మతఁడు గ్రహింపఁజాలకుండెను) ధనముకొఱకు- రోగనివారణము నకు- కీర్తిగౌరవ పదవులకొఱకు ఐహిక సుఖభోగములకొఱకు ఇచటకు వచ్చువారలనేకులుగలరు. దైవమునుగూర్చి కోరువారలెవ్వరునులేరు. దైవమును ఎఱుఁగఁ గోరువారెవరున్నారా! అని, నేను నిరీక్షించుచుం దును. ఈవిశ్వమునకు మూలకారణము బ్రహ్మము- సూర్యగ్రహ నక్షత్రమండలముల ప్రవర్తనమునకు మూలాధారము, కాల ఆయన ఋతువుల ప్రవృత్తికిమూలము బ్రహ్మమే. ఈతనువువిడుచు పూర్వము జీవి దైవమును తెలిసికొనవలయును. లేకున్న జననమరణ చక్రభ్రమ ణమునకు గురికావలసినదే. బ్రహ్మజ్ఞానము [ఎఱుక] కేవలఅద్వైత సుఖమును ప్రసాదించును. గురువు దానిని సమకూర్పఁగలఁడు. సద్గు రువుమాత్రమే దానిని ప్రసాదింపసిద్ధుఁడు.'- అని, పలికెను.

అంతట బాబా ఇతరుల వైపునకుఁ దిరిగి ఒక బాలునిపిలిచి, 'నీవు నందలాల్ మార్వాడి దగ్గఱకువెళ్లి బాబాకు అత్యవసరముగ 5 రూపాయలు కావలయునని అప్పు అడిగితెమ్ము'- అని చెప్పెను. ఆ పిల్లవాడు వెళ్ళి నందలాల్ ఇంటలేఁడని తిరిగివచ్చి చెప్పెను. ఇళ్లలో లేని వారి అందఱిదగ్గరకు బాబా ఆపిల్లవానిని పంపుచుండెను. ఆధనికుఁడు రానుపోను బాడుగకు టాంగా మాట్లాడుకొనుటచే ఆలస్యమైన ఆబండి వాఁడు బాడుగ అధికముగ తీసికొనునను భయముతో జాగునకు మిక్కిలి అసహనము నొందుచుండెను. బాబా ఏదో అవసరముగలిగి

5 రూపాయలకొఱకు వారి వీరిదగ్గఱకు పంపుట చూచుచునేయున్నాఁడు తనజేబులో 50 అయిదురూపాయల నోట్లుంచుకొని, అందుండి ఒక 5 రూపాయలకాగితము యిచ్చిన అది మరల తనకుఁ తిరిగిరాదే అను జంకుగలదు. అంతనతఁడు 'బాబా! నేను బ్రహ్మము నెఱుఁగుటకుఁ దోడ్పడుదువా? లేదా?' అని ప్రశ్నించెను. బాబా అతనిఁజూచి 'నేనుఇప్పుడు చేయుచున్నదంతయు నీవు చూచుచునే యుంటివిగదా! నీవు దైవము నెఱుఁగుటకే నేఁ ప్రయత్నము చేయుచున్నపని. ఇచట నీవు కూర్చుండియుండగనే నీకు బ్రహ్మము జూపింతును, నీవేమి తెలిసికొనలేదా? నాకు అయిదు కావలయును. బ్రహ్మమునుచేరుటకు జీవి 5 సమర్పింపవలయును. 1 పంచేంద్రియములు 2 పంచప్రాణములు 3 మనస్సు 4 బుద్ధి 5. అహంకారము (ఇవియన్నియుగలిపి 'వైరాగ్యము' అనఁబడును) బ్రహ్మజ్ఞానపథమున వర్తించుట దుర్ఘటము. అందరు ఆమార్గమున నడువజాలరు. అట్టి జ్ఞానోదయమైన, వెలుఁగుపొందును ఇహపరలోక సుఖభోగములందాసక్తి విడఁజాలినవాఁడే బ్రహ్మజ్ఞానము పడయసమర్థుఁడు'- అని బాబా తెలిపినాఁడు, బ్రహ్మజ్ఞానము పడయుటకంటె తనకు 5 రూపాయలపైగల గాఢబంధమును బాబా గుర్తించినాడన్ని ఆతనికెంతో సిగ్గున తిరిగివెళ్ళెను.

దైవమునుగుర్తించి ఆపరబ్రహ్మమునందు లయమొందుటకు జీవి తనూమన ధనములను సర్వస్వమును సంపూర్ణ సమర్పణముఁ గావించితీరవలయును. అటుల గావించుటయే ప్రథమసోపానము నెక్కుట అట్టివాఁడుగాని బ్రహ్మజ్ఞానలబ్ధికి అధికారి కాఁజాలఁడని బాబా విస్పష్టపఱచినాఁడు, ఈ సంపూర్ణసమగ్ర సమర్పణమునుగూర్చి శ్రీమద్భాగవతాదిగ్రంథములందుఁ దెలుపఁబడినది. బాబా తనఆశ్రితులకు బోధించువిధానములలో శిరిడియందు భక్తులుగావించు గ్రంథపారాయణము వారు చదువుచున్న గ్రంథములను విసిరమ్మని పంపువాఁడు.

ఒకసందర్భమున బాబా గోపాలరావుబూటీని $16\frac{1}{2}$ రూపాయలుదక్షిణ నీయుమనికోరెను. ఆసమయమున తనవద్దఆ పైకములేదని బూటీ చెప్పెను. అంతట దీక్షిత్తువద్దకువెళ్లి పైకమతని దగ్గరనుండి తీసికొని ఆతఁడు కావించుచున్న గ్రంథపఠనము వినిరమ్ము'—అని బాబా నియమించెను. బూటీ, దీక్షిత్తువద్దకువెళ్ళి పైకమడిగెను. తనవద్దర ఒక రూపాయిమాత్రము కలదని దీక్షిత్తు తెలిపెను ఆతఁడు పఠించు గ్రంథమును వినుమని బాబా ఆజ్ఞాపించినట్లు బూటీ తెలిపెను. దీక్షిత్తు భాగవతపారాయణ ముపక్రమించెను.

"కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి"-

ఈశ్లోకమున జీవి-మానవుఁడు కావించు సకలకర్మ [ఫల]ములను భగవానునకు సమర్పించుట ఇదియే సంపూర్ణసమర్పణము. బ్రాహ్మణులు తాము కావించు యజ్ఞయాగాదికర్మములు— మంత్రానుష్ఠానాదులు సకలము ఈశ్లోకము నుచ్చరించుచు భగవానునకు సమర్పణము గావింతురు. బాబా $16\frac{1}{2}$ రూపాయలు దక్షిణను అడిగెను. $16\frac{1}{2}$ రూపాయలకు ఈశ్లోకమునకు సంబంధమేమి? పరిశీలించిన ఈశ్లోకమున 17 పదములుకలవు. ఇందు సమర్పితమైనవస్తువులు 16 ఇందు 'చిత్తము' విడువఁబడినది. (జ్ఞానేశ్వరీవ్యాఖ్య ననుసరించి) ఆచిత్తముగూడ చేర్చిన సమర్పితవస్తువులు 17 అగును కాని చిత్తము 'సగము' మాత్రమే కావున ఇందు తెలుపఁబడిన 16 1/2 వస్తువులను దైవమునకు సమర్పింపవలయును. బాబా దైవము కావున బాబా నిర్దేశించునది- బూటీ దీక్షిత్తు మొదలగు భక్తులందరు ఈశ్లోకమునునుసరించి గురుదైవమగు శ్రీ సాయీప్రభువునకు తమసంపూర్ణ వ్యక్తిత్వమును [$16\frac{1}{2}$వస్తువులు] సమర్పణముఁ గావింపవలయునని విదితమగుచున్నది. ఇక దైవమును

గూర్చి తెలిసికొనుటకు వివిధసోపానములు–"రాధాబాయి దేశ్ ముఖ్"కి తెల్పిన రహస్యవిషయములను సావధానముగఁ ఒకటికి పదిమార్లు] పఠింపనగును.

(S. C. S. Pera 136, 137, 138 చూడుడు.)

'నీవు దేవునిఁజూచితివా? దైవమెవరు? ఎట్లుండును?'– ఇత్యాది ప్రశ్నలు– క్రమవిరుద్ధవిధానమున, గావింపబడుచున్నవియగుచు వానికి బాబా యొసగు సమాధానములవలన ఫలము స్వల్పము. 'దైవము' ఆధ్యాత్మి వేదాంతప్రవచనముల– వైదికమంత్ర తంత్రముల మూలమున చేఁజిక్కించుకొనఁదగిన వస్తువుకాదని బాబా విస్పష్టపరచినాడు,

'నాయమాత్మాప్రవచనేన లబ్ధోనమేధయాన బహునాశ్రుతేన
యమేవైషవృణుతే తేనలభ్య స్తస్యైషఆత్మావివృణుతేతనూగ్ంస్వామ్'

ఈ పరమాత్మ మన వాదోపవాదములచే లభింపడు. ఆలోచన చేతగాని, మిక్కిలి వినికిడిచేతగాని లభింపడు. ఈ పరమాత్మ ఏజీవుని వరించునో ఆజీవునికి లభ్యుడు, ఆచేతనునకు ఈపరమాత్మ తనస్వరూపమును ప్రకాశింపజేయుచున్నాడు.

[కఠో ౧–౨–౨౩]

బ్రహ్మజ్ఞానము ప్రసాదింపగల గురుదైవమునకు సంపూర్ణశరణాగతి– సర్వసమర్పణము– ఒక నియమితవిధానమున గావించుటను గూర్చిన ఆసత్యవిషయమును– ఆ అమూల్యసత్యమును– బాబా ఒకరిద్దఱ రాధాబాయి దేశముఖ్– అన్నాసాహెబ్ దభోల్కరునకు మాత్రమే ఎఱుక పఱచినాఁడు. వారు దైవమునుగూర్చి ఎఱుగుటకు తగిన యోగ్యతలుఁగలిగి, బ్రహ్మజ్ఞానపథమున దైవమునుగూర్చి తెలిసికొనవలయునను యథార్థకాంక్షతో ఆమార్గమున అడుగిడినవారు కావునఁ దెలిపినాడు. దైవమునుజూచుట యనిన దైవమునుగూర్చి ఎఱుకగలుటయే లోఁగడ ఈవిషయము బాబా చరిత్ర– బోధలందుఁ దెలుపఁబడి

నను ఈ అమూల్యమైన విషయమును- రహస్యమును- మఱల మఱల స్మరింపఁదగినవే. సాధకుడైన పాఠకుడు ఆవిషయము నెన్నిపర్యాయము లైనఁ జదువఁదగును,

రాధాబాయిదేశ్‌ముఖ్ అను వృద్ధురాలు బాబాను తనగురువు గఁజేసికొని, ఆతండివలన నుపదేశముపడసి, బాబావలె బ్రహ్మజ్ఞాన సిద్ధి పొందవలయునను దృఢసంకల్పముతో శిరిడికిఁజేరి శ్రీ సాయిప్రభువును సమాశ్రయించినది. ఉపదేశింపుమని ప్రార్థించినది. బాబా సమాధానమీయలేదు. అంతటనామె సత్యాగ్రహమవలంబించి, బాబావలన నుపదేశము పొందువరకు ఆహారపానీయములను మానినది. మృతికైనను లెక్క-చేయలేదు, మూఁడు దినములవరకు ఆమె పాటించిన దృఢదీక్ష గమనింపుడు! ఆవాడలో నివసించుచున్న శ్యామా (మాధవరావుదేశ పాండే) బాబాను జేరి, ఆమె పూనికనుగూర్చి చెప్పుట యుక్తము-విధి యని నిశ్చయించికొనివెళ్ళి 'బాబా! నీవలన నుపదేశము పొందువరకు ప్రాయోపవేశముకావించి, మృతికైనను సిద్ధపడిన ఆవృద్ధురాలిని కనికరించుము"- అని విన్నవించెను.

బాబా ఆ వృద్ధురాలినిఁ జేరబిలిచి యిట్లుపలికెను- 'అమ్మా! నేను నీబిడ్డను.నీవు నాతల్లివి. నీవేల ఆత్మను హింసించుకొనుచు మరణింపఁదలచెదవు? నీబిడ్డనైన నాయందు దయవహింపుము. నేనొక భిక్షుకుడను. ఇటుచూడుము నాగురుదేవుఁడు మిక్కిలి గొప్ప సాధుసత్పురుషుఁడు, సంపూర్ణ కరుణాస్వరూపుఁడు. ఆస్వామిని మిక్కిలి వినయవిధేయతలతో సేవించి శ్రమించితిని. ఆతండి నాచెవిలో నేమంత్రమునూది యెఱుఁగఁడు. దానికి బదులు నాతలను శుభ్రముగ గొరిగించి రెండు పైసాలనిమ్మని కోరెను. నాగురుదేవుడు కోరినది నాణెములుకావు. మేమువును సమర్పించినను ఆస్వామి స్వీకరింపఁడు. నాస్వామికోరిన రెండుపైసాలు- 'నిష్ఠ-సబూరి' [గాఢవిశ్వాసము- ధైర్యోత్సాహము

లతో గూడిన ఓర్పు] నేను వెంటనే సమర్పించితిని. నాస్వామి సంతోషించినాడు.

తల్లీ! 'సబూరి' ధైర్యోత్సాహములతో, గూడిన ఓర్పు. దానిని విడనాడవలదు. అది నిన్ను గమ్యమునకు జేర్పసమర్థమైనది. అది మానవులందుగల మానవత్వము. పాపపరిహారదక్షము. నిరాశ నిస్పృహ భయాదులను నిర్మూలించునది.

12 సంవత్సరములు ఓర్పుతో వేచియుండి నాగురుదేవుని సేవించితిని. ఆతండిచ్చిన ప్రేమను నేను ఏమని- ఎంతని తెలుపఁగలను. అది అనన్యసామాన్యము. నాగురువు ధ్యానస్థయుండుండగ నే నెదుటఁ గూర్చుండి ఆతండిని జూచుచుండువాడను. ఇరువురము ఆనందప్రవాహమున మునిగితిమి. నాదృష్టిని ఏ యితరము వైపునకు మరల్చియెఱుఁగను. రేయింబవళ్ళు ఆకలిదప్పుల నెఱుఁగనీయని ప్రేమతో ఆతండి ముఖకమలమున ప్రేమచూడ్కులఁ బఱుపఁగంటిని. నాగురుదేవుఁడు నా యెదుట లేకున్న క్షణకాలమేని నాకు మిక్కిలి సహింపరానిదిగనుండెడిది. నాగురువునకంటె నాకితర గమ్యముగాని- లక్ష్యముగాని లేదు. నాగురుస్వామినిఁదప్ప నితరమును ధ్యానించి యెఱుఁగను. క్షణమేని విడువక నామనస్సు గురుదేవునియందు లగ్నమై యుండెడిది. నాగురుదేవుని లీలలత్యద్భుతములు. నాస్వామికంటె నితరమును కాంక్షించి యెఱుగను నాప్రేమకంటె నితరమును నాగురువు నావలనకోరి యెఱుఁగడు. వెలికి ఏమియుఁ జేయనట్లుండినను నాగురుస్వామి నన్నుఉపేక్షించి యెఱుగఁడు. కరుణార్ద్రదృష్టిని నాయందు ప్రసరించుచుండువాఁడు.

ఈమసీదునందుఁ గూర్చుండి నేను సత్యముఁ బలుకుచున్నాఁడను. నాగురుదేవుడు నాచెవిలో నేమంత్రము నూఁదియెరుగడు. ఇపుడు నీచెవిలో నేనూఁదగలిగిన దేదియు లేదు. ఇల్లము. నీవునుఈవిధముగఁ జేయుము.

నీతలంపులకు- ఆశయములకు నన్నేకైకలక్ష్యముగఁ జేసికొంటివా పరమార్థమును- పరంధామమును బడయఁగలవు. చలనములేని శ్రద్ధతో నన్నుజూడుము. నేను నిన్నుజూతును. నాగురుదేవుఁడు నాకు బోధించిన ఏకైకసత్యము- ఇదియే. చతుర్విధసాధనములతో- ఆరు శాస్త్రములతో పనిలేదు. గాఢమైనభక్తితో నీగురువును విశ్వసింపుము. అదిచాలును.

'చాలు గురువునన్ భక్తి - విశ్వాసబుద్ధి'
ఆవృద్ధురాలు ఆమాటలు సమాలించి, విశ్వసించి తనసత్యాగ్రహమును ప్రాయోపవేశమును విసర్జించెను.

మనము పెక్కు పురాణాదులందు చదువుచున్న ఈ విషయము- గురుభక్తిమార్గమును- శ్యామా- అన్నాసాహెబ్ దభోల్కరునకుఁ దెలిపినాఁడు. శ్రీ సాయీప్రభువు దభోల్కరునకు ఈవిషయమునే పలుకుల భేదముతోఁ దెలిపినాఁడు. అందలి నిగూఢభావమిదియే.

ఒకసమయమున బాబా- దభోల్కరును 15 రూపాయలు దక్షిణ నిమ్మనెను. తనదగ్గఱ పైకములేదని అన్నాసాహెబ్ తెలుప శ్యామా దగ్గఱకువెళ్ళి తీసికొనిరమ్మని- అతనితోఁ గొంతతడవు సంభాషించి, శ్యామాయొసఁగు దక్షిణఁ గొనిరమ్మని నియమించెను. దభోల్కరు వెళ్లి శ్యామాతో ఈవిషయముఁ దెలుపఁగా నతఁడు చకితుఁడై యిట్లనెను.

'ఈబాబాను చూడుము- నీవంటి పెద్దపెద్ద పండితులను నాయట్టి తెలివిలేని వారిదగ్గఱకుఁ బంపుచున్నాఁడు. 15 రూపాయలకు బదులు 15 నమస్కారము లర్పించుచున్నాఁడను ఇఁక సంభాషణము విషయమై నీయట్టివానికి ఏమిచెప్పఁదగునో నాకు తోఁచుటలేదు ' అని, కొంత తడవువేచి, 'రాధాబాయి దేశముఖ్ వృత్తాంతము' దెలిపినాఁడు. అంతట దభోల్కరు బాబాను సమీపించి శ్యామా తనతోఁ గావించిన సంభాషణముఁ దెలిపినాఁడు- బాబా యిటుల అప్పుడుపలికెను.

"మాపద్ధతులు ప్రత్యేకములు. ఈవిషయమును జ్ఞప్తియందుంచుకొనుము. ఆత్మజ్ఞానలబ్ధికి ధ్యానమవసరము. ఆత్మానుష్ఠానము మనస్సునకు శాంతిని బ్రసాదించి సమాధినిఁగూర్చును. కావున నీకోరికలు సకలమును విడనాడి, సకలభూతాంతర్యామియైన దైవమునందు నీమనస్సును నిలుపుము. మనస్సు ఈవిధముగ కేంద్రీకరింపఁబడినయెడల గమ్యమును జేరఁగలవు.

ధ్యానము విషయమున సగుణుఁడు– రూపసహితుఁడనైన యీ నన్ను– లేక– నిర్గుణుఁడు ఆనందస్వరూపుఁడనైన నన్ను ధ్యానింపుము. నిరాకారధ్యానము నీకసాధ్యమైన ఇచట నీవు చూచుచున్న ఈరూపసహితుఁడనైన నన్ను ధ్యానించుము– రేయింబవళ్ళు ఈరూపమును చింతించుము. ఇట్టి ధ్యానసిద్ధవలన నీమనస్సు లయమొందును. ధ్యేయము– ధ్యాత (నేను–నీవు) ధ్యానము– అన్నియు లయమొందును. ఇదియే చైతన్యఘనత– బ్రహ్మసమరసత. గురువు కటాక్షదృష్టియే శిష్యునకు ఆహారపానీయములు."

అంతట బాబా కలకండ ప్రసాదము హేమాడ్రిపంతు చేతులందుంచి 'ఈబోధను విస్మరింపక నీహృదయమున పదిలపఱచుకొందువేని నీజీవితము ఈ కలకండకంటె మధురాతిమధురముగ నగు'ననెను.

బాబా ఈకథాశ్రవణము– పిదప మననము–నిదిధ్యాసలు–స్మరణ ధ్యానములు విధించినాఁడు. ఇవియన్నియు ఆనందఘనమును జేర్చి ఎఱుకనుగూర్చును. ఈవిశ్వమున ప్రకటమై గోచరించునది సకలము– మాయద్వారా ప్రకటమగు బ్రహ్మమే. ఇది తిరిగి బ్రహ్మమునందే లయమగును. శాస్త్రములఁ బరిశీలించి 'ఆత్మ'– ఏకమో–లేక, నీవు చూచునట్టి ఈజీవకోటులవలె భిన్నమో గుర్తించుకొనుము. జ్ఞానము యొక్క పరమావధి [మకుటము] ఈసకల దృశ్యప్రపంచమునకు ఏకైక మూలకారణమైన 'ఆత్మ' నెఱుఁగుటయే.

ఋణానుబంధమున నీవు నన్ను జేరితివి. అట్టి ఋణానుబంధమును పాటింపుము. ఏజీవి నీదగ్గఱకు జేరెనను ఆ ఋణబంధమును పాటించి యుక్తవిధమున నాదరింపుము. దేవుని తరిమివేయకుము. ఆకలినొందిన వానికింత అన్నమిడుము, దప్పిక నొందినవానికి కొంచెము నీరము త్రావఁబెట్టుము. వస్త్రహీనునకు వస్త్రమిమ్ము అపుడు దైవము సంతోషించును. జనులయెడ కటువులను బలుకకుము– అరువకుము– కలహించకుము. ఇతరులు నిన్ను నిరసించి, నిందించిన ఓర్పుతో సహించుము. నెమ్మదిగపలుకుము– సుఖశాంతులకిదియే మార్గము. ఇతరులు– ఈ ప్రపంచమంతయుఁ దలక్రిందులుకానిమ్ము– దానిని పాటించక నీవిధానమును గుర్తించుకొనుచు చలింపక ప్రవర్తింపుము. నిన్ను నన్ను (మనల నొండొరులను) వేర్పఱచు భేదకుడ్యముకలదు– ఈగోడను [తెరను] కూల్చివేయుము, దైవము సర్వనియంత– మహాప్రభువు. 'అల్లామాలిక్' ఆనామి చెయ్యులు– లీలలు అత్యద్భుతములు– అమూల్యములు– శాశ్వతములు– నీఆశయము క్రమముగ పరిణతినొందును. పరస్పరప్రేమచే మనమిరువురము ఆనందముఁ బడయఁగలము." అని బాబా హేమాద్రిపంతునకు బోధించినాడు.

[ఏమీ' నిన్ను పేక్షింతునా? గ్రంథమున హేమాద్రిపంతు వృత్తాంతమునుచూడుడు.]

దేవుడు (దైవము)ఎవరు? ఎట్లుండును? అను ప్రశ్నమునకు సమాధానము పలుకులతో వివరింపనలవికానిది. అది ఎవనికివాఁడు హృదయమున ఎరుక పడయవలసినదే.– అని బాబా తెలిపినది. జీవి, తన స్థితి నుండి దైవస్థితికి వృద్ధినొందవలయును. 'సర్వభూతాత్మ– భూతాత్మ'– కావలయును. అపుడు 'దైవ'మెవరో తెలిసికొనఁగలఁడు. శ్రీసాయీ మహాప్రభువు తనభక్తుని హృదయమున ప్రవేశపెట్టిన ఆప్రేమ స్ఫులింగమువిసరి, విసరి పెంపొందించుకొని మహాప్రేమజ్యోతిగ జేసికొనుటయే– ప్రేమజ్యోతిగ పరిణామమునొందుటయే 'దైవము'– అన–

ప్రేమ- ప్రేమ కంటె వేరు కాదు- దానిస్పర్శ సోకిన సకలము ప్రేమగ పరిణమించును. ఎట్టి నీచాతినీచమైన జీవమైనను ప్రేమస్వరూపుని శక్తిని గ్రహించితీరును. అపార ప్రేమస్వరూపుల ఎదుట- అతిక్రూర స్వభావము గల పులులను హంతకులనుసైతము మార్పునొందించి ఆ క్రౌర్యగుణములను బెదబాపితీరును. ఏ జీవాత్మ శక్తినంతయు- ఆకర్షణీయము- మహాయంత్రమైన ప్రేమ బయటనో అట్టివస్తువే 'దైవము' అని గుర్తించి, దైవమును ప్రేమగా నిరూపింపగలము. 'దైవము ఎవరు?' అను ప్రశ్నమునకు వేరుసమాధానము లేదు, ఆ ప్రశ్నమునకు బాబా తెలుపు సమాధానమిదియే

---

## 5. మతము - లోకసామాన్యజ్ఞానము (ప్రపంచజ్ఞానము)

ప్రపంచజ్ఞాన మనునది యేకొలదిమందికి మాత్రము ప్రత్యేకముగ దత్తమైనదని కొందరు భ్రమపడి తలంతురు. అది వైశమ సరిదిద్దదగిన పొరపాటు. ప్రపంచజ్ఞాన మనునది ఒక ప్రత్యేకమైన శక్తి కాదు. మానవుడు తనజీవితమున వివిధవిషయములను నాటి మానవుల ప్రవర్తనలను వానిఫలితములను- లేక ప్రకృతియందు గ్రహించు విషయములను సావధానముగ గమనించి, తన సామాన్యమానసిక శక్తుల పురస్కరించుకొని, ఆయాఅనుభవములను పరిశీలించి ఆవ్యక్తి తనస్వానుభవమున ఒకనిర్ణయమునకు చేయుటయే ప్రపంచజ్ఞానము.

'మతము'- అనునది మానవకల్పితము- కావున మానవుని లోకజ్ఞానము 'మతము' అనిపలుకబడును, అది ఒకనియమబద్ధమగు మానవుని ప్రవర్తనము. ఆయాదేశముల- ఆయాకాలముల మానవ(ధార్మిక) మతజీవనవిధానములు పెక్కుమార్పులు పొందినవనుట నిస్సందేహము.

అట్టిప్రవర్తనాపద్ధతులలోని మూలసూత్రములను ఆధ్యాత్మిక తత్త్వ సిద్ధాంతము లందురు. ఒక్కొక్క కాలమున ఒక్కొక్క దేశమున ఇట్టి సిద్ధాంతములు ప్రకటమైనవి. వీనిలో నొకసిద్ధాంతమును మాఱియొకటి త్రోసిరాజనుచున్నది. తక్కిన మతములన్నిటికంటె హైందవ-క్రైస్తవ సిద్ధాంతములలో మానవజీవితము దుఃఖభూయిష్ఠ మైనదనియు, ముఖ్యాముగ మానవుఁ డిట్టిదుఃఖసముద్రమును తరించి, శాశ్వతశాంతి సుఖానందదాయకమగు స్వర్గసీమను జేరుకొనదగు"నని తెలుపఁబడినది.

ఈ 'మతము'- ఈసకలజగత్తు దుఃఖభూయిష్ఠమను మతము [Pessimistic], దీనికి భిన్నమైనది- సకలజగత్తు మేలుకొఱకే ఉద్దేశింపఁబడినది అనుమతము- [Optimistic]. పెక్కుదేశముల పెక్కురు జనులు- 'మానవజీవితము దుఃఖభూయిష్ఠమైనది'- అను భావమును ప్రతిఘటించినారు, ప్రతిఘటించుచున్నారు. జీవితము దుఃఖభూయిష్ఠమే యైనజనులు వైళమ దీనిని సంతోషముతో త్యజించి యుండెడివారే- కాని, ఎట్టికష్టములకు దుఃఖములకు పాలగుచున్నను ఎవ్వరును జీవితమును త్యజింపఁదలపరు. ఎన్నెన్ని కష్టదుఃఖపరంపరలు పైఁబడుచున్నను, జనబాహుళ్యము వానినన్నిటిని ఓర్పున సహించుచు శాంతిసుఖ సంతోషానందములకొఱకే నిరీక్షించుచు ప్రాకులాడుచున్నారు. ఈజగత్తు మనమేలునకేఅనుమతము ఆత్మసంతృప్తిగల ఆస్తికమతము- దేవుఁడున్నాఁడు. అనువిశ్వాసము-ఆత్మ సంతృప్తిగలమతము. (ఆస్తికత్వాత్మ సంతృప్తులుగలమతము)

ఆస్తికత్వము- దైవముకలఁడను విశ్వాసము, దైవముతో సంబంధములేనిది- 'మతము'- కానేరదు. అట్టిది కేవలము వ్యర్థమురహాంకారము. ఈవిశ్వమున ప్రకటములగు వివిధాద్భుత దృశ్యానేకములను సావధానముగ గమనించుచు, తమతమ జీవితములందు అనుభవరూపమున తాముపొందు విచిత్రసంఘటనలను పరిశీలించువారు వీనికన్నిటికి

మూలకారణమైనది ఇట్టిట్టిదని— అనిర్వాచ్యము— అవ్యక్తము—దయామయమై మహోన్నతమగు ఒక శక్తి కలదనియు, వ్యక్తిగతజీవితములలో సమనుభూతములగు సుఖానందాదులా మహాప్రభువు— నియంత— దైవము యొక్క ప్రభావమేయగునని విశ్వసింతురు.

కావున ఆస్తికమతానుయాయి దైవమునకుఁ గృతజ్ఞుడై భగవదాజ్ఞలను— నియమితధర్మములను ఎల్లెడ గమనించుచు తనకు—మానవసమాజమునకు క్షేమము కలిగించువిధమున అనుసరించుచు, దైవాజ్ఞలను తాత్కాలికముగగాక— జీవితకాలమంతయుఁగాని సాధ్యమైనంతవరకు పాటించుచుండును. పలువురు హైందవమతమునుగూర్చి, ఈప్రపంచము దుఃఖభూయిష్ఠముగ భావించు మతమని తలంచుచున్నారు. అది సత్యదూరము— భ్రాంతిమూలమైనభావన. వాస్తవమునకు అటుల పలికి పలుకుచున్నవారయ్యును, వారి ప్రవర్తనలలో— అనుభవములలో వారు ఆస్తికులలో చేరినవారే యగుచున్నారు. కొందఱు శ్రుతిస్మృతి శాస్త్రగ్రంథములలోని [శ్లోకములను] ఘట్టములను తమవాదమున కనుకూలమగు విధమున తారుమారుచేసి యపార్థములను గల్పించుచున్నారు. అధునాతనకాలమున వెలువడిన శాస్త్రగ్రంథములలో నాస్తికమతవాదము నేటిమానవులలో నొక వైఖరి [fashion] (ఒక తరహా)యై ఆ మతవాదమునకు పుష్టి కలిగించుచున్నది.

ఇట్టివైఖరి తృప్తిపడి ఆమోదించదగిన విషయముకాదు. వ్యక్తిపరముగ దైవమునెడ నిర్వంచితబుద్ధిగలిగి, శ్రీసాయీబాబా మొదలగు సాధుసత్పురుషులనుగూర్చి గ్రహించి, సత్యదృష్టితో పరిశీలించిన మానవునకు దుఃఖభూయిష్ఠమైనదో— కాదో బోధపడఁగలదు. ఋజుబుద్ధిగలిగి ఏవ్యక్తికావ్యక్తి కడచిన కాలమునందలి అనుభూతులను తనకు సంబంధించినవి స్మృతికిఁ దెచ్చుకొనిన అవి సుఖానందములుగనే తోఁచును.

రోగిష్ఠియైన మానవుఁడైనను వానికి గలుగు ఏసుఖలేశము లేని, మిక్కిలి ఆనందప్రదములగును. వాఁడు తిరిగి ఆరోగ్యముపొందు శక్తి ఆవ్యక్తిలోనే కలదు. ప్రతివ్యక్తియు జీవితమునందు ఆనందప్రాబల్యమునకు, సుఖానుభూతికి తగినసామగ్రి కలదనియు, సర్వప్రదాత భగవానుడనియు అంతదనుక ప్రసాదింపఁబడిన వికాసములకు-ఇతోధికముగ తనకు దనవారికి సుఖానందములను సమకూర్చుకొనుశక్తిని ప్రసాదించువాఁడనియు ఆదైవమునకు కృతజ్ఞుఁడై మెలఁగుచుండవలయును. జగత్తు దుఃఖమయము' అని తెలుపుటకు అధునాతన సిద్ధాంతములను పేర్కొనవలసినపనిలేదు. సనాతనసిద్ధాంతములను గమనించిన చాలును. ఉదాహరణమునకు ఉపనిషత్తుల సారమైన భగవద్గీతలను గనుఁడు. భగవద్గీత-ను మానవజీవితము దుఃఖభూయిష్ఠమని- దీనిని విసర్జించుమని తెలుపుటలేదు. ఈసందర్భమున మనము పరిశీలింపదగిన వాక్యములు రెండు గలవు.-

1. "అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్" అశాశ్వతమును సుఖహీనమైన ఈలోకమును పొందిననీవు నన్నుశరణొంది సేవింపుము.

2. "మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః
మహాత్ములు జీవితగమ్యమును జేరినవారై నన్నుఁ [భగవానుని] బొంది దుఃఖాలయము, అశాశ్వతమునగు ఈ ప్రపంచమున మరల జన్మించరు.

ఈరెండవవాక్యము మొదటివాక్యము పునరుక్తియే. ఏ గ్రంథమునసైన సందర్భమును గమనింపక ఏదేనొకతావునఁగల వాక్యమును గైకొని అదియే గ్రంథకర్త అభిప్రాయముగ మనము నిర్ణయించుకొనరాదు. ఇచట సందర్భమును ముఖ్యముగ గనునింపఁదగినది. భారత యుద్ధారంభమున అర్జునుఁడు, ఆయుద్ధమునఁ దాను గెలుపొందిన-

ఓడినఁ దనకు గలుగు శ్రేయ మేమియుఁ గానరాదని విషాదమును వెలి పుచ్చినాఁడు.

శ్రీకృష్ణుఁడు తెలిపినది అర్జునుని స్థితి. జీవితము దుఃఖమయమను మాట అర్జునుని భావము. సక్రమపథమున— నియమానుసారము ప్రవర్తించిన మానవజీవితము దుఃఖబాధాకరము కాదని తెలియఁజేయు పట్టులు భగవద్గీతలందు పెక్కులుగలవు. భగవద్గీతలు ఉపనిషత్తులసారము, వివిధకాలములందు వివిధసందర్భముల బ్రహ్మజ్ఞులైన పలువుర ఋషుల వివిధాభిప్రాయములకూడలి ఉపనిషత్తులు, మానవజీవితము దుఃఖబాధామయముగ ఉపనిషత్తులు తెలుపుచున్నవని మనము తలంచరాదు.

1] తైత్తిరీయోపనిషత్తునందుఁ దెలుపఁబడిన ఆనందములపట్టిక సకలసుగుణసంపదలు— సంపూర్ణారోగ్యముగల మానవయువకునితో ప్రారంభమైనది.

2) ఉపనిషత్తులందు మానవజీవితమునుగూర్చి విభజించునపుడు జీవితముయొక్క బీజము— సారము— ముఖ్యముగ 'ఆనందము'గనే తెలుపఁబడినది. మానవజీవితమునఁ దెలుపఁబడు 'జీవి' సచ్చిదానందము— అని పేర్కొనబడు 'బ్రహ్మము'నందు లయమొందుననియు నిరూపింపఁబడినది,

పంచకోశవిద్యయందు జీవికి ౫ కోశములు గలవని తెలుపఁబడినది. 1. అన్నమయకోశము 1. ప్రాణమయకోశము ౩. మనోమయకోశము 4. విజ్ఞానమయకోశము 5. ఆనందమయకోశము. మొదటి నాలుగుకోశములు కేంద్రము— మూలమైన ఆనందమయకోశమును— 'ఆనందమును'—ఆవరించి, యొకదానిపైనొకటి తొడుగుగనున్నవి ఇతర 4 కోశములను విస్మరించినపుడు— సుషుప్తి— గాఢనిద్రాసమయమున

మానవుడు- [జీవి] ప్రతినిత్యము దీనిని[ఆనందమును] అనుభవించు చునేయుండును.

8] బ్రహ్మము ఏది? అని ప్రశ్నింపఁబడునపుడు శిష్యుఁడు బ్రహ్మ పదార్థమేదియో- అన్వేషించును. అన్వేషకుఁడు- ఋషి- మొదట (బ్రహ్మము)అన్నమయమని తలంచి అది కాదని త్రోసివేయును. పిదప 'ప్రాణమయ'మనుకొని, కాదని దానినిఁ ద్రోసివేయును. తరువాత 'మనోమయ'మని- ఆవల 'విజ్ఞానమయ'మని తలంచి- అవి కావని త్రోసి వేయును. తుదకు ఆనందమే- 'బ్రహ్మము-దైవము'- అని నిర్ణయించు కొనును. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్'- ఆనందమే బ్రహ్మము- దైవము అను ఎఱుక నతఁడు పొందును. ప్రతిజీవియొక్క- ఆత్మ-'బ్రహ్మము- దైవము- పరమాత్మ'యొక్క- అంశమే. అభిన్నమే. ఏకమే. ఉపనిషత్తులయొక్క- ముఖ్యసారాంశమైన ఈభావమును గుర్తింపఁజాలిన వ్యక్తి- మానవజీవితము 'దుఃఖమయము- బాధాకరము'- అని చెప్పఁ జాలఁడు.

మానవజీవితమునకు సంబంధించిన ధర్మములను శాసనములను సక్రమముగ గమనించి ఆచరణమందుంచుకొనని యంతవరకు జీవితము దుఃఖమయము- బాధాకరముగనే యుండును. భగవదాజ్ఞల నుల్లంఘించుపట్టున బాధపొడచూపును, అటుల పొడచూపినబాధ ఆ వ్యక్తిని సక్రమధర్మమార్గమునకు మరల్చి అనుసరింపఁబంచును కావున మానవజీవితము దుఃఖభూయిష్ఠము అని పలుకుటకు సరియైన- సమర్థనీయమైన శాస్త్రాధారములేవియుఁ గానరావు.

శాస్త్రాధారములనటుంచి అనుభవములఁగూర్చి విచారించుదము- ఇక్కడ- అక్కడ- సర్వత్ర గురువులు పలువురుకలరు. మానవజీవితము బాధామయమైనదని పలుకుదురు, శిష్యుల నావిధముగ నమ్మింపఁ బంచుదురు, కొందఱు గురువులు ధర్మయుక్తముగ భగవదాజ్ఞలను

అనుసరించి వర్తించువాని జీవితము ఆనందమయమై, విధి[స్వధర్మ]నిర్వహణానందము బడయునని తెలుపుకుంది. లోకములోని జనులపోషణం బాటించక త్యాగబుద్ధితో రెండవతరగతిగురువుల సమాశ్రయించుజీవి విశేషమనశ్శాంతిఁ బడయఁగలఁడు.

శ్రీసాయీబాబా సద్గురువులలో చూడామణి. లోకములోని మూఢవిశ్వాసములను- అర్థరహితములైన ధర్మసూత్రములను ఆధారముచేసికొని ఈజగత్తు దుఃఖమయమనుభావమునఁ గ్రుంగి కృశించుచు జీవితమును వ్యర్థముచేసుకొనుచున్న వారి తలంపులను చక్కదిద్ది ఉద్ధరించుచున్నాఁడు. శ్రీసాయీప్రభువు భక్తులలో వివిధమతానుయాయులు కలరు. వారిలో పలువురు ఈసంసారజీవితము దుఃఖమయము- బాధాకరము అనుభావముకలవారే. కాని, వారలలో- నొకరిద్దరుమాత్రము తమ తలంపులను బాబాయెదుట విన్నవింపసాహసించిరి. ఉదాహరణమునకు నానాసాహెబ్ చందోర్కరునుగూర్చి పేర్కొందము.

ఒకసందర్భమున చందోర్కరు బాబాను జేరి 'బాబా! ఈసంసారము భయంకరమైనది. దీనినిఁగూర్చి తలంచుటకు నాకు బుద్ధి జనించుట లేదు.దీనినుండి నన్ను విముక్తునిఁజేయుము'-అని విన్నవించెను. [S.C.S. Para. 113, 114 చూడుడు]' చందోర్కరు మాటలు విని చిఱునవ్వు నవ్వుచు,

'నానా! నీపలుకులందొకింత సత్యమున్నను తక్కినవంతయు అసంగతము- అర్థరహితము. మానవుఁడు తనజీవితమున దుఃఖముల నుండి, బాధలనుండి విడివడుటకు, తప్పుకొనుటకు సంఘమును సంసారమును విడనాడి అడవులకు పఱుగెత్తిన అవి తప్పిపోవునని నీభావమా? అది కేవలము భ్రమ- అసంగతము- అసత్యము. నీవెక్కడకేగినను నీతనువు- నీమనస్సు నివెంటనే యుండును- నిన్ను విడనాడవు. నీవెందెందు జననను నీతనూమనములు ప్రతిష్ఠలమున ఏవేనొకరూపములగు

సంతోషదుఃఖములను కలిగించుచునేయుండును. ఈ తనువున్నంత వరకు దానిప్రారబ్ధకర్మరూపములైన సుఖదుఃఖములను కలిగించితీరును. కావున ప్రారబ్ధమూలములై మనకాపాదించు సుఖదుఃఖాదులను ధైర్యము ఓర్పుతో నెదుర్కొనుచు సక్రమపథమున జీవితము గడుపుటయే ఏకైకమార్గము– తరుణోపాయము'– అని బాబా తెలిపినాడు.

పునర్జన్మమునుగూర్చి పలువురు భయాందోళన మొందుదురు, బాబా తన– ఇతరుల పూర్వజన్మములను పెక్కులఁగూర్చి తెలిపినాఁడు. ఏఒకసందర్భముననైన నది దుఃఖభూయిష్ఠమని ఒకజన్మమునుగూర్చియైన దుఃఖమయమని పలికియెఱుఁగఁడు. మఱల తాను జన్మించుదు ననియుఁ దెలిపినాఁడు. తనఆశ్రితుఁడు– భక్తుఁడు అగువాఁడు గమ్యముఁజేరునంతవరకు తాను మఱల మఱల అవతరించి, వానికి పురోభివృద్ధిఁ గల్పించుచు రక్షించుచుందునని అభయమిచ్చినాఁడు. తన ఆశ్రితులకు యోగక్షేమములనురమకూర్చుచు నెన్నిజన్మములనైన వారిని విడనాడక వారినందఱ సముద్ధరింతునని తెలిపిన బాబాయొక్క జన్మము దుఃఖమయము కానేరదు. వివిధావతారములను దాల్చుదైవము వ్యసనసంకటములకు లోనగుచున్నాఁడని పలుకతగదు.

"విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తో మహాన్ సంకటే
బ్రహ్మా యేన కులాలవత్ నియమితో బ్రహ్మాండభాండోదరే.
.......................తస్మై నమః కర్మణే"

భర్తృహారి కర్మమునుగూర్చి పలికిన పలుకులివి. దీనిని కవితా చమత్కృతిగ భావించవలయును. "దైవము కర్మబలమున పదిమాఱులు జన్మింపవలసి వచ్చినది."– అనిచెప్పుట అసంగతము. (వేదాంతదేశికుల వారి దయాశతకము 85 వ శ్లోకముఁగనుఁడు.) దైవ మెప్పుడెప్పుడు అవసరమని తోఁచునో అప్పటికప్పుడు తన ఇచ్ఛాపూర్వకముగ ఆత్మమాయ నధిష్ఠించి అవతరించుచుండును.

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

(భగవద్గీతలు- 4-7,8.)

దైవము మానవరూపమున తన యిచ్ఛానుసార మవతరించినప్పుడది బాధాకరమని యెవరును చెప్పరు.

కావున జీవితము సత్ప్రవృత్తకార్యకలాపనిర్వహణార్థము నియుక్తమైనపుడు- ఉదా. శ్రీసాయీబాబా తన ఆశ్రితులను- భక్తులను సముద్ధరించుటకై మరలమరల జన్మించునపుడు, అట్టి పునర్జన్మము దుఃఖమయము- బాధాకరమని చెప్పుట హాస్యాస్పదము. వాస్తవమునకు ఇతరులకొఱకై తాను బాధపడుట అనునది ఆనందదాయకము, అట్టి మహోన్నతమైన ఆనందమే పరమశాంతి- మానసికశాంతి- దేనియందు ఆసక్తి వహించక- ద్వేషించక [రాగద్వేషములులేక] నిస్వార్థబుద్ధితో తనవిధులను నిర్వర్తించుచు నైతికధర్మమార్గమున జీవితము గడపుచు ఈజీవితమున మానసికశాంతి పొందఁగలిగినంత పొందుచు భవిష్యజ్జీవితములనైన పరహితాచరణబుద్ధితో మంచిపనుల నాచరింపఁగలసమర్థత- శక్తి సమకూర్చుకొనఁగలవాని జీవితము తేజోమయము- ఆనందమయము నగును. అట్టి ఆశయవిధి నిర్వహణాలతో-నిస్వార్థసేవలతో గూడిన జీవితములపరంపరలు శాంతిసుఖానందమయములు- సాధుసత్పురుషులగువారు వారిపూర్వభవిష్యజ్జన్మములను గుర్తింపఁగలరు, వారిజీవితము లానందమయములే. కావున శ్రీసాయీప్రభువు తనపలుకులద్వారా పనులద్వారా మానవజీవితము దుఃఖమయము బాధాకరము- అనుసిద్ధాంతమును పటాపంచలు గావించినాఁడు.

ఈజగత్తు దుఃఖమయము అనుమతసిద్ధాంతముయొక్క- మఱియొక రూపము 'మానవద్వేషము', మనుష్యసంబంధమునుండి దూరముకావ

లయుండనుట. యోగాభ్యాసకులగువారు మానవసంబంధములను పరిత్యజించి, ఏకాంతముగ వసింపవలయునని తెలుపుఆధ్యాత్మికగ్రంధములు పెక్కు గలవు. ప్రారంభదశయందు సాధకులకు దెలుపఁబడినవియే సత్యములని కొందఱు నిర్మానుష్యములైన అరణ్యములకు కొండగుహలకుఁ జేరి, దినములు, వారములు, నెలలు, సంవత్సరములు దేహవిస్మృతి గలిగి తపస్సు చేయఁదగునని భావింతురు. ఇది అనుభవవిరుద్ధము, ఆచరణము న్సాధ్యము. అటులఁ గావింపఁజూచువాఁడు మానసికముగ దైహికముగ బాధలపాలగును. తుదకు ప్రాణహానియుఁ గలిగిన కలుగవచ్చును. ఇట్టిభావము కలుగువ్యక్తి ప్రపంచజ్ఞానశూన్యుఁడు. శ్రీ సాయిబాబా మొదలగు సత్పురుషులిట్టితలంపులు తగవని తెలిపినారు. ఇట్టిది కోటిజనులలో నొకరికి సాధ్యమగునో? కాదో? మానవసమాజమున నివసించువాఁడు నిర్మానుష్యప్రదేశమున నట్టిసాధనకై అన్వేషించుట అసంగతము- దుర్ఘటము. మనమెక్కడకు వెళ్ళిన మనమనస్సు- దానిపూర్వవాసనలతో సంస్కారములతోఁగూడినది మనవెంటనే యుండును. దానిభావములను ఆశయములను తలంపులను సమకూర్చుకొనుచు నేయుండును, ఎంతవారును దానినుండి తప్పుకొనఁజాలరు. మానసమున హత్తుకొనిన భౌతికవిషయములనుండి ఎవరును విడివడఁజాలరు.

ఒకకవి యుల్లేఖించినటుల 'నీవు నాదగ్గఱనుండి యెగిరిపోవఁదలఁచిన నీకు ఱెక్కలు నేనేయగుదును'- అనుపలుకులు సత్యము. మనస్సు తననుండి అది తప్పుకొని దూరముగాఁ జూచును. కాని, అది అంత త్వరలో- సాధ్యమగునని కాజాలదు. సక్రమాభ్యాస వైరాగ్యములచే క్రమక్రమముగ తనప్రకృతినిఁ గొంతవరకు మార్చుకొనవచ్చును. ప్రకృతినుండి సంపూర్ణముగ విడివడుట దుస్సాధ్యము. కుటుంబము- బంధుమిత్రులు- మానవసమాజము- తమఆత్మకు ప్రతిబంధకములని ఆధ్యాత్మికపురోభివృద్ధినొందు పరమాత్మావలోకనము- పరమాత్మైక్యము

నవు వీరందరు అస్థిరులుమరని పలువురు తలంతురు. వీరందఱిసంబంధము లోకనాటం గలిగినవి కావు. ఒకనిమేషమైన విడివడి పోవునవి యుంగావు– ఇవియన్నియు ప్రతివ్యక్తియొక్క ప్రకృతిలోని భాగములు అంశములై నిలిచినవి. వానిని పాటించితీరవలసినదే. వారివారిని నియతవిధమునం గ్రహించి, సక్రమపద్ధతిని వారిని వినియోగించుకొనిన అవి యన్నియు ప్రతిబంధకములగుటకు మాఱుగ ఆధ్యాత్మిక సౌధారోహణమునకు సోపానములుగ పరిణమించితీరును.

ఉదాహరణార్థము 'ప్రేమ'నుగూర్చి పరిశీలింతము. మానవుండు సాధారణముగ తనభార్యను, బిడ్డలను, తలిదండ్రులను, అన్నదమ్ములను, అక్కచెల్లెండ్రను, బంధుమిత్రులను ప్రేమించుచుండును. కాని, ధృత్యుత్సాహసమన్వితులై ఒక ఉన్నతస్థానము పొందంగోరువారి సాంసారిక వ్యాసంగములు ఉత్తమోత్తమాశయముల బడయుటకు ప్రతిబంధకములను తలంపున వానినుండి దూరమగుటకు కాంక్షింతురు. ఈవిషయమునుగూర్చి సాధుసత్పురుషులు శ్రీ సాయిబాబా వంటివారు చర్చించి, వారి నిర్ణయములను ఆధ్యాత్మికముగ అభివృద్ధి పడయగోరువారు గుర్తించి అనుసరింపందగును. అట్టి సాధుసత్పురుషులు తమ ఆశ్రితులకు వేర్వేరు సమయములనందించిన సందేశములం బాలించుటకంటె చేయదగినది వేఱులేదు.

ఈసంసార ప్రతిబంధకములంగూర్చిన ప్రమాణవాక్యములు–ఆచార్యవర్యులు తెలిపిన విషయములను గనదగును. ‘కాతేకాంతా? కస్తే పుత్రః? సంసారోఽయమతీవవిచిత్రః’ ఇది శ్రీ శంకరభగవత్పాదులు మోహముద్గరునకు కావించిన ఉపదేశము. [నీభార్యయెవతె? నీపుత్రుడెవండు? ఈసంసార(బంధ)ము అతి విచిత్రమైనది'– అని యెల్లప్పుడు తలంచుము] ఈమాటలు సన్న్యాసులకుం దెలుపంబడినవి. పూర్వాశ్రమజీవితమునువిడిచి, నూతనాశ్రమమును స్వీకరించి, అందునూతనా

శయములతో ఆధ్యాత్మిక పురోభివృద్ధి నొందఁగోరువారివిషయము కాని, ప్రస్తుతఆశ్రమము- బ్రహ్మచర్య- గృహస్థాశ్రమమునుండి ఆధ్యాత్మికపురోవృద్ధి నొందఁగోరువారికీ ఉపదేశములు సమన్వయింపవు.

భార్యయెడ ప్రేమ- అనువిషయముఁగనుడు, సామాన్యసాంఘిక జీవనమున, భార్యయెడప్రేమ దోషముకాదు. కాని, సర్వసాధారణముగ ఆధ్యాత్మికపురోవృద్ధికి భార్య ప్రతిబంధకమే యనుట సత్యము- గృహస్థాశ్రమమునందుండియు దైవధ్యానము- ఆధ్యాత్మికాభివృద్ధి పొందువారునుగలరు. శాస్త్రములననుసరించి భార్యను ఒక క్రీడావస్తువుగగాక, సహధర్మచారిణిగ గ్రహింపఁదగునని విదితమగుచున్నది. గృహస్థుఁడగువాఁడు తానుగావించు సాంఘిక- మత- ధర్మాచరణ కృత్యములందు-కుటుంబపోషణము-అతిథి అభ్యాగతసేవలందుభార్య,భర్తకు సహాయకురాలుగ తోడుగ- పనుల నిర్వహించుటకై నిర్దేశింపఁబడినది. ఆదృష్టితో విచారించిన గృహస్థుఁడగువాఁడుభార్య కలవాఁడైయుండుట ప్రతిబంధకముకాదు,

ఇఁక పుత్రునితోడి సంబంధమైనను ఇదేవిధము, పురాణశాస్త్రములననుసరించి 'పుత్'అను నరకమునుండి రక్షించువాఁడు- పుత్రుడు. ఏవ్యక్తియైన తనవంశమును పుత్రునిద్వారానే నిలుపుకొనవలయును. వంశగౌరవము- ప్రతిష్ఠ. ఆశయములు- విధులు- చెడనీయక నిలిపి నిర్వర్తింపఁజేయు వాఁడొకఁడుండవలయును. కుటుంబయజమాని చరమదశనొంది, నిస్సహాయస్థితియందున్నపుడు ఆధారభూతుఁడై సేవఁజేయువాఁడొకఁడు కావలయును. సంతానమునెడ ప్రేమఅనునది సకల జీవములందు సహజముగ పాదుకొనినదే. మాతృప్రేమయెట్టిదో క్రూరమృగాదులైన వ్యాఘ్రాదులందు గమనింపుడు. ఈవిశ్వమును ప్రసవించిన ఆదిమాత జగజ్జనని విషయమెట్టిదో కనుడు.

"సో అకామయత-బహుస్యాం ప్రజాయేయేతి" ఆబ్రహ్మమిటు లిచ్ఛించెను- "నేను పెక్కురైసంతానమును బడసెదగాక!"-అని బ్రహ్మ

ము యొక్క సంతానకాంక్ష యే ఈ విశ్వమునుగనెను. ఆ సంతానకాంక్ష యే ప్రతిజీవియందు నేటికివివర్ధిల్లుచు- సంతానప్రేమ మానవ-పశుపక్ష్యాది మార్జాలాది జీవచయంబులందు సాగుచున్నది- అట్టికాంక్ష-ప్రేమ ప్రకృతియందు 'లోపము'అనరాదు. అది నిరోధింపఁదగినది కాదు. అట్టికాంక్షను అణచికొని, తగుమాత్రముగ క్రమపద్ధతిని మఱియొకవిధముగ మార్చుకొనఁదగినది. అంతేకాని ఆసంతానేచ్ఛను పూర్తిగ నిర్మూలించుట- సంతానము నెపభయాందోళనలఁ బొందుట యెందునుగానము. ధనకాంక్షచేత బిడ్డలనుచంపుకొను నీచులెందేని నుండిన నుండవచ్చును. అట్టివారు రాక్షసపిశాచభావులు కాని ధార్మిక మతజనులు, ఆదర్శప్రాయులుమాత్రము కాఁజాలరు.

ఇతరప్రమాణము లెటులుండనిచ్చి ప్రేమతత్త్వము- ప్రేమహృదయము ఉదారమైనది, ప్రేమపూరితుఁడైనమానవుఁడు ప్రేమశూన్యుఁడైనవానికంటె వేయిమడుంగులధికుఁడు. ప్రపంచమునగల సకలమతములు 'ప్రేమయేదైవము' – 'దైవమేప్రేమ'-అని చాటుచున్నవి. ప్రేమ ఆనందముగ ప్రకాశించును. దైవము ప్రేమస్వరూపుడు– ఆనందస్వరూపుడు. విశ్వమున సకల వాఙ్మయములందు ప్రేమయే దైవమని భాషింపఁబడుచున్నది, 'దైవముప్రేమ'అనుటలో భావమేమి? 'దైవము' అననేమి? ఈవిశ్వమునకు మూలము దైవమని సకలశాస్త్రములు తెలుపుచున్నవి. మన అనుభవమును సర్వసామాన్యపదములలో తెలుపఁదలచిన దైవము. విశ్వపిత– సకలజీవములకు జనని–జనకుఁడు అనియే మనము చెప్పుకొనఁదగును.

జనకుఁడు (లేక) తండ్రి మానవుఁడుగాని- దైవీసంపత్తుగలవాఁడుగాని తనబిడ్డలను ప్రేమించును. తనసృష్టిలోని జీవములనన్నిటిని దైవముసమానముగ– నిష్పక్షపాతబుద్ధితో ప్రేమించును అని సకల మతములు చాటుచున్నవి. కాని, మనలో కొందఱు 'ప్రేమ' అనునది ఆధ్యాత్మికపురోవృద్ధికి ప్రతిబంధకము అని నిరసించుచున్నారు. ఈప్రేమ

బంధమునుండి విడివడఁజూచుచున్నారు- మనఆత్మనుండి ఈప్రేమనే దూరముచేసితిమా- ఇఁక శేషించునది లేనే లేదు. హృదయమునుండి ప్రేమను తొలగించిన దైవమే అటనుండి తొలఁగును- దూరమగును. ప్రేమ- పరమానందమగుటచే ప్రేమ శూన్యహృదయము పాషాణ సదృశము. ఎట్టి అనాగరికులైనను ప్రేమను ఆదరింపక- ప్రేమజూప నేరక దయారసములేని పాషాణహృదయులుగనుండుటకుఁ గోరరు.

కొలఁదిగ ఆస్తిసంపదలు కలిగి, అవి తనబిడ్డలకు ప్రాపంచకావసరములు దీర్చుకొనుటకు దక్కవేమో! చాలవేమో! అనుతలంపులు గలవాఁడు- తనసంపదల నితరులపహరింతురేమో'- అని తలంచువాఁడు తనబిడ్డలనిమిత్తమై యితరులను ద్వేషించి, వారియెడ అన్యాయవహించును. ఇట్టిది ప్రత్యేకప్రేమ ప్రత్యేకస్నేహబంధము. స్నేహబంధము- ప్రేమకాఁజాలదు ప్రేమయందు స్వార్థపరత కలుగరాదు. పవిత్రము నిర్మలమైన ప్రేమపట్టున ద్వేషవాసనలు పొడచూపరాదు. తమహృదయములను ప్రేమపూరితముల గావించుకొనఁగోరువారు ద్వేషాంకురములకుఁ దావీయక ఎప్పటికప్పుడున్మూలించుచుండవలయును.

తనసంతానమునెడ ప్రేమ, తదితరులయెడ ద్వేషముగా పరిణమింపకుండఁజేయుటకు ప్రతివ్యక్తి తనకు- తన సంఘమునకుగల బాధ్యతలను- తాను గావించదగినవిధులను తఱచుగ స్మరణకుఁ దెచ్చుకొనుచుండవలయును. ద్వేషమునకు తావొసంగుట విషమును స్వీకరించుటయే. ఏలయనేని ద్వేషభావమునకుఁదావొసంగిన ఆవ్యక్తియొక్క- సహజస్వభావము కళంకితమగుచుండును. అన్యద్వేషముగలవాఁడు దుఃఖభాగుఁడగును, ద్వేషముగలతావున తాత్కాలిక విషయములందైన రక్షణ- సుఖ-శాంతులకు భంగము ఎప్పటికప్పుడు పొడచూపుచునే యుండును. ద్వేషరహితుఁడైనవాఁడే ఎట్టి అపాయములు లేనివాఁడు.

“యస్మాన్నోద్విజతేలోకోలోకాన్నోద్విజతేచ యః” [భ.గీ. 12-15]

జడియకుండు నెవ్వానికిజగములన్ని
జగములన్నిటికెవ్వఁడు జడియకుండు.

అట్టివాఁడు నాకుప్రియుఁడని భగవానుఁడు తెలిపినాఁడు. ప్రేమ-పవిత్ర నిస్స్వార్థప్రేమ- త్యాగమునకు దారితీయును, త్యాగము-ద్వేషస్పర్శ ను లవమేనిఁబడయదు. ద్వేషముతో నెట్టిసంబంధమును వహింపదు, అపేక్షింపదు. ఏవ్యక్తియైన తనదైవమునకై త్యాగముఁగావించుచు నన్యులదైవమును ద్వేషించునేని,వాఁడు కావించుసేవాదులు పైశాచిక సేవలేయగును. ప్రతివ్యక్తి తనను- తనప్రవర్తనమును ప్రతిక్షణము పరీక్షించుకొనుచుండునేని, వానియందుఁగలప్రేమఇతో౽ధికముగ పవిత్రమై పెంపొందుచుండును. సామాన్యవ్యక్తి తనభార్యను, బిడ్డలను ద్వేషమునకవకాశము లేనివిధమున ప్రేమించుట సహజమేయగును. కుటుంబముతో జీవించువాఁడు ఇతరులయెడ ద్వేషబుద్ధి విడనాడి జీవించుట సుసాధ్యమేయగును, కుటుంబములతో జీవనముజరిపిన సాధుసత్పురుషులు ఆవిధానమును ప్రదర్శించినారు.

ఉదాహరణమునకు శ్రీరామకృష్ణపరమహంసభార్యతో జీవనము గడిపినాఁడు. ఈవిధముఁగ ద్వేషవాసనలూలేక ప్రేమమయులై గృహస్థజీవితముఁగడిపిన సాధుసత్పురుషుల చరిత్రములు మనదేశమున-పాశ్చాత్యదేశముల ననేకములుకలవు. తనకుటుంబముయొక్క- అవసరములు తీర్చుటయందు ఇతరులఅవసరములు తీర్చుటయందు-బాధ్యతలు విధి నిర్వహణములలో తారతమ్యములు లేకపోలేదు. ప్రాధాన్యాప్రాధాన్యములుకలవు, ప్రతివ్యక్తి తనశక్తిననుసరించి ప్రయత్నముచేయుకొలది స్వపరావసర విధినిర్వహణములు సమన్వయమునొంది జయము కలుగుచుండును. ఏసాధకుఁడైన గృహస్థుఁడేని తనకుటుంబమునెడ ప్రకటించుప్రేమను ఇతరులయెడ సాధ్యమైనంతదనుక విస్తృతముఁజేయుచుండవలయును, తనబిడ్డలను ప్రేమించువిధమున నితరులబిడ్డలను ప్రేమించనేర్వవలయును. సన్నిహితసంబంధములేనిదే ప్రేమ జనించదు.

2. ఉపాసనీబాబా విషయమై శ్రీ సాయినాథుఁడాయనను ఆధ్యాత్మికపరిపూర్ణునిఁ గావింపఁదలఁచి సంసారవిముఖునిఁగఁ జేయ ప్రయత్నించెను.

3. స్వవిషయమున కుటుంబముతోడి సంబంధము లేజన్మమున [పూర్వజన్మముల] ప్రతిబంధకములైనట్లు బాబా తెలిపియుండలేదు. పూర్వము ప్రతిజన్మమునందు తలిదండ్రులు- అన్నదమ్ములు- అక్క-చెల్లెండ్రు మొదలగు బంధుమిత్రులున్నటుల, వారందఱయెడ తనవిధ్యుక్తధర్మములను శక్తివంచనలేకుండ నిర్వర్తించినటులఁ దెలిపినాఁడు. ఒకజన్మమున ఇంటియజమానియగు అన్న,కుటుంబములోనివారినిపస్తులు పెట్టుచుండ, తానుశ్రమించి ఆకుటుంబమును పోషించినటులఁ దెలిపినాఁడు,

ఒకజన్మమున తనసోదరుఁడు వెలిపెట్టఁబడినపుడు బాబా శ్రమపడి ఆతనిని మరల నాతని వారికులమునఁ జేర్చుకొనునట్లు కావించినాఁడు. ఒకజన్మమున ఆయన తండ్రియొక్క వేఱొకభార్య [ఆమెను బాబా తనతల్లిగ భావించువాఁడు] ఆమెయెట్టి చెడ్డనడవడిగలదైనను- వ్యాధిగ్రస్తయగు నామెను తన తండ్రినిగురించి ఆమెయందు దయపఱపి పోషించి, వ్యాధిని నివారించెను. ఒకపుట్టువున బాల్యసఖియగు నామె మృతినొంది ప్రేతరూపమున నటమటించుచుండ నామె ఆత్మను శిరిడికిఁ జేర్చి, ఆధ్యాత్మికగ్రంథపఠనము వినుటకు వీలగుస్థానమున నిలిపినాఁడు. ఒకజన్మమున మిత్రులు ఆశ్రితులైన వీరభద్రప్ప- బసప్ప-గౌరి మొదలగువారికి తానుగావించిన వాగ్దానములనుపాటించి తగినసాయము వారల పునర్జన్మములందు కావించినాఁడు. (శ్రీ సాయినాథ బోధామృతము. (Charters and Sayings of Sri Sai Baba) గ్రంథమును పరిశీలించిన యిట్టివిషయము లనేకములు కలవు.

వీనినన్నిటిని సావధానముగ గమనించినయెడ, బాబా ఏసమయమునను సామాజికసంబంధములు ఆధ్యాత్మికముగ ప్రతిబంధకములని

తెలిపియుండలేదు. తనఆశ్రితులగు భక్తులను సంసారమును పరిత్యజింపుమనియు ఆదేశించియుండలేదు. కావున శ్రీసాయీ పదాశ్రితులైన వారు కుటుంబసంబంధములను ద్వేషింపక- తెగతెంపులు చేసికొనక ఆయా ఋణబంధములను గౌరవించి, సంకుచితబుద్ధినీడి, ఎల్లరయెడ కనికరము- ప్రేమఁబఱపుచు వర్తింపనేర్వవలయును బంధుమిత్రుల యెడ సాటిమానవులయెడ ప్రకటించుప్రేమ నుచితరీతినెల్ల జీవముల యెడ పఱపుచు క్రమక్రమముగ ఆప్రేమతత్త్వమును విశ్వవ్యాప్తము చేసికొనుచుండఁదగును. ఈవిధముగ మనకు సాధ్యమగునంతవరకు జీవితముగడుప నభ్యసించితిమేని మన కుటుంబబంధములు ప్రతిబంధములగుటకుబదులు ఆనందదాయకములుగ పరిణమించితీరును.

'మతము'—అనునది అతి విశాలమైనపదము- మతసంబంధమైన ప్రమాణములు అనంతములు- వివిధములు- విభిన్నములుకలవు. హైందవమతమునందును పెక్కుగ్రంథములుగలవు వానిలోఁగొన్ని కొన్నింటి నొక్కొక్క-శాఖవారు ఆదరింతురు. వీనిలో 'భగవద్గీతలు'— అన్నిశాఖల వారు ఆదరించి వారిదైనందిన కృత్యములలో ప్రమాణముగ- మతవిషయమున ముఖ్యముగ ఆధారముగ స్వీకరించుచున్నారు.

మానవుఁడు తనజీవితమున సకలమును పరిత్యజించి, మానవ సమాజమునకుదూరమై. ఏకాకిగ నిర్మానుష్యమగు పర్వతారణ్యప్రదేశములఁజేరి ఆత్మనిష్ఠయందుండి బ్రహ్మానందము ననుభవింపుమని భగవద్గీతలు బోధించుచున్నవో-లేక, మానవసమాజమునందుండి,పలువురతో భిన్నభిన్నవృత్తులందు పాల్గొనుచు ఎవనికివాఁడు తనవిధ్యుక్త ధర్మములందు- కార్యాచరణములందు తగుపాత్రత వహింపుమని తెలుపుచున్నవో విచారించఁదగును.

లోకసామాన్యజ్ఞానము పురస్కరించుకొని పరిశీలించిన సంఘమును- మానవసమాజమును పూర్తిగ బహిష్కరించుట- దూరమగు

టలు దుర్లభము దుస్సాధ్యము. సాధ్యమేయైననది ఉన్మత్తత, అసంబద్ధమునగును, ముక్కుపై పుండుకలిగినదానిని నివారించుకొనుటకు కంఠమును ఛేదించుకొనువాని విధమగును. భగవద్గీతలనే ప్రమాణముగ స్వీకరింపదలచిన ఈవిషయము తెల్లమగును. అర్జునుడు అతి విషాదమునొందినాడు. ఏమార్గమునబోవుటకు తోచలేదు అతడేమి కావించిన బాధ-పాపము— కష్టములే తోచుచున్నవి. ఏమార్గమువలంబించిన సుఖశాంతులు గానరాకుండెను. యుద్ధముచేసిన చేయకున్న మనశ్శాంతి గోచరించలేదు, అతడు చంచలనిస్పృహాయ స్థితియందుండి, తొలుత యుద్ధము చేయదలపక తనవిధ్యుక్తధర్మమునుండి తొలగిపోవనెంచెను. భగవానుడు గీతలద్వారా అతని తలంపును సరిదిద్ది, మానవుడు తననిధి ఎంతనీచమైనను, తనస్థానమునందానునిలబడి, విధ్యుక్తకర్మమును శక్తివంచనలేనివిధమున ఆచరింపవలసినదే. అని బోధించినాడు.

శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

తనధర్మము గుణవంతము— ఆకర్షణీయము— ప్రశంసనీయము కానిదైనను త్యజింపరాదు. ఆచరించితీరవలయును. స్వధర్మాచరణమునందు మృతియైనను శ్రేయమే. పరధర్మమునకు గడంగుట భయంకరము, నరకమునకు గొనిపోవునదియగును.

శ్రీకృష్ణప్రబోధితుడైన అర్జునుడు తన నిస్పృహ— విషాద స్థితినివిడనాడి [స్వధర్మమును త్యజించవలయునను బుద్ధినివిడిచి] తన క్షత్రియధర్మమాచరించుటకు— యుద్ధముచేయుటకు దృఢనిశ్చయుండయ్యెను. కావున భగవద్గీతలందే వేని కొన్ని తావులనేరి తీసికొని, వాని కపార్థములంగల్పించి, మానవుడైనవాడు ఆత్మనిష్ఠగలిగి, బ్రహ్మానందమగ్నుడు కావలసినదేకాని యితరములగు విధులాచరించరాదని శ్రీ

కృష్ణుఁడు బోధించినాఁడని పలుకతగను. అట్టి అపార్థములను భిన్నాభి ప్రాయములను బోధించుశ్లోకములు గీతలందు కొన్నికలవు.

భగవద్గీతలలోని ఆరవఅధ్యాయమున శత్రుమిత్రులను సమదృష్టిఁగనుచు నెల్లరియెడ సమత్వబుద్ధి గలిగియుండుమని శ్రీకృష్ణుఁడర్జునునకు దెలిపినాఁడు. దీనిననుసరించి, అర్జునుఁడు శత్రుపక్షము వారిని వధించినట్లు తన సోదరుని వధింపుమని అర్థముకాదు. బ్రహ్మానందరసమగ్నుఁడై, భగవానునందు లీనమైయుండ దగునని తెలుపఁబడిన సందర్భములు గీతలందు పెక్కులుగలవు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతి యోఽర్జున
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః

ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతేస్థితః
మనస్సంయమ్యమచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే.

యతేంద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదాముక్త ఏవసః.

ఇట్టిఘట్టములు— సర్వసంగ పరిత్యాగముచేసి ఏకాంతముగ నిర్మానుష్య ప్రదేశమునందుండి, యెట్టి కార్యకలాపములందు పాల్గొనక, యెవరియెడ నెట్టిసంబంధమును పెట్టికొనక— ఆత్మనిష్ఠ— ఆత్మావలోకనముగలిగి బ్రహ్మమునందు లయమొంది యుండఁదగునని తెల్పుబోధలు గీతలందెన్నేనియుఁగలవు. మానవుఁడై జన్మించినపిదప తన విధ్యుక్తధర్మ కర్మాచరణము సలుపకుండదగును— అను వాదమునకు భగవద్గీతలెప్పుడును ప్రమాణముకాను. ప్రతిమనుష్యుఁడు తనవిధ్యుక్త ధర్మమును సమాచరింపవలయుననియే భగవద్గీతలు శాసించుచున్నవి.

మానవులలో వివిధకక్ష్యలవారికి వారివారి పరిస్థితులు అవకాశములు అభిరుచులననుసరించి ఆచరింపదగు విధానములు గీతలందు బోధింపఁబడినవి. అవియన్నియు నెల్లరకు నెల్లవిధముల నెల్లవేళల ననుసరణీయములైన ధర్మములుగ దలంపఁదగదు. యుద్ధభూమియందు యుద్ధము చేయుచుండఁగువాఁడు మిత్రుని శత్రునిగ-శత్రుని మిత్రుడుగ తటస్థుడుగఁ జూచువాఁడు వాని తప్పిదమును వెంటనే గుర్తించఁగలఁడు. అట్టివాఁడు భ్రమితచిత్తుఁడై పడిపోవును. ఏబోధ యెట్టిసమయమున నెంతవరకు ఆచరణయోగ్యమో– అనుసరణీయమో నిర్ణయించుకొనగలుగునది యే ప్రపంచజ్ఞానము. [లోకసామాన్యజ్ఞానము]

మానవుఁడు పరిపూర్ణానందము ననుభవించుటకు కొన్ని విధానములు సూచింపఁబడినవి. వాఁడు ప్రథమమున అష్టాంగయోగములన భ్యసింపవలయును. [యమ- నియమ- ఆసన- ప్రత్యాహారధారణ– ధ్యాన- సమాధులు] గీతలలో ఆరవ అధ్యాయమునఁ దెలుపఁబడకున్నను ప్రాణాయామముఁగూడ కలదు. ఇతరఅధ్యాయములందు ప్రాణాయామముఁగూర్చి "ప్రాణాయామపరయణాః" అని తెలుపఁబడినది. ఆరవఅధ్యాయమున ఈఅభ్యాసయోగము చక్కగ వివరింపఁబడినది. ఇది అభ్యాసయోగతత్పరులు– శ్రేయస్కాములైన సాధకులకు మిక్కిలి ఆకర్షణీయముగనున్నది.

ఆరవఅధ్యాయమున 20–21 శ్లోకములు ఆత్మనిష్ఠకలిగి, ఆత్మయందు లయమొందినవారై ఆత్మానందమనుభవింతురని తెలుపఁబడినది. 22, 23 శ్లోకములందు అట్టిఆనంద ముత్తమోత్తమమని, దానిని పడసినపిదప నట్టి ఆనందమయునిని కదుఃఖములు– కష్టములు బాధింపవని తెలుపఁబడినది.

"తంవిద్యాద్దుఃఖసం యోగవియోగం యోగసంజ్ఞితమ్
సనిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా.

సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వాసర్వానశేషతః
మనసైవేంద్రియగ్రామం వినియమ్యసమంతతః

ఆ అధ్యాయముననే 25, 26 శ్లోకములందు మనస్సును నిలిపిన పిదప సాధకుఁడు దేనిని చింతింపరాదు. ఏవేవి తలంపులు పొడముచున్న ను మనస్సును ఆతలంపులనుండి మరల్చి, దానిని ఆత్మాభిముఖముఁ గావించవలయును- అని తెలుపఁబడినది. 27వ శ్లోకమునందు "ఇట్టి ప్రయత్నముచే ఆత్మప్రశాంతినొంది పరమాత్మ సంబంధమైన ఆనంద మునట్టి సాధకుఁడు పొందును"- అని, తెలుపఁబడినది. 28వ శ్లోకమున

"యుంజన్నేవ సదాత్మానం యోగీవిగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే.

ఈవిధముగ మనస్సునునిలిపిన యోగి బ్రహ్మసంబంధముచే మహా నందమును బడయును. అని తెలుపఁబడినది. ఈబోధలవలన సాధకుఁ డగువాడు బ్రహ్మమునుదప్ప దేనినిఁ దలంపరాదు. బ్రహ్మజ్ఞుఁడై బ్రహ్మము నందుండవలయునని తెలుపఁబడినది.

యుద్ధరంగమున నిలిచినవీరుఁడు తన రథసారథులనుగూర్చి, ధను ర్బాణములనుగూర్చి, శత్రువ్యూహాచలనములఁగూర్చి యోజించక ఆత్మ నిష్ఠుడైయుండిన, పరాజయమో- మృతియో కలిగితీరును. కావున శ్రీకృష్ణుఁడు యుద్ధరంగము నందర్జునునకు అపజయముగాని, మృతిగాని పొందుమని చెప్పలేదు. ఇవియన్నియు ఆసమయమున అర్జునునుద్దేశించి బోధింపఁబడినవికావు. ఎల్లరకు ఎల్లసందర్భముల వారివారి యోగ్య తలు- అభిరుచులననుసరించి, మానవుఁడు ప్రవర్తింపఁదగిన పద్ధతులకు సంబంధించిన వివిధ సత్యవిషయములుగల శ్రేయోమార్గమును శ్రీకృ ష్ణుఁడు బోధించినాఁడు. యోగసాధనమందు ఏకాగ్రత ముఖ్యమని తెలిపినాఁడు. అది ఆక్షణమున రథమునందుఁ గూర్చుండి యోగనిష్ఠ పొందుమని శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దెలిపినట్లు మనము భావించరాదు.

శ్రీకృష్ణుఁడు తెలిపినది "ఆతిష్ఠోత్తిష్ఠ భారత!" "తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః"- అనియే బోధించినాఁడు. గీతోపదేశానంతరము అర్జునుఁడు-

"నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయా ఽచ్యుత
స్థితో ఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ"-

అని, యుద్ధమాచరించుటకు కృతనిశ్చయుఁడైనాఁడు. శ్రీకృష్ణుఁడు అర్జునునకీ అష్టాంగయోగమునుగూర్చి తెలిపినది ఆతని కొఱకే కాదు. ఎల్లరనుద్దేశించి యనియే మనము గ్రహించవలయును. అర్జునుఁడైనను యుద్ధానంతరము విరామకాలమున ఆయోగము నభ్యసింపఁదగునని తెలిపినాఁడని మనము తలంచవలయును. అది యుద్ధసమయమున ఆచరణీయము కాదుగదా! అది యెల్లరకు అనుష్ఠింపఁదగినది. జీవాత్మను పరమాత్మయందు లయముఁగావించి నిత్యసత్యానంద మొందఁదగిన మార్గము.

ఈఅభ్యాస యోగనిష్ఠితుఁడైనవాఁడు సమత్వస్థితినొందును. మిత్రుఁడు-శత్రుఁడు; ఉన్నతుఁడు- నీచుఁడు అను భేదభావమాతనికి పొడకట్టదు. శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములాతని బాధింపవు. యోగాభ్యాసకుని పరిసరములు గాఢమైనశీతము, గాఢమైన ఉష్ణముకలిగియున్న అట్టి యోగాభ్యాసికి హానికరమే. సమాధినిష్ఠయందున్నపుడు శీతోష్ణములు మిక్కుటమైన ఆయోగి తిరిగి స్వస్థుఁడుకాజాలఁడు. యోగనిష్ఠయు సాధ్యముకాదు. కావున ప్రపంచజ్ఞానముగలిగి, అష్టాంగయోగమభ్యసించి సమాధినిష్ఠయందుండఁగలంత కాలము నిలువవలయును. చర్మరక్తమాంసములు వాని సహజస్థితి ననుసరించియుండును. విపరీత పరిస్థితులందు యోగానుష్ఠానము దుర్లభము. ఆకారణముననే భగవద్గీతలందు "యుక్తాహారవిహారస్య..." అని చెప్పఁబడినది. ఆహారము- విశ్రాంతి- పరిశ్రమము- నిద్ర మొదలగు తగినమాత్రము కలిగియుండవలయును. బాధా- దుఃఖనివృత్తికివి అవసరములు.

పెద్దవి- చిన్నవి- మచ్చికయైనవి- భయంకరమైనవి- సాధువులైన- అసాధువులైన జీవములయెడ- ఆయా పరిసరములందు లోకసామాన్యజ్ఞానము నుపయోగించి యీబోధ యెంతవరకు క్షేమకరమో గమనించదగునో సాధకుడగువాడు తనకుదాను నిర్ణయించుకొనవలయును. ఈ సమత్వదృష్టి తనకు ప్రాణహానికాని విధమున, విధి నిర్వాహణమునకు ప్రతిబంధముకాని మార్గమున సాధకుడాయాపట్టుల నభ్యసింపంగదగినదే ప్రతిమానవుడు అసాధ్యములకు దూరమగుచు సమత్వదృష్టిని తనజీవితమున నభ్యసింపదగును. మంచివారు చెడ్డవారు- సుగుణులు- దుర్గుణులు ఇత్యాదులందు సమానభావము కలిగియుండుటే సమత్వము. ఈ సమత్వదృష్టి వెన్వెంటనే ఆచరణమందుంచుట దుర్ఘటము. ఇతరజీవములకు హానిచేయకుండుట చెడునడవడిగలవారిని గూర్చి నిందించకుండుటలు అభ్యసింపదగును. మనశ్శాంతికొఱకు తనకు సంబంధములేని యితరవిషయములందు అనవసరము తలదూర్చదగనిది. ఒకరినిపొగడుట మఱియొకరిని తెగడుట తగనివనియు తెలుపబడినవి.

నస్తువీతననిందేత కుర్వతః సాధ్వసాధువా
వదతో గుణదోషాభ్యాం వర్జితః సమదృఙ్మునిః
(భాగ-11-11-16)

ఇతరులు మంచిగాని చెడుగానిచేయనీ,పలుకనీ స్తుతించక నిందింపక సమదృష్టిగలముని ప్రవర్తింపదగునని శ్రీకృష్ణుడుద్ధవునకు దెలిపినాడు. దోషులను శిక్షించునధికారము వహించి న్యాయపీఠమునందున్న న్యాయాధికారితప్ప తక్కినవారభ్యసింపంగ దగినవిషయమిది.

మన సహనశక్తిని పెంపొందించుకొనుకొలది సమత్వభావమును పెంపొందించుకొనంగలము, మన సహనశక్తిని (ఓర్పును) పెంపొందించుకొనుకొలది నిందాస్తుతుల-చలివేడుములను సైచగలము. 'సమలోష్టాత్మకాంచనః'- మంట్టిగడ్డను బంగారమును సమదృష్టితోఁ జూడఁదగు

నను విషయమును శ్రీకృష్ణుఁడు గీతలందుఁ దెలిపినాఁడు. ఇట్టి సమ దృష్టి నలవరచుకొనుటకు శ్రీరామకృష్ణ పరమహంస గంగాతీరమునఁ గూర్చుండి 'ఈమట్టిగడ్డ, ఈనాణెములు' సమమే అనుభావమును దృఢ పఱచుకొనుటకు వానిని గంగలో విసరివైచెను. మట్టిగడ్డను గంగలో వైచిన నష్టమేమియు లేదు. నాణెములను [బంగారమును] గంగలో పాఱవైచిన వానియందు అట్టి అనాసక్తిని అలవఱచుకొనవలయును, మట్టియం దెట్టి అనాసక్తి కలదో కాంచనమునందు అట్టి అనాసక్తి కలిగించుకొనవలయును. ఈధనమున్నను పోయినను ఒకటే అను నిర్లక్ష్యస్థితి కలుగవలయును, శ్రీ రామకృష్ణపరమహంసయు ఈవిధానమున సందేహామొందెను. కాంచనమనిన లక్ష్మీదేవికదా! ఆతల్లిని అసూయాభావమునఁ జూచిన కోపించి, అట్టి నిరసన భావముగలవారికి దారిద్ర్యబాధలు కల్పించి శిక్షించునేమో! అను సందేహము పొందినాఁడు. పరమహంసకు తోచినభావమేకాక యిట్టి నిర్లక్ష్యభావమున నింకను పెక్కుబాధలు కలవు. కాని, ఈసమత్వభావమును పెంపొందించుకొనుకొలది ఆసమత్వ దృష్టి దృఢపడును. ఏనాటికైనను అట్టి నిరపేక్ష- అనాసక్తి- భావముఁ గలిగించుకొనఁదగినది గీతలలోఁ దెలుపఁబడిన సమలోష్టాశ్మకాంచన భావమును ఆదర్శముగనుంచుకొని క్రమమున నభ్యసింపఁగఁదగును. అట్టి అభ్యాసము క్రమక్రమముగ ఆవ్యక్తిని గమ్యమునకుఁ జేర్చును.

## 6. శ్రీ సాయిబాబా - మతముఁ దానిభవిష్యత్తు

శ్రీ సాయిబాబా దైవసంపత్ప్రపూర్ణుఁడు— అవతారపురుషుఁడని విశ్వసించువారు వేనకువేలుకలరు. శ్రీ భగవానుని అవతారమనిన తోడనే సమ్మతింపక ముందునకుదూకి ప్రతిఘటించువారును కలరు. కావున శ్రీ సాయిబాబా 'దైవము'- అని మనము విశ్వసించుటకు కావలసిన దైవీసంపదలన్నియుఁ గలిగియున్నవాఁడని మనము చెప్పుట

మిక్కిలి యుక్తము. ద్వైవము-ద్వైపీసంపదలుగల మానవునకు భేదమును గుర్తింపఁజాలిన G.S. కపర్డే- మొదలగువారు తెలిపిన భావమిదియే.

తత్త్వశాస్త్రము- అప్రత్యక్షప్రమాణములఁటులుంచి, జనసామాన్యపరిభాషలో మతముయొక్క భవిష్యత్తు- అందు బాబాకుఁగల స్థానమునుగూర్చి విచారించుదము. మనభారతదేశమున పరస్పరభిన్న భావములుగలిగి పెద్దవియైన హైందవ- ముస్లింమతముల కలయికయే ప్రాధాన్యత నహించుచున్నది. ఈ యిరుతెగల భిన్నభావములు- తలల ఛేదించుకొనుట- దేవాలయములను మసీదులను ధ్వంసములఁజేసికొనుట తుదకు రాజకీయ సమైక్యతకు భగ్నముఁ గావించుకొనుటయు జరిగినది. కావున ఈహిందూ- ఇస్లాంమతముల భేదప్రతిపత్తినిఁ బాపి, మేదో యొకవిధమున సమైక్యత- సామరస్య సమన్వయభావముల పాదుకొలిపి, యీ యిరుమతముల కలయికకు యుక్తమైన విధానమున న్వేషించి, మనదేశమును బాధించు ఈసమస్యను తీర్చిదిద్ది, ఈ రెంటి నేకముచేయుట నేఁడెంతయు ముఖ్యమైనది.

కావున శ్రీ సాయిబాబా యీ హిందూ- ఇస్లాంమతభేదములను తొలగించి, సామరస్య సమన్వయములఁగూర్చుటకు ఎంతవరకు ప్రియత్నించి, సఫలుఁడై, యేనాటికేనియు నీ రెండుమతములలోని సత్యమార్గాన్వేషులను సమాధానపఱచి, భవిష్యత్కాలమున భారతదేశమున నుండఁదగిన భవిష్యన్మత స్వరూపమును తీర్చిదిద్దుటయందు తమ ఇస్లాంమతమున మాఖ్యాశయములకెట్టి భంగము కలిగినను దానిని ప్రతిఘటించుటకు మనదేశములోనే ముస్లిములు అసంఖ్యాకులుకలరు. మన భాగ్యవశమున శ్రీసాయిప్రభువు రెండుమతముల సమ్మేళనమునకు ఆశాద్యోతకములగు కొన్నివిధానముల నిర్దేశించినాఁడు.

పూర్వమున ఈరెండుమతముల కలయిక సాధించువిషయమున మన దేశచరిత్రము మనకేమి తెలుపుచున్నదో గమనించుదము. మాన

వులలో మతసామరస్య సమన్వయభావముల వర్ధిల్లజేసి, సమైక్యతఁ గల్పించుటయందుత్సహించి, ప్రోత్సహించఁజాలు మహాశయులు సాధు సత్పురుషు లెల్లకాలములఁ గలరు. కాలమునననుసరించి ఉదారభావ వైశాల్యతననుసరించి అక్బరు చక్రవర్తిపేరు ప్రప్రథమమునఁ బేర్కొనఁదగినది. ఆయన తనదర్బారులో హిందువులను ముస్లిములను నామంతులుగ స్వీకరించిన చక్రవర్తి మాత్రమేకాదు. ఇతఁడు ఈప్రపంచ మెన్నఁడు కనివిని యెఱుఁగని అత్యంతౌదార్యోపేతుఁడైన పరిపాలకుఁడు.

"దైవము ఒక్కఁడే కావున ఎల్లమతములకుఁజెందిన ప్రజలందఱు నేకముగకలిసి, సోదరభావముతో నొకేస్థానమున ఏకైకపితయగు ఆ దేవుని ప్రార్థింపఁదగును." అను ఉదారము- ఉదాత్తమునైన ఆశయ ములకలవాఁడు అక్బరుచక్రవర్తి, ఋజుబుద్ధికలిగి సత్యమార్గాన్వేషియగు ప్రతివ్యక్తియు నంగీకరింపఁదగిన ఆశయమిది. అట్టి యోచనాపరుఁడీ ఆశయమును సత్యమైనదిగ గుర్తించి; యిదిఎవరో ఒకవ్యక్తియొక్క విశ్వాసమనికాక జనులందఱకు సంబంధించినది జనసామాన్యమైనది- విశ్వ జనసూత్రమని ఇతరుల విశ్వసించునట్లుచేసి, యీ యిరుమతములవారికి సమ్మతమగునట్లు చేయుటయేకష్టము.

అక్బరుచక్రవర్తి తాత్త్వికవిషయముల అప్రత్యక్షప్రమాణము లఁగూర్చి ఆలోచింపలేదు. తన ప్రజలందు సమరసభావము కలిగించి, ఆచరణీయము శ్రేయస్కరమై అభ్యుదయమునుగూర్చునదిగ గుర్తించి నాఁడు. ఆయన చక్రవర్తియగుటచే ఇరుమతములలోని పెద్దలందఱును ఒకేస్థానమునకలిసి, దైవమును ప్రార్థించుఁడని ఆదేశించినాడు. ఇట్లు తాను ప్రతిపాదించిన మతమును- విశ్వాసమును 'దీన్ ఇలాహి'-'దైవ మతము'- అనిపేరు పెట్టినాఁడు. ప్రతిమతము దైవమతమగును, దైవ మునకు ప్రత్యేకించి ఒకమతములేదు. (Re-back-lingo-to bind) దైవమునుండి దూరమైనజనులను తిరిగి దగ్గఱకుఁ జేర్చునది- Religion

మా—మనుజులను- త—తరింపఁజేయునది- మతము. దైవప్రార్థనము ఇతర సాంఘిక కార్యములను నిర్వర్తింపఁజేయుటకు మానవులను దగ్గఱకుఁ జేర్చునది- మతము దైవసంబంధియునై ఆదైవమునుండి దూరమైనజీవు లను తిరిగి దైవమునుజేర్చునది- మతము.

'మతము'—అనునది సాంఘిక సంబంధమైన అద్భుతవిషయము. ఏమతములోనైన సామాన్యులకు- పెద్ద తెలివిలేనివారికేని మానసికో త్సేకముఁ గలిగింప సమర్థమైనది. ఒకేమతమున ఒకేకాలమున దైవ మునుగూర్చిన తలంపులు విభిన్నములుగనుండును. దైవమును జేరువిధా నములు- జనులు దైవసంబంధముఁ గలిగించుకొను పద్ధతులును వివిధ ములుగ నుండును; అట్టియెడ ఒక దేశమునందేని ఆయామతములయుల జను లందలి మత[విధానముల]ములనేకీకరించుట సామాన్యమైనపనికాదు. కాని, అక్బరుచక్రవర్తి యీపనికిఁ గడంగినాఁడు. ఆయన [చక్రవర్తి] పదవీప్రభావము- భావోదాత్తతవలన చాలవరకు విజయము నొంది నాఁడు.

దైవము— భగవానుఁడు- అల్లా-ఒక్కడే అనునది హైందవ- ఇస్లాం— మతములఁగల ప్రధానఆదర్శము- వ్యక్తిని- తదీయులను దేశ మును రక్షించుకొనుటకై ఆ ఏకైకదైవమును గౌరవించి, ప్రార్థించుట ఎంతయు నవసరము. ఈపనికొఱకై హైందవులు- ముస్లిములుకలిసి ప్రార్థింపఁదగును. ఇదివరకు అటుల ప్రార్థించినారు. దేశసంక్షోభములు కలిగినపుడు— దేశభద్రతకు ముప్పు వాటిల్లినపుడు వీరందఱుఁజేరి దైవ మును ప్రార్థించువిషయమున వారివారి భిన్నభావములు ప్రతిబంధక ములుకాలేదు. ఒకచక్రవర్తి [ఆదేశించినపుడు] ఆజ్ఞాపించినపుడు ప్ర జలు అందఱుఁజేరి యేకైకపితను— దైవమును ప్రార్థించఁగలిగిరి. కొంత కాలమువరకు అక్బరుచక్రవర్తి ప్రయత్నము- ఆచరణీయమై విజయ వంతమైనది.

దురదృష్టకారణమున ఆయన ఆశయములు ఆచరణలు ప్రజల హృదయములందు బాగుగ నాటుకొనలేదు. అక్బరుచక్రవర్తి పిదప రాజ్యపాలకులైనవారు భిన్నభావములను కలిగియుండిరి. ముఖ్యముగ ఔరంగజేబు చక్రవర్తి తన రాజ్యములోని ప్రజలను ఇతర మతములనన్నిటిని విసర్జించి, ఇస్లాంమతమునే అవలంబించుడని శాసించినాడు. నిర్బంధించినాడు. మనదేశమున మొగల్ సామ్రాజ్యమంతరించుటకు ఇదియే ముఖ్యకారణమని చరిత్రకారులెల్లరు దెలిపియుండిరి. పూర్వమొక పొరపాటు జరిగియుండిన, దానిని గుర్తించి, సరిదిద్దుకొని, సక్రమమార్గమున ననుసరించుట మన విధ్యుక్తధర్మము.

ఒకసంఘమును– సమాజమును స్థాపించునపుడు ఆసమాజములోని ప్రతివ్యక్తియు తాను క్షేమముఁబొందుచు నితరులను క్షేమము పొందఁగోరవలయును. ప్రతివ్యక్తియు వానివాని భావానుసరణముగ దైవమును సమాశ్రయించుటకు స్వాతంత్ర్యము కలిగియుండవలయును. ఇట్టి ఆశయములతో స్థాపింపఁబడిన సమాజము సుస్థిరముగ నిలుచును. మతసంబంధములైన యెట్టి నిర్బంధములు విధింపబడినను ఆ మతమునకు, ఆ సంఘమునకు హాని కలిగితీరును.

శ్రీ సాయిబాబా తనను సమాశ్రయించినబిడ్డల హైందవ– ముస్లిం– క్రైస్తవ– పార్శీ మొదలగు మతానుయాయులతోడ ప్రవర్తించినవిధము పైనఁ దెలుపఁబడిన ప్రధానఆశయములను విస్పష్టపఱచుచున్నది. ఏవిధమైన నిర్బంధముగాని, పరివర్తనముగాని మతము యొక్క ప్రధానకార్యమును చెఱచును. మతపరివర్తనము [మతము మార్పు] అనునది ముఖ్యముగ నిర్బంధముమీదను– అల్ప– నికృష్టములైన ఆశయములమీదను ఆధారపడియున్నది. (S C.S. Para 595) ఒక సందర్భమున హైందవమతమునువిడిచి ఇస్లాంమతమును స్వీకరించిన ఒకవ్యక్తిని, బాబా సంతోషించునను తలంపుతో బడేబాబా (అబ్దుల్) సాయినాథుని దగ్గఱకుఁ గొనిపోయి “బాబా! ఇతఁడు ‘ఇస్లాం’మతము

ను స్వీకరించినాఁడు —' అనిచెప్పెను వెంటనే బాబా అతని చెంప మీఁదకొట్టి, "నీఅబ్బను మార్చుకొంటివా?"— అని నిరసించెను. తండ్రిని మార్చుకొనుట అనునది అనూహ్యము- అసభ్యతయునగును.

ప్రతిమతమున ఆమతానుయాయి దైవమును తనతండ్రిగ విశ్వసించును. ఇదియెంతయు అవసరము, శక్తినిన తండ్రినిగాని తన మతాను సారము ప్రేమించి సేవించు విశ్వపితను- (దైవమును) మార్పుచేసికొనుట అనునది అసంగతము— అశ్లీలమునై తీరును. కావున శ్రీసాయీబాబా హైందవ- ముస్లిం- క్రైస్తవాది మతానుయాయులైన తన ఆశ్రితులను తమ మతమును విడనాడి వేఱొకమతమును స్వీకరించుట తగదని బోధించినాఁడు. ముఖ్యముగ కావలసినది హృదయపరివర్తనముగాని, బాహ్యపరివర్తనముకాదు. అట్టి హృదయపరివర్తనము పాపపశుత్వ భావములను చక్కదిద్ది, దైవసన్నిధికిఁ జేర్చునని బాబా తెలిపినాఁడు. అట్టి హృదయపరివర్తనము జనులు తలంచువిధమున మతపరివర్తనము కాదు. అట్టిది బాహ్యచిహ్నముల (భౌతికచిహ్నముల) నేమాత్రమున పేక్షింపదు. అట్టి పరివర్తనము బాహ్యచిహ్నములనేవియు సూచింపని దగును.

ఎల్లరు సత్యమగు హృదయపరివర్తనముకలిగి, దైవమును దృఢముగ హృదయమున నిలుపుకొని, దైవసంబంధముగలిగి, అద్వైతభావమున నిమగ్నులై యుండునెడ నట్టివారలలో పరస్పరవైరము- ద్వేషము పొడమక, ప్రశాంతముగ జీవయాత్రగడపదగునని బాబా బోధ—ముఖ్యాశయము.

సకల మతములందు సారాంశవిషయముల కలహకారణములైన భిన్నభావములులేవు. వివిధమైన కలహము కలిగినను బాహ్యవిషయములఁగూర్చియే. ఒకఁడు దేవాలయమునకు వెళ్ళఁదలఁచును. మఱి యొకడు మసీదునకుఁ బోఁదలచును. వారియువురకుఁ గలయికకుదురదు,

ఒకడు ముఖమున నామము నిట్టిలువుగ బెట్టును. మఱియొకడు గంధము-విభూతి ముఖమున అడ్డముగ మూడు రేఖలుగ పెట్టుకొనును. వారిరువురకు అంగీకారము కుదురదు. ఇది సరియైన ఋజువైన మార్గమని చెప్పగలమా? ఏవ్యక్తియైన ప్రశాంతముగ గూర్చుండి, దైవమహాత్మ్యమునందు మనస్సునిలుపుచు ఆదైవకల్యాణ గుణములను చింతించుచు ఆదైవధ్యాన విషయమునందున్న వాడితరులతోగాని, యితరులు వానితోగాని కలహించుట కవకాశమే కలుగదు. దైవము ప్రేమస్వరూపుడు గాన దైవమును ప్రార్థించుటవలన ఫలితము ప్రేమయేయగును. మతసారాంశమును పరిశీలింతుమేని- అనగా ప్రతివ్యక్తియు దైవధ్యాన నిష్ఠయందుండ బ్రయత్నించునేని దానిఫలితము ప్రేమ-సామరస్య సమన్వయభావమేయగును. గాని, ఒక తెగవారు మఱియొక తెగవారిపై మత కలహములు యుద్ధములు, దండయాత్రలునలుపుటకు అవకాశమే కలుగదు. మతవిషయ దండయాత్రలు నేడు పురాతనకాలమునాటి అజ్ఞానజనిత మూఢభావములుగ గుర్తింపబడుచున్నవి.

వానిస్థానమున నేడు ఆర్థికాభివృద్ధికొఱకు- భౌతికాభ్యున్నతికొఱకు- ప్రజానీకముపై ఆధిపత్యము సంపాదించుటకొఱకు-సామ్రాజ్య విస్తరణకొఱకు యుద్ధములు సాగింపబడుచు పూర్వమతోన్మాద యుద్ధములకంటె తీవ్రతర ప్రమాదములకు- ప్రాణిహింసలకు దారితీయుచున్నవి. మానవజాతియందు మతవిభేదముల నిర్మూలించువిషయమై మార్గమన్వేషించుట సాధ్యమయ్యేనేని ఆర్థిక- సామ్రాజ్యవిస్తరణాదులకై జరుగుచున్న యుద్ధముల నివారించుటకు మానవులను తగుమార్గమన్వేషించుటకై ప్రేరేపించితీరును.

శ్రీసాయిబాబా చరిత్రమును సావధానముగ బరిశీలింతుమేని బాబా యేమి కావించినది, ఆతండిని సమాశ్రయించిన హిందువులు-ముస్లిములు- క్రైస్తవులు పార్శీలు మొదలగు వివిధ మతానుయాయులందు మతవిషయక సామరస్య సమన్వయము లెంతవరకు పెంపొం

దించి పరస్పర ద్వేషభావములను నిర్మూలించినది, బాబా ప్రతిపాదించిన- బోధించిన విధానము తాత్కాలికముగ ఆశ్రితులందు ఫలితము ఎటుల సమకూర్చినది, ఆవిధానము ఇతరసమస్యల సాధించి విశ్వమానవప్రేమ- సౌభ్రాత్రములను సంస్థాపించుటకు గట్టిపునాదులు వేయఁబడినదో లేదో మనకు విశదముకాఁగలదు.

బాబా కావించినది విచారించుదము. తొలుదొలుత బాబాయందు అద్భుత శక్తిసమర్థతలు ప్రకటమైన కారణమున యేకొలదిమంది హైందవులుమాత్రము బాబాను దైవముగ గురుదేవునిగ భావించి, సేవించిరి. నీటను తైలముగమార్చుట- పంచభూతములను శాసించుట మొదలగు అద్భుత శక్తిసమర్థతలనుగనిన శిరిడిలోని- ఆప్రాంతములోని జనులు (శ్రీ) సాయిప్రభువు కేవలము మానవమాత్రుఁడు కాఁడనియు దైవసంపద్విశిష్టుఁడగు దైవపురుషుఁడుగ తలంచిరి. క్రమక్రమముగ బాబా తన శక్తిసమర్థతలను తనభక్తులఁ జక్కదిద్దుటకై వినియోగించి, ప్రభువులు- సామాన్యులు- ధనికులు- పేదలు, మిత్రులు- శత్రులు; హిందువులు- ముస్లిములు; ఇత్యాది భిన్నభావముల కెడమీయక యెల్లర సమాదరించి, ప్రేమించి, ఆధివ్యాధుల నివారించి, ఐహికహితకామితముల ననుగ్రహించి, సకలజీవములయెడ సమానప్రేమ నెఱపుటచే (శ్రీ) సాయినాధుని విశాల ప్రేమపూరితహృదయము ప్రకటమైనది. ఈవిధమున బాబాయందు నిస్స్వార్థత్యాగసేవలు- విశ్వజీవసామరస్య సమన్వయప్రేమలు ప్రకటమైనవి. (శ్రీ)సాయీశునకు కుటుంబముగాని, దేసితో సన్నిహిత సంబంధముగాని లేదు. ఈవిశ్వమంతయు బాబా కుటుంబమైనది. ఎల్లజీవులు బాబాకు ఆత్మబంధువులే అయినారు.

“అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసామ్
ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్”

[(శ్రీ) సాయీమననము]

ఇతఁడు నావాఁడు— ఇతఁడు పరుఁడు అని అల్పబుద్ధులగువారు గణింతురు. ఉదారచరితులైన మహాత్ములకు ఈ విశ్వమంతయు వారి కుటుంబమే యగును.

శ్రీసాయి మహాప్రభువు సత్యముగనట్టి మహోదాత్తభావోపేతుఁడైన "విశ్వకుటుంబి". బాబానుండి వెలువడిన అద్భుతశక్తులు వేలు లక్షలజనుల నాకర్షించినవి. ఆశ్రితుఁడైనవాడు ఆతండ్రిని గురుదేవునిగ తన యిష్టదైవముగ రక్షకునిగ విశ్వసించి సేవించినాఁడు. ఒక మిత్రుఁడీ రచయితను 'సాయిబాబా బాకూడ దేవుడేనా? ఉన్న దేవుళ్లు చాలకనా?' అని ప్రశ్నించినాఁడు. ['సందేహనివృత్తి'- అను గ్రంథము చూడుడు] హిందువులు భావించు 33 కోట్ల దేవతలకు మఱియొకరిఁ జేర్చుటయా? అని కొందఱు తలంపవచ్చునుగాని యీ ముప్పదిమూఁడుకోట్ల ఒకటవ దైవము తక్కిన ముప్పదిమూడుకోట్ల దేవతలను దిగమ్రింగి, దైవముయొక్క ఏకత్వమును ప్రదర్శించినాఁడు. తననుజేరిన భక్తులకు లౌకికహిత కామితముల ప్రసాదించి ప్రేమస్వరూపుఁడై హిందువులకేగాక ముస్లిములు— క్రైస్తవులు— పార్శీలు తదితరులందఱకేకైకదైవమైన వస్తువుదగ్గఱకుఁ జేర్చినాఁడు. ఆ ఏకైకదైవమును వీరందఱు ప్రత్యక్షముగ మానవరూపమున జూడగలిగినవాడుగ అత్యద్భుతమైన శక్తిసంపదలుగలవాఁడుగ ప్రేమస్వరూపుడుగ దయామయుఁడుగ ప్రకటమైనాఁడు. ఆకారణమున నెల్లరు 'దాసోఽహమ్' అనిప్రణమిల్లిరి.

ఎల్లవిధముల నెల్లగతుల నెల్లభావముల తమతమ శ్రేయస్సుకొఱకాతండ్రిని ఆధారముగఁ జేసికొనినారు కావున హిందువులు ముస్లిములు క్రైస్తవులిత్యాదులు బాబానుసేవించిరి, ఆయనను ముస్లిములు క్రైస్తవులు తాము విశ్వసించు దైవమునుతప్ప తదితరులను హైందవులవలె విశ్వసించి వ్యక్తిపూజాదులఁగావింప నంగీకరింపరు. ఎవరు అంగీకరించిన నంగీకరింపకున్న నెవరేని తమ అభీష్టావాప్తికొఱకు సేవించి

ఫలప్రాప్తి బడయుట కేవస్తువాధారమైనదో ఆవస్తువును దైవమనుట కెట్టి సందేహములేదు. కష్టనివృత్తి- అభీష్టావాప్తిం గూర్పంగలవస్తువే దైవము— అనుట నిర్వివాదము, దైవమును విశ్వసించుట- దైవసంబంధముం గలిగియుండుట— ప్రార్థించుట- అభీష్టములబడయుటయే ప్రతి మతముయొక్క సారాంశము. ఈపనిం గావించుటకు ముస్లిములు-క్రైస్తవులు వెనుకాడరు. ఎవరికష్టములు వారికింగలవు, వారు ఆర్తులు కావున భౌతికతనువునందున్న బాబాను వారి కష్టనివృత్తికొఱకు ప్రార్థించిరి. భౌతికతనువు విడిచినపిదప బాబా సమాధిం జేరి ప్రార్థించుచున్నారు. కష్టనివృత్తి అభీష్టావాప్తిం బడయుచున్నారు. దీనిమూలమున వీరందఱు ఆ ఏకైక దైవతత్త్వమునే ప్రార్థించుచున్నవారగుచున్నారు.

కావున పర్యవసానమువారు దైవతత్త్వమునే సమాశ్రయించిన వారగుచున్నారు, వారివారి మూఢవిశ్వాసములు- మతసిద్ధాంతముల ననుసరించి బాబాను దైవముగ నంగీకరింపకపోవచ్చును. అది వేఱు విషయము. వాస్తవముగ బాబామ్రోల సాగిలంబడి మ్రొక్కి- తమతమ కష్టనివృత్తి— అభీష్టప్రాప్తికొఱకుం బ్రార్థించువారందఱు ఆ స్వామిని దైవముగ- గురుదేవునిగ నాదరించి గౌరవించువారే యగుచున్నారు. శ్రీ సాయీశుని 'అవాలియా'- అనిన రక్షకుండైనసాధువు అనిన-గురుదేవుండనిన నది ప్రధానముగాదు, ఎల్లరయెడ బాబా ఏకైకపితృ భావము ప్రదర్శించిన కారణముచే ఆతండ్రి తన ఆశ్రితులనందఱ నొకటిగం జేర్చి ఏకైకసంబంధముం గూర్చినాండు.

[S.C.S.Para 501A చూడుడు] ఒకసందర్భమున G.G.నార్కే- M.A. M.Sc. ఇంగ్లాండునందు గొప్ప విద్యాయోగ్యతలు గడించి తిరిగి వచ్చిన పట్టభద్రుండు. శిరిడిలోని భక్తులతో మాటాడుచు "బాబా ఒక మనుష్యమాత్రుండే కాని దైవముకాండు." అని పలికెను, ఆభక్తులు బాబా దగ్గఱకేగి, 'బాబా! నీవు మనుష్యమాత్రుండవే కాని దైవము కావు'— అని మన 'నార్కే' పలుకుచున్నాండు— అనిచెప్పిరి. అంతట

"ఆవిద్యాధికుఁడు చెప్పినమాటలు భౌతికతత్త్వవాదము ననుసరించి సత్యమేకాని మీరటుల పల్కరాదు, నేను మీయందఱకు తండ్రిని- సకలము మీరు నావలనఁ బడయవలయును" అని బాబా వారికిఁ దెలియఁబలికినాఁడు.

దీని ననుసరించి, బాబా భౌతికతనువును 'బాబా, అని తలంచిన యెడ నది మానవశరీరమే- కావున బాబా మానవుఁడనుటలో లోప ములేదు. బాబావలన దైవసహాయముఁ గోరువారు బాబా మనుష్య మాత్రుఁడని తలంచుట మహాప్రమాదము గొప్పనేరము-దైవసహాయ ము అనుగ్రహము- చర్మ- రక్త- మాంసముల ఎముకలనుండి లభిం చునదికాదు. ఆత్మనుండి లభించవలసినదే. కావున ఆత్మయే దైవము ఆకారణముననే 'నేను ఈ భౌతికదేహ మాత్రుఁడనుకాను- నేను మీయందఱకు తండ్రిని- మీరు సకలము నావలన బడయవలయును'- అని బాబా తెలిపినాఁడు.

బాబా చరిత్రమునఁ దెలుపఁబడిన భక్తులు ఆనాఁడేకాదు. ఈ నాఁడును శ్రీ సాయీబాబావలన వారివారి అభీష్టములను పడయఁగలు గుట బాబా యందుఁగల దైవత్వమును విశ్వసించి సేవించుటవలననే- అని మనము గుర్తించవలయును. కావున మనము బాబా భౌతికతనువే దైవమని తలంపక అరూపమునందుఁగల దైవతత్త్వమునే మనదృష్టి యందుంచుకొనవలయును. ఆకారణముచేతనే బాబా తనబిడ్డలు గుర్తించఁదగిన ఋజుమార్గము విశదపఱచినాఁడు, 'సాయీబాబా అనిన ఈ ద్వారకామాయి మసీదునఁగూర్చున్న 3 1/2 మూరల మానవమా త్రుఁడని మీరు తలంచుచున్నారా- [S.C.S. ] అది మిక్కిలిపొఱ పాటు. నేనులేని తావులేదు.' అనినాఁడు. అనఁగా శ్రీ సాయీబాబా సర్వవ్యాపి సర్వనియంత- సర్వజ్ఞుఁడు- సర్వసమర్థుఁడు. అని తన ఆశ్రి తులెల్లరకు వారివారి అనుభవములద్వారా ఎఱుక పఱచినాఁడు.

శిరిడియం దేశదేశగతుఁడై కూర్చున్నయట్లు తోఁచియుఁ దన అద్భుత శక్తిసమర్థతలను తన ఆశ్రితులకు ప్రకటించినాఁడు, వేలకొలది మైళ్ళదూరమునఁనున్న తనవారిని దనదఱికి ఆకర్షించినాఁడు. వారివారి హృదయపరివర్తనముఁ గావించువాఁడు, అంత్యకాలములవారి ఆత్మలను తనదఱికి ఆకర్షించువాఁడు. ఆపదలనుండి తలఁగఁబెట్టువాఁడు, కావున 'సాయీబాబా' అను భౌతికతనువున- మానవరూపమున సన్నిధింపఁజేసి యున్న ఆ పరతత్త్వము- ఆ పరమాత్మనే మనము 'సాయీ'- అని పిలుచుచున్నారము, వివేకవంతులు 'బాబా' అని పిలుచువస్తువు- ఆపరవస్తువేకాని బాబా భౌతికతనువుకాదు. [ఆ ప్రేమమయము- దయామయమునైన పరతత్త్వము ఏభౌతికతనువునందు ప్రకటమైనదో ఆతనువు ఆపాదమస్తకము సాధకుఁడైన ఆశ్రితునకు లక్ష్యశుద్ధి, లక్ష్యసిద్ధికొఱకు గౌరవనీయము- సేవనీయము- పూజనీయమునైనది, ఆవస్తువును సాకారునిగ- నిరాకారునిగ ఎట్లు సేవించినను ఫలము సమానమే యగును]

ఈదృష్టి తెన్నగ బోధపడినపిదప బాబా సంస్థాపితమైనపద్ధతి- బహువిధములగు కష్టములఁ దొలగించుకొనుట. అభీష్టములఁ బడయుటకు ఏకైకపితయగు బాబాను సమాశ్రయించి ఫలసిద్ధిఁబడయు ప్రజలలో ఏకీభావము కుదురుట గుర్తింపఁదగినవిషయము- విజయము. ఈ సమైక్యసిద్ధి వ్యక్తులందేకాదు- సంఘములందు, దేశములందు-ప్రపంచమందు సిద్ధించునదియగును. బాబాయందు సమాన పితృభావసంబంధమును పురస్కరించుకొని- బ్రాహ్మణులు-బ్రాహ్మణేతరులు ముస్లిములు క్రైస్తవులు- పార్శీలు మొదలగువారు ఎల్లరుకలిసి సోదరభావముతోఁ జేరఁగలుగుచున్నారు.

1918 పూర్వము చావడికి ఊరేగింపు సందర్భమున జరిగిన విషయము- తరువాత నేటివరకు శిరిడియందు జరుగుచున్న విషయము

గదియే. ఎల్లమతములవారు నేకమై తమ సమర్థసద్గురువైన శ్రీసాయీ మహాప్రభువు నెడ సమాన గౌరవాదరణప్రేమలఁ బఱుపుచున్నారు. ఈ రూపమున బాబా తన ఆశ్రితులగు భక్తులందు మతసామరస్య సమన్వయభావములను పెంపొందించువిధానము నిర్దేశించినాఁడు. సత్యపథముఁ దెలిపినాఁడు. బాహ్యవిషయములకు ప్రాధాన్యమీయకుఁడు. బాహ్యవేషాదులు వివిధములుగ నుండుటకు సందేహములేదు. ఎల్లమతములందలి సారాంశవిషయములకు ప్రాధాన్యమీయుఁడు. దైవమును సమాశ్రయించి, దైవసంబంధముఁ గలిగియుండి దైవకరుణచే కష్టములఁ దొలగించుకొని వివిధకామితముల బడయుచు క్రమముగ ప్రతివ్యక్తి సాత్త్వికస్వభావమును పెంపొందించుకొని, తనను తాను (అహంతను) విస్మరించుచు దైవపద సంలబ్ధినిఁ బడయుటయే బాబా తెలిపిన సత్యపథము. ఇది యెల్లమతములవారికిని బాబా సమకూర్చిన సమానపీఠము.

హిందూ- ఇస్లామ్‌మతముల కలయికకు బాబా యీరూపమున పునాదులు ఏర్పఱచినాఁడు. ఈవిధమున హైందవులు- ముస్లిములు విశ్వపితయైన ఏకైక దైవమును గౌరవించి ప్రేమించనేర్వవలయును. సర్వవ్యాపియైనదైవము ఇంద్రియగోచరుఁడుకాని కారణమున ఆదైవ సంబంధమైన శక్తిసంపదలు మానవరూపమున [శ్రీ సాయీబాబా యందువలె] ఎందెందు ప్రకటమగునో అట్టివ్యక్తులఁజేరి వారియందు గల దైవత్వమును సమాశ్రయింపవలయును.

'ఒక్క సాయీబాబా' యీ ప్రపంచమునంతయు నెటులుద్ధరిం చఁగలఁ'డని జనులందు సందేహము గలుగవచ్చును. సావధానముగ బరిశీలించిన ఒక సాయీబాబా వందలకొలఁది సాయీబాబాలను సిద్ధపఱచినాఁడు. శ్రీసాయీ మహాప్రభువు ఆచరణపూర్వకముగ నిర్దేశించినమార్గము ననుసరించి హైందవ- ముస్లింసాధువులు మనదేశమున

పలువురుకలరు- వారిని సమాశ్రియించి యనుసరించు హైందవులు-
పలువురుకలరు.

ప్రతిమండలమున ఇస్లాం మతానుయాయులైన సాధువులుకలరు.
దైవీసంపద్విశిష్టులని వారిని సమాశ్రియించు హైందవమత తత్పరులైన
వారియెడనేని ఆ ముస్లింసాధువులు ప్రేమాదరణములను బఱపుచునే
యున్నారు. ఇట్టుల భారతీయ జనసమాజమున క్రమక్రమముగ సమైక్య
తవర్ధిల్లుచున్నది ఎకాలదిమంది అట్టి ముస్లింసాధు సత్పురుషులయొక్క
బఱపు ప్రేమాదరణగౌరవములు దేశమందంతటను మతసామరస్య
సమన్వయములఁగూర్చుటకు సమర్థము కాకపోవచ్చును.

భిన్నత్వమును కాంక్షించుచు తమస్థితినుండి ఉన్నతస్థానముఁ
జేరు తలంపులేక తమతమ మతశాఖోపశాఖలనే అంటుకొనియుండు
జనులెల్ల దేశములందెల్లకాలముల ను నుండనేయుందురు. కాని, ఎట్టి
మానవుఁడు తన స్థితినుండి ఉన్నతస్థానమునకుఁ జేరఁజాలఁడు' అని పలు
కువారు మిక్కిలి పొఱపడువారగుదురు

చరిత్రను పరిశీలించిన పూర్వకాలమున జనసమూహములు
ఎట్లు చెలరేగి. సంఘములుగ నాకర్షింపబడి, పెక్కుమతములఁ మూఢ
విశ్వాసముల సిద్ధాంతముల నవలంబించినది, మనకు బోధపడును. శ్రీ
సాయీప్రభువు ననుసరించి యవతరింపనున్న సాయీపంచకమున సం
పూర్ణ శక్తిసంపదలుగల ఒకసాయి తన అప్రతిహాత దైవీసంపత్ప్రభావ
ముల బలముచే నీవిశ్వమునంతయుఁ దన ఆదర్శములచే నింపివేయగ
లఁడు, కాలముఁ గడచినకొలది శ్రీ సాయీబాబాను అనుసరించు జన
సమూహమునందు తక్కిన జనులందఱు లీనమైపోవుదురు. దైవప్రవా
హామును ప్రతిఘటింపఁగలశక్తి మానవజాతికిలేదు. ప్రతిదేశమున
మహాసాధువుల చరిత్రలవలన నిది స్పష్టమెనది. శ్రీ సాయీప్రభువు-
ఆయన ననుసరించి యవతరించు 'సాయీలు' యీ విశ్వమునందంత

టను ఇప్పుడు మన 'మిదమిత్థ'మని నిర్ణయింపఁజాలని ఒకేరూపమున, కొన్ని సిద్ధాంతములతో ఏకైకమతము– విశ్వమతము– స్థాపించితీరుదురు- అని, మనము విశ్వసించుటకు తగిన ఆధారములుకలవు. శ్రీసాయీ ప్రభువు పరాత్మ– యీ కార్యమును సాధించితీరుసని ఊహించుటకు సమర్థనీయమైన ఆధారములుకలవు.

## 7. జీవితగమ్యము - జ్ఞానపరమావధి - ఏమి ?

పలువురు విజ్ఞానవేత్తలచే హేతువాద సిద్ధాంతపద్ధతుల ననుసరించి చర్చింపఁబడిన సమస్య-ఇది. ఆత్మ–[ప్రకృతి] విశ్వము–దైవము [బ్రహ్మము] అను ఈ త్రిపుటితత్త్వమును పరిశీలించి, యీదృశ్యప్రపంచమందంతర్భూతమైన సత్యమును గ్రహింప సమర్థనీయమైనదే 'సత్యజ్ఞా'మని ప్రసిద్ధ శాస్త్రగ్రంథములు తెలుపుచున్నది. జీవాత్మన నిత్యత్వమును నిరాకరించుట 'ఆత్మహత్య'– తుల్యమని భావించువారు కొందఱున్నను మనము ద్వైత-అద్వైత- ప్రశ్నములజోలికి పోవక సకలమును విభజనముఁ జేసికొనిపోవగ మిగులునవి తుదకు రెండుగలవు. నిత్యమైన ఆత్మ-ఆత్మ చేరికొనుదైవము (బ్రహ్మము) ఈవిషయమై భిన్నభావములుకలవు. చివరకు శేషించుసత్యము విషయము. ఇదమిత్థమని నిర్ణయింపరానిది అందుచే విద్యావంతులు పరస్పరము ఖండనమండనముల గావించుకొనుచు కలహించుకొందురు.

ఈసమస్య విషయమై ఆశ్రితులగుభక్తులు సవమదమగునపుడు శ్రీ సాయీప్రభువు వారల నెటుల సమాధానపఱచినాడో గమనింతము. భగవద్గీతాదిగ్రంథములను శంకరభాష్యాదులను పఠించి వేదాంతవిద్యాశాస్త్రముల పాండితిని సంపాదించి పట్టభద్రులైన నానాసాహెబ్ చందోర్కర్ మొదలగువారి సమస్యలఁగూర్చి శిరిడిలోని వాడలలో చర్చించుకొనుచుండువారు విశ్వవిద్యాలయమున ఒక ఆచార్యుఁడుగ బాబా

ప్రకటించుకొనక, తనను గురువుగ విశ్వసించి ఆశ్రయించుభక్తుల యోగ్యతల ననుసరించి, వారితో మెలఁగి సమాధానపఱచువాఁడు. శాస్త్రవిషయక సందేహములను తనవారు స్వానుభవములను పురస్కరించుకొని రహితముఁ జేసికొనఁజేయుటయే బాబా కావించు విధానము. బాబా యందు, ఆతండ్రిబోధలందు గాఢవిశ్వాసము వహించుట మూలమున నిట్టి సమస్యలు, సందేహములు నివారణకాగలవు. ఋజుమార్గమున బాబాను సమాశ్రయించినగాని యివి నివారణము కాఁజాలవు.

[S.C.S. Para 131] వాలంబి స్టేషన్‌మాష్టరువంటి సంశయాత్ములయెడ బాబా ప్రవర్తించినవిధమున తన అభిప్రాయము విశదపఱచినాఁడు. వాలంబి స్టేషనుమాష్టరువకు బాబాయందు విశ్వాసములేదు. కాని, బాబా గొప్పసమర్థతలుగల మహాపురుషుఁడని దాస్‌గాణూమహారాజువలన విని ప్రేరేపించఁబడి, బాబాను స్వయముగచూచి, తనకుఁదా, నిర్ణయించికొనఁదలచి దాస్‌గాణూవెంట శిరిడికి వెళ్ళినాఁడు, ఆయిరువురు మసీదుఁజేరిన సమయమున సర్వజ్ఞుఁడైన శ్రీసాయి విచిత్రముగఁ బ్రవర్తించుచుండెను. అందఱుఁ జేయునటులగాక, బాబా పెక్కుకపవలనుతీసికొని ఒక్కొక్కదానినిఁ గడుగుచు బోరగిలఁ బెట్టుచుండెను. ఆస్టేషన్‌మాష్టరు విసుగొంది "ఈపనియేమి?"– అని గాణూమహారాజును ప్రశ్నించెను. గాణూదాసు– ఆవిధముగ బాబాను ప్రశ్నించెను. 'జనులు నాదగ్గఱకుఁజేరు విధమిదియే– అధోముఖముగవత్తురు. ముఖము పైకెత్తబడియున్న యేవేని స్వీకరించుటకు వీలుండునుఁ– అని బాబా సమాధానముఁజెప్పెను. అన్యాపదేశముగ బాబా పలికినమాటలాస్టేషన్‌మాష్టరునకు బోధపడలేదు, ఎదేని స్వీకరించుటకు, ఆచేరుకొను వ్యక్తియందు విశ్వాసగౌరవములను పురస్కరించుకొని చేరు ఆశ్రితపాత్రలందు ప్రబోధబీజములచే నింపవీలగును, ఏవేని ప్రబోధకల్గింపవచ్చును. ఆవచ్చిన స్టేషన్‌మాష్టరునకు బాబాయందు విశ్వాసము లేదు. కావున బాబావలన నతఁడెట్టిఫలమును బడయలేకుండెను. బాబా

సూచించినవిధము విస్పష్టము. ఆధ్యాత్మికపురోభివృద్ధిఁ బడయుటకు సత్యాన్వేషణతో తన ఆశ్రయమందు గాఢవిశ్వాస గౌరవములుగలిగి,తన సంశయములను నివారించుకొనుటకు తగినఓర్పు వహించి యుండఁదగును.

బాబా తఱచుగ నాయాసందర్భముల నవకాశముఁజేసికొని ఆధ్యాత్మిక ప్రబోధబీజములను తనవారి హృదయక్షేత్రముల నాటువాఁడు 1910 తరువాత కాకాదీక్షితు- అతనిమిత్రులు శిరిడినుండి వారివారి తావులకేగఁదలచి బాబా అనుజ్ఞనుకోరిరి. 'మీరు వెళ్ళవచ్చును'- అని బాబా పలికెను. అచటఁ జేరినవారిలో నొకరు 'ఎక్కడకు వెళ్లవలయును?-' అని ప్రశ్నించెను, బాబా ఆసంభాషణమును క్రొత్తమలపు నకుఁద్రిప్పి, ప్రబోధఁ గావింపనెంచి 'పైకి'- 'ఇక్కడనుండి పైకిఅనెను- "అనగా పెక్కుబంధములకుఁ జిక్కుకొని, ప్రతిఘటనలు, సుఖదుఃఖాదులతో సదమదమగుచు, భయాందోళనలఁ బొందుచు, ఈవిశ్వమున అంతర్వ్యాప్తమైయున్న వస్తువునుగూర్చిన సత్యదృష్టి- ప్రశాంతిగనలేని యీ ప్రస్తుతసంసారమునుండి ఉన్నతస్థితికి"- అనిభావము.

ఆపృచ్ఛకుఁడు- 'అటుపోవుటకు మార్గమేది?'- అని అడిగెను. 'ప్రతివ్యక్తియున్న స్థానమునుండి పైకిఁబోవుటకు అనేకమార్గములు కలవు. మీకుఇక్కడ (శిరిడి)నుండియు మార్గముకలదు. ఆమార్గము నిమ్నోన్నతములుగలది. ఆపథమున పులులు- ఎలుఁగులుకలవు.' అని బాబా సాంకేతికభాషలో పలికెను. [శిరిడియందు పులులుగాని-ఎలుఁగులుగాని లేవు, ప్రతివ్యక్తియొక్క ఆధ్యాత్మిక పురోభివృద్ధికి పెక్కు ఆటంకములుకలవు- అవి పులులు- ఎలుగులవలె భయంకరములైనవని భావము.]

ఆపట్టున హా. సీ. దీక్షితు అందుకొని, 'కాని, బాబా! ఆతనికి తోడున్ననో?' అని ప్రశ్నించెను. 'వానికి 'తోఁడు'న్న నిక నెట్టికష్టములులేవు. ఆపులులు- ఎలుఁగులు దూరదూరముగఁ దొలగిపోవును.

తోఁడులేకున్న ఆమార్గమున పెద్దగొయ్యికలదు. ఆ పెద్దగొతిలో (నరకమున) అతఁడు జారిపడిన పడవచ్చును.'— అని బాబా పలుకుచున్న మాటలను అన్నాసాహెబ్ దభోల్కరు సావధానముగ వినుచుండెను. ప్రతివ్యక్తికి ఆధ్యాత్మిక పురోవృద్ధినొందియున్న తన్స్థితికిఁ బోవుటకు గురువు అవసరము— అని బాబా తెలుపుచున్నట్లు గ్రహించెను. [ఒకసందర్భమున దభోల్కరు గురువులతో నెట్టి అవసరములేదు— అని వాదించినవాఁడు. హేమాద్రిపంతు వృత్తాంతముఁజూడుడు.] ఈ సంభాషణమంతయుఁ దనను ద్దేశించి కావింపఁబడినదిగ అతఁడు తెలిసికొనెను. ఆధ్యాత్మికౌన్నత్యముఁ బడయఁగోరు సాధకునకు— తోఁడు— గురువు అవసరము— లేకున్న నతనికిఁగలుగు ప్రతిబంధకములనుండి తప్పుకొనలేడనియే బాబా ప్రబోధగ దభోల్కరు గ్రహించినాఁడు. "గురుబినాకోనే బటావే" (గురువులేకున్న మార్గముఁ జూపువాఁడెవఁడుకలఁడు)అని కబీరు పలికినాఁడు. (గురువు దఱిలేనియెడ మార్గమెఱుకబడదు.) ఆధ్యాత్మిక మార్గగామియైన సాధకుఁడు తనకుఁగలుగు సందేహములను— ఆటంకములను గురువునందు గౌరవ విశ్వాసప్రేమలను బఱపుచు సేవించనేర్చిన ఆగురువు ఆశ్రితునకుగలుగు సందేహములనువారించి, సమస్యలనుదీర్చి తార్కానుకష్టములను తొలగించి పులుల, ఎలుఁగుల, పెద్దగోతులబాఱి పడనీయక తప్పించి క్షేమకరమార్గమున నడిపించి, గమ్యముఁజేర్చి తీరునని బాబా పలుమాఱులు తెలిపినాఁడు. బాబా ప్రవచించురూపకములు అపారభావ గర్భితములు.

1911న ఉపాసనీమహారాజు శిరిడికిఁజేరి బాబాను గురువుగ స్వీకరించి, వివిధదృశ్యములద్వారా ప్రబోధలను గ్రహించినాఁడు ఒకదృశ్యమున ఉపాసనీ తానొకమార్గమున నడచుచుండఁగ ప్రక్కనొక అగాధమైన ఒకగుంట ఉండెను. [అది నరకమని తరువాత గ్రహించినాఁడు] దాని అంచునకుఁజేరిన తోడనే అందుండి రెండుచేతులు పైకిఁజాచఁబడి ఆతని [ఉపాసని] పాదములఁ జిక్కించుకొని ఆగుంటలోనికిఁ లాగఁ

జూచెను. తన గురువును ఆసమయమున స్మరింపఁ జాలుకరుణ అతనికిఁ బ్రసాదింపఁబడుటచే 'పోనిమ్ము! పోనిమ్ము' పోనీయవా సాయిబాబాకు తెలిపెదను'– అనుమాటలు నోటినుండి వెడలెను. [గురుదేవుని జ్ఞప్తి యందుంచుకొని స్మరించువానికి సకలాటంకములు తొలగి నరకమున కాకాక్షించు సకలదుర్వాసనలు నశించును.] వెంటనే ఉపాసనీపాదము లఁబట్టిన చేతులపట్టు విడిపోయెను. అతఁడట్లులా నరకకూపముదరికిఁ బోవుట తప్పిపోయనని తెలుపఁబడెను. ఆతని ఆనరకకూపమునఁ గూల నీయక గురుకరుణయే తప్పించినది. ఇది అన్యాపదేశము– సాంకేతికము కావచ్చును. [ఉపాసనీమహారాజు వృత్తాంతముచూడుడు]

ఇట్టి గురుకరుణయే H.V. సాఠేనుగూడ నరకకూపమునుండి తప్పించినది. శిరిడీయందలి 'శాల'లోని ఒక చెడిపెబాజి పడనీయక నైతికపతనమునుండి, సాఠే'ను రక్షించినది గురుకరుణయే [H.V.సాఠే వృత్తాంతముఁజూడుడు] ఆసమయమున 'సాఠే' ఆర్తాపరాధుఁడుగఁ జిక్కెను. తన అవివేక ప్రవర్తనమునకు గాఢ పశ్చాత్తాపముపొందెను. అదిమొదలా ప్రదేశమును 'శాల'ను మెట్టియెఱుఁగఁడు. తన ఆశ్రితుఁ డైనవానిని నరకకూపమునఁ బడనీయక రక్షించుచు, సురక్షితమార్గ మున నడిపించుచు జీవితగమ్యమునుజేర్చు సద్గురువెట్టివాఁడో బాబా విశదపఱచినాఁడు, మానవుఁడట్టి వ్యభిచరణశీలముఁగలిగియున్న, చెడు ప్రవర్తనములకు లోనిసిఁడైనయెడ పవిత్రత– విరక్తి– దైవప్రేమ– విముక్తిఁగనలేఁడని, మానవజీవితమున ఉన్నతసత్యముఁ బడయుటక న్నాఁడుగాఁడని తనవానికి బాబా ఎఱుకపఱచినాఁడు. ఆవిధముగ 'దభోల్కరు'నకు బాబా తెలిపినవిషయము– 'గమ్యముఁ జేరుకొనుటకు గురువు ఎంతేనియు అవసరము'– అనియే- సాఠేను పురస్కరించుకొని బాబా నిరూపించినాఁడు. సాఠేనుగాని తదితరులనుగాని బాబా రక్షించినది యిది యొకటియేకాదు. క్రోధము– క్రోపము, కామమువలె గమ్యమును జేరనీయక మానవునకు ప్రతిబంధకమగును.

సాఠేవిషయమున క్రోధము (ద్వేషము)ను నుపశమింపఁ జేయుటకు మఱియొక సాయము బాబా కావించినాఁడు. సాఠే శిరిడిదగ్గఱ కొంతభూమినిఁ గొనెను, దానిఁజూచి రాఁదలచెను, అతని భార్యను గూడ వెంటఁగొనిపోఁదలచి బండిని పిలిపించెను. అతనిమామ దాదా కేల్కారు- తనఅల్లుడు సాఠే భూమినికొనిన విషయము దాయాదులకు దెలిపినచో తమకు భాగమురావలయునని దాయాదులు పేచీలు పెట్టుదురను తలంపున తనపుత్రికను వెళ్ళవలదనెను సాఠే తనభార్యను బండియెక్కుమన నామె నిరాకరించెను. తనమాటను ధిక్కరించిన భార్యపై కోపముదహించి బండివానిచేతిలో కొరడాలాగికొని ఆమెను (సాఠే) కొట్టుటకై ఆకొరడాను పైకెత్తెను. ఇదియంతయు మసీదునందుండియే తెలిసికొనుచున్న బాబా 'మేఘుని సాఠేదగ్గఱకు పంపెను. మేఘుఁడాక్షణమున పఱుగెత్తిచేరి "బాబా నిన్ను పిలుచుచున్నాఁడు"- అని, సాఠేకుఁ దెలిపెను ఎత్తినకొరడాను క్రిందపడవైచి సాఠే బాబాను సమీపించెను. బాబా సాఠేను శాంతపఱచి, 'నీపొలమెక్కడకుఁబోలేదు. అక్కడేయున్నది. దానిని నీవు చూడవలసిన అవసరలేదు.'- అని, బోధించెను. తన భార్యయెడ క్రౌర్యప్రవర్తనమునుండి బాబా యెటుల ఆక్షణమున కాపాడినది సాఠే గ్రహించెను. ఇట్టి అసభ్యప్రవర్తనము- నరక కూపమునుండి బాబా తప్పించిన విధము గుర్తించెను.

శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీనరః

తనువు విడుచునంతదనుక నేమనుజుండు
కామకోపములను గలుగువేగ
మును సహింపఁగలడొ పురుష పూతనందనా!
వాఁడె యోగి సుఖియువాఁడె యగును.

శ్రీ మద్భగవద్గీతామృతము. 5-23

ఆధ్యాత్మిక పురోవృద్ధినొంది గమ్యము జేరుకొనుటకు సాధకుడైన మానవుడు కామక్రోధాదులను, రాగద్వేషాదులను అవశ్యము నిర్జింపవలయును. ఇట్టి శత్రుషట్కమును జయించి జీవితగమ్యముజేరి కొని శాశ్వతసుఖశాంతుల బడయుటకు ఏకైకమార్గము సద్గురుసమాశ్రియమే.

## 9. శ్రీ సాయీబాబా - జాతీయ సమైక్యత

శ్రీ సాయీబాబా నివాసస్థానమైన శిరిడిగ్రామ వాతావరణము రాజకీయ తదితర వివాదములగూర్చిన ఆందోళనములచే నేనాడును కలుషితముకాలేదు. బాబా తన సహజ నిరాడంబర మార్గమున, ఆచరణబోధలద్వారా, భారతజాతీయ సమైక్యతకు భారతీయక్షేమ భద్రతలకు గట్టి పునాదులను నిలిపినాడు. వచ్చినకష్టము మతసంబంధములైన ఆచారసిద్ధాంతములందు పరస్పర భిన్నాశయములుగల అశేష హైందవ- ముస్లిము మతానుయాయుల ఏకైకకారణమున జేరదీసి యిరుతెగలందు సామరస్య సమన్వయభావమును పాదుకొలుపుటయే బాబా తన ఆశ్రితులగు బిడ్డలకు సకలమత సారాంశమును విశదపఱచి, సర్వనియంత 'చత్తేబోత్తేదేవ్'- చరించుచు పలుకుదైవము అయిన గురుదేవునందు అచంచలప్రేమ బఱపుటయే ఏకైకసంబంధముగా గల్పించి యెల్లర జేర్చి కూర్చినాడు.

బొంబాయి మొదలగుపట్టములందు దేవాలయముల మసీదులను విధ్వంసముల గావించుకొనుచు వొండొరుల బాధింకొనుచు హింసించుకొనుచు విద్వేషము పెంచుకొనుచున్న సమయముల శిరిడియందు హిందువులు- ముస్లిములు పరస్పరము మైత్రిపఱపి సహకరించుకొని దేవాలయములను మసీదులను నిర్మించుకొనుచు- పునరుద్ధరించుకొన దొడ్డ గిరి గోపాలరావుగండు- ఒక హైందవరెవిన్యూ ఇన్సెపెక్టరు. మసీదును

పునరుద్ధరించుటకు కొండజాతినిఁ దోలించెను. బాబా ఆజాతిని హైందవదేవాలయములను పునరుద్ధరించుకొనుటకై యిచ్చెను. హైందవులు వేనవేలు ధనముఁగూర్చి మసీదును మిక్కిలి రమ్యముగ పునరుద్ధరించిరి. శిరిడికి ౩ మైళ్ల దూరమునున్న 'సకోరి' గ్రామమున బాబా భక్తుడైన ఉపాసనీమహారాజు- ప్రజానీకమునందెట్టి కలతలులేని విధమున- ప్రశాంతికి భంగముకలుగని చొప్పున శివ-మారుతి- దేవాలయములకు ఇరువదిగజముల దూరమున నొకచక్కని 'మసీదు'ను కట్టించెను.

శిరిడియందు హైందవులు ముస్లిములు ఏకమై చావడికి ఊరేగింపునందు- ఇతర సేవలందు ద్వారకామసీదు- సమాధిమందిరమున జరుపఁబడు ప్రార్థనలందు పాల్గొనువారు. ఈ యిరుతెగలవారు తీసికొనివచ్చిన శాకాహారపదార్థముల నివేదనల- 'నమాజ్' 'ఫటెయా' లను పలికి కావింపబడిన నివేదనలనెల్లను స్వీకరించి ఆరగించుచుందురు.

శ్రీ సాయిబాబా హైందవ- ముస్లింసమైక్యతకు సజీవమైన చిహ్నమైనవాఁడు. బాబా జీవితము- బోధలు మన భారతదేశమున సకలజాతి- మత- శాఖలన్నిటిని సమైక్యపఱచు సమర్థనీయములైన సమైక్యతానురాగబద్ధములై యున్నవి. బాబా భౌతికతనువునందున్న తుదిక్షణమువరకు- పుట్టుకచేతగాని పోషణ- రక్షణ- వృత్తి- ఆచారముచేతగాని, ఆతండ్రి హైందవుఁడైనది- ముస్లిం అయినది యెవ్వరికిని తెలియదు. బాబా-తనది యీమతమని యెప్పుడు చెప్పుకొనలేదు. (కమీషన్ స్టేట్‌మెంట్ చూడుము) S C.S. Para 581

హైందవ-ముస్లిం మతముల లక్షణములురెండును బాబాయందు కలవు. ఆరెండును పెనవేసికొనియుండుటచే నిర్ణయింపసాధ్యము కానివైనవి. ప్రజలు వారివారికి తోచినవిధమున నిర్ణయించుకొన దొడఁగిరి. అట్టివారి నిర్ణయముల నవహేళన సూచకముగ బాబా పరిహసించువాఁడు. 1916నందు బాబా "సీమోల్లంఘనము" (భౌతికతనుత్యాగ

ము| చేయు తలంపున తనపైఁగల వస్త్రములన్నియు నూడఁబెఱికి-తుత్తు నియలుచేసి 'ధుని'యందు వైచి, దిగంబరిగనిలిచి, 'రండి! రారండి! అయ్యలారా! వీఁడు హైందవుఁడో– ముస్లిమో– వచ్చిచూడండీ'–అని ఆగ్రహావేశుఁడై పలికినాఁడు. [దిగంబరియైన ముస్లింమతానుసారము 'సుంతి' కర్మమునకు లోనైనాఁడో లేదో యెఱుఁగుట సాధ్యముకాదు] నానాసాహెబ్ చందోర్కరు బాబా సుంతి కర్మమునకు లోనుకాలేదని మఱికొందఱు లోనైనవాఁడని పలికిరి.– ఆవిధముగ హైందవమతాను సారము 'చౌలము' [చెవులుకుట్టుట] కావింపఁబడినదని కొందఱు లేదని కొందఱుపలుకువారు, 'సుంతి'–'చౌలము' ఇత్యాదికర్మములకు బాబాలోనైన, కాకున్న-నవి యప్రధానములు- బాబా అనినట్లు అవి నిష్ప్రయోజకులైన జనులాలోచించుకొనదగిన విషయములు– అసంగతములు.

బాబా తుదిక్షణమువరకు తనపుట్టువును గూర్చికాని, తానుపొందిన మతసంస్కారములఁగూర్చి కాని పలికియుండలేదు. అట్టి సంభాషణము లనవసరములని అసంగతములని భావించినాఁడు, అవి కేవలము మనుష్యమాత్రుఁడైనవానికి సంబంధించిన విషయము బాబా తాను దేహబుద్ధిగలిగి– దేహబద్ధుఁడనని తలంపుగలవాఁడుకాఁడు. సర్వభూతాత్మ- భూతాత్మయైనస్థితియే ఆతండ్రి యెఱుక తాను గావింపఁదలచివచ్చిన పనులను నిర్వర్తించుటకు ఆతనువు నుపయోగించుకొనుచున్నవాఁడనని ఆప్రభువెఱుంగును. బాబాకు పలువురుబిడ్డలతో ఋణానుబంధముకలదు. అట్టి ఋణబంధమును గుర్తించి వారినెల్లరఁ తనదగ్గఱకుఁ జేరఁదీసి, ఆజన్మమున వారలకెంతెంతెదనుక పురోగమించుటకవకాశముకలదో అంతంత ఉన్నతస్థాయికిఁ గొనిపోవునాఁడు అట్టి ఆధ్యాత్మిక జ్ఞానలబ్ధి, బాబాను సమర్థసద్గురువు– పరాత్మ- ఈశ్వరుఁడు అల్లా- అని గుర్తింపఁజాలిన వారికే లభ్యమగునుగాని బాబా భౌతికతను మాత్రుఁడుగ భావించువారికి లభ్యముకాదు. ఆ భౌతికతనువును విస్మరించి

అందధిష్ఠించిన సర్వేశ్వరభావమును గుర్తింపఁగలవారికే సాధ్యము. ఆ కారణముననే బాబా 'మైఁ అల్లాహూఁ'- నేను లక్ష్మీనారాయణుఁడను- అని పలుకుటయేకాక, ఆశ్రితులైనవారికి వారివారి యిష్టదైవస్వరూపుఁడుగ దర్శనమిచ్చినాఁడు. వారుధ్యానించి సేవించు ఆవస్తువే 'తాను' అనుప్రబోధ కలిగించినాఁడు. తన సర్వవ్యాపకత్వ సర్వనియంతృత్వ- సర్వజ్ఞత- సర్వభూతాత్మ- భూతాత్మస్థితి ప్రకటింపఁజాలినాఁడు. ఆయాభక్తుల అభిరుచుల ననుసరించి, తానేవిఠల్- శ్రీరామ- దత్త- మారుతి- మొదలగు దేవతామూర్తి స్వరూపుఁడుగ తనభావిక తనువున ప్రకటనము గావించినాఁడు.

అటుల పలువురుభక్తులకు తాను 'దైవము'- అను ఎరుక గలిగింపఁజాలిన వస్తువు- బాబానుగూర్చి 'యీతఁడు హిందువుల దేవుఁడా? ముస్లిముల దేవుఁడా?' అని చర్చింపఁబూనుట హాస్యాస్పదము- బాబా బిడ్డలు తమహృదయములనిట్టి అనవసర- అసంగతచర్చలపాల్పడి సర్వనాశనము కల్పించుకొనకుండునట్లు చేయుటయే బాబా ఆశయము. ఆ కారణముననే తనవిషయమున- ఇతరసాధు సత్పురుషుల విషయమునవారి జన్మకర్మములనుగూర్చి చర్చింపఁదగదని బాబా తెలిపినాఁడు. నిషేధించి నిరుత్సాహపఱచినాఁడు. కబీరు భగవనుఁడు ఆవిధముగ నిషేధించి, అట్టి చర్చలవలన కలుగుమేలుకంటె కీడే తత్యధికమని తెలిపినాఁడు.

శ్రీ సాయీప్రభువునుగూర్చి యింతదూరము తెలిపినను బాబా హైందవుఁడా?- ముస్లిమా? అనువిషయము రూఢిగ తెలిసికొన నాసక్తి వహించువారు అనేకులుకలరు. ఇట్టి అన్వేషణేచ్ఛ తొలఁగిపోవునది కాదు. అని మనము గమనించవలయును. బాబాతోడ పెక్కు-సంవత్సరములు సంబంధము కలిగియుండి ఆతండ్రి ఆదరాభిమానములనుపొంది ఆస్వామి అనుగ్రహమున పెక్కు-మారులు కష్టములనుండి రక్షింపఁ

బడిన భక్తుఁడు (గాణూదాస్) బాబాను ఒక 'మస్లిం' అనియే విశ్వసించినాఁడు ఎవరేని అట్టివానిని [బాబాను] బ్రాహ్మణుఁడని ఎటుల భావింపఁగలఁడివియు సందేహించినాఁడు. బాబా యందిట్టి మహమ్మదీయభావము కల్పించుకొనుట ఆయన (గాణూదాస్) భక్తి కెంతయు హాని కలిగించినది. బాబానుగూర్చి యిట్టి మతవిభజన నిర్ధారణభావము కలిగియుండుట ఆట్టి వ్యక్తియొక్క దేహాభిమానమే కారణము అనగ ఆవ్యక్తి దేహము మాత్రమేయవి– ఆతనువు శ్రేష్ఠమైన హైందవ బ్రాహ్మణ వర్ణమునకుఁజెందినదని ఆతనిభావము. ఇట్టి భేదభావములెంత అనర్ధకరములో– భగవానునందైక్యము (పూర్ణాలయ) పొందుటకు ఇట్టి తలంపులెంత ప్రమాదకరములో "నాందేడు"లోని'బ్రహ్మచారిసాధువు' ఆభక్తునకు నిరూపించినాఁడు. [Life of Sai Baba ఏమీ, నిన్నుపేక్షింతునా? గ్రంధమున (దాస్ గాణూమహారాజ్ వృత్తాంతము) పుటలు 211-213] 'నీ అభిమానము– నీ అజ్ఞానమెట్టిదో తెలిసికొంటివా? నీ నీగురువు సాయీబాబా తనపాదములనుండి గంగ నుద్భవింపఁజేసెను. ఆగంగను నీదోసిట పట్టుకొంటివి. దానిని నీవేమిచేసితివి?నీవా జలముల నెత్తిపైనమాత్రము చల్లుకొంటివి. నీవాజలముల త్రాగినవాఁడవు కావు– చూడుము– నీ దురభిమానము',– ఆ–వి రక్తబ్రహ్మచారి– సాధువుయొక్క–భావము వివరించుకొందము. ఆభక్తుని [గాణూదాస్] తలంపు– ఆగంగ ఒక ముస్లిం మహావిష్ణువు పాదములనుండి ఉద్భవించినదిగ భావించి, అట్టినీరము పరిశుద్ధమైన బ్రాహ్మణ తనువునకుచెందిన పెదవులఁ దాకనిచ్చిన ఆపెదవులు కళంకితములగునని ఆతనిభావము అంతకంటె అసంగతమైన బుద్ధిలేదు. కాని, అట్టిభావ మాభక్తునందు పెద్ద కాలమునిలిచి పాదుకొనినది. దురభిమాన మురహంకారములు త్వరగా నశింపవు. కొంతవర కున్నతస్థాయికిఁజేరిన భక్తులందు సైతమిట్టి దేహాభిమానములు నిర్మూలముఁ గాఁజాలవు.

[చూడుడు. S.C.S. శ్రీ సాయీనాధ బోధామృతము Para 404]

బాబా భక్తుఁడు రావ్ బహద్దూర్ S.B. ధుమాల్- జిల్లా మేజస్ట్రేటు ప్రశ్నమునకు బాబా మతమునుగూర్చి యిచ్చిన సమాధానమును గమనింపుఁడు! 'బాబా హైందవుఁడుకాఁడు- ముస్లిముఁగాఁడు, ఈయుభయ మతములవారికి అతీతుఁడైనవాఁడు'- అని సమాధానమిచ్చెను. అంతకంటె, ఆసమయమున బాబా హైందవ ముస్లింసఖ్యతకు సమైక్యతకు జాతీయ సామరస్య సమన్వయ కార్యకలాపములఁగూర్చి వివరించుటకవకాశములేదు. ఆవిషయము మనము పరిశీలించుదము, అట్టిపని మనకు కష్టమేయగును.

బాబా యందుగల హైందవముస్లిముల లక్ష్యములు- ఆరెంటియొక్క కలయిక- ఆయన కారణమునందు- మసీదునందు- బాబా ప్రవర్తనమందు- బోధలందు- ఆతండిరికి సంబంధించిన ప్రతి విషయమునందు- ఈ యిరుమతముల కలయిక జాతీయసమైక్యతా విధానములు ఎట్లు చక్కగ మిళితములైనవో గమనింపఁదగును.

[S.C.S. Para 477] బాబా ఒకసందర్భమున తానుపూర్వము 'కబీరు'గ అవతరించినట్లు [S.C.S. 486] అక్బరుచక్రవర్తి తన శక్తిసమతల కాశ్చర్యచకితుఁడైనట్లు తెలిపినాఁడు. హిందూముస్లిం సమైక్యత విషయమున అక్బరుచక్రవర్తి ఆశయములను బాబా నిర్వహించిచాలవరకు సఫలీకృతుఁడైనాఁడు. కబీరు 15, 16 శతాబ్దములమధ్య 'ష్లా' కాలముననున్నవాఁడు, ఆతని ఆశయములు నేటికాలమునవలె ఉదాత్తములైనవికావు. బాబా నేటికాల పరిస్థితులను- ఆధ్యాత్మిక ప్రగతిని- చక్కగ గ్రహించి, భారతదేశ వాతావరణమును బాగుగ గుర్తించినాఁడు. ప్రప్రథమభారతీయ స్వాతంత్ర్యసమరమున ఝాన్సీరాణిసేనలో తానొక యోధుఁడైనట్లు తన పూర్వజన్మములలో నొకదానినిఁగూర్చి తెలిపినాఁడు, (S.C.S. 489)

శ్రీ సాయిప్రభువు శిరిడియందున్న కాలమున అచట వివిధములైన రాజకీయములు లేవు. బాలగంగాధరతిలక్- G.S. కపర్దే-

వీరు శిరిడియందున్నపు డేవిధములైన రాజకీయవిషయములను బాబా చర్చించి, యెఱుగడు. దేశభక్తినిఁగూర్చి ప్రోత్సహించినను రాజకీయ విషయక భిన్నభావములను దూరము నందుంచినాఁడు. భారతదేశము సర్వశక్తివంతము- సర్వశోభావంతము నగుటకు హిందూ- ముస్లిముల ఐక్యత- సమైక్యత లత్యావసరములను విషయము దేశాభ్యున్నతిఁగూర్చి జాగ్రత్తగ పరిశీలించు ప్రతివ్యక్తికి తోఁచితీరును. బాబా ఈవిషయము గుర్తించినాడు కావుననే హైందవ- ముస్లిములందు సామరస్య సమన్వయభావము పెంపొందించుటకు గట్టి పునాదులు నిర్మించినాఁడు మొదటిది తన తనువున- రెండవది తనజీవితమున, మూడవది మసీదునందు- నాల్గవది తనబోధలందు, చివరిది తనతో సంబంధించిన ప్రతివిషయమున ఈ సమైక్యతకు ప్రాధాన్యమిచ్చి, దానిని పెంపొందించుటకు గట్టి కృషి గావించినాఁడు.

ఈ విషయములనుగూర్చి మనము చర్చించుట అసంగతమే యగును బాబా తనువునుగూర్చి విచారించుదము. బాబా చెవులు కుట్టబడియుండుట కెట్టిసందేహము లేదు, బాబా మహాల్సాపతితో చెప్పినటుల నైజామురాష్ట్రమున పత్రి యనుగ్రామమునందు బ్రాహ్మణ దంపతులకు జనించియున్నవాఁడు. ఒకటి రెండుసంవత్సరముల బిడ్డగనున్నపుడా బ్రాహ్మణ దంపతులు తననొక ముస్లింఫకీరునకు అర్పించినటులను తెలిపినాఁడు, బాబా జీవితమున హిందూ- ఇస్లాంకలయికకు ఇది మొదటినిదర్శనము. బాబాను తీసికొనివెళ్ళి సాకిన ఆఫకీరు ఆధ్యాత్మికోన్నతస్థితి నొందినవాడనియు సూఫీమతానుయాయులందత్యున్నతస్థాయికిఁ జేరికొనినవాడనియు మనము గ్రహింపఁదగును. బాబా యెప్పుడును దైవమునుద్దేశించి 'గురుదేవుఁడు- ఆఫకీరు- దైవము- అని పలికినను- తనను అతిబాల్యమునుండి పెంచి, తనకు తండ్రి- రక్షకుఁడు గురువు- దైవము- సర్వస్వమునయిన ఆఫకీరు అనియే మనము తెలిసికొనఁదగును. దైవభావము- వైరాగ్యమునకు సంబంధించిన సకలసుగు

ణములను- తనజీవితమును తీర్చిదిద్ది తనయొక్క సర్వస్వమును దైవాంకితము చేయుబుద్ధిని బాబా ఆఫకీరునుండియే సముపార్జించినాడు. రెండుమూడు సంవత్సరములైనపిదప [అనగా బాబా 5, 6 ఏండ్లవయస్సువచ్చినవాడైన పిదప] ఆఫకీరు మరణించెను భర్త ఆజ్ఞానుసారమా ఫకీరు భార్య బాబాను గొనిపోయి తిరుపతి వేంకటేశ్వరభక్తి తత్పరుడు, మహాసాధు పుంగవుడు సకలయోగసిద్ధి సంపదలుగలిగి 'జింతూరు' పరగణాపాలకుడు- పీష్వాలవలన జయేదారుడైన గోపాలరావు దేశముఖునకు- (వేంకుశునకు) ఆబిడ్డను అర్పించినది. 'రాజ్యపరిపాలనా దక్షత్వమేకాక వేంకటేశ్వరానుగ్రహమున అష్టాదశ యోగసిద్ధులు సకల శక్తిసమన్వితులు గోపాలరావునకు సంక్రమించినవి. జనులెల్లరు ఆయనను గోపాలరావును 'వేంకుశుడు'- 'వేంకుశ్'అని పిలువదొడగిరి.

కావున బాబా మస్లిం (సూఫీ) ఫకీరు పోషణమునుండి- ఆధ్యాత్మిక యోగపరాకాష్ఠ నొందిన ఫకీరునకంటె భిన్నుడుగాని హైందవ భక్తశిఖామణి వేంకుశుని రక్షణమున జేరినాడు. బాబా పలుమారులు మిక్కిలిప్రేమతో తనగురుదేవుని 'వేంకుశుడ'ని పేర్కొనువాడు. తన గురుమార్గము పరమ ప్రేమాత్మకమైన విశ్వమతమని తెలుపువాడు. గురుప్రేమ- గురువు అనుగ్రహమే యీమార్గమున ఉపాయోపేయములుగ బాబా తనబిడ్డలకు విశదపఱచినాడు.

పశువులు- జంతువులందు సైతము ఈప్రేమతత్త్వము విదితము. బాబా తన గురుప్రేమయందు నిమగ్నుడైనవాడు. ఆగురువు బాబాను మిక్కిలిగ ప్రేమించినాడు. ఈగురుభక్తి యనునది సకలమత సిద్ధాంత సారము. బాబా సామాన్యమానవస్థితినుండి పరిపూర్ణత్వము- సర్వభూతాత్మ భూతాత్మత్వము 'అనేకాశ్రితాతర్క్య లీలావిలాస'యోగ సిద్ధిసంపదలు బడయజాలినది యీగురుప్రేమ మార్గముననే (చూడుడు

S.C.S. శ్రీ సాయీనాథ బోధామృతము Para 136–139) 'నేనీస్థితి పొందినది (సకల యోగసిద్ధిసంపదలు పొందఁగలిగినది.) నాగురుదేవుని కరుణాకటాక్షము మాత్రముననే– మా పరస్పరప్రేమలు [వాకు నా గురుదేవునిపైన– నాగురుదేవునకు నాపైనగలప్రేమ] అపారము'– అని తెలిపినాఁడు. కావున మొదటినుండి హైందవ– ముస్లింతత్త్వములు బాహ్యవిషయములకు సంబంధించినంతవరకు బాబాయందు చక్కఁగ పొందుపడినవి. ఇఁక ఆంతరంగిక– ఆధ్యాత్మికవిషయము– సకలమత సిద్ధాంతసారము– దైవము– ప్రేమ స్వరూపుఁడు [దైవమేప్రేమ– ప్రేమయేదైవము.] మానవునిఆత్మ– ఆదైవమునుండి వెడలిన ఒకనిప్పురవ్వ ఈ మానవరూపముననున్నవ్యక్తి ఆప్రేమద్వారా తిరిగి దైవమును చేరికొనవలయును– అను నియమమున పోషింపఁబడి బాబా పరిపూర్ణస్థితి నొందినాఁడు. కావున శ్రీసాయీబాబా అట్టిశిక్షణమునఁ దీర్చిదిద్దబడి మానవపరిపూర్ణత సాధుసత్పురుష ప్రపూర్ణస్థితిఁ బొందినాఁడు. తనను సమాశ్రయించి సేవించు బిడ్డలెల్లరకు దైవము– సమర్థ సద్గురు దేవుఁడైనాఁడు. బాబా జీవితమున చరమదశయందు ఈవిషయమెల్లరకు విస్పష్టమైనది.

బాబా తన గురుదేవునివలన నొక ఇటుకరాయి– చిఱుచేలము మాత్రము గైకొని, సంపూర్ణత్వప్రాప్తికి ఆశీస్సులుపడసి బయలుదేరినాఁడు. ఆపిదప ఫకీరులలో కలిసిమెలసి తాను నొకఫకీరుగ నిందందు సంచరించినాఁడు ఎంతెంతకాలము ఎందెందుఁ దిరిగినది. యెవ్వరు నెఱుఁగరు తుదకు శిరిడిగ్రామము బాబా స్థిరనివాసమైనది. శిరిడిజేరిన పిదప పెద్దకాలము (20, 30 సంవత్సరములు) పేరు ప్రతిష్ఠలేని ఒక సామాన్య ఫకీరుగనే కాలముగడపినాఁడు.

బాబా సకలసిద్ధి సంపదలను సర్వభూతహితప్రేమలను గుర్తింపఁజాలిన హైందవసాధువులు గంగాగిర్, దేవదాస్, జానకీదాస్ మొదలగువారు; ఆపిదప జనసామాన్యము–[ఆశ్రితులగు బిడ్డలకు సంతానయి–

హితాభిలాషులను పరిపాలించుటచే బాబా పాదములఁ గ్రమ్ముకొని గౌరవించి పూజింపఁదొడఁగిరి. బాబా తన భక్తులైన బిడ్డలపై ప్రేమ పాశములచే బద్ధుఁడై తొలుత వ్యష్టిగ, పిదప సమిష్టిగ తనపూజలఁ గావించుటకు లోఁగవలసివచ్చెను. శిరిడికిఁ జేరిన ముప్పది నలుబది సంవత్సరముల తరువాత బాబా సమర్థసద్గురువను ప్రసిద్ధి విదితమైనది అష్టప్రాప్త సిద్ధిపూర్వము- తరువాతను బాబా తన ప్రేమతత్త్వమును విశదపఱచుచు, తొలుత తనకు ఋణానుబంధముఁగల బిడ్డలను ఆపిదప తనను సమాశ్రయించు భక్తులందఱియెడ ప్రేమ- నిస్స్వార్థ- నిరవధిక ప్రేమఁ బఱపినాఁడు శ్రీసాయీ సంసారమున తనవారినెల్లరఁ బ్రేమించుచు- సేవించుచు తన అసాధారణ ఆత్మస్ఫూర్తిమైనశక్తి ప్రపూర్ణవ్యక్తిత్వమున వేనవేల బిడ్డల వేలకొలది తావుల సంరక్షించుచు సకలమానవ సమాజము ననుగ్రహించి తరింపఁజేయుటకే జీవించినాఁడు. ఇట్టి ఆశయము, కార్యదీక్షగలవ్యక్తియే యితరులకంటె సమర్థుడు.

మనమీ అధ్యాయమున వివరింపనది బాబా ఆప్రేమతత్త్వము వ్యాప్తిగావించుటలోని ముఖ్యాంశము, హిందూ- ముస్లిం సమైక్యతను సాధించుటయే బాబా శిరిడికిఁ జేరినాఁడు మనదేశమున నున్నట్టుల శిరిడియందును హిందూ- ముస్లిం వైషమ్యములుండెను. బాహ్యవిషయముల- వేషమున వ్యక్తిగతాభ్యాసముల- మతాచారముల- నియమసంస్కారముల బహువిధములగు భిన్నప్రవృత్తులుగల హైందవ ముస్లిములందు సమైక్యతఁగూర్చుట సామాన్యమైన పనికాదు అది మిక్కిలి కష్టసాధ్యము. ఈ యుభయతెగలు వేర్వేఱుగ నుండవలయునని ఆశయముగలవారు, వీరి భిన్నప్రవృత్తులను పెద్దకాలము మనదేశమును పాలించిన బ్రిటిష్ ప్రభుత్వమువారు కపటయుక్తి చాతుర్యములతో ఈ భిన్నప్రవృత్తులను అత్యధికముగ నిరువురందు పాదుకొనఁ జేసిరి.

కాని బాబా విధానము అతిసూక్ష్మమైనది బాబా యేమి కావించుచున్నది, తన ఆశయసిద్ధి నెటుల నెఱపుచున్నది యెవ్వరు నెఱుఁ

గను. ప్రతివ్యక్తియందు బాబా ప్రసరించు ప్రేమతత్త్వ పర్యవసానము ఎవరికిని గానరాకుండెను. బాబా యందు ప్రేమనెఱపినవారు హిందువులు- మస్లిములు- క్రైస్తవులు మొదలగువారు సోదరభావమున చేరినారు. బాబా తెలిపినట్లు వీరందరు 'ద్వారకామాయి'బిడ్డలు. వారినెల్లరను బాబా జాగరూకతతోఁ గాపాడినాఁడు. ఇట్టి వివిధ మతానుయాయులను సమానముగ- భేదరహితముగ ప్రేమించి ఆదరించుట హైందవముస్లిం సమైక్యతకు మిక్కిలి దోహదము కలిగించినది. మతవైషమ్యము- మతనిర్బంధము- మతాంతరీకరణము మొదలగునవి జరుగనీయక బాబా తగు జాగ్రత్త వహించినాఁడు. అట్టివానిని నిరసించి అణచివేసినాఁడు.

ఒక సమయమున బాబా సంతోషించునను తలంపున (మాలేగోన్ ఫకీరు) బడేబాబా క్రొత్తగా తన హైందవమతమును మార్చికొని ఇస్లాంమతము స్వీకరించిన 'ఇబ్రహీం' అను వానిని బాబా దగ్గఱకు తీసికొనివెళ్ళి 'ఈతఁడు ఇస్లాంమతము స్వీకరించినాఁడు'- అని యెఱుకపఱచెను. [S C.S 595] బాబా ఆ ఇబ్రహీంను చెంపపైఁగొట్టి 'నీ అబ్బను మార్చుకొంటివా?' అని నిరసించి, మసీదులోని కాలిని రానీయలేదు. హైందవులను ముస్లిములను సమానాదరణమున బాబా మసీదులోనికి రానిచ్చువాఁడు. హైందవులు మసీదులోని 'ధుని'ని అర్చించువారు. నగుణ్ మేరు నాయక్ తో 'అన్నము నేతితోఁజేర్చి 'ధుని'-అగ్నియందు వేల్చుమని బాబా ఆజ్ఞాపించినాఁడు. ఇది పార్సీలు- హైందవులలో కొందఱఆచారము. ఆధునిలోని ఉదిని బాబా అందఱకు ప్రసాదించువాఁడు. మసీదుమంటపమున (ముందుహాలులో) తులసీ బృందావనముకలదు, హైందవస్త్రీలు ఆతులసికోటకు ప్రదక్షిణము చేయుచుందురు. మహమ్మదీయులకొఱకై పడమటబావి గోడదగ్గఱ ఒకతావున మధ్యగ నొక అరుగు మూఁడునాలుగు మెట్లుగలది కలదు. ప్రబోధకులైనవారెవరేనియున్న దానిపైనిలిచి ప్రబోధ గావింతురు. మసీదున

దీపములు వెలిగింపఁబడి యుండును, దీనిని 'మింబర్' అందురు. ఆమసీదు బాహ్యాకారము అంతయు ఇస్లాంమతమున పూర్వాచార 'సరేసన్' కట్టడముల పద్ధతుల ననుసరించి యుండును, ఇఁక ఆమసీదునందు హైందవముస్లిముల శాస్త్రగ్రంథములు పఠింపఁబడుచుండును. పగటి కాలమున హైందవులు పండరిపద్ధతుల ననుసరించి భజనలు— పూజలు— హారతులు మేళతాళములతో జరుపుచుందురు. మహమ్మదీయులు 'ఇద్గ'పూజలను మసీదునందు జరుపుటకై వచ్చు ఆచారముకలదు. పూర్వాచార పరాయణులగు ముస్లిములు రాత్రులందు 'కలమ్' లేక 'మరియత్' వల్లించుచుందురు, బాబా [తోడు] అంగరక్షకుఁడైన అబ్దుల్ (బడేబాబా) ధునిముందు, కూర్చుండి 'ఖొరాన్' పఠించుచుండును,

పగటివేళ అరతులైనపిదప తుకారాంగాథలు— భాగవతాది— పురాణపఠనములు— భజనలు జరుపఁబడును. ఆవిధముగ ఇరుమతముల వారు వారివారి మతాభీష్టముల ననుసరించి వారివారి మతగ్రంథముల నొండొరులయెడ నెట్టి స్పర్ధలేకయే పఠించుకొనుచుందురు, సర్వాంతర్యామియైన బాబా ఆయా మతానుయాయుల అభిరుచుల— అభీష్టముల నెఱిగి సమయోచితముగ వారల నుత్సేకపఱచువాఁడు. బాబా రామమంత్రము జపింపుమని గురుచరిత్ర— భావార్థరామాయణము—ఏకనాథ—భాగవతము— జ్ఞానేశ్వరి ఇత్యాది పవిత్రగ్రంథముల పారాయణము [పోట్] జరుపుమని తనబిడ్డల కాదేశించువాఁడు. రాత్రి ఆరతులందు— జ్ఞానేశ్వర— తుకారాం— మొదలగు మహారాష్ట్ర సాధుసత్పురుషుల సంబంధములగు గేయములు కీర్తింపఁబడును. ఈవిధముగ మహారాష్ట్ర సాధు సత్పురుషులనుగూర్చి కీర్తింపఁబడుచున్నను బాబా వారందఱకు కేంద్రలక్ష్యముగ భాసించువాఁడు, ఇన్నివిధముల జరుగుచున్నను శిరిడియందు ఈ యిరుతెగలందు పరస్పర వైషమ్యము కలిగినదికాదు.

సకలమతములు సత్యములు. వారివారి గురుమార్గమున ప్రవర్తింపదగినవి. వారివారి మతాచారపద్ధతులను విడనాడక స్వమతవిశ్వాస గురుసాంప్రదాయానుసారము ప్రవర్తింపదగునని ప్రబోధించు శ్రీ సాయీబాబా వీరందఱకు ఏకైకలక్ష్యమైనాడు. ఎల్లమతములు సమైక్యత నొందవలసిన పద్ధతి యిదియే. మానవ స్వభావమున్నంతవరకు జనులందు భేదములుండనేయుండును. ఎల్ల జీవరాసులయందు భేదములున్నటుల మానవులందును భిన్నత్వముండితీరును. అట్టి భిన్నత్వమున అంతర్వ్యాప్తమైన ఏకత్వదృష్టి మానవులందు విశిష్టమైనది. మానవులందు ప్రేమ–దయ అనునవిలేని యెడల అట్టి భిన్నత్వభావములు వారికి విషప్రాయములై నాశనహేతువులగును. పరస్పరద్వేషములు కలహములకు హింసలకు దారితీయును. శ్రీ సాయిప్రభువవలె మార్గదర్శి– నియంత– ప్రేమస్వరూపుడు అగు సద్గురువు లక్ష్యముగానున్న యెడ నిట్టి స్వాభావిక భేదములు ద్వేషకలహ హింసలకు అవకాశము కలుగనేరదు.

ప్రేమ– స్త్రీపురుషులందు సమైక్యతఁ గూర్చునటుల విభిన్నతత్వములు– ఆశయములు– ప్రజ్ఞలుగోచరించు మానవులందును ప్రేమభావము సమైక్యతఁ గూర్చితీరును. ప్రజలలో పరస్పరద్వేషములు– అన్యాయముల కలహములను బాబా తనబోధలచేతనే కాక తన ఆచరణములద్వారా నివారింపఁ జేసినాఁడు. సహనస్వభావమును పెంపొందించినాఁడు. బాబా అధిష్ఠించియున్న ద్వారకామాయి మసీదున ప్రేమతత్త్వము నిబిడముగ వ్యాపించినది. వివిధ మతములనేకాక ఆయామతములందలి వివిధ శాఖోపశాఖలనైతము సమైక్యతఁ బఱుప సమర్థమైనది. ఈ ప్రేమతత్త్వ ప్రభావముననే మానవసమాజమే కుటుంబమై సాంఘిక సమత్వభావము నలవఱచుకొనఁగలదు. విభిన్నమతములు– వివిధశాఖలు– ఆశయములుగలిగి పరస్పర భిన్నభావములుగల సం

ఘోషసంఘములందు బాబా సమైక్యతఁ గల్పింపఁజాలు మార్గము నిర్దే శించినాఁడు.

ఈజాతిమత సమైక్యభావము క్రొత్తదికాదు, ఏకనాథ- నామ దేవ- కబీర్,- గురునానక్ మొదలగువారు వారివారి ఆచరణబోధల ద్వారా యీ జాతిమత సమైక్యతకు పాటుపడినారు వీరందఱు పూని సాగించినపనిని పరిపూర్తిచేయుటకు బాబాకు విడిచిపెట్టినారు. బాబాను ప్రేమించి సేవించు మహారాష్ట్రదేశమున భక్తులు తమవలె బాబాను ప్రేమించి సేవింతురని వారు ఊహించి యెఱుఁగరు.. కాని శ్రీసాయీ భక్తి శ్రీ సాయీప్రేమ- శ్రీ సాయీసేవ- శ్రీ సాయీ సిద్ధాంతము లందు ఆదరణము ఈనాఁడు మన భారతదేశమున హిమాచలము మొ దలు కన్యాకుమారివరకు- బొంబాయి మొదలు ఆసామ్‌వరకు వ్యా పించి క్రమక్రమముగ విశ్వవ్యాప్తమగుచున్నది, ఈ ప్రపంచమం తయు శ్రీ సాయీమయమైతీరును. అది ఈశ్వరేచ్ఛ. ఈ ప్రవాహము విశ్వవ్యాపము కావలసినదే. దీనిని నిరోధించుట కెవరికిని సాధ్యము కాదు. ఈవిశ్వమునకు బాబా ఏకైక లక్ష్యమైనాఁడు.

ప్రతి మతమునందు నుద్దండపాండితిని గడించి, మహోన్నతస్థాన మలంకరించి నారమనుకొను ప్రచారకులందైక్యముఁ గల్పించుట. సా మాన్యజనులందైక్యత గల్పించుట అంతతేలికయైన పనికాదు, 'అవా లియా'ను అనుకొననీ- అవతారమనుకొననీ- నిష్పక్షపాతబుద్ధి- దైవీ సంపద్విశిష్టత- అత్యద్భుత శక్తిసమర్థతలుగల 'శ్రీ సాయీబాబా' వంటి సత్పురుషుఁడున్నాఁడు- ఎల్లరకు శ్రేయము గలిగించఁగలఁడు- అని గుర్తించి సేవించు జనసమాజమునందు సంఘీభావము- సమైక్యత కలిగించుట మిక్కిలి సాధ్యము. హైందవముస్లిముల ఆచారభావముల కలయిక కలిగి, పరస్పర భిన్నభావముల విస్మరించి కబీరు పంథానుయా యులు పెంపొందినట్లు శ్రీ సాయీబాబాను సమాశ్రయించి జనసమా

జము సమైక్యదృష్టితో సేవించుచున్నారు. క్రమక్రమముగ శ్రీసాయీ పదాశ్రితులగు హైందవ ముస్లిములసంఖ్య అత్యద్భుతముగ వృద్ధినొందుచున్నది. శ్రీ సాయీబాబా యీ కృషియందు అపారవిజయ మొందినాడు.

ప్రతిమతమునందు నున్నతస్థాయిజేరిన వివేకవంతులును సమైక్యభావము వైపునకు మొగ్గుచున్నారు. ప్రతిమత సిద్ధాంతములోగల మూఢవిశ్వాసములే యీ జనులను వేర్పఱచుటకు ముఖ్యకారణము. ఈనాడు కాకున్న నిక యేనాటికైన నిట్టి మూఢవిశ్వాసములు శమించి, సకల మతములు సమైక్యతనొంది, యీ విశ్వసృష్టిస్థితి లయకారకుడై యెల్ల జీవులయెడ సమానప్రేమ బఱపుచు అనంతశక్తి సంపదలుగల ఏకైక భగవానుని ప్రేమించి సేవించి తరింపక తప్పదు. శ్రీ సాయీబాబా హైందవుల- ముస్లిముల- క్రైస్తవుల- సకల మతానుయాయులు సమైక్యభావము వహించి ప్రవర్తించినారు.

ఎల్లమతములు సమైక్యతనొందుటకు ప్రేమతత్త్వము మాత్రమే ప్రధానము. ఆ ప్రేమసిద్ధాంతము ననుసరించియే యెల్లరు సమైక్యత నొందవలయును. ప్రేమయే దైవము- దైవమే ప్రేమ- అని గుర్తించి, మానవునందు పూర్ణత్వమునకు ప్రేమయే కారణమని, ప్రేమపరిపూర్ణుడగుమానవుడే సత్పురుషుడు 'చల్తేబోల్తే దేవ్'— [భూమిపై చరించుచు పలుకుదైవము]అని ఎల్లరు విశ్వసింపదగును శ్రీసాయీబాబా యీ ప్రేమపరిపూర్ణస్థితినొంది 'ఆనందో బ్రహ్మేతి విజానీయాత్' అను శ్రుతి ప్రమాణము యథార్థముగ నిరూపించినాడు. బాబా తానెల్లరకు పరమాత్మయని- అంతర్యామియని- సచ్చిదానంద ప్రపూర్ణుడనని ప్రకటింపజాలినాడు. ముస్లిములకు బాబా 'సూఫీ' సూఫీ మతమునను సరించు కబీరు పంథానుయాయులు బాబాను పూర్ణత్వస్థితినొందిన సూఫీ' అని గుర్తించినారు. హైందవులు భక్తి జ్ఞానమార్గములందు పరా

కాష్ఠ నొందినవారు బాబాను దైవీసంపత్ప్రపూర్ణుఁడని,- సచ్చిదానంద విగ్రహుఁడని గ్రహించినారు. దైవము ప్రేమస్వరూపుఁడని. అట్టి పూర్ణప్రేమ యెందుఁగలదో అదియే దైవమని గ్రహించజాలుఁవిజ్ఞులు అట్టి దైవత్వస్థితి బాబా యందుండుట నెఱిఁగి సమాశ్రయించి సేవించుదురు.

కాని, ఇట్టి సమైక్యత ఒక్కరోజున సాధించఁదగినదికాదు. విశ్వమత సమైక్యతాసాధమునకు బాబా గట్టిపునాదులు నిర్మించినాఁడు. కాలము గడచినకొలఁది, యీ ప్రపంచములోని మానవుల ఆశయములు పావనములై పెంపొందినకొలఁది బాబా నిర్దేశించినమార్గము సమ్యగ్యోచనాపరులు- జనసామాన్యము గుర్తించి యనుసరింపఁగలరు. ఇది అమోఘము. దీని భవిష్యత్పరిణామము ఇప్పుడే మనకు పొడగట్టుచున్నది బాబా భౌతికతనువు విడిచినను తన కార్యదీక్షను విడనాడి యెక్కడకో వెళ్ళినాడని యెవరు తలంచరాదు. 1918 తరువాత నేటికినిఁ కేనాటికిఁ దన అద్భుతలీలలను ప్రదర్శించుచునే యున్నాఁడు. ఈభారతదేశమున ఈ ప్రపంచమునందంతటఁ సకల జాతిమత సమైక్యతాసిద్ధికి శ్రీ సాయిబాబా ఏకైక లక్ష్యమైనాఁడు ఈవిశ్వమున మానవులందు సకల జాతిమత శాఖోపశాఖల సమైక్యతకు 'ప్రేమసిద్ధాంత'మే ఏకైక మార్గమని స్వకీయాచరణపూర్వకముగ నిర్దేశించి ప్రబోధ కావించినాఁడు.

## 9. శ్రీ సాయిబాబా-మానవుఁడు-దైవము-హాస్యము

శ్రీ సాయిప్రభువునుగూర్చి, బాబా అనుదృష్టితో తృప్తినొందక ఆస్వామియొక్క వ్యక్తిత్వము సంపూర్ణముగఁ తెలిసికొనఁగోరువారికి నెల్లప్పుడు నదియొక సమస్యగానే ఆందోళనఁ గలిగించును. బాబా ఆశ్రితులు- భక్తులలో పలువురు మొదటిరకమువారే. తనఆశ్రి

శ్రీ రామావతారమున మానవస్వభావ లక్షణములు- ప్రతిపదమునఁ బ్రకటమగుచు దైవీగుణ సంపదలతో మిశ్రితములై శ్రీరామచంద్రుని వ్యక్తిత్వము లౌకికముగ- పారలౌకికముగ జనులకు ఆదర్శము- అనుసరణీయమగుచున్నది. శ్రీరామధ్యానము- రామస్మరణము- రామలీల- అనునవి సర్వసామాన్యముగ లౌకికపారలౌకికవిషయములఁ సేవనీయమగుట ఆఅవతారమునందు మానవతెద్యోతకమగుట చేతనే ఆవిధముగ శ్రీ సాయిబాబా- శ్రీ సాయిరాముని విషయమున [శ్రీరామనవమి శిరిడియందు వార్షికోత్సవము- 'ఉరుసు' పండుగ బాబాచే నియమితమై- శ్రీరామరూపమును ప్రదర్శించిన కారణమున] మానవలక్షణములు- దైవలక్షణములు చక్కగ మిశ్రితములై జనులు సమాశ్రయించి గ్రహించి, సేవించుటకు తోడ్పడుచున్నవి. శ్రీసాయి ప్రభువుయొక్క మానవలక్షణములు దైవలక్షణములతో మిశ్రితములై యీరెండును పరస్పరభిన్నములుగ తోచుచున్నను ఆమహావ్యక్తి యందెటుల రమ్యముగ ప్రకటమైనవో యికముందు తెలిసికొందము.

హాస్యము- అనునది ఒక ప్రత్యేకమైన మానవలక్షణ విశేషము బాబా యందుఁగల మానవలక్షణములలో హాస్య ప్రసంగమనునది విశిష్టమైనది. ఆప్రసంగము దగ్గఱనున్నవారికి వెంటనే అవగాహనము కాదు. ఆప్రసంగములోనిభావము ద్వివిధములుగనుండును. ఒకభావము అప్పటికప్పు డర్థమగునట్లుండును, రెండవభావము నిదానముగ-విమర్శించుకొనినపిదప ఎవరినిగూర్చి పలుకబడినదో ఆవ్యక్తికే అనుభవమున బోధపడును, ఉదాహరణములను పేర్కొందము.

## 1. G. D. పలాస్కి - నాలుగువేల రూపాయలు.

'పలాస్కి'- అనునతడు బాబాను సందర్శింపవచ్చెను, బాబా తన అలవాటుచొప్పున తన అంతర్జ్ఞానము విదితమగునట్లు- ఆవచ్చిన ఆశ్రితునకు తనయందు విశ్వాసము పాదుకొనునట్లు (ఈతని బాకీదా

'జీవో బ్రహ్మైవనాపరః' అని శ్రీ శంకరభగవత్పాదులు తెలిపినటుల జీవి- మానవుడు-జీవి బ్రహ్మమునకంటె [దైవమునకంటె] భిన్నమైన వస్తువుకాదు. ఒకే వస్తువునందు వివిధశక్త్యలుగ మనము గ్రహించవలయును. సద్గుణములన్నియు నొకస్థాయికిఁ జేరి, ఒకనియమిత రూపము దాల్చినవ్యక్తినిఁగూర్చి 'ఇతఁడు దైవము'- అని జనులు పేర్కొందురు. సర్వసాధారణమైన మానవవ్యక్తికంటె- ఆవస్తువు(జీవి) మహోన్నతస్థానమును జేరికొనినవాఁడైన కారణమున ఆవిధముగ భావింతురు. ఆయా ధిక్యత- ప్రభావ విశేషమునఁగాని దయావిశేషమునగాని లేక, యేకళ్యాణ గుణవిశేషమునైన కావచ్చును. దైవీగుణ సంపద్విశేష్టుఁడితఁడందురు. అట్టి సుగుణ సంపద్విశేషములఁ బ్రకటించు వస్తువు మానవరూపధారియే. శ్రీరామ-శ్రీకృష్ణ- ఆది-అవతార పురుషులందు మానవత్వ- దైవత్వములు రెండును మిశ్రితములై యుండినటుల శ్రీ సాయిబాబాయందును మానవత్వ దైవత్వముల కలయిక కలదు.- [అందు అవాంఛనీయములైన గుణముల కలయిక లేదు.] కేవల దైవత్వస్థితిగలిగిన యేవస్తు వెచటనేని పొడమిన ఆవస్తువుతో మానవులకెట్టి ప్రయోజనములేదు. ఆవస్తువును జేరలేరు. ఆదరించఁజాలరు.

ఆకారణముననే సత్పురుషుడైనవాఁడు మానవదేహము-మానవసంబంధములు మానవపరిమితులుకలిగి, యతడును మానవుడను తలంపు జనులకుఁ గలిగించుచుండును. ఇఁక సత్పురుషునియొక్క- అంతరంగిక స్వభావమునుగూర్చి మానవుడు తనబుద్ధి పాటవము ననుసరించి గ్రహించుచు నతనిఁజేరి కలిసిమెలసి యుండుటకు ధైర్యము వహించును. అట్టి మానవపరిమితులు- లక్షణములులేని వ్యక్తివలన జనులకెట్టి ప్రయోజనములేదు. ఆకారణముననే హైందవశాస్త్ర పురాణాది గ్రంథములందు మానవోద్ధరణము- యోగక్షేమ సంఘటనమే అవతారముల ప్రధానలక్ష్యముగ వర్ణింపఁబడుచున్నది.

శ్రీ రామావతారమున మానవస్వభావ లక్షణములు- ప్రతిపదమునఁ బ్రకటమగుచు దైవీగుణ సంపదలతో మిశ్రితములై శ్రీరామచంద్రుని వ్యక్తిత్వము లౌకికముగ- పారలౌకికముగ జనులకు ఆదర్శము- అనుసరణీయమగుచున్నది. శ్రీరామధ్యానము- రామస్మరణము- రామలీల- అనునవి సర్వసామాన్యముగ లౌకిక పార లౌకిక విషయముల సేవనీయమగుట ఆఅవతారమునందు మానవతెద్యోతకమగుట చేతనే ఆవిధముగ శ్రీ సాయిబాబా- శ్రీ సాయిరాముని విషయమున [శ్రీరామనవమి శిరిడియందు వార్షికోత్సవము- 'ఉరుసు' పండుగ బాబాచే నియమితమై- శ్రీరామరూపమును ప్రదర్శించిన కారణమున] మానవలక్షణములు- దైవలక్షణములు చక్కగ మిశ్రితములై జనులు సమాశ్రయించి గ్రహించి, సేవించుటకు తోడ్పడుచున్నవి. శ్రీసాయి ప్రభువుయొక్క మానవలక్షణములు దైవలక్షణములతో మిశ్రితములై యీ రెండును పరస్పరభిన్నములుగ తోచుచున్నను ఆమహావ్యక్తియందెటుల రమ్యముగ ప్రకటమైనవో యికముందు తెలిసికొందము.

హాస్యము- అనునది ఒక ప్రత్యేకమైన మానవలక్షణ విశేషము బాబా యందుఁగల మానవలక్షణములలో హాస్య ప్రసంగమనునది విశిష్టమైనది. ఆప్రసంగము దగ్గఱనున్నవారికి వెంటనే అవగాహనము కాదు. ఆప్రసంగములోనిభావము ద్వివిధములుగనుండును. ఒకభావము అప్పటికప్పుడర్థమగునట్లుండును, రెండవభావము నిదానముగ-విమర్శించుకొనినపిదప ఎవరినిగూర్చి పలుకబడినదో ఆవ్యక్తికి అనుభవమున బోధపడును, ఉదాహరణములను పేర్కొందము.

### 1. G. D. పలాస్కి - నాలుగువేల రూపాయలు.

'పలాస్కి'- అనునతడు బాబాను సందర్శింపవచ్చెను, బాబా తన అలవాటుచొప్పున తన అంతర్జ్ఞానము విదితమగునట్లు- ఆవచ్చిన వ్యక్తితనకు తనయందు విశ్వాసము పాదుకొనునట్లు (ఈతని బాకీదా

రుఁడు బాపూసాహెబ్ చెల్లించవలసిన 4వేలు రూపాయలు చెల్లించక జాగుచేయుచు కాలము గడుపుచున్నాడు. ఈతనికివచ్చిన కష్టమిదియే) ఆపలాస్పి తననుచేరి (మొక్కినతోడనే అచటచేరిన వారితో బాబా యిట్లనెను. «బాపూసాహెబ్ ఏమిచేయుచున్నాఁడు'— బాబా అడిగి నది (బాబా పూజారి) బాపూసాహెబ్ జోగ్నుగూర్చి యనితలంచి, అచటనున్నవారిలో నొకఁడు 'ఆతఁడు నిద్రపోవుచున్నాఁడు.' అని తెలిపెను.

సా.బా:- అతఁడు ఇక్కడకు వచ్చినతోడనే ఆతనిఁగొట్టెదు. నాకు నాలుగువేలరూపాయలు బాకీపడి, చెల్లింపక కాలము గడపుచు న్నాఁడు. అచటనున్నవారు బాబాకు జోగ్ 4వేలు బాకీపడి చెల్లించక కాలము గడపుచున్నవాఁడని అందుచే బాబాకు ఆతనిపై కోపమువచ్చి నదని తలంచిరి. కాని బాబా పలుకులు పలాస్పికి సంబంధించినవి. పలాస్పి బాబా పలుకులలోని భావము గ్రహించినాఁడు. అవి తనకు శుభశకునములైనవిగ భావించి, తనబాకీదారునిపై నొత్తిడి కలుగఁజేసి, తనపైకము త్వరలో బాబా అందఁజేయించునని గ్రహించినాఁడు. జోగ్ వచ్చినపుడు అచటివారు బాబా మాటలుచెప్పిరి. జోగ్ మిక్కిలి చకితుఁడై "బాబా మాటలు అసత్యములు. నేను బాబాకు 4 వేలు బాకీ పడియున్నాననుట అన్యాయము" అనెను. ఆ తమాషా- బాబా ఆనందించుచుండెను.

## 2. సర్పదష్టుఁడు - శ్యామా.

ఒకదినమున శ్యామా (మాధవరావు దేశపాండే) సర్పదష్టుఁడ య్యెను. జనులు సాధారణముగ సర్పదష్టులైనపుడు విఠోబా దేవాల యమునకు వెళ్ళుచుందురు. కావున అచటివారు విఠోబా [ఖైరోబా] దేవాలయమునకు వెళ్లుమని శ్యామాతో చెప్పిరి. కాని ఆతని దేవాల

యము ద్వారకామాయి మసీదుకాన, శ్యామా మసీదునకేగి మెట్లెక్కు బోవుచుండును. అంతట బాబా 'బ్రాహ్మణశ్యామా పైకెక్కుచుము- దిగుము- దిగిపొమ్ము- హాట్ మాగే- హాట్ మాగే'- అనెను శ్యామా చకితుఁడయ్యెను స్తబ్ధుడై నిలఁబడెను. ఆతని ఆశలు బాబా యందు మాత్రమేకలవు. తనను పైకెక్కవద్దు- దిగిపొమ్మని ఆజ్ఞాపించుచున్నాఁడే- అని శ్యామా తలంచుచుండెను. శ్యామా ఆందోళనబుద్ధిని గూర్చి ఆక్షణమాత్రము నవ్వుకొని, అంతట 'శ్యామా లోనికిరమ్ము- రమ్ము- ఈఫకీరు [దైవము] దయామయుఁడు- నీవు స్వస్థుఁడవగుదువు'. అని పలికి అచటనున్నవారితో 'శ్యామాను ఇంటికిఁ దీసికొని వెళ్ళుఁడు! విషము పూర్తిగ హరించి పోవునంతవరకు 24 గంటల వరకు నితని నిద్రపోనీయకుఁడు'- అని బాబా చెప్పెను.

ఇచట బాబా హాస్యము గమనింపుడు- బ్రాహ్మణశ్యామా పైకెక్కుచుము. దిగుము- దిగిపొమ్ము ఇది- ఈమాటలు శ్యామాను సంబోధించినవికావు- ఆ సర్పవిషమునుగూర్చి పలికినవి. శ్యామా శరీరమునుండి దిగిపొమ్ము అని బాబా ఆజ్ఞ. ఆవిషము శ్యామాపైకి ఎక్కక దిగెను. ఈసిద్ధి 'యథాసంకల్పసిద్ధి'- శ్రీమద్భాగవతము. 11 స్కంధము 1 అధ్యాయమునఁ దెలుపబడినది. ఉపనిషత్తుల వాక్యననుసరించి సత్యవాక్ సత్యసంకల్పమని తెలుపఁబడినది. దైవీస్థితినుండి పలికిన పలుకు సద్యఃఫలితమీయ సమర్థమైనది. కావున ఆ త్రాఁచు విషము వెంటనే శ్యామా తనువునుండి దిగిపోయెను. అట్టి అప్రతిహతమంత్రము బాబా శ్రీముఖమునుండి వెడలినను అందు మానవ లక్షణమైన హాస్యమును మిళితమైనది ఇది బాబాయందు గల ప్రత్యేకత యని మనము గ్రహించవలయును. 'హమారా ఘరాణానిరాళా ఆహే' (మాపద్ధతులు ప్రత్యేకములు) అని, బాబా ఒక సందర్భమున పలికినాఁడు.

### ౩. కుశభావ్ - ఉల్లిగడ్డలు

ఒకసమయమున 'కుశభావ్' అను భక్తునితో హాస్యప్రసంగము గావించి ఒక అద్భుతశక్తిని ఆతనికి బాబా ప్రసాదించిన వృత్తాంతము దెలిసికొందము. 'కుశభావ్'నుగూర్చి 'అనుగ్రహలీల' యందుఁ దెలుపఁబడినది [ఏమిరా, నిన్ను పేక్షింతునా? గ్రంథమున]

ఒకనాఁడు కుశభావ్ బాబా దగ్గఱకేగెను. నీవీరోజున ఏమితిందువు? అని బాబా ప్రశ్నించెను, 'ఈదినము ఏకాదశి కావున నేమియుఁ దినను'— అని, ఆతఁడు సమాధానమిచ్చెను. ఏకాదశి యననేమో ఎఱుగనటుల—

సా.బా:- ఏకాదశి అననేమి?

కు.భా:- ఉపవాసదినము— బాబా!

సా.బా:- ఉపవాసమననేమి?

కు.భా:- [హిందూస్థానీ] రోజాస్‌వంటిది.

సా.బా:- రోజాస్ అననేమి?

కు.భా:- మేము పస్తుందుము కందమూలములనుతప్ప ఏమియుతినము.

బాబా యిక్కడ కందపదమును చమత్కరించెను. 'కంద'-అను పదమును 'కాండ' అని పలికిన 'ఉల్లిగడ్డలను అర్థమగును. అంతట

సా.బా:- ఓ! కాండములా? అటులయిన వీనిని తినుము- అని, ఉల్లిగడ్డలను కుశభావ్ ముందుంచెను, ఏకాదశినాఁడు ఎవరు ఉల్లిగడ్డలనుతినరు. బాబా తనకు అనాచారము- శిష్టవిరుద్ధమైన ఆచారము నంటఁగట్టుచున్నాఁడని తలంచి-

కు.భా:- బాబా! నీవుతినిన నేను తిందును,

బాబాకు మూఢాచారములు- మతవిభేదములు లేవు, కావున బాబా తినెను. కుశభావుకూడ కొన్నితినెను,

ఆసమయమున బాబా దర్శనార్థము కొందఱు భక్తులువచ్చిరి. వారలతో-

సా:బా:- ఈ బాపనయ్యను చూడండి- ఏకాదశినాఁడు ఉల్లిగడ్డలను తినుచున్నాఁడు-

కు.భా:- బాబా తిననాడు. నేనుతింటిని.

సా.బా:- కాదు-కాదు. నేను కందములను- తీపిగనుసుగడ్డలనుతింటిని. (అని బాబా ఉల్లగడ్డలను గ్రక్కెను.)

ఇక్కడ ఆశ్చర్యమును గమనింపుడు. బాబాతినినది ఉల్లిగడ్డలు- గ్రక్కినవి ఉల్లగడ్డలు- ఇదియు 'యథా సంకల్పసంసిద్ధి'. బాబా యోగ సిద్ధి సంపదలలో నిదియొకటి బాబా ఉల్లగడ్డలను గ్రక్కుటచూచి ఆశ్చర్యపడి కుశభావ్ ఆ గ్రక్కబడిన ఉల్లగడ్డలను వెంటనే తీసికొని తినెను.

సా.బా:- నీచుఁడా! గ్రక్కినగడ్డల నేలతినెదవు? అని కొట్టుచున్నను లెక్కచేయక తినుచుండెను.

బాబా హృదయము ద్రవించెను. కుశభావును అనుగ్రహింపఁ దలంచెను. [లోగడ కుశభావు నీచమంత్రోపాసనలచే యితరుల వస్తువులు తెప్పించి తమా షాలుచేయుట మాన్పించినాడు కావున] బాబా అతనికి ఒక అద్భుశక్తి ప్రసాదింపఁదలంచెను.

సా.బా,- నీకు ఈశక్తిమాత్రము అనుగ్రహించుచున్నాఁడను. నన్ను తలంచుకొని నీదోయిలి పట్టుము. నాప్రసాదము ద్వారకామాయిధుని లోని వెచ్చని 'ఉధి' నీదోసిటఁ జేరును. నిన్ను జేరువారికి ఆ ఉధినిమ్ము. అదినా అనుగ్రహమగుటచే దానిని స్వీకరించువారికి సకల శుభములు కలుగును.

అది అమోఘమైనశక్తి. దానికి ఎట్టి మంత్రతంత్రములతో పని లేదు. బాబాను తలంచుకొని దోసిలొగ్గుటయే అతఁడు చేయవలసినది.

ఈహాస్యము చమత్కారములయొక్క పరిణామము బాబా ఒక అద్భుతము- అమోఘమైనశక్తిని కుశభావునకు అనుగ్రహించెను. కుశభావు తన జీవిత విశేషమంతయు ఆశక్తి ప్రభావమున తాను సుఖజీవనము గడపుటయేకాక తనను చేరినవారికి ఉధిని- బాబా అనుగ్రహమునుప్రసాదించి వారలకు సుఖశాంతులఁ గూర్చినాఁడు.

బాబా తన ప్రక్కనఁగూర్చుండి భుజించువారితోడను 'సంతోషసంతృప్తులతో భుజింపుడు- బాబా సంస్థానము తఱుఁగుపడునని భయపడకుడు. సంతృప్తిగ భుజింపుడు' అని హాస్యముగ పలుకుచుండువాఁడు.

## 4. హేమాద్రిపంతు. (అన్నాసాహెబ్ దభోల్కర్) చణకలీల.

ఒకసమయమున బాబా భక్తజన పరివేష్టితుఁడై కూర్చుండెను. హేమాద్రిపంతు [అన్నాసాహెబ్ దభోల్కరు] వచ్చి బాబాకు ప్రెుక్కి కూర్చుండగ నతనికోటు మడతలనుండి వేపుడు సెనగలు కొన్నిపడెను. అచట చేరినవారు నవ్వుచుండిరి. ఆదినము ఆదివారము. శిరిడియందు సంతజరుగుదినము.అతఁడక్కడకు వెళ్ళలేను ఆసందర్భమును పురస్కరించుకొని బాబా హాస్యముగఁ బలుకుచు, 'ఓహో! యీసెనగగింజలు ఈతఁడెవరికిఁ బెట్టక ఒంటరిపాటున తినువాఁడని తెలుపుచున్నది. అని బాబా పలుక హేమాద్రిపంతు తన అసమ్మతిఁ దెలుపుచుఁ దన కట్టె అలవాటులేదని, తనకోటు మడతలోనికి ఆగింజ లెట్లువచ్చెనో తానెఱుఁగనని తెలిపెను. అంతట బాబా 'నీవు తినునప్పుడు ఆపదార్థములను నాకు అర్పింతువా? నేనెప్పుడు నీదగ్గఱలేనా?' అని మిక్కిలి అమూల్యమైన బోధకావించెను. బాబా సర్వత్రి వ్యాపించియున్నవాఁడనియు తనభక్తుడు ఏమి తినుచున్నను ముందుగ తన గురుదేవునకు సమర్పించి తినవలయునను గొప్పబోధ ఆసమయమునఁ గావించెను.

ఆబోధ దైవబోధ- దైవపరిభావము- సర్వవ్యాపకత్వము అన్నాసాహెబ్‌తో హాస్యరూపక పరిసంగమున బాబా దైవతత్వమని విదితమైనది.

5. ఆసవము– పులుపు- పులుపుకాదు.

ఒక సమయమున బాబా B.M. రేగేకు కాకాదీక్షితునకు తన అద్భుతశక్తిని ప్రకటించి ... గఱపెను. రేగే నిమ్మపండ్లరసముతో ఆసవమును సిద్ధపఱచి, కొంచెము చవిచూచి అది మధురముగనుండుట గని తన నేస్తునకు ఉప్పొంగి దానిని బాబా దగ్గఱకు గొనిపోయెను. అచట కాకాదీక్షితుడుగూడ ఉండెను. రేగే తెచ్చిన ఆసవమును బాబా కొంత రుచిచూచి 'అరే! కాకా? యిదియెంత పులుపుగానున్నదో చూడుము!' అనెను. దీక్షితు రుచిచూచి మిక్కిలి పులుపుగనున్నది అనెను. రేగేనుగూడ రుచిచూడుమన రేగే రుచిచూచి అది మిక్కిలి పులుపుగనుండుట గుర్తించి మిక్కిలి చిన్నవోయెను. తనగురుదేవునకట్టి పులుపు ఆసవమిచ్చితినే యని రేగే ఖిన్నుడయ్యెను. అంతట బాబా చిఱునవ్వునవ్వి 'నేను హాస్యముగ పలుల పలికితిని, ఇపుడు మీరిద్దఱు త్రాగిచూడుడు' అని బాబా అనెను. దీక్షితు– రేగే- యిరువురు ఆసవముత్రాగిరి, అది మిక్కిలి మధురముగనుండెను, అది బాబా కావించిన హాస్యమా? లేక తనవానికి అడకువ- స్వకీయమగు నేస్తునకై ఉప్పొంగకయుండు అడకువ కలిగించుటకై అటుల కావించెనా! మన మెఱుగము. తప్పటడుగువేయు తనబిడ్డలను దయామయుడైన బాబా తన హాస్యరూపమున నెప్పటికప్పుడు చక్కదిద్దుచుండును.

6. ద్రాక్షలు–విత్తనములుకలవి–విత్తనములేనివి.

కాకామహాజని- అతని యజమాని– ధాకర్సే.

ధాకర్సే, కాకామహాజని యజమాని సాధుసత్పురుషులయందు నమ్మకములేనివాడు. కాకామహాజని బాబానుగూర్చి, అతండ్రి అద్భుత

శక్తినిగూర్చి తెలుపుటచే అతని ప్రేరణమున బాబాను దర్శింప శిరిడికి వెళ్లెను. మార్గమధ్యమున ద్రాక్షలు విత్తనములు లేని యెండినవి కొని తీసికొని వెళ్లి బాబాకు సమర్పించెను. బాబా కొన్ని తిని, మహాజనికి- అతని యజమానికిని కొన్ని పెట్టెను. ధాకర్సే వానిని తిని విత్తనములు మసీదులో నుమియరాదని చేతిరుమాలలో వానినుంచెను. తానాపండ్లను తినుటకై పడుకష్టము బాబా గ్రహించలేదేయని తలంచెను. బాబా మరల కొన్ని పండ్లు ధాకర్సేకుపెట్టి తినుమనెను. అతడు సందేహించుచు తీసికొని నోటిలో వేసికొనెను. ఆశ్చర్యముగ నవి తాను కొని తెచ్చినవేయైనను అందు విత్తనములు లేకుండెను. అతనికి కావలసినది బాబా వలని చమత్కారము. బాబా శక్తి నతడు కొంతవరకు గ్రహించెను. ధాకర్సే మానసిక ఆందోళనమును గ్రహించి, బాబా ఆద్రాక్షలను సంకల్పమాత్రమున విత్తనములు లేనివిగ చేసెను. ఈశ్వరధ్యానమున భక్తుడు తలంచినది సద్యఃఫలిత మాయ సమర్థమైనది. ఇదియు 'యథాసంకల్పసిద్ధి.'

7. M.B రేగే- ఎఱ్ఱని చెక్కుగల అరటిపండ్లు.

శ్రీ సాయీప్రభువు నైతికబోధ గావించిన మఱియొక హాస్య సంఘటనమునుగూర్చి తెలిసికొందము. బాబా యందుగల దైవమానవతత్త్వముల నిది తెలియజేయును. M.B. రేగే బాబాయందు గాఢ భక్తి కలవాడు. ఒకసమయమున నతడు బాబా దగ్గఱ గూర్చుండెను. ఒక భక్తుడు ఎఱ్ఱని చెక్కుగల అరటిపండ్లు గెలతెచ్చి బాబాకు సమర్పించెను. రేగేకు అట్టి అరటిపండ్లనిన మిక్కిలి యిష్టము అచటచేరిన వారికా పండ్లను పంచుచు తనకుగూడ బాబా ప్రసాదించునని యతడు తలంచెను. ఆ గెలలోని పండ్లను అచట చేరినవారికి పంచుచుండెను. కొన్ని పంచి యిచ్చినపిదప ఒక పండునొలిచి గుజ్జు నొకరికి ప్రసాదించి దానిచెక్కు రేగేదగ్గఱ పడవైచి 'ఖావ్-ఖావ్'- [తినుము-తినుము]

అనెను. [ఆతని నాకర్షించినది దానిపైగల ఎఱ్ఱని చెక్కే- కావున దానినే తినుమనీ ఆ ఎఱుపు చెక్కలో నేమికలదో చూడుమని బాబా కావించినబోధ-] రేగే బాబా ప్రసాదించిన దానిని ఒకఎద్దు తినునట్లు నమలి తినెను. అది రుచికరముకానిదే- ఆవిధముగ రెండవ, మూడవపండు నొలిచి ఆచెక్కను రేగే దగ్గఱ పడవైచి ఖావ్-ఖావ్ అనెను. రేగే తినుచుండెను. అంతట బాబా రేగేవైపునకు మఱల 'ఆ! నీకేమియుఁ బెట్టలేదా?' అని రేగే ప్రేమకుముంచి ప్రేమ బలపుచు నొకపండు నొలిచి రేగేను కొంచెము తినుమని, తాను కొంచెముతిని ఆపండు నిరువురు కొరికితిరి. ఈ సంఘటనము ఆయిరువుర పరాకాష్ఠ ప్రేమను సూచించును. ఈ హాస్యమువ యువకుడైన రేగేకు ఆ వెలికిఁ గనఁబడు ఎఱ్ఱని చెక్క మనల నాకర్షించునది. ఆ చెక్కను తినిన మనకు ఆనందము లేదు. కావున బాహ్యరూపములఁగాంచి భ్రమపడరాదు. అంతస్సారమునే పాటించవలయును- అనునీతిని ఈవిధముగ బాబా తన బిడ్డకు బోధించినాఁడు.

8. రామదాసి

బాబా హాస్యసంఘటనముద్వారా తన ఆశ్రితులను చక్కదిద్దిన మఱియొక వృత్తాంతమును దెలిసికొందము. 'రామదాసి' అను నతఁడు బాబాను సమాశ్రయించినాఁడు. ప్రతిదినము ద్వారకామాయి మసీదు నందుఁ గూర్చుండి విష్ణు సహస్రనామములు, మఱి యితర పవిత్రగ్రంథములను పారాయణముచేయువాఁడు. విష్ణు సహస్రనామము లతనికి కంఠస్థములు. బాబా ఒకదినమున అతనికి హాస్యముద్వారా బోధగావింపఁదలచెను. తనకు కడుపు నొప్పిగనున్నదని బజారునకువెళ్ళి సునాముఖీ ఆకు తేరఁబంచెను, రామదాసి బజారునకువెళ్ళగ నాతని పుస్తకముల కట్టనుండి విష్ణు సహస్రనామముల పుస్తకము బాబాతీసి 'శ్యామా'చేతికిచ్చి, నీవు దీనిని నీదగ్గఱ నుంచుకొని ప్రతిదినము పారా

యణము చేయుమనెను.'రామదాసి కోపించును. ఆపుస్తకము నా'దని శ్యామా పలికెను. 'ఆతనికోపము లెక్కచేయకుము. దీనిని నీదగ్గఱ నుంచుకొను'మని బాబా శ్యామా చేతికిచ్చెను. అంతలో రామదాసి బజారునుండి తిరిగివచ్చెను అక్కడనున్న 'చిబాక్కర్' నారదపాత్ర వహించి 'బాబా నీ విష్ణు సహస్రనామగ్రంథముతీసి శ్యామాకు ఇచ్చి నాడనిచెప్పెను. ఆమాటలువిని రామదాసి ఆగ్రహోదగ్రుడై యది యంతయు శ్యామా కావించిన కుట్రయని ఆతని మిక్కిలి తూలనాడి నిందించెను. అంతట బాబా రామదాసినిఁగూర్చి పలికిన పలుకులను గమనింపుడు. 'శ్యామా మంచిబిడ్డకాడా! ఆతనిపై నాగ్రహింపవలసిన పనిలేదు. నీకా గ్రంథమంతయు కంఠస్థము. నీవా పుస్తకము నష్టమైన దని ఆగ్రహింతువా- నీవు రామదాసివి కాని, రామదాసివికావు. రామదాసి యైనవాఁడు ప్రాకృతవస్తువులపై ఆసలుఁడుగవలయును.'అని, బాబా అతనికి చక్కని నైతికబోధ కావించినాఁడు. శ్యామామిక్కిలి చిన్నవోయి క్రొత్తపుస్తకము తెచ్చి యిచ్చెదననినాఁడు. అచటఁజేరిన వారు బాబా కఱపిన నీతిబోధను గ్రహించి ఒక పవిత్రగ్రంథమును గూర్చియైన భక్తుఁడైనవాఁడు ఉద్రేకము- ఆగ్రహము చెందరాదు అనుపాఠమును గ్రహించిరి ఎట్టిపరిస్థితులందైన ప్రశాంతమనస్కుఁడై యుండవలయును- అందు ముఖ్యముగ రామదాసుఁడు భగవత్సేవ కుఁడు. శాంతిఁ గోల్పోవరాదు. ఈపరమ ఆధ్యాత్మికబోధ ఒక రామ దాసికేకాదు. ఎల్లరు పాటించదగినది. ఈబోధ ఎల్లరకు విదితమగునట్లు బాబా యీ హాస్యసంఘటనము ద్వారా విశదపఱచినాఁడు.

9. దూషణరూపమున బాబా తనఆశ్రితులను అనుగ్రహించుట-

### గాడ్గేభావ్.

ఒకొక్కసమయమున బాబా తన ఆశ్రితులను వెలికి దూషించుచున్నటుల కనబడి వారివారి దుష్కర్మఫలితములను- ప్రతిబంధము

లను తొలగించి అనుగ్రహించువాఁడు. అట్టి బాబా దూషణలు తన ఆశ్రితులను గూర్చికాదు. అట్టివారి నావరించి బాధించు దుష్కర్మఫల రూపములగు ప్రతిబంధములను మాత్రమే- అని మనము గ్రహించ వలయును. అది అప్పటికప్పుడు వారు గ్రహింపఁజాలకున్నను అది రొకరూపమైన హాస్యమనియే పరిణామమున గ్రాహ్యమగు చుండును

గాడ్గేభావ్ అనునతఁడు పంఢరిపురమున- నాశిక్‌నందు ప్రసిద్ధ మైన గొప్ప సత్రములను నిర్మాణము గావించెను. నాశిక్ పురము నందొక ధర్మశాల నిర్మించుచుండెను. దాని నిర్మాణము కొంతవరకు కావించుటకు మాత్రమే- ధనము లభించెను. ఆపిదప తగినధనము లభిం పక ఆపని ఆగెను. అతని దురదృష్టవశమున ఆపని ఆగెనని తలంచి గాడ్గే శ్రీ సాయీప్రభువునందు మిక్కిలి గౌరవప్రేమలు గలవాఁడగు టచే తన దుష్కర్మఫలరూపములగు ప్రతిబంధములను తొలగించు కొనుటకై బాబాను దర్శించినాఁడు. బాబాను సమీపించి తనకష్ట ములను తెలుపుకొనఁ బోవుచుండగా బాబా అతనిని పలువిధముల దూషించి, శపించి, తిట్టినాఁడు. ఆమాటలకు గాడ్గేభావ్ నవ్వినాఁడు. బాబా కూడ అతనితో పాటు నవ్వెను. ఆవిషయమంతట ముగిసెను. గాడ్గేభావును తిట్టి శపించి బాబా అతని తరిమివేయదలచినాడని అచట చేరినవారు తలంచిరి. కాని బాబా తిట్టి శపించినది గాడ్గేభావ్ దుష్క ర్మఫలరూప ప్రతిబంధములనే. బాబానుండి ఆదూషణలు వెలువడిన పిదప గాడ్గేభావునకు కావలసిన ధనసహాయము లభించి నాశిక్‌లోని ధర్మశాల నిర్మాణము చక్కగ సంపూర్ణమయ్యెను. ఆధర్మశాలయందు శ్రీ సాయీబాబా చిత్రపటమును గాడ్గేభావ్ నిలిపినాఁడు.

**10. B. V. దేవ్ — గుడ్డపేలికలు దొంగిలించుట**

తీవ్ర ఆధ్యాత్మిక సాధనపరులైన ఆశ్రితులఁ జక్కదిద్దుటకు బాబా హాస్యము నుపయోగించు సందర్భమొకటి తెలిసికొందము.

B.V. దేవ్ అనునతఁడు మామ్లత్ దార్. అతని ప్రారబ్ధ కర్మవశమున
జ్ఞానేశ్వరి పారాయణ మెప్పుడు ప్రారంభించిన నేదో యొక విఘ్నము గలుగు
చుండెను మహారాష్ట్రదేశమున జ్ఞానేశ్వరి [జ్ఞానదేవుని మరాటీ టీక
తోఁగూడిన భగవద్గీతలు] పారాయణమునకు ఉత్తమగ్రంథముగ భావిం
పఁబడును. కావున B.V. దేవ్ బాబాను సమాశ్రయించెను. బాబా
25 రూపాయలు దక్షిణ తీసికొనెను. బాబా దగ్గఱ సెలవు తీసికొని
విడిదికి వెళ్ళి దేవ్ అచట 'బాలకరాంమానకర్' ద్వారా బాబా
అద్భుతశక్తులనుగూర్చి తెలిసికొనఁగోరి, ఆతని అనుభవములనుగూర్చి
ప్రశ్నించెను. మఱునాఁడు తెలుపుదునని తెలిపి, 'మానకర్' ఆమఱు
నాడు తన అనుభవములఁగూర్చి వివరింప ప్రారంభించెను. ఆక్షణమున
బాబా B.V. దేవ్‌ను తనదగ్గఱకుఁ బిలిపించి ఆతనిపై నాగ్రహోద
గ్రుఁడయ్యెను. 'ఏమీ, నీవు ముసలివాఁడవయ్యును నీతల యంతయు
నెరసియు చింపి పాతలను దొంగిలించుచుంటివా! నిన్ను గొడ్డలితో
చంపివేయుదును'- అని ఉద్రిక్తుఁడయ్యెను. దేవ్ స్తబ్ధుఁడై గడగడ
లాడి మాఱు పలుకలేకపోయెను. ఆతఁడు అటుల స్తబ్ధుఁడగుటయు
నొక అద్భుతశక్తి పరిణామమే. అది బాబా ఆతనియెడ వఱపుచున్న
అనుగ్రహము. దేవునకేమియు బోధపడలేదు బాబా మరల దక్షిణఁ
గొని రమ్మనెను. దేవ్ 25 రూపాయలు తెచ్చియిచ్చెను. నీవు ఏమి
చదువుచుంటివి? అని, బాబా ప్రశ్నించెను. ఏమియులేదని దేవ్ సమా
ధానమిచ్చెను. 'జ్ఞానేశ్వరి' మొదలగు గ్రంథమేల పారాయణముచేయవు?
నీవు పారాయణము ప్రారంభింపుము! నేను నీకు చక్కని జరీ అంచు
పట్టునాలువ బహూకరింపఁదలచియుండ నాదగ్గఱనుండి ప్రాతగుడ్డ పేలి
కల నేల దొంగిలింపఁజూచెదవు?' అని బాబా పలికెను. B.V. దేవ్
శిరిడియందు 'జ్ఞానేశ్వరి'పారాయణము ప్రారంభించి దానిని ముగించెను.
ఎట్టి విఘ్నములులేక అతఁడా గ్రంథ పారాయణమును పూర్తిచేయగలు
గుట అదియే ప్రథమము. అదియొక అద్భుతసంఘటనము. ఆతని చెడ్డ

సంస్కారములన్నియు 'ఈగొడ్డలితో నిన్ను చంపెదను' అని బాబా పలికిన మాటలతో తొలగిపోయెను. 'గుడ్డపేలికల నేల దొంగిలించెదవు?' అని బాబా పలికినమాటలతనికి బోధపడినవి. మానికర్ వలన బాబానుగూర్చి - ఆతండి శక్తిసమర్థతలగూర్చి తెలిసికొనుట గుడ్డపేలికలను దొంగిలించుట యనియు, బాబా తనకు స్వయముగ తనశక్తి నెఱుకపఱచుట జరీఅంచు పట్టుసాలువ బహూకరించుట యని గ్రహింపగలిగెను. లేనికోపము వెలుపలకు ప్రకటించుచు పలుకుటయు హాస్యమే ఆవిధముగ B.V. దేవ్ పురాకృత దుష్కర్మఫలముల నన్నిటిని నిర్మూలింపజేసి, బాబా ఆతనికి ఆధ్యాత్మికముగ ప్రసాదించిన నిష్ఠ మిక్కిలి ప్రశంసనీయమైనదని మనము గుర్తింపవలెను.

## 11, తార్కాడ్ సతి. బాంద్రా బాబా ప్రతిదినము 3 పర్యాయములు బాంద్రాకు వెళ్లుట.

శ్రీ సాయీప్రభువు ద్వారకామాయి మసీదునందు తనభక్తులతో కలిసి కూరుచున్నవాడయ్యు 'నేను శిరిడిలో లేను'- అని పలుకుట ఆధ్యాత్మికసత్యముతో గూడిన మఱియొక పరిహాస సంఘటనము. నేను శిరిడిలో లేను అని చెప్పుటలో శిరిడియందు భక్తులు చూచుచున్న భౌతిక దేహము తాను కాదనియు తన యథార్థ వ్యక్తిత్వము సర్వత్ర- ముఖ్యముగ ఎల్లర హృదయముల నధివసించియున్న 'దైవశక్తి' అనియే బాబా తెలుపునది.

తాను శిరిడిలోలేనని బాబా పలుకనచటజేరినవారు చకితులై నివ్వెఱపడి, బాబా అసత్యము పలుకుచున్నాడే- యని సందేహించుట ఆతండిరికొక ఆనందము గూర్చుచుండును.

'అమ్మా! మీయింటికి ప్రతిదినము 3 పర్యాయములు వచ్చుచుండుటలేదా?' అని బాంద్రాకాంతను [తార్కాడ్ సతిని] బాబా ప్రశ్నింప ఆమె 'నిజమే-బాబా' అని సమాధానమిచ్చెను.

శిరిడిలోనికాంత ఆశ్చర్యపడి 'బాబా నిన్నిక్కడ నిత్యమూ మేము చూచుచుండ, 100 మైళ్ళ దూరముననున్న బాంద్రాకు దినదినమూ 3 సార్లు ఎట్లుపోగలవు?' అని ఆశ్చర్యముతో ప్రశ్నించెను. 'కాని, నేనీ తల్లియింటికి నిత్యము పోవుచున్నానను'- అని బాబా సమాధానమిచ్చి ఆయింటికిఁ జేరుమార్గము'- రైల్వేదారి- దాని తరువాత గోవడ-మొదలగువానిని దాటి తార్కాడ్ సతి గృహమునకుఁ చేరుమార్గమును బాబా తెలిపినాఁడు. శిరిడిలోని కాంతకు బాబా మాటలు బోధపడ లేదు- బాబా తాను లింగశరీరమున వెళ్ళి తనబిడ్డలు సమర్పించు నైవేద్యములను స్వీకరించుచున్నవాఁడనను భావము వ్యక్తపఱచినాఁడు.

12. కాకా మహాజని — అతిసారవ్యాధి

బాబా తన హాస్యమును పురస్కరించుకొని తనవానికి మేలు చేకూర్చిన ఒక సంఘటనమును తెలిసికొందము. కాకామహాజని అతిసారమున బాధపడుచుండెను. పలుతడవులు విరేచనములగుటచే తన దగ్గఱ చెంబుతో నీరము పెట్టుకొనుచుండెను. నీటిచెంబు దగ్గఱనుంచుకొని అతఁడు మసీదునకు వెళ్లెను. బాబా ఆతనిస్థితిని గుర్తించినాఁడు. బాబా తన ఆశ్రితులు పలువురతో సంభాషించుచున్నట్టులుండి తటాలున ఆగ్రహోదగ్రుఁడై లేచి కుపితవాక్కుల వెలిప్రుచ్చెను. అచటచేరిన వారు అందఱు భయభ్రాంతులై వెలుపలకు పరుగెత్తిరి. ఆతత్తరపాటున మంటపము దగ్గఱకూర్చుండి వేరుసెనగకాయలఁ దినుచున్నవాఁడొకఁడు ఆకాయలనక్కడ విడిచిపెట్టి వెలుపలకు ప్రాణభీతిచే పఱుగెత్తెను. కాకామహాజనియు వెళ్ళఁదలచి తన నీటిచెంబును తీసికొనెను. కాని బాబా మెల్లగ ఆతనిదగ్గఱకు వెళ్ళి కూర్చుండుమని చెప్పి, ఆ వేరుసెనగకాయలు విడిచిపెట్టబడిన చోటునకేగి ఆకాయలను కాకామహాజనిని కొన్నితినుమనిపెట్టి తాను కొన్నితిని, యిరువురు నీరు త్రాగిరి. చూడుడు- వేరుసెనగకాయలనుతిని నీరుత్రాగుట అతిసార

మును వృద్ధిచేయునుగాని నివారింపదు- కాని, బాబా నీలకిసారము అణగును'. అని శాసించినాడు. వెంటనే ఆవ్యాధి అణగెను. లేనిచో పమపత్రికటించుట తనవానికి ఆ వేరుసెనగకాయలను సమకూర్చి వ్యాధిని నివారించుటకే అని మనము గ్రహించవలయును.

13. సదాశివతార్కాడ్ - పూనాకువెళ్ళుమని బాబా ఆజ్ఞ

ఏఉద్యోగములేక బాబా అనుగ్రహమున తిరిగి యేదైన ఉద్యోగము లభించుసను ఆశతో సదాశివతార్కాడ్ శిరిడికిఁజేరి బాబాను సందర్శించెను' శిరిడినుండి తాత్యాపటేల్ మొదలగువారు అహమ్మద్ నగరునకు సినిమా చూచుటకు వెళ్ళుచున్న వారితో కలిసివెళ్లి అక్కడ సినిమాచూచి పూనాకు వెళ్ళుమని బాబా సదాశివతార్కాడ్ నాజ్ఞాపించెను. ఈఆజ్ఞ మిక్కిలి నిర్దాక్షిణ్యము అసంగతమైనది. తార్కాడ్ ఉద్యోగములేక దైనిక జీవనము గడచుట కష్టముగనుండి బాబా కరుణచే ఏదైన ఉద్యోగము లభించునను ఆశతో శిరిడికివచ్చిన వానితో 'నీవువెళ్ళి వింతవినోదములుచూచి పూనాకు వెళ్లుమనుట ఎవరికేని విడ్డూరముగ తోచకమానదు. కాని అది బాబా ఆజ్ఞ. శిరసావహించవలసినదే. తాత్యాపటేల్ మొదలగువారితోగలిసి అహమ్మద్‌నగర్ చేరి అక్కడనుండి పూనాకు సదాశివతార్కాడ్ చేరినాడు. ఈ వింత చూడుడు! పూనాలో ఒక ఫ్యాక్టరిలో పనిచేయు కూలీలు సమ్మెచేసిరి. ఫ్యాక్టరీ నడిపించగల సమర్థుఁడైన మేనేజరు [నిర్వాహకుడు] దొరకక సదాశివతార్కాడ్ కొఱకు ఆఫ్యాక్టరీ ఖామందులు బొంబాయి మొదలగు తావులకు తంతివార్తలుపంపిరి. ఇదంతయుఁ నెఱిఁగిన బాబా యిది యంతయుదెలుపక తార్కాడును పూనాకువెళ్లుమని ఆజ్ఞాపించినాఁడు. సదాశివతార్కాడ్ పూనాకు వెళ్ళినతోడనే అతనికొఱకు నిరీక్షించుచున్న ఫ్యాక్టరీఖామందులు అఫాక్టరీమేనేజరు ఉద్యోగము నిచ్చిరి. తార్కాడ్ కోరిక లీడేరెను.

## 14. ముసలిమేకను- తెగవేయుమని బాబా ఆజ్ఞ.

ఒకదినమున చావసిద్ధముగనున్న ఒక ముసలి మేక ద్వారకామసీదు మంటపమునఁజేరెను. (శ్రీ) సాయీప్రభువు దానిని కత్తితో తెగవేయుమని బడేబాబాతోను (అబ్దుల్) ఆజ్ఞాపించెను. బడేబాబా దానియందు జాలికలిగి మెల్లగ మసీదునుండి వెడలిపోయెను. రాధాకృష్ణఆయీ యింటివద్దనుండి కత్తి తెచ్చి ఆ మేకను తెగవేయుమని బాబా శ్యామాను ఆజ్ఞాపించెను. ఆయీ మొదట కత్తినిచ్చి అతడు చేయుచున్న పని తెలిసికొని ఆకత్తిని తీసికొనిపోయెను శ్యామా తన యింటివద్దనుండి కత్తి తెచ్చెదననిచెప్పి వెళ్ళి తిరిగిరాకుండెను. బాబా యీ హాస్యమంతయుఁగనుచు తానానందించుచుండెను. అంతట బాబా కాకాదీక్షితునుపిలిచి ఆ మేకను చంపుమని ఆజ్ఞాపించెను. దీక్షితు బాబాకు పూర్తివిధేయుడు. ప్రతిఅక్షరము పాటించువాఁడు. కావున కత్తిని చేతఁబట్టికొని, 'బాబా! దీనిని చంపుదునా?' అని ప్రశ్నింప బాబా 'చంపుము' అనెను. దీక్షితు సందేహించుచుండ 'ఏల సందేహించెదవు'? అని బాబా పలికెను. భూతదయకంటె బాబా ఆజ్ఞ ముఖ్యము గాన మేకను చంప నిశ్చయించి కత్తి పైకెత్తెను. కత్తి మేక మెడదగ్గఱకు చేరక మున్న బాబా 'ఆపుము' అని, దానిని నీవు చంపవలదు- నేనేచంపుదును అని, బాబా దానిని తన భుజములపై నెత్తికొని పదిఅడుగులు వేసెను. ఆమేక చచ్చిపోయెను ఏమి జరుగనున్నది బాబా యెఱుఁగును. ఈవిధముగ తానానందించుచు, తన ఆశ్రితుల మానసికతత్త్వము- తన ఆజ్ఞను నిస్సందేహముగ నిర్వర్తింపఁగల శక్తిస్థైర్యము లెవరికిఁగలవా? అని బాబా పరీక్షించుచుండెను ఈపరీక్షయందు- బాబా ఆజ్ఞాపరిపాలనమునందు కాకాదీక్షితు నెగ్గినాఁడు.

బాబా హాస్యరూపములగు సంఘటనలు అనేకములుకలవు, వానినన్నిటి నిక్కడ పేర్కొన అనవసరము, బాబా ఇట్టి పరిహాసము

లందు వినోదించుటలు సాధారణ మానవలక్షణము. అట్టి మానవసహజలక్షణముల ప్రదర్శించుటలో బాబా యందుగల దైవలక్షణములను తనభక్తులు గ్రహించుటకు- ధైర్యమువహించి, బాబాను సమాశ్రయించి ఆతండ్రియొక్క సహజవ్యక్తిత్వమును కొంతవరకైన గ్రహించ నుత్సహింతురనియే బాబా అటుల కావించినది మానవలక్షణములతో మిళితములుగాకయున్నయెడ బాబా యందుగల దైవలక్షణములను భక్తులు గుర్తించి, వానిని ఉపయోగపడుమకొనజాలరు. మఱియొక సాధు సత్పురుషుడైన శ్రీరామకృష్ణపరమహంస విషయమున ఈమానవదైవలక్షణము లెటుల మిళితములై భక్తులహృదయములు నాటుకొనినవో యీ క్రింది ఉదాహరణమున గ్రహింపదగును.

శ్రీరామకృష్ణ పరమహంసయందు అత్యంత ప్రేమాదరణ గౌరవములుగల శ్రీ C. N. సుబ్బస్వామి అయ్యర్ గారు [హైకోర్టుజడ్జి-మద్రాసు]పరమహంసను స్మృతిపథమున దలంచుచు పూజ్యశ్రీ B. V. నరసింహస్వామిగారితో నిట్లనిరి.

'నా మానసిక నేత్రమున కెదుట ఆచిఱునగవుతోగూడిన ముఖము- ఆపెదవినుండి పైకి పొడముచున్న ఆ ఒక్కపల్లు, తనవారికి బోధించు మిక్కిలి అమూల్యములు- పవిత్రములగు ఆబోధలు' మొదలగునవి...

కావున ఆసత్పురుషుని 'ఆచిఱునవ్వుముఖము' ఆపెదవిదాటి వెలికిపొడము ఆ ఒక్కపల్లు' ఇవి భౌతిక వ్యక్తిత్వమును దెలుపుచు దానివెనుక దైవలక్షణములు అమూల్యములు పవిత్రములగు బోధలు మిళితములై ఆ న్యాయాధిపతి, స్మృతిపథమున నిలిచియున్నవి. అసంగతములగు మానవలక్షణములు మహోన్నతములు-ఉదాత్తములైన దైవలక్షణములతో సమ్మిళితములై ఆమానవ దైవలక్షణములం గూర్చిన భావములన్నియు మనకు స్ఫురించుచుండును ఆదైవలక్షణముల నాశ

ర్షించుటకు ఆ మానవలక్షణములు మనకు సహాయభూతములై మన కుపయుక్తములగుచుండును, భగవానుని లక్షణములఁగూర్చి తెలిసి కొనుముందు అవతారముల- పరమభాగవతులఁగూర్చి చదివి తెలిసి కొనుమని మనకు పెద్దలు తెలుపు కారణమిదియే భాగవతులద్వారా మాత్రమే మనము భగవానుని గుర్తించగలము. అంతకుమించి వేఱగు మార్గము లేదు.

'దైవం మానుషరూపేణ'- అనునుడి- బోధ- భాగవతులందు సాధు సత్పురుషులందుగల మానవత్వము [ప్రధానము] కావలయును. భక్తుఁడు భగవానునిగూర్చి ప్రార్థించునది గమనింపుడు. భాగ VI11-24.

అహంహరే! తవపాదైకమూల
దాసానుదాసో భవితాస్మిభూయః
మనస్స్మరేతా సుపతేర్గుణాం స్తే
గృణీతవాక్కర్మ కరోతుకాయః.

ఓహరీ! నీపదకమలములే ఏకైక ఆశ్రయముగ గల దాసులదాసుఁడనై జన్మింతునుగాక-ఓప్రాణనాయకా! నామనస్సు నీలీలావిశేషములదలంచుచు, నానాల్క, వానిని గీర్తించుచు నాతనువు నీసేవలను మాత్రమే చేయుభాగ్యము గల్పింపుము.

నేటికాలమున పరమ భాగవతోత్తముఁడై విలసిల్లినవాఁడు- ఏ మహాస్వామియొక్క లీలామహత్త్వములు మనము గుర్తించి గ్రహించజాలినవారమో ఆతండ్రి శిరిడియందు పొడమిన శ్రీ సాయీబాబా ఒక్కఁడే. ఆప్రభువు ఎల్లవేళల దైవమునందు లీనమైనవాఁడు. 'అల్లా మాలిక్'- 'హరి-హరి' యని సర్వదా స్మరించువాడు; సకలకర్తృత్వములను దైవమున కధీనముచేయువాఁడు. ప్రేమ- అవ్యాజప్రేమతోఁ గూడిన నిస్స్వార్థ సేవైకపరుఁడు. మోక్షముఁగాని, భగవానునియందు

సంపూర్ణముగ లయించుటగాని కోరక భగవానుని పరరూపములగు సకలజీవులయెడ నిర్హేతుకదయ పఱచి, నిస్స్వార్థసేవ చేయువాడు శ్రీ సాయీబాబా ఒకఁడే.

సనాకపృష్ఠం నచపారమేష్ఠ్యం
నసార్వభౌమం న రసాధిపత్యమ్
నయోగసిద్ధీః పునర్భవం వా
సమంజసత్వా విరహయ్యకాంక్షే

[భాగ. VI—11—25]

ఓ స్వామీ! నీవు లేని స్వర్గముగాని (ధ్రువపదముగాని) బ్రహ్మలోకముగాని, సార్వభౌమపదముగాని రసాతలాధిపత్యముగాని, సకల యోగసిద్ధులుగాని— జన్మరాహిత్యముగాని నాకువలదు— వీనిసిగాని— ఇక ఏ వేనిఁగాని నేనుకోరను. నీవు నావద్దఉన్న సకలమున్నట్లే అగును— అని భక్తుఁడు శ్రీ భగవానుని నిరంతరము ప్రార్థించుచుండును.

## 10. శ్రీ సాయీబాబాసిద్ధులు - వానిమహాలమ్ము- అవి వినియోగింపఁబడిన విధము.

శ్రీసాయీ మహాప్రభువు మొదటిపర్యాయము శిరిడీకిఁ జేరినపుడు ఎవరు గుర్తించి లెక్కించని ఒకసామాన్య ఫకీరుగనుండెను, రెండుమూఁడు నెలలు మాత్రమట నిలిచి పిదప మూఁడుసంవత్సరము లెందెదో సంచరించి చాంద్ భాయి పెండ్లివారితో రెండవమారు శిరిడీకి జేరినాఁడు ఔరంగబాద్ ప్రాంతమున అడవులో కొన్నిసిద్దులు చాన్ భాయిపటేల్ గుర్తించినటుల చెప్పఁబడినను బాబా అప్పటికిని సామాన్యఫకీరుగనే భావింపఁబడెను. రెండవమారు శిరిడీకి జేరినపుడు బాబా తన తలదాచుకొనుటకు శిరిడీ గ్రామమునే తన స్థిరనివాసముగఁ జేసికొనఁదలచెను.

భగవద్గీతలందు తనభక్తుడు 'అనికేతనుడు'-అని భగవానుడు తెలిపినాఁడు. బాబా విషయమున ఆవిధమే ఇదినది అని చెప్పకొను టకు బాబాకు ఏప్రదేశము లేదు. (ప్రతిస్థానము ఆతండిదే- ఏదియు బాబాదికాదు. ఋణానుబంధమునఁజేసి శిరిడి యందు ఇతర ప్రదేశము లందుఁ దనకు సంభావించిన వారలనేకులున్నను 'సంపూర్ణ వైరాగ్య పేతుఁడై బాబా ఎవరితోడను దేనితోడను సంబంధము లేనివాఁడే. చాన్‌భాయిపటేల్ పెండ్లివారిని విడిచినతోడనే ఆయూరి వెలుపల మఱ్ఱిచెట్ల నీడనగల ఖండోబా దేవాలయము తన ఏకాంతవాసమునకు తగినదిగఁ దలంచెను. 60 సంవత్సరముల తరువాత బాబాను సమాశ్రయించిన ఉపాసనీమహారాజును ఏకాంతముగ నుంచుటకు ఈఖండోబా దేవాలయమునే బాబా నిర్దేశించిన విషయము గుర్తింపుడు! ఉపాసనీ వృత్తాంతమును గనుఁడు)

ఆఖండోబా దేవాలయము ధర్మకర్త మహాల్సాపతి, శ్రీసాయీ బాబా ఒక మహమ్మదీయ ఫకీరను తలంపున ఆ కోవెలలోనికి ప్రవేశింపనీయని కారణముచే తన నివాసమునకు బాబా వేఱొక తావు చూచుకొనవలసి వచ్చినది. తన పూర్వభవమున బాబా తనగురువు సమాధిప్రక్కనగల వేపచెట్టు [మధుర నింబవృక్షము] క్రిందఁ జేరి నాఁడు. అదియు శీతాతప వర్షములకు మానవనివాసయోగ్యము కాని కారణమున దానిప్రక్కన శిథిలావస్థలోనున్న మసీదును తన నివాసముగఁ జేసికొనినాఁడు. ఆ వేపచెట్టుక్రిందనున్న- మసీదునన్నున్న అడవులఁ దిరుగుచున్నను తన గురుదేవుని ధ్యానించుటతప్ప తనయోగశక్తులను సిద్ధులను ప్రకటించుకొనవలసినపని లేకుండెను.

బాబానుండి అప్రయత్నముగ వెలువడినసిద్ధి మసీదులోని దీపములను నీటితో వెలిగించుట నిత్యము తైలముపోయు తైలవర్తకులు (వాణీలు) ఒకదినమున తైలములేదని కల్లలుపలికిరి వారు బాబాను

ఒక పిచ్చిఫకీరని— ఆయన యేమిచేయునో చూతమని తలంచి కల్లలు పలికిరి. బాబా మారుమాటాడక ఖాళీడబ్బాతో తిరిగివచ్చి, మసీదు లోని ప్రమిదలను నీటితో శుభ్రపఱచి ఆనీటిని డబ్బాలోపోసి ఆనూనె తోఁగూడిన నీటెనితాగి, ప్రమిదలన్నిటిని నీటితోనింపి, యందువత్తు లనుజేర్చి వెలిగించెను. తైలముపోసినవానికంటె మిక్కిలి ప్రకాశవంతి ముగ ఆదీపములు రాత్రియంతయు వెలిగెను, ఇదియొక చమత్కా రము— సిద్ధి-

ఇటనీరు తైలముగ మారుటయే. ఈమార్పు రసాయనిక భౌతి కశాస్త్రజ్ఞుల కందునదికాదు పాతంజలయోగ సూత్రములందు— శ్రీ మద్భాగవతము 11 స్కంధము 15 అధ్యాయమున— ఇతరశాస్త్రము లందు యోగశక్తివలన కలుగుసిద్ధులు పేర్కొనఁబడినవి. ఇచట బాబా కాపించినది "యథాసంకల్పసంసిద్ధి-" 'అప్రతిహతఆజ్ఞ' సంక ల్పించినవిధమున జరుగుట— తిరుగులేనిఆజ్ఞ—అగును.

పాతంజలయోగసూత్రములు III అధ్యాయము 16—50 సూత్ర ములనుచూడుడు! ఈసిద్ధులెటుల కలుగునో తెలుపఁబడినవి. శ్రీమ ద్భాగవతమున 11 స్కంధము 15 అధ్యాయము 5వ శ్లోకము మొదలు ఆ అధ్యాయము తుదివరకు ఈసిద్ధులు— అవి ప్రాప్తించువిధము తెలు పఁబడినవి. మంత్రితంత్రి శాస్త్రములందు ఇంద్రజాలకులెట్లు వస్తువు లను సృష్టింపఁగలుగుచున్నారో తెలుపఁబడినది. అయిన బాబాఎటుల నీరును తైలముగ మార్పఁగలిగినాఁడు?-అని విద్యావంతులడుగవచ్చును.

బాబా మాంత్రికుఁడుకాఁడు. మంత్రశాస్త్రములఁ దెలుపఁబ డిన ఆయావిధానములఁ బాటించి యెఱుఁగఁడు. బాబా యెల్లవేళల దైవము అల్లాయందు మనస్సునిలిపి ధ్యానించువాఁడు అల్లామాలిక్- హరి-హరి-అని ధ్యానించువాఁడు. హరి ప్రత్యక్షమైనాఁడు బాబా పొందిన ఈయోగశక్తి-సిద్ధి సంపదలను విభజించి, వివరింపఁదలచిన మనకు ఒకే సమాధానము లభించుచున్నది-

"జితేంద్రియస్య దాంతస్య జితశ్వాసాత్మనోమునేః
మద్ధారణాం ధారయతః కానాసిద్ధిః సుదుర్లభా
(భాగ-స్కం 11-15 అధ్యా-31శ్లో)

శాంతుఁడు జితేంద్రియుఁడు జితశ్వాసుఁడునయి
నాదు ధారణ డెందమునన్ ధరింప
మహావిపుంగవునకుఁ దలంపంగసిద్ధి
యెయ్యదియు దుర్లభంబుగాదయ్య! నిజము.

ఇంద్రియనిగ్రహముగలిగి నాయందు మనస్సు లగ్నముచేసి ధ్యానని ష్ఠను గనువానికి లభింపనిసిద్ధి యేమిగలదు?- అట్టివానికి సకలసిద్ధులు సాధ్యములే అగును- ప్రధానము- ఆధ్యానము తీవ్రము- నిరంతరము కావలె అట్టి అవిరళ తీవ్రధ్యానములబడిన ధ్యేయవస్తువునఁగల సకలశక్తులు ధ్యాతయందు జేరును.

'యథాసంకల్పసంసిద్ధి'-
'లెస్యచాజ్ఞా యథామమ'.

భాగవతమునఁ దెలుపఁబడిన ఈరెండుసిద్ధులు మనకు చాలును. బాబా జీవితపర్యంతము. నేటికి ప్రకటించిన ప్రకటించుచున్న సకలసిద్ధులు యోగశక్తిసంపదలన్నియు ఈరెంటికిందనే సమన్వయపఱుపవచ్చును.

తన ఇచ్ఛానుశక్తిని ప్రవర్తింపఁజేయుచున్నను అప్పుడపుడు బాబా తాను దైవమును ప్రార్థించుచున్నట్లు సూచించువాఁడు దైవముఁనందు లయస్థితిపొందినపుడు బాబా ఇచ్ఛ-దైవేచ్ఛయు నొకటిగ నగును. అట్టి సందర్భములందు 'అల్లాను ప్రార్థించుచున్నాఁడను.నాప్రా ర్థన ననుగ్రహించును.'- అనువాఁడు ఈవిషయము దృష్టియందుంచు కొందుమేని S.C.S శ్రీ సాయినాథ బోధామృతము- భక్తులవృత్తాం తములందుఁ దెలుపఁబడిన బాబా లీలలు- చమత్కారములు మనకు బోధపడఁగ వ్చు

ఒకవిషయముమాత్రము సత్యము శిరిడికిఁ జేరినపిదప పెద్దకాలము బాబా తనసిద్ధులను వ్యర్థపఱుపుకొనక ఎంతసేపు తనగురుదైవమును-అల్లాను ధ్యానించుటయందే నిమగ్నుఁడైనాఁడు. R A. తార్ఖాడ్‌తో బాబా తెలిపినట్లు 'లౌకికవస్తు [విషయ] లబ్ధికి సిద్ధులను వినియోగించిన అట్టిస్థితి దైవమునకు దూరముచేయును. అట్టివాఁడు దైవమునకు దూరమగును. పాతంజలయోగసూత్రములు. III. 38 లోను తెలుపబడినది.

అంతరాయాన్ వదంత్యేతా యుంజతో యోగముత్తమం
మయా సంపద్యమానస్య కాలక్షేపణహేతవః

[భాగ. స్కం XI-15=33]

ఉత్తమంబగు యోగంబునొందఁగోరు
పూరుషునకివి ప్రత్యూహములుగఁ బది
దులువదించుచుండు నాతోడివాని
కెన్నినవి కాలయాపన హేతువులగు.

బాబా పెద్దకాలము గురుదేవుని ధ్యానమునందే గడపెను. కబీరు సూక్తి ననుసరించి 'జీన్నే పాయా- ఉన్నేఛుపాయా' అనునటుల బాబా తన యోగసిద్ధులను బహిర్గతయ కానీయలేదు.

శ్రీ సాయిప్రభువునకు సిద్ధులతో అవసరము లేదు. తిండికి రేకుడబ్బా- జోలె తీసికొని వెళ్ళి 5 నియమితగృహముల భిక్షించి ఆహారపదార్థములు తెచ్చికొని తినువాఁడు. నివసించుటకు నీడనిచ్చుటకు మసీదు నింబవృక్షముకలదు. శీతబాధ నివారించుటకు ద్వారకామాయి మసీదునందు నిరంతరము వెలుగు 'ధుని'కలదు, ఇంద్రియజయము నొకసిద్ధియే. అది బాబా గురుప్రసాదలబ్ధము. బాల్యమున పెంపుడుగురువు ఫకీరు-దీక్షాగురువు వేంకుశుఁడు. వీరి అనుగ్రహమున అది లబ్ధమైనది. ఇఁక బాబాకు ఎట్టి కోరికలులేవు, జనుల పొగడి

కల– తెగడికలను పాటించువాఁడుకాఁడు. అట్టితడిగ్రికి సిద్ధులతో నేమిపని? కుశభావ్– తెప్పించుటల్లు వస్తువులను తెప్పించవలసిన పనిలేదు. బాబా పాదముల నాశ్రయించిన సకలసిద్ధులు ఆ స్వామికి ప్రతిబంధకములు కావు. ఆ డిగ్రీలో నవియు నొకభాగమే బాబా దీక్షాగురువు వేంకుశుఁడు సకలసిద్ధి ప్రపూర్ణుఁడు. బాబా తనగురువు వేంకుశుని సెలవుతీసికొని వెడలునపుడు ఆ గురుదేవుఁడు బాబాయందు తన 'శక్తినిపాతము' గావించినాఁడు. అది కొన్నిటపూర్ణము కొన్నిట పరిమితము కావచ్చును. శ్రీ సాయిప్రభువు తనగురువును ఆతితో నొప్పించి మృతినొందినవానిని తిరిగి బ్రతికించుటకు గురుదేవుని శక్తినే ప్రార్థించియుండవచ్చును.

S.C.S. Para 314. సర్పదష్టుఁడై మృతినొందిన బాలుని బ్రతికింపుమని బాబానుజేరి, యేడ్చిన ఆతల్లి యోడ్చుఁని కాకాదీక్షితు ఆ బాలుని బ్రతికింపుమని బాబాను ప్రార్థించినపుడు బాబా తెలిపిన విషయము గుర్తింపఁదగును. "ఇప్పుడు మృతినొంది నూతన తనువును పొందినబిడ్డ జీవాత్మను తిరిగి మృతినొందిన ఈతనువునఁ జేర్పఁగలను. కాని ఆజీవి నూతనతనువునఁ జేయగల పనులను చెఱచిన వాఁడనగుదును. ఆయాజీవుల కర్మములఁగూర్చి మనము జోక్యముకల్పించుకొనరాదు."– అని బాబా సమాధానము చెప్పినాఁడు. దీనినే 'ప్రతిభ'– అందురు, ఏజీవి యెక్కడ జన్మించుచున్నది గుర్తించుట–

'ఉత్క్రామంతం స్థితంవాపిభుఁజానంవా గుణాన్వితం
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః

[భ. గీత. 15-10]

పుట్టిన ప్రతిజీవి మరణింపకతప్పదు. అట్టియెడ యోగసిద్ధులు దైవవిధానమునకు భిన్నముగ వినియోగింపఁదగనివి. అట్టిమృతిదారొకనునపుడు దుఃఖితులగువారికి అట్టిదుఃఖమును ధైర్యముతో నెదుర్కొనఁ

దగు ప్రబోధ కావింపవలయును. కాని, జ్ఞాని- యోగి యగువాఁడు తనయోగసిద్ధులను వినియోగించి ఆజీవిని నూతన తనువునుండి మరలించి, మృతశరీరమున మఱల ప్రవేశించునటులఁ జేయరాదు.

పాతంజల యోగసూత్రములు III-౩౪ సూత్రమున

'ప్రతిభాద్వా సర్వమ్'- సకలసిద్ధులు జ్ఞానము- ఈ 'ప్రతిభ'వలన లబ్ధములగును.

ఈ 'ప్రతిభ'వలననే మానవులు- ఇతరజంతువులు- [బల్లులు మొదలగువాని] హృదయములలోని విషయములు బాబా గ్రహింపఁ గలుగుట ఇట్టి శక్తిపవిత్రిత- పూర్ణసత్వపరిభావము- పూర్ణవైరాగ్యము, దైవమునందు ధ్యానసిద్ధి- వలన కలుగును బాబా యందుగల ప్రతిభ దైవమునందు పూర్ణలయస్థితి- అప్రతిహతఆజ్ఞ- యథాసంకల్ప సంసిద్ధిగ, భూజయము- ఆకాశగమనము- మనోజవము మొదలగునవి సమర్థ సద్గురువుగ బాబా రాణించుటకు తన ఆశ్రితులను శుభ్రక్షేమమార్గమున దైవమునుజేరు విధానమున ప్రవర్తింపఁ జేయుటకుఁ దోడ్పడినవి.

సమర్థ సద్గురువైనవాఁడు తానుపయోగించిన నుపయోగింపకున్న సకలశక్తులను గలిగియుండవలయును. శిష్యుఁడు- ఆశ్రితుఁడు- భక్తుఁడు ఐనవాఁడు తన గురుదేవుని సమాజస్థితిని గుర్తించి తన ఆధ్యాత్మిక పురోగమనము అందుచేఁగలుగు ఆటంకములను ధైర్యోత్సాహములతో గూడిన ఓర్పుతో నెరవేర్చుకొని ముందుకుఁ జనవలె. అట్టి అవకాశము కలిగించుటకే సమర్థ సద్గురుదేవుఁడు సకలశక్తులను కలిగియుండును. సద్గురువగువాఁడు తనను సమాశ్రయించిన సకల జనులను ఆధ్యాత్మికముగనే కాదు. లౌకిక కాంక్షలతో సమాశ్రయించినను వారి వారి హితకామితములను గుర్తించి, లౌకికముగనే కానిమ్ము వారిని ప్రసాదించుశక్తి కలిగియుండవలయును.

ఉదాహరణమునకు— జి.యస్. కపర్దే- బాబాను సమాశ్రియించినది కేవలము విదేశప్రభుత్వము వారతనికిఁ గల్పింపనున్న బాధలనుండి తప్పుకొని, తన న్యాయవాదవృత్తిని— సాంఘిక- రాజకీయజీవితముల నవిచ్ఛిన్నముగ సాగించుకొనుటకే. అట్టి విషయమునను బాబా తన సమర్థతలను వినియోగించి, బ్రిటిష్ ప్రభుత్వాధికారుల (గవర్నర్ మొదలగువారల) హృదయముల నాకర్షించి, దేశభక్తిని పురస్కరించుకొని భారతప్రజల రెచ్చగొట్టుటకై కపర్దే కావించిన ఉపన్యాసముల గూర్చి అధికారులు కపర్దేపై నెట్టిచర్యలను తీసికొనకుండునట్లు కావించినాడు.

ఆవిధముగనే బాబాను ఆశ్రయించిన దామోదర్- సావలాం— రసానే- (దామియా) విషయమున ఇరువురుభార్యలను పరిణయమాడినను సంతానము కలుగలేదు. రసానే జాతకమున పుత్రస్థానమునపాపగ్రహములుండుటచేత గురువీక్షణములేని కారణమున సంతానప్రాప్తి లేదని జ్యోతిష్కులుచెప్పిరి, రసానే బాబాను ఆశ్రయించెను. బాబా సంతానము ప్రసాదించినాడు. జి జి. నార్కే- విషయమున జనించిన బిడ్డలు అతిబాల్యముననే మరణించుచుండిరి. ‹అల్లా అనుగ్రహించును› అని బాబా అభయమిచ్చినపిదప జనించిన బిడ్డలకు దీర్ఘాయువు ప్రసాదించినాడు.

ఇట్టి సంఘటనలను సాధించుటకు మన శాస్త్రములందు మంత్ర తంత్ర యంత్ర- జపహోమాదులు పెక్కులు తెలుపఁబడినవి. బాబా ఆశీస్సులు పుత్రకామేష్టి క్రతువులు—శింశుమార యంత్రపూజలు- బృహదారణ్యకము VI_లోన తెలుపబడిన మహాకార్యసిద్ధి హోమాదులు తెలుపఁబడిన వానినిచేసి యెరుగరు. ఇతరహృదయముల నాకర్షించి తన యిచ్ఛప్రకారము ప్రవర్తింపఁజేయు విధానములు కౌషీతకి ఉపనిషత్తు III నందు దెలుపఁబడినది, కపర్దే మొదలగువారి విషయము

లందు ఈ శాస్త్రములలో దెలుపఁబడిన ప్రక్రియలేమియు బాబా పాటించి యెఱుఁగడు. తన ఇచ్ఛాశక్తివలననే బాబా తన ఆశ్రితుల నందఱను అనుగ్రహించినాఁడు.

ఆ విధముగ బాబా తననుజేరిన ఆశ్రితుల భూతవర్తమాన తత్కాల భవిష్యద్విషయములఁ దెలుపువాఁడు. ఉదా! దామియాకు 15 సంవత్సరములలో ఎనమండుగురు బిడ్డలు కలుగుదురనియు నార్కేకు 3,4 సంవత్సరములలో పూనాయందుద్యోగము లభించుననియు ఇత్యాదులు తెలుపువాఁడు. బాబా ఒక సందర్భమున చందోర్కరుతో 'మీ జ్యోతిష్కులు దీర్ఘముగ ఆలోచించి, గుణించి కొన్ని విషయములు తెలుపుచుందురు. అందు కొన్ని సత్యములగును'— 'నేను భవిష్యత్తు నెఱుగుదును. నేను చెప్పునవి సత్యములగును'— అని చెప్పినాఁడు.

'యథా సంకల్పసంసిద్ధిని'గూర్చి నేనిక్కడ పలుకుచుందును— నాపలుకుల ననుసరించి, యవి యక్కడజరుగును. బాబా యోగశాస్త్రముల ననుసరించి యెఱుఁగడు. ఆ పరతత్త్వ ధ్యాననిష్ఠచేతనే ఆ దైవశక్తిసంపదలు బాబాయందు సహజముగ నిలిచినవి. ఈవిషయమే భాగవతమున 'మద్ధారణాంధారయతః కాసాసిద్ధిః సుదుర్లభా'— అని చెప్పఁబడినది. అనఁగా పరతత్త్వమునందు సంపూర్ణముగ లయమొందినవానికి దైవమునందుగల సకలశక్తులు సర్వజ్ఞత్వాదులు అట్టివ్యక్తి నుండి ప్రకటమగును. దైవ (అల్లా) ధ్యానమునందు బాబా సంపూర్ణుడు. సంపూర్ణముగ దైవమున లయించినాఁడు. S.C.S. శ్రీ సాయీనాథ బోధామృతమునందు— బాబా చరిత్రము— భక్తుల వృత్తాంతాదులందుఁ దెలుపఁబడిన సకలశక్తి సంపదలు దైవికములే, దైవశక్తి సంపదలే యగుచున్నవి.

శ్రీసాయీమహాప్రభువు తన ఆశ్రితులయెడ అనుగ్రహించిన విధానములు— ఐహికకామితములు— కష్టనివృత్తి— హితాభీష్టసిద్ధిః

బడయఁ జేయుటకే కాదు. బాబాయందు సంపూర్ణవిశ్వాసము వహించి, తన అంకితసంతతిగ- తనను గురుదైవముగ గుర్తించి, హాత్తుకొని, తనతోడ్పాటుచేత తనను అనుసరించి ఆధ్యాత్మికప్రగతి నొందుటకే అట్టులఁ గావించినాఁడు. ఐహికములగు కోరికలను ప్రసాదించుచున్నను ప్రతివిషయమున అంతో యింతో ఆధ్యాత్మిక ప్రబోధను బాబా కావించిన చమత్కారములలో నిమిడియేయున్నది. అట్టుల బాబావలన హితాభీష్టములఁ బడసిన ప్రతివ్యక్తియు ఆధ్యాత్మికముగ నొక అడుగు ముందుకు వేసినవాఁడే.

[దా.సా. రసానే] దామియాకు 4 మామిడిపండ్లు [సంతాన ప్రాప్తికొఱకు] ఇచ్చుసందర్భమున "జనములు- ఇమ్ము- ఇమ్ము- అని మొరపెట్టుకొందురు ఇదిగో- ఈపండ్లను తినిచావుము!" అని బాబా పలికినాఁడు. దామియా మిక్కిలి భయచకితుఁడైనాఁడు సంతానప్రాప్తికై బాబాను ఆశ్రయించినాఁడు- కాని యిచట మృతి తెలుపఁబడినది. అంతట బాబా చిఱునవ్వునవ్వి- "ఈపండ్లను నీవుకాదు నీరెండవభార్యను తిననిమ్ము. నీవలన ఎనమండుగురు బిడ్డల నామె పడయును,"- అని పలికినాఁడు. బిడ్డలు 8 మంది కలుగుట సంసార భారమేయగును, సంసారము మానవుని ప్రపంచకమగ్నునిఁ గావించును. దానివలన ప్రమాదముకలిగి దైవము విషయమున పూర్తిగ మఱపుకలిగించి వానిజీవితమున ఐహికవస్తుసేకరణమే సర్వస్వముగ జీవితలక్ష్యముగ వానికి తోఁపఁజేయును.

'సనత్సుజాతీయము' నందు సనత్కుమారుఁడు పలికినట్టుల "ప్రమాదోమృత్యురహంబ్రవీమి"- ప్రమాదమే మృత్యువు - ఈ సంసారప్రమాదమే మృత్యువు. బాబా దామియాను సంసారమునందుఁ ద్రోయుపూర్వము ఆ ప్రమాదమును సూచించినాఁడు. అని మనము గ్రహించవలయును. సంసారమున నిమగ్నుఁడగువాఁడు ఆధ్యాత్మికముగ మృతినొందినవాఁడే యగును.

ఆశ్రితులు భక్తులగువారు బాబా సహాయమర్థించిన సందర్భములందు వారికి తగిన రీతుల సాయపడుచు దానితోఁడ తనయందు గాఢ విశ్వాసము వారికి బాబా ప్రసాదించువాఁడు. ఉదా:- నార్కే-ధుమాల్-బూటీ మొదలగువారు బాబా దైవసంపద్విష్టుఁడనిఁ తమకు రక్షకుఁడగు గురుదైవమని విశ్వసించినారు. "ఆచార్యదేవో భవ!" [ఉపనిషతు] 'నీ గురువేదైవమని విశ్వసింపుము'— అని ఉపనిషత్తులు తెలుపుచున్నవి.

ధుమాల్— బాబాను తన సర్వరక్షకుఁడుగ విశ్వసించినాఁడు. ఒకసమయమున S.C.S. Para - 40 'భావ్! రాత్రియంతయు నిద్ర లేదు. నిన్నుగూర్చియే యోచించుచు- యోచించుచుంటిని." అని, బాబా పలికినాఁడు. తన తలంపులను పెడదారులఁ ద్రొక్కనీయక బాబా తన నెల్లు కనిపెట్టి రక్షించుచున్నది ధుమాల్ గుర్తించినాఁడు. శ్రీ సాయీనాథుడు సర్వజ్ఞుఁడు సర్వసమర్థుఁడగుటయేగాక తనకు రక్షకుఁడైన దైవమని, ఇఁకమీఁద తన రక్షణభారము సకలము బాబా చేతులందుంచి తానుక్షేమముగ మెలఁగఁగలనని తలంచినాఁడు.

నాశిక్ పట్టణమున ప్లేగువ్యాధివ్యాపించి ఎలుకలు చచ్చిపడియున్న బంగాళాలో నివసించుచున్నను బాబా రక్షణలోనున్న తాను తనవారు ఎట్టి అపాయములోనుగారని విశ్వసించినాఁడు. [ధుమాల్ వృత్తాంతముచూడుడు.] ఆవిధముగనే జరిగినది. ఇట్టి నిదర్శనములు ఆ నిర్దేశింపఁబడిన భక్తులకేకాదు— బాబాయందు సకలభారమును నిలిపి, బాబా ఆజ్ఞలను పరిపాలించిన ధుమాల్ మొదలగు బాబా అంకితసంతతిని గుర్తించినవారికిని బాబా యందు గాఢవిశ్వాసమును పాదుకొలిపినది.

ఈవిధముగ శ్రీ సాయీనాథుఁడు శిరిడీయందు భౌతికతనువుననున్న 60 సంవత్సరముల కాలము తన సకలసిద్ధులను వేలకొలది ఆశ్రి

తులకు లౌకికార్థములను ప్రసాదించుచు దానితో ఆధ్యాత్మిక పురో
వృద్ధులను సమకూర్చుటయందు వినియోగించినాడని పాఠకులు గుర్తిం
పదగును, బాబాయందుగల సిద్ధులు వానిని వినియోగించిన విధాన
ములు- ఇతరమాంత్రికుల- ఇంద్రజాలికుల యంత్రతంత్రవాదుల సిద్ధు
లకు వానిని ప్రదర్శించు పద్ధతులకుగల ముఖ్యభేదములను గమనిం
పదగును.

1. శ్రీ సాయిప్రభువునందుగల సకల శక్తిసంపదలు సహజ
ములు. బాబా అంతర్యాగములై కేవలము తన గురుదైవము నందు
ప్రేమ- నిరంతరధ్యాననిష్ఠ- లయమూలమున కలిగినవి. ఇతరమాం
త్రికుల ఐంద్రజాలికుల విషయమున ఆయా ప్రత్యేకసిద్ధులకొఱకై వారు
కావించిన నీచదేవతోపాసన- జపాదులవలన లబ్ధములైనవి.

2 రెండవ తెగవారు ప్రాపంచకకాంక్షలు లేనివారు కారు,
ఆయాసిద్ధి- శక్తుల ప్రదర్శనముల మూలమున తమ అధికృతయందు
కాంక్ష, లౌకికకీర్తి ప్రతిష్ఠలను ఐశ్వర్యసంపద్విశేషములను కాంక్షిం
చువారు.

3, అట్టివారుగడించు శక్తిసంపదలు పరిమితములు. మంత్రజ
పాదులతో సంబంధముగలిగినవి. త్వరలో క్షయించునవి. వారి లౌకిక
భోగలాలసతలచే నవి క్రమముగ క్షీణించును. ఇట్టి సిద్ధిప్రదర్శనముల
వలన వారు సంసారకూపమునఁ గూలుచుందురు.

4. అట్టి మాంత్రికులఁజేరువారు ప్రమాదములపాలై పతనమగు
అపాయముకలదు. సమర్థసద్గురువులగు శ్రీ సాయీప్రభువు వంటివారు
తమ ఆశ్రితులయెడ పరమప్రేమఁ బఱపుచు లౌకిక పారలౌకికముల
రెంటవారల నుద్ధరింతురు.

5. మంత్రవాదుల- మాంత్రికులఁజేరువారు ధనము చెల్లించు
చుండవలయును. సమర్థసద్గురువులకు ధనకాంక్షలేదు, ధనముతో వానికి
నిమిత్తములేదు.

6. మాంత్రికుల శక్తులత్యల్పములు, పరిమితములు వారు తెలుపు భూతభవిష్యద్దాదులు సత్యములుకావు. సమర్థసద్గురువుల శక్తిసంపదలు అపారములు- అమోఘములు- దేశకాల కారణాతీతములు.

7. ఈ మాంత్రికులు మొక్కలైన వారికికలుగు రక్షణములాయా నీచదైవతముల కరుణపై ఆధారపడియుండును. అట్టి వారానీచదేవతలచే మరణమునొందిన నొందవచ్చును లేక మతి చెడిపోవచ్చును. సమర్థసద్గురువులకట్టి అపాయములులేవు

జ్యోతిష్కులని ప్రసిద్ధినొందిన వారికేకాదు మునీశ్వరులకుసైతము భవిష్యత్తు తెలియదు, మృతి యెప్పుడు దాపరించునో తెలియదు, అందుచేతనే భగవద్గీతలందు అధ్యా-8-

'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మరయుద్ధ్యచ'

అని చెప్పబడినది. మరణకాలమున దైవమును ధ్యానింపగలుగుదునో లేనో యని శ్రీ కులశేఖరులు,

"కృష్ణత్వదీయ పదపంకజ పంజరాంత
మద్యైవమే విశతుమానసరాజహంసః" అనినారు.

అనుశ్రుతముగా చెప్పుకొనబడు కథగలదు—

'యదావ్యాసశ్చ దాసశ్చయమేన మృత్యునాసహ
కాలస్యగృహమాయాంతి తదాదాసోమరిష్యతి'.

సద్గురువుల అనుగ్రహవిశేషమున తమ ఇష్టదైవమును-గురుదేవుని అంత్యకాలమున స్మరింపగలవారు కొందఱుగలరు, (కాకాదీక్షితు వృత్తాంతముజూడుడు,)

'నూల్కర్ విజయానంద మాహిపాన్ దత్తసద్గతిః' —
'శేసేక్నేశో స్తథాంధస్య సతాంగతి విధాయకః'
'ఘమాలుపాసనీపల్యోః నిర్యాణేదత్తసద్గతిః'

[శ్రీసాయీ సహస్రనామములు]

(S.C.S. 95, 96 (శ్రీ) సాయీనాథ బోధామృతము చూడుడు)

'నా వానిని చెపనీయను- పడనీయను'- అని బాబా పలికినారు. వాని సకలభారములు- ఐహికాముష్మికములను నేను వహింతును' అని బాబా శపథము చేసినాడు.

ఇట్టి సమర్థతలు సిద్ధులు కావు, (శ్రీ) సాయీనాథుడు తన గురు దేవుని అనుగ్రహమున గురుదేవునందు నిరంతర ధ్యాన ధారణాదులచే ఆ గురుదైవమునందు లయమొందినవాడు. దైవమునందు లయమొందినవానికి ఆ దైవమునగల సకలశక్తులు కలిగియుండును.

"ఉపాసకస్యమామేవం యోగధారణయా మునే,
సిద్ధయః పూర్వకధితా ఉపతిష్ఠంత్య శేషతః"
భాగ XI_15 అధ్యా ౩౫ శ్లో

పాతంజల యోగసూత్రముల ననుసరించి పరతత్త్వమును నిరంతరము ధ్యానించుటవలనను శుద్ధసత్త్వమును పెంపొందించిన కొలది ఇట్టిసిద్ధులు కలుగుచుండును. ప్రతిభ పెంపొందును సర్వజ్ఞత సర్వ సమర్థతలు కలుగును. ఇన్నికలిగినను ఆశాబీజము శేషించును అట్టి ఆశాబీజమును సంపూర్ణముగ నశించినవానికే కైవల్యము సిద్ధించును. (శ్రీ) సాయీనాథునకు ఆశాబీజము నిర్మూలమైనది కావుననే 'మైం అల్లాహూ'- చెప్పగలిగినాడు, S.C.S. 66-68 ((శ్రీ) సాయీనాథ బోధామృతము చూడుడు) సర్వభూతాత్మ- భూతాత్మస్థితిని నిరూపించుచున్నది. సకలసిద్ధి శక్తిసంపదలు గలిగి తన ఆశ్రితులను లౌకిక పారలౌకికముగ పురోవృద్ధి సమకూర్చ దీక్ష వహించినవాడు కావుననే ఈ సకలశక్తి సంపదలను వినియోగింపక తప్పనివయ్యెను.

S.C.S. 57. కనిత్కార్ సతి [పూనా] గొప్ప విదుషీమణి. బాబానగూర్చి విని ఆయన హైందవుడా? ముస్లిమా?- ఇదంతయు

ఇంద్రజాలక విద్యయా? ఏమి అని తెలిసికొనదలంచి ద్వారకామాయి మెట్లెక్కుచుండగా బాబా ఆమె కెదురుగఁబోయి పలికిన పలుకులు గమనింపుడు.

'బ్రాహ్మణుఁడితండు స్వచ్ఛమౌ బ్రాహ్మణుండు
పావనబ్రాహ్మణుఁడు; కోట్ల ప్రజలశుభ్ర
మార్గమున నడిపించి గమ్యస్థలంబు
నందఁజేయు- నియ్యదియె బ్రాహ్మణమసీదు.'

అని ప్రకటింపఁగలిగినాఁడు. (శ్రీ సాయీశగుణ 39పుట)

ప్రతివిషయమున బాబా యోగసూత్రములందు- భాగవతమున ఏకాదశస్కంధమునందుఁ దెలుపఁబడిన విధానముల ననుసరించినాడా? ఏమి?- అని మనము విచారింపవలసిన పనిలేదు. గురువులు నొవ్వించి మృతినొందినవానికి గురుపాద ధూళినే మృతుని దేహముపైఁజల్లినాఁడు. గురువును ప్రార్థించుటచే ఆతని సజీవునిఁ జేయఁగలిగినాఁడు. మసీదున నీటితో దీపములను వెలిగించుటయు అవిధమే, గురుదేవునందుఁ గల ధ్యానసిద్ధియే అట్టిశక్తిని బాబాయందు గలిగించినది.

మంత్రశాస్త్రములందు- మంత్రములు తంత్రములు- యంత్రములు- ఔషధములు తెలుపఁబడినవి. వివిధములైన మోహన- వశీకరణ- ఆకర్షణ- విద్వేషణ- మారణ- ఉచ్చాటనాది విధానములతో గూడియున్నవి, ఇట్టివానితో బాబాకు ఎట్టిసంబంధములేదు 1911లో ఉపాసనీ మొదటిపర్యాయము శిరిడికివెళ్ళి అక్కడనుండి సతారాకు తిరిగివెళ్ళి యిక రాదలచలేదు. 8వ నాడు తిరిగిరమ్మని బాబా ఆజ్ఞాపించినాఁడు. కాని ఉపాసనికి ఆ తలంపులేదు. శిరిడివిడిచి 7 దినములాయాప్రాంతముల దిరుగాడి 8వనాడు శిరిడికిఁ జేరినాఁడు. ఆయనకుఁ గాని- ఆయనవెంట వచ్చినవారికిఁగాని అట్టి తలంపులను కలిగించలేదు.

బాబా వారిచందఱను తనగుప్పిట నుంచుకొనినాఁడు. ఇదియంతయు 'యథాసంకల్ప సంసిద్ధియే'- ఇందేవియు మంత్ర తంత్రాదులు ఇంద్రాదిదేవతలను ప్రార్థించుటయు లేదు. 'కాసాసిద్ధిః సుదుర్లభా!" అని చెప్పఁబడినదే బాబా విషయమున 'మనమన్వయించుకొనవలయును. బాబా తనబిడ్డల కెప్పుడేమి జరుగునది తెలిసికొనఁగలఁడు. అందుచే ధైర్యముగ వారి నాయావిధముగ నియమింపఁగలడు.

ఉదాహరణమునకు:- నానాసాహెబ్ చందోర్కరు, లేలేశాస్త్రి. యిరువురు ప్రయాణముచేయుచున్న టాంగా తలక్రిందుగ పడినపుడు శిరిడిలోనున్న బాబా "అరే! నానా మరణింపనున్నాఁడు- నేను మరణింపనీయుదునా? నా నాలుగుచేతులు సాచి రక్షింతును'- అనినాఁడు. వారిరువురు ఆ అపాయమునుండి రక్షింపఁబడిరి. శిరిడియందు ప్లేగు వ్యాధి వ్యాపించెను. నందరాంమార్వాడి ప్లేగువ్యాధినోకి శిరిడివిడిచి వెళ్ళుటకు బాబా సెలవుతీసికొన ద్వారకామాయి మసీదుజేర "నీవు వెళ్ళవలదు- నిన్ను మరణింపనీయను." అని, బాబా అభయమిచ్చినాఁడు. తరువాత పెక్కు సంవత్సరములు నందరాం జీవించినాఁడు ఒక ప్రసిద్ధజ్యోతిష్కుఁడు గోపాలరావుబూటీతో ఆదినము ఆతని గండము అనిచెప్ప 'ఏమి! ఆతడు నీకు మృత్యువు ఆసన్నమైన దనుచున్నాఁడా!' తాకుము- ఎట్లుతాకి చంపునవో చూచెదను'- అని బాబా పలికినాఁడు, ఆదినమున ఒకసర్పము బూటీవద్దకువచ్చెను. కాని ఆతనిఁ దాకక వెడలిపోయెను.

'మృత్యువునిన్ను చెనకఁజాలదనిపలుకగలుగుటఅదివిస్పష్టముగ
దైవశక్తియే.

సర్వంవస్తు భయాన్వితంభువి నృణాంసాయీశ ఏవాభయం'.

నిఖిల కీప్రపంచమున సకలము భయముతోకూడినదే- అభయము శ్రీ సాయీప్రభువునందు మాత్రమే కలదు.

బాబా శక్తిసమర్థతలు సకలము దైవశక్తియే. ఆతండి సమర్థతలఁగూర్చి అన్వేషించువారలు అవి మంత్ర- తంత్రాదులుగ భ్రమింతురు బాబా భక్తులు మాత్రము ఆస్వామిని గురుదేవుఁడుగ భావింతురు. అది తిరిసత్యము- శ్యామా బాబానుగూర్చి 'దేవా!'- అనియే సంబోధించును. నిర్గుణ సగుణ బ్రహ్మమునుగూర్చి సంపూర్ణ సమర్థతలుగల దైవ ప్రతినిధులనుగూర్చిన వేఱు తలంపులు భక్తులగువారు పాటించవలసిన పనిలేదు. ఆవిషయము విచారింపరు. అట్టి తలంపులు భ్రమను కలిగించును. బాబా సమక్షమున తారాబాయి సదాశివ తార్కాడ్ మొదలగు భక్తులు బాబా రక్షణమున ఎట్టి భయాందోళనలు కలుగవని- మృత్యువు సైతము వారిని చెనకజాలదను- నిశ్చయబుద్ధినిఁ గలిగియుందురు •అభయమేగాక బాబా కటాక్ష వీక్షణమున గంటలతరబడి పరమానందము సచ్చిదానందస్థితిఁ బడయఁ గలిగినారు. 1. నారాయణఆశ్రమ్ 2 జీ. యస్ కపర్దే 3. దక్షిణాభిక్షా డాక్టరు మొదలగువారి వృత్తాంతముల గమనింపుడు, ఇట్టి పరమానందభాగ్యము బాబావలనఁ బడయఁగలిగిన ఆతండి సాయీ మహాప్రభువు సంపూర్ణ సచ్చిదానందవిగ్రహుఁడు. ప్రత్యక్షదైవము- అగుట నిర్వివాదము. నాస్తి- మొదలగువార లేవిధముగఁ దలంచినను వారి తలంపులతో నిమిత్తము లేదు.

ఇఁక స్వేచ్ఛామరణము [సిద్ధి] విషయమై విచారించుదము. మానవత్వవృష్టి ననుసరించి బాబా మూఁడు పర్యాయములెటుల సంఘటిల్లినది గమనింతము

1] 1836లో బాబా 'అల్లాను చూడఁబోవుచున్నాడను. తిరిగి వత్తునని నమ్మకములేదు 3 దినములకు తిరిగిరానియెడల ఈ తనువును మధుర నింబవృక్షము దగ్గఱగ సమాధిచేయుడు! తిరిగివచ్చితినా ఈ తనువును స్వీకరించి మఱి కొంతకాలము నేను కావింపవలసిన పనులను

నిర్వర్తింతును'— అని మహల్సాపతితో పలికి తనువు విడిచినాఁడు. కొన్ని క్షణములలో ఆతనువు శవముగ మాఱెను. అంతట పంచాయతీ జరిపి బాబా మరణించెనని, ఆతనుకు బాబా కోరినచోట సమాధి చేయుమని పంచాయతీదారులు— అధికారులు తెలిపిరి కాని మహల్సాపతి మఱికొందరు భక్తులు ఆపని జరుగనీయలేదు ౩ దినములు— [7౨ గంటలు] తరువాత బాబా మరల ఆ తనువున ప్రవేశించి ఆపిదప ౩౨ సంవత్సరము లా తనువున నున్నవాఁడు.

2] 1916 సంవత్సరము దసరాదినమున [విజయదశమి] బాబా సీమోల్లంఘనము చేయుచున్నాఁడా? అని అందరు తలంచిరి, 1918 విజయదశమినాఁడు తన నిర్యాణము జరిగించుకొని బాబా తెల్సుకొనినాఁడు. దానికి ముందుగ శ్రీ రామవిజయమును మసీదునం చదివించుకొనినాఁడు. 'దావియా' మొదలగువానిని నిర్వర్తించుటకు ౨౫0 రూపాయలను ముస్లింనాథునకు సంశుద్ధినకు పంపినాఁడు. మఱియొక సాధువైన బిన్నేమియాకు "9వ నెల 9వ తారీఖున అల్లా తాను వెలిగించిన దీపమును తీసికొనిపోవుచున్నాఁడు" అని బాబా వర్తమానమంపినాఁడు, ఈవార్త అందినవెంటనే బిన్నేమియా అశ్రువుల స్రవించినాఁడు, నిర్యాణకాలమున జీవి సర్వసంగ పరిత్యాగము చేసి దైవమును ధ్యానించుచు తనువు విడువవలయును. (భాగవతము-పరీక్షిత్తువృత్తాంతము భగవద్గీతలలో తెలుపబడిన విధము) ఆవిధముగ బాబా కావించినాఁడు యోగసూత్రములు ౨౨ ననుసరించి అరిష్టములు— శకునములనుగూర్చి బాబా యోచించవలసిన పనిలేదు. సకలజ్ఞాన విజ్ఞాన రహస్యములు బాబా ఎఱుఁగనివి కావు సకలము ఆతండ్రికి విదితమే— శ్రీ సాయీనాథుఁడెఱుఁగనిది యీ విశ్వమున లేదు

"ప్రపంచమున సాయినిలోఁగొనఁగల వస్తువేదియు లేదు
ప్రపూర్ణసంవిత్ స్ఫురన్మూర్తి బాబా కను భ్రామగ రాదు"
[చరమలీల చూడుడు] (శ్రీ సాయీవిజయము)

ఇక తన ఆశ్రితులను అనుగ్రహించు విధములను గమనింపుడు కాకాదీక్షిత్తును విమానమున గొనిపోవుదునని పలికినాడు (కాకాదీక్షిత్తు నిర్యాణము చూడుడు.) అవసానకాలమున వేలకొలది మైళ్ళదూరమున నున్న వారిని తనదరికి ఆకర్షించినాడు. ఉత్తరజన్మమున సాయీబిడ్డలను తగిన మాతృగర్భములం జేర్చినాడు. [పిప్యా- రోహిల్లా- గాల్వాంకర్– సపత్నేకర్–బిడ్డ- బాబు ప్రధాన్ మొదలగు వారివిషయములను గుర్తింపుడు] ఈవిధానము లేయోగసూత్రములందును- ఏమంత్రశాస్త్రములందును తెలుపబడినవికావు. ఇట్టిశక్తి యోగశాస్త్రము- భాగవతమునందుం దెలుపంబడిన సర్వజ్ఞత్వ సర్వనియంతృత్వ సర్వసమర్థతలకు సంబంధించినదేయని బాబా విషయమున మనముగుర్తించి తన ఆశ్రితుల భక్తుల యోగక్షేమ భారమువహించి శుభ్రస్నిగ్ధమార్గమున నడిపించు గురుదైవము శ్రీసాయీ మహాప్రభువని విశ్వసించి సేవించవలయును.

బాబానుండి ప్రకటమైన సర్వజ్ఞత్వాది సమస్తశక్తిసంపదలు S.C.S. శ్రీసాయీనాథ బోధామృతమునందు వివరింపంబడినవి. ఈ గ్రంథమును సావధానముగ పరిశీలించువారు బాబా దైవత్వస్థితిని గ్రహింపంగలరు. ఇంకను పరిశోధింపంజూచుట తగనిపని. శ్రీసాయీ విషయమున దైవము విషయమున కర్మసిద్ధాంతము ఒకహద్దు కలిగింపంగలదా? ఇచ్ఛాశక్తి అనునది కలదా? ఇది యిట్లు జరిగితీరునని ఆయాజీవుల విధివిధానము ముందుగ నిర్ణయింపంబడినదా?- ఇత్యాది ప్రశ్నలు మానవుని కలవరపెట్టినవి- పెట్టుచున్నవి. తుదివరకు కలవరపెట్టితీరును. ఇట్టి తాత్త్వికవిచారణములు– వాని సమాధానముల గూర్చి, జనసామాన్యము దూరముగనుందురు. ఇట్టి సంశయములకు లోనుగాక గాఢభక్తివిశ్వాసములు శ్రీ సాయీప్రభువునందుగలిగి, సకలసందేహములనుతీర్చు పని బాబాకే విడువందగును. అది ఉత్తమోత్తమము– క్షేమతమము విజ్ఞానతమమైన విధానము, ఇంతకంటె–

బాబా తెలిపిన దానికంటె మంచి సందేశము ఎందు విచారించినను పొందఁజాలరు.

(శ్రీ) మద్భాగవతము— 11 స్కంధము 15 అధ్యాయమున భగవానునియందు మూర్తిమేకలవని చెప్పబడిన అష్టమహాసిద్ధులు- అణిమ- మహిమ- లఘిమ- ప్రాప్తి- ప్రాకామ్య- ఈశిత్వ- వశిత్వ- పరమానందములు. ఇవి తరువాతఁ దెలుపఁబడిన పదియు- ఆవలఁ దెలుపఁబడిన అయిదుసిద్ధులతో కలయిక గలిగియున్నవి. ఇవి 6,8 శ్లోకములలో తెలుపఁబడినవి. బాబా విషయమున యివియన్నియు- ఆతండి) నిరంతరము అల్లా- హరి ధ్యాననిష్ఠవలన కలిగినవే (లభించినవే) యని మనము గ్రహింపవలయును. దైవముునందు సంపూర్ణలయ ప్రభావము జనితములేయగును.

అణిమ— (లఘిమ) Mrs T, Master T బాంద్రా— వీరు శిరిడి యందుండగా సూక్ష్మతనువున బాబా వెళ్ళినట్లు నైవేద్యము ఏమిలభింపక తిరిగివచ్చినటు ఇత్యాదులు అణిమసిద్ధిగ గ్రహింపఁ దగును ఆదినముపూజాసమయమున నైవేద్యముపెట్టని విషయము Mr.T.భోజనవేళకుముందు గుర్తించి బాబాకు తన క్షమాపణ మర్థించుమ శిరిడికి ఉత్తరము వ్రాసినాఁడు.

పత్రంపుష్పం ఫలంతోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః
(భ.గీత, 9—27)

(శ్రీ)కృష్ణాది అవతారపురుషులవలె బాబా ప్రేమ యెంత గలదో ఆభక్తుల ననుగ్రహించును. అట్టిభక్తుల నెల్లవేళల వేయికనులఁ గనిపెట్టియుండును. ఆవిధముగ దీక్షిత్తు శిరిడియందున్న సమయమున పూజసలుపుచు తాంబూలము సమర్పింప మఱచినాడు. మసీదునకేగి బాబాను సందర్శించగా ఏదీ! తాంబూలము— అని బాబా అడిగినాడు.

సిక్లిత్తు ఆదినము పూజయందు తాంబూలము సమర్పించుట మఱచి నట్లు గ్రహించెను. ఇట్టివి అనేకములుకలవు. బాబా భక్తులెయుం డియు పొరపాటునగాని మోసబుద్ధినేని ప్రవర్తించువారిని ఆతండ్రి చక్కదిద్దిన సందర్భములు అనేకములుకలవు

ముద్రణాలయములో పనిచేయు N.V. బాబాను సందర్శింపఁబోవు చు తనదగ్గఱ పైకమున్న బాబా దక్షిణకోరునని, ఉంచుకొని లేదనిపలు కుట తగదని, తనదగ్గఱనున్న పైకము తనవెంటవచ్చు D.V.సాంభారే చేతికిచ్చి బాబాను సందర్శించెను. ఆసాంబారే దగ్గఱనుండి తీసికొని దక్షిణనీయుమని బాబా కోరెను.

ఒక వృద్ధురాలు బాబాకు 8 అణాలు సమర్పింపదలచి బాబా చేతిలో 4 అణాలుంచెను. అంతటబాబా 'ఈ పేదబ్రాహ్మణుని ఏల మోసగించెదవు. తక్కిన 4అణాలుకూడ ఈయుము' అనినాఁడు. ఈ విధముగ బాబాభక్తుల తలంపులను సంకల్పములను చక్కదిద్దువాడు.

ఇఁక తక్కిన యోగసిద్ధులు- అష్టమహిమలు అష్టాదశసిద్ధుల విషయమై S.C.S. శ్రీసాయీనాథ బోధామృతము- ఏమీా, నిన్ను పేక్షింతునా ? (Life of Sai Baba) గ్రంథములలో ననేకములు గలవు.

వశిత్వము. (విషయములనుండి మనస్సును నిగ్రహించుట) బాబా జీవిత చరిత్రమును పరిశీలించిన ప్రాపంచక విషయములచేత బాబా ఆకర్షిం పఁబడినట్టుల ఎవరు నేసందర్భమునఁ దెలిపియుండలేరు.

కొందఱు బాబానుగూర్చి యిటుల ప్రశ్నింపఁజూతురు,

శ్రీ సాయీబాబా గుణాతీతుఁడా? స్థితప్రజ్ఞుఁడా? పరమభక్తుఁడా? పరమజ్ఞానియా? ఇత్యాదులు. వీనికన్నిటికి ఒకే సమాధానముకలదు. ఇవియన్నియు ఇంతకెక్కుడైనవన్నియు నగుచున్నాడు.

'సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠత్ దశాంగుళమ్.'

'ఈభూమిని విశ్వమును ఆవరించి పీనిపై పది అంగుళములు వ్యాపించియున్నవాఁడు'- అనియే చెప్పవలయును.

శ్రీ సాయిామహా ప్రభుపు సంపూర్ణ యోగావతారుఁడు. సచ్చిదానందప్రపూర్ణుడు. సందేహముగలవారు ఈ క్రిందఁ దెలుపఁబడిన వారి వృత్తాంతములద్వారా తెలిసికొనఁదగును.

1. దక్షిణాఫ్రికానుండి వచ్చినడాక్టరు
2, G. S. కపర్దే
3. ఉపాసనీబాబా
4. శ్రీమతి సదాశివతార్కాడ్
5. జహాంగీర్ [పార్శీ] (Blerk D.E.)
6. బాలకృష్ణ ఉపాసనీశాస్త్రి [హరిద్వార్ వద్ద వనమున అతడు చూచినయోగి—సాధువు]
7. S. B. నాచ్నే
8, B.V. దేవు [తల్లి ఉద్యాపనము]
9, చందోర్కర్ – సర్వభూతాత్మ-భూతాత్మస్థితినిరూపించినాడు.

అహమాత్మాహిచందోర్కర్ సర్వభూతాశయస్థితః
పిపీలికాము ఖేనాపిమక్షికస్యముఖేనచ [శ్రీ సాయిామననము]

పాతంజలయోగసూత్రములు- భాగవతము 11 స్కంధము 15వ అధ్యాయమునఁ దెలుపబడిన అష్టమహాసిద్ధులు— దశసిద్ధులు—పంచసద్ధులు- అన్నియు బాబా కలిగియున్నవాఁడు. యోగసంపూర్ణావతారుఁడు కావుననే యోగదృష్టి తనవానిపై ప్రసరించినమాత్రమున గంటలతరబడి ఆనందస్థితిని ప్రసాదింపఁగలిగినాడు. తాను సచ్చిదానంద ప్రపూర్ణుఁడైనగాని తనబిడ్డలకు ఆనందస్థితి ప్రసాదింపఁజాలఁడు. అందుచే బాబా "మైఁ అల్లాహూఁ' అనఁగలిగినాఁడు.

జ్యోతిరింగణ ఏకోను మన్యసే
యత్త్వమేవ తిమిరేషు లక్ష్యతే.

కొందఱు సాధువులను యోగులమని నాడీగ్రంథవేత్తలమని జ్యోతిష్కులమని ప్రకటించుకొనఁజూతురు. అట్టివారిలో కొందఱు ధ్యాననిష్ఠయందుండి యేమేని కొంత దెలిసికొనగలిగిన అది పరిమితమే. బాబా విషయమున నెట్టి ధ్యాననిష్ఠలు అవసరములేవు. తారాబాయి తెలిపినటుల బాబా తనబిడ్డలతో సంభాషించుచుండియు విశ్వవ్యాప్తియే యగువాడు. వేలకొలది మైళ్ళలో నేమిజరుగుచున్నది 10 వేల ఏండ్ల నాడేమి జరిగినది, ఇక 10, 15 సంవత్సరములకు ముందేమి జరుగనున్నది బాబా ఎఱుగును. తిరోభావ ఆవిర్భావాదులు గలవాఁడు. పరతత్త్వమున లయించినవాడు గనుకనే సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వాదులు గలవాఁడు. త్రికాలజ్ఞత్వము యథాసంకల్పసంసిద్ధి అప్రతిహత ఆజ్ఞ ఇవన్నియు- సర్వ సమర్థత్వాదులగును.

## స్తంభనము

అగ్న్యర్కాంబు విషాణాం ప్రతి స్తంభనమ్

అగ్ని:- ధునీజ్వాలలను- హాట్ మాగే- హోట్ మాగె

ఇది యథాసంకల్ప సంసిద్ధియే

వడగాడ్పులు:- మసీదున నున్నవారికి చల్లగాలివచ్చుట

అంబు:- 1 మేఘములనాజ్ఞాపించుట- ప్రధాన్ కుటుంబము

ప్రయాణసమయము-అరె! అల్లాబరస్తేపూరాకల్

2 మేఘుఁడు కడవలలో తలపై నీరుపోసినపుడు

తుపాను:- శిరిడిజనులు బాబానుజేరి ప్రార్థించినపుడు ఆపుట.

విష స్తంభనము:- పిచ్చికుక్క- సర్పదష్టుఁడైన శ్యామా.

అగ్ని- కొండాజీ గడ్డివాము

లగుడోద్ధృత రోషిల్లా స్తంభనాద్దర్పనాశకః

బాబాను “పృథ్వీగత” God on earth అని భావించును.

స్తంభన- ప్రతిస్తంభనము- ఉపాసనివృత్తాంతము చూడుడు.

## 11. శ్రీ సాయిమహాప్రభువు సిద్ధులనుగూర్చి తెలిపిన విధము.

శ్రీ సాయినాథునకు పలువిధములగు శక్తులను ఉపయోగమించినభక్తులు ఆయాప్రదేశముల పలువురుకలరు ఏయేస్థితిని బొందిన వేయేసిద్ధులు ప్రాప్తించునది బాబా యెఱుఁగును. బాబా తన ఆశ్రితులగు భక్తులకు యుక్తములగు బోధలను గావించినాఁడు.

సాధకుఁడగు భక్తుఁడు తన యిష్టదైవమునందు- గురుదేవునందు మనస్సు లయింపఁజేసికొనలేది- ధ్యానసిద్ధి వహించినకొలది- తదనుగుణ్యముగ ప్రశాంతస్థితిని బడయఁగలఁడు. అన్యభావ గ్రహణాదిశక్తులు గలుగును. అట్టిసిద్ధులు సాధకునకు గర్వకారణములై క్రమక్రమముగ ప్రాపంచక వస్తు ´ విషయాదులకు దారితీయును అది క్రమముగ వతిని లౌకికవిషయలంపటునిఁజేసి సంసారసాగరమున నిమగ్నునిఁజేయును గమ్యస్థానము- దైవమునకు వానిని దూరముగావించును.

శ్రీ మహాభారతము శాంతిపర్వమునఁ దెలుపబడిన, కొంగను చూపుచే దహించిన బ్రాహ్మణుని వృత్తాంతము గమనింపుడు మఱియొకఁడు చలనరహితస్థితి తన తలపై పక్షులు గూండ్లు నిర్మించుకొను నంతటి నిశ్చలస్థితినొంది తుదకు గర్వించెను. ఇట్టి గర్వితస్థితి పతనహేతువని గుర్తించెను. మొదటివాఁడు పతివ్రతవలన ధర్మవ్యాధునివలన జ్ఞానబోధనొందెను.

[S.C.S. Para ౩౬౮ చూడుడు.]

బాబా ఆశ్రితుఁడొకఁడు ప్రాణాయామము- ధ్యాననిష్ఠవలన దూరదృష్టి మొదలగుసిద్ధులను బడసెను. తన ధ్యానమందిరమునుండి యే దూరముననున్న తన యంత్రశాల (Mill) తగులబడుచున్నట్లు తెలిసికొనగలిగెను. అట్టి శక్తికతఁడు గర్వించెను. సేవకుఁడువచ్చి తలుపు తెఱచి అగ్ని ప్రమాదమును గూర్చి తెలుప 'నేనెఱుఁగుదు' నని సమాధానమిచ్చెను. కొంతకాలము గడచినపిదప నతడు తనభార్యతో కలిసి శిరిడికి వెళ్ళి బాబాను దర్శించెను. 'ఆవేశ్యావిలాసముల నవలోకించుచుంటివేమి!' అని బాబాపలుక ఆమాట లాతనిభార్య గ్రహింపలేదు- అతడు గ్రహించెను. అభక్తుడు తనగురుదేవుఁడు సహజముగ చేయు హెచ్చరికలు ప్రాణాయామాదులచేత ప్రాప్తించుసిద్ధులను ఆదరింపరాదని బోధించుచున్నాడని గ్రహించగలిగెను. పాతంజలయోగసూత్రములందు దెలుపబడినట్లుల "సిద్ధులకు ప్రాపంచిక విషయములందు వినియోగించిన సమాధి దైవనిష్ఠకు భంగకరములు" అని తెలుపబడినది (సూ. ౩౮-౫౨. 'ఈసిద్ధులు ప్రాపంచికవిషయమున కొంతలాభకారకములైనను యోగి వీనిచే నాకర్షింపబడిన క్రమముగ చెఱుపుకలుగును' 'స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునఃఅనిష్టప్రసంగాత్.'

సూత్ర ౫౨. సాధకుఁడాసిద్ధిని బడసిన దేవతల ఆనందముఁబడయగలఁడు. కావున యోగసూత్రములు- బాబా బోధలననుసరించి ఆసిద్ధులు మంచి- చెడు రెంటిని గలుగఁజేయును. భాగవతము 11 స్కంధము ను- యోగసూత్రములు- బాబాబోధలు సాధకునకు సిద్ధులు కలిగిన అవియెల్ల పతనహేతువులో తెలుపఁబడినవి. ఇఁక బాబా కావించిన విషయముల గమనించిన ఆతండ్రి తన సిద్ధులను- శక్తులను పరిమితముగ నుపయోగించినాఁడు. సకల సమర్థసద్గురువులు అవతారపురుషులునైన శ్రీ కృష్ణభగవానుఁడు మొదలగువారు వారి దైవశక్తిసంపదలను సిద్ధులను ప్రదర్శించిరి. కాని అవి అభిశంసనీయములుకావు. ప్రాపంచిక విషయోపార్జనమునకు- స్వార్థబుద్ధితో ఆసిద్ధులను వినియోగించుటలు వాంఛనీయముకాదు. ప్రాపంచికదృష్టితో వాని నాదరింపరాదు. అట్టి స్థితియందే అవి చెడిపోవు. నిస్వార్థతతో వానిని విని

యోగించిన హానికరములు కావు. ఈవిషయమున బాబా బోధలందు ప్రధానాంశమిదియే

గురువును మార్చి కొనుట తగదు.

S.C.S (శ్రీసాయీనాథ బోధామృతము 415)

R S. దేవు- రత్నగిరిలో వారివంశ పరంపరగవచ్చు గురువును కలిగియుండెను. అతఁడెట్టి సిద్ధిశక్తులు లేని కులగురువై యుండవచ్చును. R S. దేవు బాబాను దర్శించి "బాబా! నాకు ఉపదేశము కావించినీవు నాకు గురుడవుకమ్ము!' అనికోరెను. ఆతనిఁజూచి 'నీగురు వెట్టి సిద్ధిసంపదలు లేనివాడైనను అతనినికాదని ఏవో సిద్ధులుగలవాడని క్రొత్త గురువులకై నీవు అన్వేషింపవలదు' అని బాబా బోధించినాఁడు. ప్రాపంచకవిషయ లంపటుఁడుగాని గురువునందు గాఢవిశ్వాసము భక్తిగల సాధకుఁడు సకలవిధముల పురోవృద్ధి నొంది సిద్ధిశక్తులను బడయగలడు. పలువురు సాధుసత్పురుషులును ప్రాపంచకాకర్షణలకు లోఁగరాదని తెలిపియుండిరి. పలువురు విద్యావంతులును సందేహము కలిగియుందురు. సిద్ధిసంపదలుగలవారే వారి దృష్టియందు అధికులుగ నుండవచ్చును. ఇట్టి సిద్ధిసంపదలందు దృష్టినిలిపి సాధుసత్పురుషుల విషయమున న్యూనాధిక్యతలను పాటింపరాదు. "శ్రీ సాయీబాబా యెన్నియో సిద్ధిప్రదర్శనలను గావించినాడే! ఆయన పరమజ్ఞానియై యుండునా?'- అని శ్రీ నరసింహస్వామిగారిని పలువురు విద్యాధికులు ప్రశ్నించియుండిరి. తన ఆశ్రితులను అనుగ్రహించు తలంపుతో దైవశక్తిసంపదలను ప్రదర్శించినమాత్రమున పరమజ్ఞానమావంతయు ఱుగదని శ్రీ స్వామివారు తెలిపియుండిరి.

శ్రీ సాయీప్రభువు మనకుజూపిన శుభ్ర,స్నిగ్ధ, క్షేమమార్గమున మనమునడచి, మనగమ్యమునకుఁజేర ప్రతిఒక్కరము ప్రయత్న సాఫల్యముఁబడయుటకు మనలఁ గరుణింపుమని శ్రీసమర్థ సద్గురుదేవుడగు సాయీ మహాప్రభువునకు ప్రణామసహస్రము లర్పించుదము.

ఓమ్ శ్రీ సాయీశరణ్

'సమీక్ష' సంపూర్ణము.

## ఈ రచయితచే రచింపఁబడిన గ్రంథములు

1 శ్రీ దేవకీనందన శతకము 1923

2 శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబన స్తోత్రము 1924

3 శ్రీ భావనారాయణస్వామి మాహాత్మ్యము [బాపట్ల] 1924

4 శ్రీ శివరాత్రి మాహాత్మ్యము 1925

5 శ్రీ ముకుందమాల [తెనుగు పద్యములు] 1924

6 శ్రీ మద్భగవద్గీతామృతము 1929
(భగవద్గీతాశ్లోకములు - తెనుగుపద్యములు)

7 శ్రీ ఆశ్చర్యచూడామణి [శ్రీరామకథాత్మకము] 1934

8 శ్రీ ప్రబోధ సుధాకరము (శ్రీమచ్ఛంకర భగవత్పాద
రచిత ప్రకరణ గ్రంథము శ్లోకములు)
తెనుగు పద్యములు 1936

## శ్రీ సాయీ లీలా ప్రచురణములు

1 శ్రీసాయీ బాబా పూజా స్తవములు మొదటికూర్పు 1157
,, ,, రెండవకూర్పు 1962 1-00

2 శ్రీ కృష్ణకర్ణామృతము 1958 1-00
(శ్రీ లీలాశుకసంస్కృత కృతికి తెనుగుపద్యములు)

3 శ్రీ సాయీ మననము 3 సర్గలు మొదటికూర్పు 1958
,, ,, రెండవకూర్పు 1967 1-00

4 శ్రీ ఆపదుద్ధారక శతకము మొదటికూర్పు 1959
,, ,, రెండవకూర్పు 1962 0-50

5 శ్రీ వేంకటేశ్వర సుప్రభాతగీతములు మొదటికూర్పు 1969
,, ,, రెండవకూర్పు 1962 0-50

♦6 శ్రీ సాయీ కరుణ (4 తరంగములు) 1960 2-00

♦7 శ్రీ సాయీబాబా కూడ దేవుడేనా? ఉన్న దేవుళ్ళు
చాలరనా? [సందేహనివృత్తి] 1960 1-00

8 శ్రీ పుండరీక చరిత్రము—పాండురంగనక్షత్రమాల 1964 0-75
9 శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి 1965

♦ గుర్తు పెట్టినవి పునర్ముద్రణము కావలయును.

10 శ్రీ సాయీ కబీరసూక్తులు (సాఖీలు-ద్విపదలు) 1965 0-76
11 శ్రీ సాయీదేవ శతకము (ఈరచయిత పెద్దకుమారుడు
చి॥ శ్రీ వేంకటపార్థసారధి రచించినది) 1965 0-30
12 శ్రీ హనుమాన్ చాలీసా—స్తోత్రములు 1965 0-15
13 శ్రీ సాయీ విజయము (జంగమకథ) 1967 2-00
14 ప్రేమామృతము (నారద భక్తిసూత్రములు 1968 3-00
టీక-సూత్ర పద్యము-వివరణగీతమాలిక)
15 శ్రీనివాస దయాశతకము 1968 0-50
16 శ్రీ సాయీనాథ బోధామృతము
(శ్రీ సాయీబాబా అభయప్రదానములు సూక్తులు) 6-00
అఖిలభారత సాయీసమాజము—మైలాపూర్-మద్రాసు 4
17 ఏమీ, నిన్ను పేక్షింతునా? శ్రీసాయీబాబా జీవితచరిత్ర
1, 2 సంపుటములు 7-50
18 „ „ 3 సంపుటము 5-00
19 „ „ 4, 5 సంపుటములు 10-00

## ముద్రణము కావలసినవి.

1 శ్రీ సాయీబాబా పూజాస్తవములు
2 శ్రీ సాయీ అనుసరణము.
3 సద్గురువులు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | 23 | కూక్చు | కూర్చు |
| ౫ | 6 | ఆసతేసులు | ఆసలీసులు |
| ౫ | 6 | నిన్యనింద | సన్యాసింద |
| ౭ | 8 | మోషు | మూడు |
| ౧౦ | 17 | సచ్ఛరిత్ర | సచ్చరిత్ర |
| ౧౦ | 19 | వాసెదనని | వ్రాసెదనని |
| ౧౦ | 20 | హేమాది | హేమాద్రి |
| ౧౧ | 1 | పక్షింతునా | పేక్షింతునా |
| ౧౧ | 8 | పుట్టపరి | పుట్టపర్తి |
| ౧౧ | 9 | గ౨శుక్తి | గర్భశుక్తి |
| ౧౧ | 18 | ్రుసమై | ద్రుమమై |
| ౧౧ | 19 | వెళ్భ | వెళ్ళ |
| ౧౨ | 13 | శ్రీ | (శ్రీ) |
| ౧౨ | 19 | ధైమెవ | ధైమెన |
| ౧౨ | 25 | గూతన | నూతన |
| ౧౪ | 25 | ూనము | మూనము |
| ౧౯ | 4 | ∩f | of |
| ౨౬ | 5 | పట్నాయ | పట్నాయక్ |
| ౨౭ | 17 | వెద్య | వైద్య |
| ౬0 | 18 | శ్రాద్ము | శ్రాద్ధము |
| ౬1 | 18 | అనుగహా | అనుగ్రహా |
| 1 | 11 | ప్రసిద | ప్రసిద్ధ |
| 1౬ | 7 | తెుయు | తెలియు |
| 15 | 23 | నట్టుదల | పట్టుదల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 17 | 7 | ఇందియముల | ఇంద్రియముల |
| 18 | 15 | 'సానీ' | 'వానీ' |
| 19 | 13 | త బిడ్డ | తనబిడ్డ |
| 22 | 19 | కేనలము | కేవలము |
| 23 | 10 | ప్రా థింప | ప్రార్థింప |
| 24 | 11 | కోడపై | గోడపై |
| 25 | 17 | మప కేది | కేది |
| 32 | 18 | 1917 | 1918 |
| 36 | 7 | మొవలు | మొదలు |
| 37 | 2 | బిడ్డ పె | బిడ్డలపై |
| 41 | 2 | యిమోలా | యిరోలా |
| 41 | 9 | నటువ | నటుల |
| 43 | 15 | విశా | విశ్వా |
| 43 | 13 | ప్రనర్తింప | ప్రవర్తింప |
| 44 | 20 | జానేశ్వరి | జ్ఞానేశ్వరి |
| 47 | 15 | బా ! | బావ్ ! |
| 48 | 15 | తెలిసకొని | తెలిసికొని |
| 48 | 21 | సెద్ద | పెద్ద |
| 51 | 7 | పెన | పైన |
| 51 | 17 | డేవ్ | దేవ్ |
| 52 | 15 | విధానము | ప్రధానము |
| 56 | 4 | నమోవక్కరు | నిమోవక్కరు |
| 9 | 5 | సారాయణము | పారాయణము |
| ,, | 19 | సు సంతోషము | సుఖ సంతోషము |
| 60 | 8 | ఆది | అది |
| 63 | 3 | పారతల్లిని | వారితల్లిని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 76 | 9 | నన్నిటికి | నన్నిటిని |
| 83 | 5 | విధమునీ | విధమున |
| 85 | 1 | గూర్చుదుకు | గూర్చుదును |
| 90 | 20 | నుంను | నుండెను. |
| 91 | 9 | మాసిక | మానసిక |
| 99 | 5 | ఆధ్యాత్మికి | ఆధ్యాత్మిక |
| 125 | 11 | బేధ | భేద |
| 128 | 17 | నచ్చుట | వచ్చుట |
| 132 | 13 | అవి | అని |
| 133 | 12 | బిడ్జల | బిడ్డల |
| 136 | 10 | వెళ్ళి | వెళ్ళి |
| 144 | 24 | త్వ | త్ర |
| 148 | 25 | అనేర | అనేక |
| 153 | 11 | విశేషము | శేషము |
| 188 | 20 | పోదర | సోదర |
| 198 | 10 | ప్రుద్ధ | వృద్ధి |
| ,, | 19 | జవవరి | జనవరి |
| 211 | 21 | ఆజ | ఆజ్ఞ |
| 230 | 13 | జానేశ్వరి | జ్ఞానేశ్వరి |
| ,, | 25 | అద్వై | అద్వైత |
| 232 | 8 | సర్వత్రైనకో | సర్వత్రైకో |
| 233 | 9 | సార | పార |
| ,, | 21 | బ్రహ్మవవు | బ్రహ్మమవు |
| 234 | 3 | అన | అని |
| 235 | 6 | పడిన | బడిన |

